## 253

(శ్రీ త్రిగుణాతీతానందస్వామికి)

జనవరి, 1896.

ప్రియ శారదా,

...పత్రికనుగూర్చిన నీ తలంపు నిజముగా చాల బాగుగా నున్నది. సర్వాత్మనా నీవు దానిని నెఱవేర్పఁపూనుకొనుము. ......ధనము ఎట్లు అను చింత నీకు వలదు....క్రైస్తవమతమును మహమ్మదుమతమును బోధింపగలవారు చాలమంది యున్నారు. (కావున) నీవు నీదేశపుమతమును బోధింపుము. మఱి నీకు ఎవఁడేని అరబ్బిభాషలో పండితుఁడగు మహమ్మదీయుఁడు దొరకి వానిచేత అరబ్బిభాషలోని పుస్తకములను తర్జిమాచేయింపగలుగుదువేని, అది మంచి పద్ధతియే. పర్షియనుభాషలో మన యిండియాదేశ చరిత్ర ఎక్కువగా కలదు. ఆ పుస్తకములను కొంచెము కొంచెముగా తర్జిమాచేయింపగలుగుదువేని (నీ పత్రికకు) అదొక తప్పని నియతమయిన విషయ మగును. మనకు పలువురు రచయితలు కావలయును. తరువాత ఆ కష్టమైనపని యున్నది, చందాదారులను సంపాదించుట, దానిని సాధించుట యిట్లు-నీవు దేశాటన జీవనము తొడంగుము. ఎక్కడ నీకు బెంగాళిభాష భాషింపబడుచు అగపడినను, అక్కడ నీకు గొరకినవాని కెల్ల ఒకపత్రిక అంటగట్టుము. నీ వాగ్బలముతో వారిని చందాదారుల జేయుము. ఇందులకు వారు కొంతధన మీయవలసినట్లు ఏర్పడగానే వారు తప్పక వెనుదీయుదురు. ఏ యడ్డంకిని నీవు సరకుచేయకుము. దానిని ముందుకు నడపుచునే పొమ్ము. మీలో అందులకు శక్తిగలవారందఱును పత్రికకు వ్యాసములు వ్రాయుడు. ఊరక సోమరితనముతో కూర్చుండిన ప్రయోజనము లేదు. నీవు వీరకార్యమును

కావించితివి సుమా! బళి శేష్! ఎవరు తొట్రుపడి, చేయుదమా వలదా అని సందేహము పా లగుదురో, వారు వెనుకబ్బడుదురు. నీవు అందటి తలలు దాటిపోగలట్లు చాయగా ఎగిరి దూకుదువు. తమ మోక్షమునకై పాటుపడువారు తమ మోక్షమును పొందజాలరు, ఇతరులకును మోక్షము తేజాలరు. నీవు కావించు గడబిడ ప్రపంచముకోసలవలకు మాఱుమ్రోగును గాక. ఎందును దోష ములు వెదకుటకు సిద్ధులై కొందఱు ఉండగా యుందురు; కాని పనిమాట వచ్చినపుడు ఎవని పొలకువయు ఉండదు. పని చేయుచునే యుండుము ని శ్శక్తికొలదియు. తరువాత నేను ఇండియాకు వత్తును, దేశమునంతయు ఊపెదను. భయ మే మున్నది! నీకు విషము లేదు విషము లేదు అని మొండిపట్టుగా చెప్పబడుచుండు నేని పాముసైతము తన విషమును కోలుపోవును. ఈ జనులు అభావపుత్రోవనే పట్టుదురు, తమకు కడకు అభావమే సిద్ధించువఱకు!

గంగాధరుడు మంచి వీరోచితకార్యమును చేసినాడు! బళి! పనిలో కాళి అతనిని కలసికొన్నాడు —ముమ్మాటికి బళి. ఒకడు మదరాసుకు పోని, మఱియొకడు బొంబాయికి పోని, ప్రపంచము ఉద్ఘూత లూగనీ! హా! ఆ దుఃఖము! నాకు నావంటివారు మఱి యిరువురు ముగ్గురు ఉండిఉందురేని, నేను ఈ లోకమును గడగడ లాడించివేసియుండగలను. మఱి యిప్పుడు ఉన్నవిధాన, నేను ముందుకు నెమ్మదిగా సాగవలసియున్నది. లోకమును పునాదులు కదల ఊపుము. చైనాకు ఒకనిని పంపుము; ఒకనిని జపానుకు. పేదగృహస్థులు వారి యల్పజీవనములతో ఏమి సేయగలరు, శివుని భూతములగు సన్న్యాసులు గదా 'హర! హర! శంభో!' అను తమ ఘోషలతో మింటిని చీల్పవలసినది!

నీకు నా ప్రేమ

వివేకానంద.

## 254

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

228 పడమటి 39 వ వీధి
న్యూయార్కు
జనవరి 16, 1896.

ధన్యప్రియా,

(నీవు పంపిన) పుస్తకములకు నా కృతజ్ఞతలు. సాంఖ్యకారిక చాలమంచి గ్రంథము. కూర్మపురాణమున నేను ఉండుననుకొన్న దంతయు లేకున్నను, యోగమునుగూర్చి కొన్ని శ్లోకము లున్నవి. నా పూర్వలేఖలో నేను మానిన మాటలు 'యోగసూత్రములు' అనునవి. ఇపుడు వానిని నేను పెక్కు ప్రమాణ గ్రంథములనుండి జ్ఞాపికలను చేర్చి, భాషాంతరమున అనువాదము సేయుచున్నాను. ఆ జ్ఞాపికలలో కూర్మపురాణమందలి అధ్యాయమునుగూడ చేర్ప గోరుచున్నాను. శిష్యులకు నీవు చెప్పు పాఠములనుగూర్చిన వివరములను కుమారి మెక్లియడు చాల ఉత్సాహముతో నాకు తెలిపినది. శ్రీ గాల్సువర్దికి ఇపుడు శ్రద్ధ చాల ఎక్కువమైనటు లున్నది.

నేను ఇక్కడ నా మామూలు ఆదివారపు ఉపన్యాసములను, శిష్యులసమావేశములనుగూడ తొడంగితిని. రెంటిని మిక్కిలి ఆదరోత్సాహములతో గ్రహించుచున్నారు. నేను రెంటిని వట్టిధర్మానకే చెప్పుచున్నాను. హాలు బాడిగ మొదలైనదానికై వేఱుగా వసూలు చేయ పూనుకొందును. కడచిన ఆదివారపు ఉపన్యాసము చాల మెచ్చుకొనబడినది. అది అచ్చులో ఉన్నది. పై వారమున నీకు కొన్ని ప్రతులు పంపెదను. అది మనము పెట్టుకొన్న పనికి స్థూలాకారము.

నా మిత్రులు 'గుడ్విను' అను స్టెనోగ్రాఫరును ఏర్పాటు చేసినారు కావున నేను శిష్యులకు నేర్పు పాఠములు, జనులకు కావించు ఉపన్యాసములు అతడు వ్రాసిపెట్టుచున్నాడు. నేను నీకు

ప్రతిదానికి ఒకప్రతి పంపుద మనుకొనుచున్నాను. అవి నీకు కొన్ని భావములను అభిప్రాయములను స్ఫురింపజేయవచ్చును.

ఇక్కడ నాకు మిక్కిలి కావలసియుండునది ఏమనగా, తెలివి గలిగి సామర్థ్యము గలిగి ప్రేమయుగలిగియున్న నీవంటి గట్టివాడొకడు. విద్య అందఱికి నేర్పవలసినదే అను సర్కారు శాసనముగల దేశమిది. ఇచటి జనులలో అందఱును నడితరము వారే. సమర్థులు ఎక్కడనైనను ఒకకొందఱు ఉన్నట్లైన వారు నిరంతరధనార్జనతత్పరతలో మునిగిపోయి యున్నారు.

నాకు ఈదేశాన కొంతభూమి, దానిమీది యిండ్లు, విస్తారముగా చెట్లు, వేసవిలో ధ్యానమునకు చక్కని ఆశ్రయముకాదగిన సన్నివేశముగల నదియొకటి దొరకు అవకాశ మున్నది. దొరకినట్లైన దానిని నేనులేనప్పుడు విచారించుకొనుటకు నిర్వాహకుల సభ యొకటి ఉండవలసియుండును. వారే నా డబ్బు లావాదేవులు, అచ్చుపని, ఇంకను ఇతరవిషయములను చూచుకొందురు.

ధనవిషయములతో నాకు సంబంధము బొత్తిగాలేకుండ చేసికొన్నాను. ఐనను ధనములేక మనపనులు ప్రయత్నములు సాగునా? కావున నా పరోక్షమున ఈ విషయముల నన్నింటిని విచారించుకొనుటకు ఒక కార్యనిర్వాహకసభను ఏర్పఱిచి, అన్నింటిని దానికి అప్పగింపవలయును. స్తిమితముగా పనిచేయుట అమెరికనులకు అలవడినది కాదు కదా. ఒకగుంపులోపడి పనిచేయుట ఒక్కటే వారెఱింగినది. కావున వారికి అట్లే కానీ. ఉపదేశకార్యభాగము ఎట్లు అందువా, నా మిత్రులు ఈ దేశాన ఒకచోటినుండి మఱొకచోటికి పర్యటించుచుందురు. అందు ఎవనివఱకు వాడు స్వతంత్రుడు. కావున ప్రతియొకడు వేఱువేఱు మండలమును ఏర్పఱుచుకొన నిమ్ము. వ్యాప్తికి అదియే అన్నిటికన్నను సులువగు మార్గము. ఇకను చాలినంత బలము కూడునేని, అపుడు మన బలమును శక్తిని ఏకాగ్రము చేయుటకు సాంవత్సరికసమావేశములను పెట్టుకొందము.

ఆ సభ కేవలకార్యనిర్వాహణకే. అదిఒక్క న్యూయార్కు వఱకే పరిమితమైయున్నది.

నిరంతరము నీకు నా ప్రేమ, నా యాశీర్వచనములు.

వివేకానంద.

## 255

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

జనవరి 23, 1896.

ప్రియ అళసింగా,

ఈ జరిగినకాలమునకు నీకు నాకడనుండి భక్తినిగూర్చి పుష్కలముగా విషయము లభించియుండవలయును. డిసంబరు తే 21 ది బ్రహ్మవాదిన్పత్రికప్రతి వచ్చిచేరినది. ఇటీవల కడపట వెలువడిన కొన్ని 'బ్రహ్మవాదిన్' పత్రికల తరువాత నాకు ఏదియో రవంత అనుమానము తట్టుచున్నది. నీవు థియాసఫిస్టులలో కలిసి పోదువా? ఈసారి మీరు నిస్సందేహముగా మిమ్మర్పించు కొంటిరి! ఏమున్నది! నీ జ్ఞాపికలనడుమ థియాసఫిస్టుల యుపన్యాసాల ప్రకటనపత్రికను ఒకదానిని దోపితివి! నాకు థియాసఫిస్టులతో సంబంధ మున్నదని ఏపాటి యనుమానమునకు ఎడము కలిగినను, అది అమెరికాయందును ఇంగ్లండునందును రెండెడలను నా పనిని చెఱచును. సరియైన బుద్ధిగలవా రందఱును వారిదారి తప్పు అని తలంచువారే. వారినిగూర్చి అట్టియభిప్రాయ ముండుట నిజమే. ఆ విషయము నీవు చక్కగా ఎఱుగుదువు. నీవు నన్ను మించిపో చూచుచున్నావని తోచుచున్నది. ఇంగ్లండులో ఆనిబెసెంటు పేరును చాటినచో చందాదారులు ఎక్కువ మంది వత్తురని నీవు తలంచుచున్నావా? నీవు నిజముగా మూఢుడవు.

థియాసఫిస్టులతో నేను జగడమాడకోరను. నా పద్ధతి ఏమనగా వారిని బొత్తిగా సరకుసేయకుండుటయే. ఆ ప్రఖ్యాపనకు వారు ధన మిచ్చినారా? వారిని ప్రఖ్యాపింపను నీ వేల పరువెత్త

వలయును? నేను ఈసారి ఇంగ్లండుకు పోయినపుడు మనకు చాలినంతకంటె ఎక్కువమంది చందాదారులను సంపాదింపగలను.

చూడు. నాకు ద్రోహుల పొత్తు వలదు, నీకు స్పష్టముగా చెప్పుచున్నాను. వంచకునిచేత నేను వంచింపబడను. ఆ మోసము నాకడ చెల్లదు. నీవు బిచానా యెత్తివేయుము; వెళ్లిపొమ్ము; నాతో సకలసంబంధమును మానుకొంటి నని నీపత్రికలో బాహాటముగా ప్రకటింపుము, అటుపిమ్మట ఆ థియాసఫిస్టుల గూడెములో చేరుము. అట్లు కాదందువా, వారితో ఏసంబంధము లేకుండ మానుకొనుము. నేను నీతో స్పష్టాక్షరములు పలుకుచున్నాను సుమా. నాకు అనువర్తి ఒక డున్నను చాలు. మఱి వాడు చావునకైనను వెనుదీయని నమ్మకము సత్యవృత్తి కలవాడుగా నుండవలయును. జయము కానీ అపజయము కానీ, నేను లెక్కసేయను. ప్రపంచమంతట మతోపన్యాసములుచేయు ఈవెట్టిపని నాకు విసుగెత్తించుచున్నది. నేను ఇంగ్లండులో ఉన్నప్పుడు ఆ'సి'కి సంబంధించినవారెవరైనను నాకు సాయముసేయ వచ్చిరా? .ఛీ! తెప్పడుకథ! నా ఉద్యమము పరిశుద్ధముగా నుండవలయును. ఉండదా, ఇక నాకు ఆపనియే అక్కఱలేదు.

మీ

వివేకానంద.

మఱిమాట :—నీతీర్మానమును జాగుసేయక బదులిడుము. ఈవిషయమున నే నేమో గట్టిగా తీర్మానించుకొన్నాడను. నీయుద్దేశ్యములు తొలినుండి అట్టివే యయియున్న, నీవు నాతో ముందుగానే ఆ మాట చెప్పియుండవలసినది. 'బ్రహ్మవాదిన్'పత్రిక వేదాంత ప్రచారము సేయుటకేకాని, థియాసఫి ప్రచారమునకుకాదు. ఇట్టి దొంగవ్యవహారములు చూచినపుడు నేను కోపము ఆపుకొనజాలను. ఇట్టిది లోకము! ఎవరిని నీవు మిక్కిలి ప్రేమింతువో, ఎవరికి నీవు మిక్కిలి సాయము చేయుదువో వారే నిన్ను మోసగింతురు!

వి.

ఆ సభ కేవలకార్యనిర్వహణకే. అదిఒక్క న్యాయార్జనకే పరిమితమైయున్నది.

నిరంతరము నీకు నా ప్రేమ, నా యాశీర్వచనములు.

వివేకానంద.

## 255

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

జనవరి 23, 1896.

ప్రియ అళసింగా,

ఈ జరిగినకాలమునకు నీకు నాకడనుండి భక్తినిగూర్చి పుష్కలముగా విషయము లభించియుండవలయును. డిసంబరు తే 21 ది బ్రహ్మవాదిన్పత్రికప్రతి వచ్చిచేరినది. ఇటీవల కడపట వెలువడిన కొన్ని 'బ్రహ్మవాదిన్' పత్రికల తరువాత నాకు ఏదియో రవంత అనుమానము తట్టుచున్నది. నీవు థియాసఫిస్టులలో కలిసి పోదువా? ఈసారి మీరు నిస్సందేహముగా మిమ్మర్పించుకొంటిరి! ఏమున్నది! నీ జ్ఞాపికలనడుమ థియాసఫిస్టుల యుపన్యాసాల ప్రకటనపత్రికను ఒకదానిని దోపితివి! నాకు థియాసఫిస్టులతో సంబంధమున్నదని ఏపాటి యనుమానమునకు ఎడము కలిగినను, అది అమెరికాయందును ఇంగ్లండునందును రెండెడలను నా పనిని చెఱచును. సరియైన బుద్ధిగలవా రందఱును వారిదారి తప్పు అని తలంచువారే. వారినిగూర్చి అట్టియభిప్రాయ ముండుట నిజమే. ఆ విషయము నీవు చక్కగా ఎఱుగుదువు. నీవు నన్ను మించిపో చూచుచున్నావని తోచుచున్నది. ఇంగ్లండులో ఆనిబెసెంటు పేరును చాటినచో చందాదారులు ఎక్కువ మంది వత్తు రని నీవు తలంచుచున్నావా? నీవు నిజముగా మూఢుడవు.

థియాసఫిస్టులతో నేను జగడమాడకోరను. నా పద్ధతి ఏమనగా వారిని బొత్తిగా సరకుసేయకుండుటయే. ఆ ప్రఖ్యాపనకు వారు ధన మిచ్చినారా? వారిని ప్రఖ్యాపింపను నీ వేల పరువెత్త

వలయును? నేను ఈసారి ఇంగ్లండుకు పోయినపుడు మనకు చాలినంతకంటె ఎక్కువమంది చందాదారులను సంపాదింపగలను.

చూడు. నాకు ద్రోహుల పొత్తు వలదు, నీకు స్పష్టముగా చెప్పుచున్నాను. వంచకునిచేత నేను వంచింపబడను. ఆ మోసము నాకడ చెల్లదు. నీవు బిచానా యెత్తివేయుము; వెళ్లిపొమ్ము; నాతో సకలసంబంధమును మానుకొంటి నని నీపత్రికలో బాహాటముగా ప్రకటింపుము; అటుపిమ్మట ఆ థియాసఫిస్టుల గూడెములో చేరుము. అట్లు కాదందువా, వారితో ఏసంబంధము లేకుండ మానుకొనుము. నేను నీతో స్పష్టాక్షరములు పలుకుచున్నాను సుమా. నాకు అనువర్తి ఒక డున్నను చాలు. మఱి వాడు చావునకైనను వెనుదీయని నమ్మకము సత్యవృత్తి కలవాడుగా నుండ వలయును. జయము కానీ అపజయము కానీ, నేను లెక్కసేయను. ప్రపంచమంతట మతోపన్యాసములుచేయు ఈవెట్టిపని నాకు విసుగెత్తించుచున్నది. నేను ఇంగ్లండులో ఉన్నప్పుడు ఆ'సి'కి సంబంధించినవారెవరైనను నాకు సాయముసేయ వచ్చిరా? .ఛీ! తప్పుడుకథ! నా ఉద్యమము పరిశుద్ధముగా నుండవలయును. ఉండదా, ఇక నాకు ఆపనియే అక్కఱలేదు.

మీ

వివేకానంద.

మఱిమాట :—నీతీర్మానమును జాగుసేయక బదులిడుము. ఈవిషయమున నే నేమో గట్టిగా తీర్మానించుకొన్నాడను. నీయుద్దేశ్యములు తొలినుండి అట్టివే యయియున్న, నీవు నాతో ముందుగానే ఆ మాట చెప్పియుండవలసినది. 'బ్రహ్మవాదిన్'పత్రిక వేదాంత ప్రచారము సేయుటకేకాని, థియాసఫి ప్రచారమునకుకాదు. ఇట్టి దొంగవ్యవహారములు చూచినపుడు నేను కోపము ఆపుకొనజాలను. ఇట్టిది లోకము! ఎవరిని నీవు మిక్కిలి ప్రేమింతువో, ఎవరికి నీవు మిక్కిలి సాయము చేయుదువో వారే నిన్ను మోసగింతురు!

వి.

## 256

(శ్రీ యోగానందస్వామికి)

228 - పడమర 39 న్యూయార్కు
జనవరి 24, 1896

ప్రియ యోగిన్,

...నీకు ఆరోగ్యము ఇంకను పూర్తిగా చక్కబడలేదని వినగా నాకు మిక్కిలి విచారము కలుగుచున్నది. నీవు అతిశీతల వాతావరణము కలిగి హేమంతశిశిర ఋతువుల మిక్కుటముగా మంచు కురియుచుండు డార్జిలింగువంటి చోటికి, పోగలవా? శీతోగ్రత, నాకుమాన్పినట్లే, నీ కడుపులోని జబ్బును మాన్పి చక్కదిద్దును. నీవు నేతిని భోజనసువాసనసంభారమును బొత్తిగా మానగలవా? నేతికన్నను వెన్న సులువుగా జీర్ణ మగును.

ఇక మూడునెలలు గడవగానే నేను ఇంగ్లండుకు వెళ్ళెదను; అక్కడ మరలకొంచెము సంచలనముకలిగించుటకు. తర్వాత శిశిర ఋతువునకు ఇండియాకు వత్తును. దానికి తరువాత...అదంతయు దైవాధీనము.

శారదుడు ప్రకటింపగోరుచున్న పత్రికకు నీ శక్తికొలది పూనిక వహింపుము. శశినికూడ దానిని చూచుకొమ్మనుము. ఒకసంగతి: ప్రకృతము కాళిగాని మఱెవరుగాని ఇంగ్లండుకు రావలసిన యక్కఱ లేదు. నేను ఇండియాకు వచ్చినపుడు వారిని ముందు తరిబీదు చేసెదను. తరువాత వారు తమయిచ్ఛవచ్చిన చోట్లకు పోవచ్చును.

మనము సొంతముగా ఏమియు చేయము; ఎవరైనను ఏమేని రవంత చేయప్రయత్నించిన వారిని హేళనము చేయుదుము ఈచేటే మనదేశమునకు పతనము మూడునట్లు చేసినది: నిస్సానుభూతియు దౌర్బల్యమును—ఇవి సకలదుఃఖమూలము. కావున మీరు రెంటిని వదలుకోవలెను.ఒక్కొక్కవ్యక్తియందు ఎట్టిశక్తిసామర్థ్య

ములు కలవో దేవుడు తప్ప మఱెవరు ఎఱుగగలరు ? అవకాశములు అందఱికి దొరకును గాక. తక్కినది దేవునికి వదలిపెట్టదగును. అందఱియెడ సమానమైన ప్రేమ కలిగియుండుట, నిజముగా దుర్ఘటమే; మఱి అట్లు లేకున్న ముక్తి లేదు.

ప్రేమపూర్ణ భవదీయ
వివేకానంద.

## 257

(కుమారి – మేరీహేలునకు)

228 పడమర – 39 వ వీథి
న్యూయార్కు
ఫిబ్రవరి 10, 1896

ప్రియసోదరీ,

నాజాబు నీకు ఇంకను చేర లేదని తెలియవచ్చినందులకు చాల ఆశ్చర్యపడితిని. నేను నీజాబు అందగానే వెంటనే దానిని వ్రాసి, అప్పుడే న్యూయార్కులో నేను చేసిన మూడుఉపన్యాసములు గల కొన్నిచిన్నపుస్తకములను గూడ నీకు పంపితిని. ఇప్పుడు నాభానువారోపన్యాసములు సంక్షిప్తలిపి (షార్టుహాండు) లోవ్రాసి కొనబడి అచ్చువేయబడుచున్నవి. వానిలో మూడు కూడి రెండు చిన్నపుస్తకములైనవి. వాని అనేకప్రతులను నీకు పంపితిని. ఇంకను రెండువారములు నేను న్యూయార్కునందే యుందును. అటుతర్వాత డిట్రాయిట్టుకుపోయి, మరల ఒకటిరెండువారములు గడపుటకు బోస్టనుకు తిరిగి వత్తును.

నిరంతరకార్యభారముచేత, ఈసంవత్సరము నాయారోగ్యము చాల చెడినది. నా నరములు చాలబలహీనములుగా నున్నవి. ఈసారి చలికాలములో ఒక్కరాత్రియైనను గాఢముగా నిద్రపోయి ఎఱుగను. నేను అతిగా పనిచేయుచున్నాను. నిజము. కాని ఇంత కన్న పెద్దపని ఇంగ్లండులో నాకోసము కనుపెట్టుకొనియున్నది.

నేను దానినంతయు చేసిముగింపవలసియున్నది. తరువాత నేను ఇండియాచేరి శేషించినజీవితకాలమెల్ల విశ్రాంతి అనుభవింప

గలనను ఆస గలిగియున్నాను. లోకసేవకు నాచేతనైనంతమట్టుకైనను చేయ ప్రయత్నించితిని. దానిఫలము ఈశ్వరాధీనము.

ఇపుడు విశ్రాంతికావలయు నని తహతహపడుచున్నాను. అది కొంత కలుగునన్న ప్రత్యాశ యున్నది. ఇండియాజనులు నన్ను విడిచిపెట్టుదు రనియు తలంతును. నోటిమాటలేక కొన్ని యేండ్లపాటు మూగనై ఉండమనుకోర్కె ఎంతతీవ్రముగ నున్నది!

నేను లోకపు ఈ జగడాలకోసమును యుద్ధాలకోసమును సృష్టింపబడినవాడనుకాను. కడుపులోనిచల్ల కదలకుండు స్వభావము నాది. సహజముగ నేను ఆదర్శవాదిని. స్వప్నజగత్తులో మాత్రమే జీవించుట నాకు శక్యము. ప్రతివాస్తవ సంభవ స్పర్శసయితము నా కలలను చెదరగొట్టుచు సుఖమును కొలుపుచ్చుచుండును. ప్రభూ, నీ యిచ్ఛయే జరుగును గాక.

అప్పచెల్లెండ్రకు మీకు నలుగురికి నేను సదా కృతజ్ఞుడను. దేశాన నా కున్నది ప్రతిది మీరు నాకు ఇచ్చినదే, మీ రెల్లప్పుడు సుఖులై ధన్యులై ఉందురు గాక. నేను ఎక్కడనున్నను మిమ్ము గాఢమగు కృతజ్ఞతతోను అచ్ఛపు ప్రేమతోను జ్ఞప్తియం దుంచుకొనియే యుందును. బ్రదుకు సమస్తము కలలపరంపర. నా ఆశ ఏమనగా తెలిసియే కలలుగనుచుందము గాక అని. అంతే. అందరికిని నా ప్రేమ. సోదరి జోసెఫైనుకుకూడ.

సదా మీ ప్రియసోదరుడు,

వివేకానంద.

## 258

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

223 - పడమర - 39 వ వీథి

న్యూ యా ర్కు

ఫిబ్రవరి 13, 1896

ధన్యప్రియమహాశయా,

ఇండియానుండి వచ్చుచున్న సన్న్యాసివిషయము:—ఆయనే తర్జుమాపనియందును ఇంకను ఇతర కార్యములందును నీకు సాయపడ

గలడని నా నమ్మకము. ఉత్తరకాలమున, నేను వచ్చినపుడు, నేను ఆయనను అమెరికాకు పంపవచ్చును. ఈ దినము మఱియొక సన్న్యాసియు జాబితాకు చేర్పబడెను. ఈతూరి చేర్పబడిన యీయన అచ్చపు అమెరికను, ఈదేశాన కొంతపేరుగన్న మతోపదేశికుఁడు. ఆయన పూర్వాశ్రమనామము డాక్టరు స్ట్రీటు. ఇపుడు ఆయనే యోగమందలి తన ప్రవణతనుబట్టి యోగానందుడాయెను.

నేను ఇందుండి బ్రహ్మవాదినుపత్రికకు ఎప్పటికప్పుడు క్రమముగా ఇచటికార్యవృత్తాంతములను వ్రాసి పంపుచుంటిని. అవి శీఘ్రకాలమున ప్రకటింపబడగలవు. ఇక్కడివి ఇండియాకు చేరుటకు అంత దీర్ఘకాలము పట్టుచున్నది! అమెరికాలో విషయము లన్నియు ఉదాత్తములుగ వృద్ధిగాంచుచున్నవి. మొదటినుండియే ఏమాయమోసము లేనందువలన, వేదాంతము అమెరికను జనులలో చాలగొప్పవారి శ్రద్ధను ఆకర్షించుచున్నది. ఫ్రెంచినటి, సారా బరన్‌హార్డ్ ఇక్కడ 'ఇజీల్' నాటకమును ప్రదర్శించుచున్నది. అది ఫ్రెంచిగామార్చబడిన బుద్ధునిజీవితపుచరిత్ర. అందులో ఇజీల్ అను వెలయాలు మఱ్ఱిచెట్టుక్రింద బుద్ధుని మరులుగొల్పి తనవశము చేసికొనగోరగా, బుద్ధుఁడు లోఁగక, ఆమెను అంతసేపు తనయొడిలో కూర్చుండబట్టుకొని ఈ యిహలోకనిస్సారతను మిథ్యాస్థితిని బోధించును. అయినప్పటికిని 'పర్యవసానమున బాగుగా నుండునది సర్వము బాగుగా నుండునదే' అను న్యాయమున ఆ వెలయాలి ప్రయత్నము నెగ్గదు. ఆ బెరన్హార్టమ్మ అందు వెలయాలిపాత్ర నటించును. నేను ఆ బుద్ధుని వ్యవహారము చూచుటకు పోయియుంటిని. ఆయమ్మ ప్రేక్షకవర్గములోని నన్ను గాంచి, నాతో ఒకతూరి మాటలాడగోరెను. నా పరిచితమైన యొక గొప్ప కుటుంబమువారు ఆ సమాగమమును ఏర్పాటు చేసిరి. ప్రసిద్ధికెక్కిన గొప్ప పాటకత్తె ఎమ్. మొఱ్ఱేలమ్మయు గొప్పవిద్యుచ్ఛక్తిపనివాడు టెస్లయు అక్కడికి వచ్చియుండిరి. బరన్హార్డమ్మ గొప్ప విదుషి, తత్త్వశాస్త్రము లెస్సగా నేర్చియున్నది. మొఱ్ఱేలునకును కొంత శ్రద్ధ కలుగుచుండి

నది. శ్రీ టెస్లా వేదాంతమందలి ప్రాణము ఆకాశము కల్పములు, అను వీనినిగూర్చి వినుటకు చాల మోజుపడెను. అతని యభిప్రాయమున ఆధునికశాస్త్రము అంగీకరించునవి ఆ సిద్ధాంతములు మాత్రమే. ఆకాశమును ప్రాణమును రెండును మహత్తునుండియు బ్రహ్మనుండియు కాదా ఈశ్వరునుండియు కలుగుచున్నవి. ప్రాణమును ప్రకృతియు సంకోచము చెంది అంతర్లీనశక్తిగా అగుటను గణితమార్గమున తాను రుజువుచేయగల నని శ్రీ టెస్లా అభిప్రాయము. నేను పైవారము పోయి అతనిని చూచి ఆ క్రొత్తగణితపురుజువును గ్రహింపవలసియున్నది.

ఆ పక్షమున వేదాంతమున చెప్పియుండు సృష్టిప్రక్రియ యంతయు చాల గట్టిపునాదిపై నెలకొల్పబడిన దగును. నేను ఇపుడు ఎక్కువగా వేదాంతమున చెప్పబడిన సృష్ట్యాదులను ప్రళయాదులను గూర్చి పరిశోధన చేయుచున్నాను. అవి ఆధునిక శాస్త్రముతో చక్కగా పూర్ణముగా అదికియున్న నని నాకు స్పష్టముగా గోచరించుచున్నది. ఒకటి విశదమైన, వెంటనే మఱొకటియు విశదమగును. ఉత్తరకాలమున దీనినిగూర్చి ప్రశ్నలు ఉత్తరములు అను మార్గమున ఒక గ్రంథము వ్రాయ సంకల్పించుచున్నాను. అందు మొదటి యధ్యాయము సృష్టినిగూర్చి. వేదాంతమున చెప్పబడిన విధానములకును నేటిశాస్త్రమునకును గల సమ్మతిని ఆనుగుణ్యమును విరోధములేమిని రుజువుపఱతును.




ప్రళయాదులన్నియు అద్వైతమార్గముననే విశదీకరింపబడును. అనగా ఏమిచెప్పిన ట్లనగా- ద్వైతమతమువాడు జీవాత్మ మరణానంతరము సూర్యమండలముకడకు చేరి, అందుండి చంద్ర

మండలమును చేరి, అందుండి విద్యున్మండలమును చేరు ననియు, అక్కడినుండి ఒక పురుషుడు వెంటరా, బ్రహ్మలోకము చేరు ననియు చెప్పును. (అందుండి నిర్వాణము చెందునని అద్వైతి పలుకును)

అద్వైతమతమున అభిప్రాయ మెట్లనగా, జీవాత్మ రాను రాదు, పోను పోదు; ఈ మండలములు అన్నియు ప్రపంచపు-పొరలు. అన్నియు ఆకాశప్రాణములవలన ఉత్పన్నమైన వివిధ రూపములు. అనగా ఏమన్న ట్లనగా, అన్నింటికంటెను క్రిందిది అనగా మిక్కిలి ఘనీభవింపబడినది సూర్యమండలము. ఈ దృగ్గోచర ప్రపంచమంతయు అది. అందు ప్రాణము శారీరకాది భౌతిక బలము, ఆకాశము ఇంద్రియగ్రాహ్యమైన సర్వ పదార్థము. దానికి పైది చంద్రమండలము. అది సూర్యమండలమును చుట్టుకొని యున్నది. చంద్రమండలమనగా చంద్రుడు కానేకాదు. అది దేవతలు వసించుచోటు. అనగా అందు ప్రాణము మానసిక శక్తులుగాను, ఆకాశము తన్మాత్రలు అనగా సూక్ష్మకణములుగాను గోచరించును. దానికిపైన విద్యున్మండలము. అది ప్రాణమును ఆకాశము నుండి విడదీయరాని అవియుతస్థితి. అచట విద్యుత్తు అనగా శక్తియో పదార్థమో నిర్ణయించి చెప్పను వలనుపడదు. దానికి పైన బ్రహ్మలోకము. అక్కడ ప్రాణమును లేదు ఆకాశమును లేదు. మఱి ఆ ఉభయమును మనఃపదార్థమున, అనగా ప్రధానశక్తియందు కలసిపోవును. ఇకను ఇక్కడ – ప్రాణముగాని ఆకాశముగాని లేక పోవుట బట్టి,—జీవుడు ఈ విశ్వమునంతయు సమష్టిగా అనగా మహాత్సర్వస్వముగా మనస్సర్వస్వముగా తలంచును. ఇది యొక పురుషుడుగా, నిరాకార విశ్వాత్మగా గోచరించును. మఱి యది పరమాత్మ కాదు; ఏలన ఇంకను అనేకత ఉన్నది. ఇందుండి జీవుడు కట్టకడపట లక్ష్యమగు ఏకత్వమును కనుగొనును. అద్వైతము ఇ వన్నియు జీవునియెదుట తోచు దర్శనానుభూతిపరంపర లనియు, అతనికి గమనాగమనములు లే వనియు, ఆవిధానసే ప్రకృత దర్శ

నానుభూతి సృష్టింపబడిన దనియు చెప్పును. సృష్టిలయములు ఒక్క వరుసనే జరుగవలయును. ఒకదానికి వెనుకకు పోవుట యనియు మఱియొకదానికి వెలుపలికి వచ్చుట యనియు అర్థము.

ఒక్కొక్కడును తనకు సొంతమైన ప్రపంచమును మాత్రమే చూడజాలును. ఆ ప్రపంచము తనబంధనముతో సృష్టిగనును, తనమోక్షమున లేకపోవును. ఐనను బంధనము తొలగని యితరుల కేమో అది నిలిచియే యుండును. ప్రపంచము నామరూపాత్మకము. సముద్రమున అల యనబడునది ఆ నామరూపబంధమున్నంతవఱకే అల. అల అడగునేని అది సముద్రమే, ఆ తత్క్షణమే నామరూపములు శాశ్వతముగా మాయమైపోవును. అల ఎందుండి లేచి ఆ నామరూపములను గొనెనో, ఆ నీరు గన లేకున్నటైన, ఆ నామ రూపములు కలుగవు గదా. మఱి ఆ నామరూపములే అల కాదు. అల యెపుడు వట్టినీరు ఐపోవునో అపుడు అవి మాసిపోవును. వేఱు అలలకు గల నామరూపములు అట్లే యుండును. ఈ నామరూపము లను మాయ యందురు; నీరు బ్రహ్మము. అంతసేపును అల నీటి కంటె వేఱుగాదు, నీరే; అయినను అలగా అది నామరూపములు కలిగియుండెను. మరల ఈ నామమును రూపమును ఒక నిముస మైనను అలను వీడియుండ జాలవు. అల వట్టి నీరుగా నామరూప సంబంధము లేక శాశ్వతముగా ఉండగలదు. నామరూపములు (అలనుండి) ఎప్పుడుగాని వేఱుపఱుపరావు గాన వానికి ఎప్పుడు గాని సత్త కలదనుటకు లేదు. ఐనను అవి శూన్యముగాదు. దానికి మాయ అని పేరు.

నేను దీని నెల్ల జాగ్రత్తగా వివరముగా మొదటినుండి కడ వఱకు నిరూపింప కోరుదును. అయినను నీవు దీనిని పైపైన చూచియు నేను సరియైన మార్గమును పట్టియున్నానని గ్రహింతువు. దానికి ఇంకను శారీర ధర్మశాస్త్ర పరిశీలన కావలసి యుండును. పై కేంద్రములకు క్రింది కేంద్రములకు గల సంబంధము లను పరిశీలింపవలయును. మనస్సు, చిత్తపదార్థము బుద్ధి-అను వీని

ధర్మముల విచారమున లెస్సగా మునిగి అన్నివిషయములను పూర్తిగా బయటికి తేవలెను. నాకు ఇపు డంతయు స్పష్టముగా తెలియుచున్నది. మోసము, దగా అన్న మాట లేదు. వానికన్నిటికి గట్టిహేతువులను పట్టి వానిని ప్రేమమధువున మెదిపి మెత్తవఱచి గాటపుకృషితో గుమగుమలాడించి యోగ పాకశాలలో చక్కగా వండి శిశువునైతము సులువుగా జీర్ణముచేసికొనునట్లు చేయవలయు ననుట నా కోరిక.

మీ

వివేకానంద.

## 259

(శ్రీ ఆళసింగ పెరుమాళుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు
ఫిబ్రవరి 17, 1896.

ప్రియ అళసింగా,

......పని మిక్కిలి కష్టముగా నున్నది. అది పెరుగుకొలది మఱింత కష్టమగుచున్నది. నాకు సుదీర్ఘవిశ్రాంతి చాల అవసరము. ఇంకను ఇంగ్లండులో గొప్పపని నేను చేయవలసినది నాముందు ఉన్నది....అబ్బాయీ, ఓపిక వహింపుము. అది నీ వనుకొన్నదాని కంటె పెరుగగలదు......ప్రతిపనియు నెఱవేఱులోపల నూర్ల కష్టములు దాటవలసియున్నది. పూనిక వదలక పాటుపడువారు త్వరగానో ఆలస్యముగానో (సిద్ధి) వెలుగు చూడగలరు.

నేను ఇపుడు అమెరికను నాగరకత హృదయమగు న్యూయార్కునే మేలుకొలుప గంటిని. కాని అది ఒక భయంకరమైన పోరాటమైనది......నాకు ఉన్నదంతయు చాల మట్టుకు ఈ న్యూయార్కు పనికోసమును ఇంగ్లండునందును వ్యయము చేసితిని. ఇపుడు అన్ని విషయములు తాము సాగిపోగల వన దగిన ఆకారమున ఉన్నవి.

హిందువుల భావములను అభిప్రాయములను ఆంగ్లీకరించుటయు, (వారి) శుష్క తత్త్వశాస్త్రమునుండియు, గహనమగు

పురాణావళినుండియు వింతమై ఉలికిపడజేయు శారీరక ధర్మశాస్త్రము నుండియు సులువును సుబోధమును జనాకర్షకమును అయి గొప్ప మేధావంతుల అన్ని అక్కఱల దీర్చు మతమును రూపొందించుట అను పని అట్టిప్రయత్నము చేసినవారికి మాత్రమే అవగత మగును. నిగూఢమగు అద్వైతము నిత్యజీవితమున సజీవమును కావ్య శృంగారమాధుర్యములు గలదియు కావలెను. అత్యంత గహనము లగు పురాణములనుండి సుస్పష్ట నైతిక సంప్రదాయములు రావల యును. దిక్కుతోపని యోగశాస్త్రమునుండి శాస్త్రసమ్మతమై సహేతుకమై అనుష్ఠానయోగ్యమగు మన స్తత్త్వశాస్త్రము రావల యును. దీనినంతటిని శిశువుసయితము సులువుగా గ్రహింపగల రూపమున ఉంపవలయును. ఇది నా జీవితకార్యము. ఇందు నే నెంత వఱకు నెగ్గగలనో, దేవునికే ఎఱుక. "మనకు హక్కు పనిచేయుటకే గాని, దాని ఫలమునకు గాదు." అబ్బాయీ, అది చాల కష్ట మైనపని, చాల కష్టమైనపని! సాక్షాత్కారమునుగూర్చిన భావము లను, సంపూర్ణ వైరాగ్యమును చిత్తమునకు తెచ్చుకొనునట్లు శిష్యులు తయారగువఱకు, కామకాంచనముల సుడినడుమ చి తమును స్థిరముగా నుంచుకొని, తనగొప్ప లక్ష్యముల పట్టు వీడక నిలిచి యుండుట నిజముగా మిక్కిలి కష్టమైన పని. దేవుని ధర్మాన ఇప్పటికే చాల జయము సేకుఱినది. మతప్రచారకులును ఇతరులును నన్ను అర్థము చేసికొనలేరైరి. అందులకు వారిని తప్పుపట్టను. (ఏలన) వారు ఇప్పటికెన్నడును కామినీకాంచనముల నించుకయు సరకుసేయని మానవుని చూచియెఱుగరు. తొలుత అది సాధ్యమని వారు నమ్మలేకపోయిరి; అవును, వారు ఎట్లు నమ్మ గలరు? ఇండియా జనులకుగల పాతివ్రత్యపవిత్రత్వభావముల బోనివే పాశ్చాత్యులకును కలవని నీవు ఎంచరాదు. వానికి వారి పర్యాయ ములు సద్గుణము ధైర్యము......... జనులు ఇపుడు నాకడకు గుంపులు గుంపులుగా వచ్చుచున్నారు. 'శారీరకవాంఛలను నిజముగా అణపగలవారు ఉన్నారు' అని నూర్లసంఖ్యలవారు

ఇపుడు బాగుగా నమ్ముచున్నారు. ఈ ధర్మములపట్ల గౌరవాదర ములు దినదినమునకు పెరుగుచున్నవి. ఎవడు వేచియుండునో వానికి అన్నియు చేకురును. నీకు నిరంతరముగా దేవుని యను గ్రహము కలుగును గాక.

భవదీయ ప్రేమపూర్ణ
వివేకానంద.

## 260

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

228 పడమటి 39 వ వీథి
న్యూ యార్కు
ఫిబ్రవరి 29, 1896.

ధన్య, ప్రియ,

నేను సాధ్యమైనచో మేనెలకుముందే వచ్చుచున్నాను. ఆ విషయమునుగూర్చి నీకు ఆకులత వలదు. ఆ చిన్నిపుస్తకము బాగుండినది. ఇక్కడినుండి వార్తాపత్రికల కత్తిరింపులు చేతికి వచ్చినచో అక్కడికి రవాణా చేయబడును.

పుస్తకములు, పెద్దవియు చిన్నవియు ఇక్కడ తయారు చేయబడిన విధము ఇది :—న్యూయార్కులో (అందులకై) ఒక కార్యనిర్వాహణ సంఘము కూర్పబడినది. షార్టుహాండు వ్రాయించి అచ్చువేయించు పనులకగు వ్యయమంతయు వారు పెట్టుకొన్నారు. అందులకు షరత్తు ఏ మనగా అట్లు అచ్చువేసిన వన్నియు వారివిగా నుండవలసినది అని. కావున ఈ చిన్నిపుస్తకములును తక్కిన పుస్తకములును వారివి. ఒక పుస్తకము 'కర్మయోగము' అనునది ఇప్పటికే ప్రకటింపబడినది. అంతకన్న చాల పెద్దదగు 'రాజయోగము' అనుదాని ప్రకటనము జరుగుచున్నది. 'జ్ఞానయోగము'ను తరువాత ప్రకటింపవచ్చును. ఇవి జనులకు ప్రియమైనవిగా నుండును. అందలి శైలి సంభాషణ శైలి. నీవు ఇదివరకు చూచియున్నావు గదా. ఆక్షేపింపదగినదానినెల్ల అందుండి తొలగించితిని. పుస్తక ములు తయారుసేయుటకు నాకు వారు సాయపడుదురు.

పుస్తకములు నిర్వాహకసంఘమువారి సొమ్ము. ఆ సంఘమునకు ప్రధానమైన ప్రాపు, శ్రీమతి ఓల్బులుసతియు, శ్రీమతి లెగ్గెట్టు సతియు.

ఖర్చులన్నియు వారు భరించినందున పుస్తకములు వారివగుట న్యాయ్యమే. ప్రకటించినవారు అందే మేని వేలు పెట్టుదు రేమో అను భయములేదు. ఏలన వారే కదా వానిని ప్రకటించినవారు.

ఇండియానుండి ఏవేని పుస్తకములు వచ్చిన వానిని పెట్టి పెట్టుము.

పార్టుహాండు వ్రాయసకాడగు గుడ్విను అను పేరుగల ఆంగ్లేయుడు పనిలో చాల శ్రద్ధకలిగియున్నాడు. కావున నేను ఆయన నొక బ్రహ్మచారిని చేసితిని. అతడు నాతోకూడ తిరుగు చున్నాడు. మే మిరువురము కలసి ఇంగ్లండుకు వత్తుము. అతడు నా కెప్పుడును సాయముగా నున్నట్లే ఇప్పుడు నుండగలడు.

అన్ని ఆశీస్సులతో,

భవదీయ

వివేకానంద.

## 261

(శ్రీ త్రిగుణాతీతానందస్వామికి)

బోస్టను

మార్చి 2, 1896

ప్రియ శారదా,

నీ జాబువలన నాకు ప్రతి సంగతియు తెలిసినది. ఐనను ఉత్సవమును గూర్చి నేను పంపిన కేబిల్ మాటనే నీ వెత్తలేదు. శశి కొన్ని నెలలక్రింద పంపిన నిఘంటువు నాకు ఇంకను చేరలేదు. ......నేను త్వరలో ఇంగ్లండుకు పోవుచున్నాను. నేనే ఇంగ్లం

డుకు పోవుచున్నాను కావున శరత్తు ఇప్పు డిచ్చటికి రానేవలదు. (ఇటో అటో) నిశ్చయించుకొనుటకు ఇంత సేపు పట్టు మనుష్యులు నాకు అక్కఱలేదు. యూరపు సంచారమునకు నేను ఆతని పిలువ లేదు; దానికి వలయు పైకమును నాకడ లేదు. కావున అతనిని రావల దని చెప్పుము. మఱెవ్వరైనను కూడ రావలదు.

టిబెట్టును గుఱించి నీవు వ్రాసిన జాబును చూడగానే నీ సామాన్య వివేకముపై నాకు గల మదింపు పోయినది. మొదటి సంగతి ఏమనగా నోటోవిచ్ వ్రాసిన పుస్తకము యథార్థమైనది అనుట అర్థములేనిమాట. నీవు అసలుప్రతిని చూచితివా? లేక దానిని ఇండియాకు తెచ్చితివా? రెండవది యేమనగా, కైలాసమఠ మున జీససు చిత్తరువును సమరిటను మహిళ చిత్తరువును నీవు చూచితినని చెప్పుచున్నావు. అది జీససు ప్రతిమయే, ఎవనిదో వీథిలో పోవువానిది కాదు అని నీ వె ట్లెఱుగుదువు? నీవు చెప్పిన మాటను నేను ఒప్పుకొందు ననియే అనుకొనుము. అప్పుడు దానిని మఠమున ఎవడైనను క్రైస్తవుడే ఎట్ట లేదని నీవు ఎ ట్లెఱుగుదువు? ఇంకను టిబెట్టు జనులను గూర్చిన నీ యభిప్రాయములును యుక్తి యుక్తములుగా లేవు. నీవు నిజముగా టిబెట్టు లోపలిభాగమును చూడ లేదు. నీవు చూచినది వ్యాపారపు రస్తా యంచును మాత్రమే. అటువంటిచోట్లలో ఆ ప్రజలలోని అధములే అగపడుదురు. కలక త్తాలో చైనాబజారు బారాబజారు ప్రాంతములను చూచిన యెవ డేనియు ప్రతిబెంగాలివానిని అబద్ధాలకోరు అనిన, ఆ మాట సరిగా నుండునా?

ఏదేని వ్యాసము వ్రాయునపుడు శశితో చక్కగా సలహా పడుము......నీకు కావలసినది విధేయత......

భవదీయ ప్రేమయుత

వివేకానంద.

## 262

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

న్యూయార్కు
మార్చి 17, 1896.

ధన్య, ప్రియ,

నీ కడపటి జాబు నాకు ఇప్పుడే అందినది. అది నాకు చాల భయము కలిగించినది.

(నా) ఉపన్యాసములు కొందఱి మిత్రుల తరఫున వాని స్టెనోగ్రఫిని ఇతర ఖర్చులను వారు భరించినందున వానిని ప్రకటించు హక్కు వారికే ఉండవలయు నను షరత్తుతో ఒసంగబడినవి. కావున వారు అప్పుడే ఆదివారోపన్యాసములను, కర్మయోగము రాజయోగము జ్ఞానయోగము అను మూడు పుస్తకములను ప్రకటించియైనది. రాజయోగమున ముఖ్యముగా చాల మార్పు చేయబడినది. విషయము క్రొత్త వరుసన కూర్చబడినది. పతంజలి యోగ సూత్రాల అనువాదమును చేర్చబడినది. 'రాజయోగము' లాంగ్మన్సువారి చేతిలో నున్నది. ఈ పుస్తకములు ఇంగ్లండులోను ప్రకటింతమనుకొన్నందుకు ఇచ్చటి మిత్రులు కోపము చెందుచున్నారు. వానిని నేను చట్టము ప్రకారము వారికి ఇచ్చి యైపోయినందున, నాకు అందులకు ఏమి చేయను ఉపాయము తోపకున్నది. చిన్ని పుస్తకముల ప్రకటన అంతగా ఫరవాలేకపోయినది గాని పుస్తకములలో మార్పులు విషయముల క్రొత్తవరుసలు చూడ అమెరికాలో వేసిన పుస్తకమునకును ఇంగ్లీషు పుస్తకమునకును పోలికే ఉండదు. నిన్ను బతిమాలుకొందును, ఈ పుస్తకములను ప్రకటింపకుమా. ప్రకటించినట్లైన ఇక్కడ నా స్థితికి చాల మోసము గల్గును. అణపలేని జగడాలుపుట్టి, అమెరికాలోని నా పనియంతయు నాశమగును.

నాకుచేరిన కడపటిజాబువలన ఇండియానుండి ఒక సన్న్యాసి బయలుదేఱివచ్చుచున్నాడని తెలియవచ్చుచున్నది. నాకు కుమారి

ముల్లరుకడనుండి చాల పసందైన జాబొకటి వచ్చినది; కుమారి మెక్లియదు కడనుండియు ఒకటి వచ్చినది. లెగ్గెట్టు కుటుంబమంతయు నాకు చాల కూర్చునది యైనది.

నేను శ్రీ ఛాటర్జినిగూర్చి ఏమియు ఎఱుగను. అతని యిబ్బంది ఆర్థికమనియు, ధనమును థియాసపిస్టులు అతనికి సరఫరా చేయజాలకున్నారనియు ఇతరమూలమున విన్నాడను. ఇండియానుండి చాల సమర్థుడొకడు వచ్చుచున్నాడను విషయము తెలియ వచ్చినందున ఛాటర్జి నాకు చేయగలసాయము అత్యల్పముగను నిష్ప్రయోజనముగను ఉండును. అతనిమాట ఇంకను అనుకొననే అక్కఱలేనిది. అంతే వాని సంగతి. మనము తొందరపడ నక్కఱలేదు.

ఈ ప్రకటనకార్యమును గూర్చి ఆలోచింపు మని నిన్ను మరల వేడికొందును. శ్రీమతి ఓల్బుల్ సనికి కొన్ని జాబులు వ్రాయుము. 'మనము తెచ్చు సుభవార్త, మన సిద్ధాంతము సర్వజీవకోట్ల ఏకత్వము' అనుటను జ్ఞప్తియందుంచుకొని అమెరికను వేదాంతిపుమిత్రుల యభిప్రాయమును ఆమె ద్వారా కనుగొనుము. మన మొక ప్రత్యేక జాతియగుదుము అను ఆయా దేశాల జనుల జాత్యైక్యాది భావములు కేవలము దుష్టమూఢవిశ్వాసములే అగును. అంతియకాక ఎవడు ఇతరుల యభిప్రాయములకు నిరభ్యంతరముగా లొంగిపోవుచుండునో అతడు కడపటికి తన యభిప్రాయమే నెగ్గను, తనకే జయము సేకుఱను కాంచును. నాకు సందేహాము లేదు. ఎప్పుడును ముందులొంగుట కడపటికి జయముపొందుటకే. మన మిత్రులకెల్ల నా ప్రేమను అందింపుము.

ప్రేమతో ఆశీస్సులతో.

భవదీయ

వివేకానంద.

మలిమాట: నేను మార్చినలలో సాధ్యమైనంతత్వరగా తప్పక వచ్చుచున్నాను.

వి.

## 263

(శ్రీ అళసింగ పెరుమాళునకు)

బోస్టను
మార్చి 23, 1896

ప్రియ అళసింగా,

......నా క్రొత్తసన్న్యాసులలో ఒకరు స్త్రీ......తక్కిన వారు పురుషులు. ఇంగ్లండులో మఱికొందఱిని సన్న్యాసుల జేసెదను. వారిని నాతోకూడ ఇండియాకు పిలుచుకొనివచ్చెదను. మన ఇండియాలో హిందువులకున్నంతకంటె ఈ 'శ్వేత'ముఖములకు ఎక్కువ ప్రభావముండును. వీరు వీర్యసమంచితులు, హిందువులు నిర్జీవులు. ఇండియాకు సామాన్య భారతదేశమునకు ఆసపాటు క్రిందితరగతుల జనులలోనే. పైతరగతుల జనులు శారీరకముగాను నైతికముగాను చచ్చినవారే.

నా విజయమునకు కారణము జనప్రియమగు నా శైలియే. ఆచార్యుని గొప్పతనము అతని సరళభాషయే.

......నేను పైనెల ఇంగ్లండుకు పోవుచున్నాను. నేను అతిమాత్రముగా పనిచేసితినేమో అని వెఱగగుచున్నది. వీడని దీర్ఘశ్రమవలన నా నరములు ఇంచుమించు క్రక్కదలిపోయినవి. నీవు 'అయ్యో, పాపము' అనవలయునని కాదు నేను ఇది వ్రాయుట. మఱేలన నీవు నావలన ఎక్కువగ దేనినిగాని ఎదురుసూడకుండుటకు. నీ వెంతబాగుగా పనిచేయగలవో అట్లు చేయుచు పొమ్ము. పెద్ద పనులు చేయగలుగుదునను ప్రత్యాశ నాకు ఇపుడు అంతగా లేదు. అయినప్పటికిని నా యుపన్యాసములు స్టెనోగ్రఫిమార్గమున వ్రాయబడుటవలన చాల గ్రంథములు ఏర్పడినవి. నాలుగు పుస్తకములు సిద్ధముగా నున్నవి......సరియే. నేను నా శక్తికొలది మేలుచేయ ప్రయత్నించితినని నాకు తృప్తిగా నున్నది. కాన పనివీడి విరామము పొంది ఒక గుహలో కూర్చున్నప్పుడు నా యంతరాత్మ ప్రసన్నముగా నుండగలదు.

అందఱకు నా ప్రేమయు దీవెనలును

వివేకానంద.

## 264

(కుమారి మేరీ హేలుకు)

ప్రియ సోదరీ,

నామీఁద కోపము కలిగి నా జాబులకు దేనికిగాని జవాబు వ్రాయువైతివని నాకు భయమగుచున్నది. నిన్ను లక్షక్షమాపణలు వేడికొందును. మంచి అదృష్టమువలన నాకు కావినన్ని గుడ్డ దొరకినది. సాధ్యమైనంతత్వరగా (దానితో) కోటు కుట్టించుకొనబోవుచున్నాను. శ్రీమతి బుల్సతిని నీవు కలసికొంటివని వినగా నాకు సంతసము కలిగినది. ఆమె చాల ఉదారశీల, కృపావతియగు సఖి. ఇదిగో చూడు సోదరీ, ఇంటిలో రెండు సన్నని చిన్న పుస్తకములు, సంస్కృతభాషవి ఉన్నవి. నీవు శ్రమ యని తలంపవేని, వానిని నాకు పంపుము. ఇండియానుండి పుస్తకములు భద్రముగా వచ్చి చేరినవి. నేను వానికోసము ఏమియు సుంకము కట్టవలసిరాలేదు. కంబళ్లు ఇంకను చేరలేదే, ఆశ్చర్యముగా నున్నది! నేను మరల అమ్మ ఒబ్బిలును చూడబోలేదు. నాకు తీఱికచిక్కలేదు. నాకు లభించు ప్రతిక్షణకాలమును లైబ్రరీలో గడపుచున్నాను.

మీకందఱకు శాశ్వతప్రేమ, కృతజ్ఞతలతో

సదా నీకు కూర్చు సోదరుడు

వివేకానంద.

మలిమాట: కడచిన కొన్నాళ్లలో కాదుకాని శ్రీ హా సుదృఢశ్రద్ధాళువగు విద్యార్థి, కుమారి హాకు నా అనురాగమును దయతో అందింపుమా.

వి.

## 265

(శ్రీ ఆళసింగ పెరుమాళుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు
మార్చి, 1896.

ప్రియ అళసింగా,

......సాగిపో పనితో, నాకు సాధ్యమైనదెల్ల నేను చేయగలను. దేవున కభిమతమగునేని ఇక్కడను ఇంగ్లండులోను

కాషాయాంబరులగు సన్న్యాసులు చాల తటచ్చై పోవుదురు. నా బిడ్డలారా, పనితో సాగిపొండి.

జ్ఞప్తియందుంచుకొనుము, నీకు నీ గురువునందు భక్తివిశ్వాసములుండువఱకు, నీమార్గమునకు ఏదియు అడ్డము రాజాలదు. ఆమూడుభాష్యముల అనువాదము ఈ పాశ్చాత్త్యులదృష్టిలో గొప్ప విషయముగా నుండగలదు.

......ఆగు, నాబిడ్డా, ఆగు ; ఆగి పనిసాగింపుము. ఓర్పు ఓర్పు......నేను మరల తగిన సమయమున జనులమీాద పడెదను.

భవదీయ ప్రేమయుత

వివేకానంద.

## 266

(శ్రీమతి బుల్సతికి)

ఇండియానా అవెన్యూ

చికాగో-ఇల్లి,

ఏప్రిల్ 6, 1896

ప్రియ శ్రీమతి బుల్సతి,

నీవు దయతో వ్రాసిన జాబు సరిగా అందినది. నాకు ఆనందకరములగు మిత్రసమాగమములు గల్గినవి. తరగతుల పాఠములు ఇప్పటికే పెక్కు జరిగినవి. మఱికొన్నింటిని పెట్టుకొని అటుతర్వాత గురువారము బయలుదేఱెదను.

ఇచట కుమారి ఆడమ్సు దయవలన ప్రతిది చక్కగా ఏర్పాటుచేయబడెను. ఆమె మంచితనమును దయయు అంతటివి.

నేను కడచిన రెండుదినాలుగా కొంచెము జ్వరముతో బాధపడుచున్నాను. కావున పెద్దజాబు వ్రాయజాలను.

బోస్టనులో అందఱికి నాప్రేమ.

ఆదరయుత భవదీయ

వివేకానంద

## 267

(డాక్టరు నంజుండరావుగారికి)

న్యూయార్కు
ఏప్రిల్ 14, 1896

ప్రియ డాక్టరు నంజుండరావు,

నీ జాబు నాకు నేడుదయము చేరినది. నేను రేపు ఇంగ్లండుకు ప్రయాణము చేయుచున్నందున, హృదయపూర్వకముగ కొన్ని బంతులే వ్రాయగలిగి యున్నాను. నీవు బాలురకు అని సంకల్పించిన పత్రిక విషయమున నాకు సర్వవిధ సానుభూతియు కలదు, దానిని పైకి తెచ్చుటకు నా చేతనైనంతయు చేసెదను. నీవు దానిని 'బ్రహ్మవాదిన్' పద్ధతినే అనుసరించుచు స్వతంత్రమైన దానినిగా చేయవలయును. దాని శైలిని విషయములను మాత్రము ప్రజల కత్యధిక రంజకముగాను ఆకర్షకముగాను చేయవలయును. ఉదాహరణార్థము చెప్పెదను చూడు. సంస్కృత గ్రంథములయందంతట చెదరి చెదరియుండు ఆ యద్భుత కథలను తిరుగ వ్రాసి జనుల మెప్పుగలవానినిగా జేయుటకు నీ వన్నదేని కల గన్నంత కంటె ఎంతో హెచ్చు అవకాశము ఇందు కలుగును. నీ పత్రికలో అది ఏక ముఖ్యాంశముగా ఉండవలయును. నాకు అవకాశము కలిగినపుడు నేనును నాకు సాధ్యమైనన్ని కథలు, వ్రాసెదను. నీ పత్రికను ఎక్కువ పండితోచితముగా చేయకు. అందుకు బ్రహ్మవాదిన్ ఉన్నదిగా. - అట్లు చేయకుందువేని అది మెల్లగా లోకమంతట వ్యాపించునని నాకు గట్టి నమ్మకము. మిక్కిలి సులువగు భాష వాడుము; నీ ప్రయత్నము నెగ్గును. కథలగుండ ప్రధాన (ధర్మ) సూత్రములను బోధించుట అందలి ప్రధానాంశముగ నుండవలయును. తత్త్వవిచారపరమైనదానినిగా దానిని చేయనే చేయకు...

...ఇండియాలో మనకు లేనిది ఒండొరులను కలుపుకొను శక్తియు, అంగోపాంగములను పరిశీలించి ఒక పద్ధతి ఏర్పఱుచుకొను శక్తియు. అందులోని మొదలి రహస్యము విధేయత.

......ధైర్యముగా పని జరుపు. ఒక దినములోనే ఒక సంవత్సరములోనే సిద్ధి కలుగు నని ప్రతీక్షింపకు. మహోన్నత లక్ష్యమును అంటిపట్టుకొనియే యుండుము. స్థిరముగా నుండు. (చాపల్యము రానీకు.) ఈర్ష్యాసూయలు స్వార్థపరత రానీయకు. విధేయత గలిగి, సత్యపక్షమును మానవకోటిపక్షమును నీ దేశపక్షమును సదా అవలంబించియుండుము. అట్లుండగలవేని నీవు ప్రపంచమునే కదల్పగలవు. మనుష్యుని తరహా, వాని జీవితము—ఇదే ప్రభావ మర్మము. మరేదియు గాదు. ఈ జాబును పదిలముగా నుంచుకొని నీకు చింత కలిగినపుడును ఈర్ష్య మొలకెత్తినపుడును ఈ కడపటి బంతులను చదువుకొనుము. ఈర్ష్య బానిసలచేటు. అదే మన దేశ జనులచేటు. దానికి సదా దవ్వుగ నుండుము. అన్ని దీవెనలు సర్వసిద్ధి నీకు కలుగును.

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

## 268

(శ్రీమతి బుల్ నతికి)

124 తూర్పు-44 వ వీథి
న్యూయార్కు
ఏప్రిల్ 14, 1896

ప్రియ శ్రీమతి బుల్నతి,

...వీడుగో ఒక వింతమనుష్యుడు బొంబాయినుండి నా కొక జాబు చేతగొని వచ్చియున్నాడు. ఇతడు చేతులతో పనిచేయ నలవాటుపడిన శిల్పి. అతని ముఖ్యమగు ఉద్దేశ్యము ఏమనగా కత్తులు మొదలగు కోతసాధనములు ఇంకను ఇతరవిధములగు ఇనుపవస్తువులు చేయు నీ దేశములోని కర్మాగారములను చూచుట ......అతనినిగూర్చి నాకు ఏమియు తెలియదు. అయినను ఒకవేళ అతడు మోసగాడు అయినను, మా దేశపుజనులలో విదేశాలకు వచ్చు ఇట్టి సాహసగుణమును పెంపొందింపవలయు నని నాకు చాల

అపేక్ష. దారిప్రయాణపు ఖర్చునకు చాలినంత డబ్బు వానిచేత నున్నది.

మఱి అతనియుత్సాహము నిజమైనదే యగునా అని వానిని ముందు జాగ్రత్తకు వలయుపరీక్ష చేసి, ఫరవా లేదు అని నీవు తృప్తిపడుదువేని, అతడు కోరునది మఱేమియు గాదు, అట్టి కర్మాగారములను చూచుటకు కొన్ని అవకాశములు. అతడు నిజముగా అట్టియాసగలవా డగునవియు ఈ విషయమున నీవు వానికి సాయపడ జాలుదు వనియు నా యపేక్ష.

ఆదరపూర్ణ భవదీయ

వివేకానంద.

## 269

(శ్రీ త్రిగుణాతీతానందస్వామికి)

న్యూయార్కు.

ఏప్రిల్ 14, 1896

ప్రియ శారదా,

నీజాబు వలన ప్రతివిషయము ఎఱుగనైనందుకు చాల సంతోషము. శరత్తు క్షేమముగా చేరినా డని నాకు సమాచారము అందినది. నాకు నీజాబును 'ఇండియన్మిర్రరు' ప్రతియు చేరినవి. అందులో నీవు వ్రాసిన విషయము బాగున్నది. క్రమముతప్పక వ్రాయుచునే యుండుము. తప్పులు వెదకుట (లోకాన)సులువే కాని గుణములు వెదకుట సన్న్యాసికి ముఖ్యలక్షణము. దానిని ఎప్పటికిని మఱవకు......నీకు ఇంచుక వ్యాపారనైపుణ్యము కొఱవ...నీకు కావలసినది ఆకార్యపు అంగములను సరిగా అమర్చుకొనుట. దానికి విధేయతయు చక్కని కార్యవిభాగమును ఆవశ్యకములు. ఒక్కొక్క విషయముననను అన్ని వివరములను నేను, రేపే ఇంగ్లండుకు బయలుదేఱుచున్నాను గావున, అక్కడినుండి వ్రాసిపంపెదను. మిమ్ముల నందఱిని, అంగోపాంగములు చక్కగా అమర్చుకొన్న

......మేలి కార్యపరులుగా చేయవలయు నని నిశ్చయించుకొని యున్నాను. .

'మిత్రుడు' అన్న మాట అందఱి విషయమునను వాడవచ్చును. బెంగాలిలో దీనముగా దేబిరించువిధమైన మర్యాద సాధారణముగా నున్నది. అది ఇంగ్లీషుభాషలో లేదు. అట్టి బెంగాలీపదములు, యథార్థముగా ఇంగ్లీషున అనువాదముచేసిన, పరిహాసాస్పదమగును. 'రామకృష్ణపరమహంస దేవుడు' అను ఆవిధమైన విషయములు ఇట్టిదేశాలలో చెల్లుబడి కావు. 'మ-'కు అట్టిదానిని అందఱి గొంతులోను దిగమ్రింగింపవలయునను అభిప్రాయము ఉన్నది. మఱి యట్లుచేసిన మన ఉద్యమము ఒక చిన్న తెగగాసంకుచితమైపోవును. అట్టి ప్రయత్నములకు నీవు దూరముగా నుండుము. మఱి జనులు (ఎవరైనను) ఆయనను దేవుడుగా పూజింతురా, మంచిదే. దాని వలన వచ్చిన సెబ్బర ఏమియు లేదు. నీవు ప్రోత్సహింపను అక్కఱ లేదు, నిరుత్సాహపఱుపను అక్కఱ లేదు. సామాన్యజనులు సదా మనుష్యునే లెక్కింతురు; పై మెట్టువారు సిద్ధాంతమును లెక్కింతురు. మనకు రెండును కావలసినవే. కాని సిద్ధాంతము ప్రపంచమంతటికి ఒక్కటే. మనుష్యులు అట్లు కాదు. కావున ఆయన యుపదేశించిన సిద్ధాంతముల గట్టిగా పట్టుకొనుము. వ్యక్తినిగూర్చి జనులు ఏమేని యనుకొననిమ్ము ......... జగడాలు ద్వేషాలు మతదురభినివేశ దురాగ్రహములు ప్రశాంతించును గాక. ఇవి యన్నింటిని చెఱచును. "ఉత్తముడు కడపటివాడుగా ఉండ వలయును." "మద్భక్తానాఞ్చ యే భక్తాస్తే మే భక్తతమా మతాః" "నాభక్తులకు ఎవరుభక్తులో వారిని నా పరమభక్తులుగా తలంచు కొందును."

ప్రేమయుత భవదీయ

వివేకానంద.

## 270

(సోదరులకు)

6 పడమటి 43 వ వీధి
న్యూయార్కు
ఏప్రిల్ 14, 1896

ప్రియసోదరీమణులారా,

నేను ఆదివారమున క్షేమముగా చేరితిని. ఒళ్ళు జబ్బుగా నున్నందున ఇంతకంటె ముందుగా వ్రాయజాలకపోయితిని. నేను రేపు మధ్యాహ్నము 12 గంటలకు వైట్‌స్టార్లైను జెర్మానిక్ (నావ)లో ప్రయాణముచేసెదను. ప్రేమను కృతజ్ఞతను దీవెనలను సదాస్మరించు,

సదా మీప్రియసోదరుడు
వివేకానంద.

## 271

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

గురువారము అపరాహ్ణము
వేవ్నీ భవనము
ఫేర్లాజెల్ గార్డన్సు
ఎన్. డబుల్యూ

ప్రియ స్టర్డీ,

నేను ఉదయము నీతో చెప్ప మఱచితిని. ఆచార్య మాక్సు ముల్లరు నేను ఆక్సుఫర్డుకు వత్తునేని నాకు తాను చేయగల సర్వ సాహాయ్యము, చేసెదనని జాబులో వ్రాసినాడు.

భవదీయ ప్రేమపూర్ణ
వివేకానంద.

మఱిమాట : శంకరపాండురంగ ప్రకటితమగు అథర్వవేద సంహిత పంపుమని వ్రాసితివా?

వి.

## 272

(హేలు అప్పచెల్లెండ్రకు).,

హై వ్యూ, రీడింగు
ఏప్రిల్ 20, 1896

ప్రియ సోదరీమణులారా,

ఈవలితీరమునుండి మిమ్ము కుశల మడుగుచున్నాను. సముద్రముమీది ప్రయాణము చాల ఆనందముగా ఉండినది. ఈతూరి జబ్బు లేమియు లేవు. అవి రాకుండ చికిత్స చేసికొంటిని. ఐర్లండు గుండను, కొన్ని ప్రాచీన ఇంగ్లీషు పట్టణముల గుండను మిక్కిలి వడిగా ఒక చిన్న పరువుతీసి మరల రీడింగుకు బ్రహ్మమాయా జీవులయు జీవాత్మ పరమాత్మాదులయు నడిమికి చేరితిని. ఆ మఠియొక సన్న్యాసి ఇక్కడ ఉన్నాడు; చాల పసందైన మనుష్యుడు. అంతే కాదు. గొప్ప పండితుడును. మేము పనిలో మునిగియు గ్రంథములను సరిచూచి ప్రచురించుచున్నాము. దారిలో అంతగా చెప్పదగిన ప్రాధాన్యముకలది ఏదియు సంభవింపలేదు. విసుగుకలిగించుచు ఇంచుకయు మార్పులేక రసహీనముగా, నా జీవితమువలెనే ఉండినది. నేను అమెరికానుండి బయటికి వచ్చినపుడే నాకు అమెరికా మీద ప్రేమ ఎక్కువగ నుండును. ఇకను అన్నియు తలపోసికొనగా అక్కడనుండిన సంవత్సరములు నేను ఇప్పటికి నా జీవితమున చూచినదానిలో శ్రేష్ఠమైనకాలము.

'బ్రహ్మవాదిన్' పత్రికకు కొందఱు చందాదారుల చేర్ప ప్రయత్నించుచున్నారా? శ్రీమతి ఆడమ్సు సతికిని, శ్రీమతి కాంగోరు సతికిని నా యత్యంత ప్రేమను సాదరసంస్మృతిని ఎఱింగింపుడు. మీరు ఇబ్బందిలేక వ్రాయతగినంత త్వరగా నాకు మీరు ఏమి చేయుచుండునదియు భోజనపాన సైకిల్ యానములతోడి మీ జీవితపు విసుగును మాన్పుకొన ఏమిచేయుచున్నారో వ్రాయుడు. నేను ఇపుడు తొందరలో ఉన్నాను. తరువాత ఒక పెద్దజాబు వ్రాసెదను. కావున ఇప్పటికి సెలవు. మీ రెల్లపుడు సుఖముగా నుందురు గాక.

మీ నిత్య ప్రియసోదరుడు,
**వివేకానందుడు.**

మెలిమాట :— నాకు తీరిక కలుగగానే అమ్మచర్చికి (జాబు) వ్రాసెదను. సామ్యుఘు లాక్ సోదరికి నా ప్రేమను అందింపుము.

వి.

## 273

(అలంబజారు మఠమువారికి)

హైవ్యూ, కేవర్షామ్.
రీడింగు.
ఏప్రిల్ 27, 1896.

ప్రియ—,

......మీ కందఱకు నన్ను ఒకమాట వ్రాయనిండు. నేను మీమీద నాకు సొంతముగ్గా అధికారము కావలయు నని కాదు; ఇది వ్రాయుట-మఱి మీ మేలుకోసమును, ప్రభువు అవత రించిన ప్రయోజనమును నెఱవేర్చుటకును. ఆయన మిమ్మందఱిని నాకు అప్పగించినాడు. ప్రపంచమునకు గొప్ప క్షేమమును సాధించు టలో మీరొకవిధము నిర్వహింపవలయును. ఆ సంగతి మీలో చాలమందికింకను తెలియదు. అదే నేను దీనిని వ్రాయుటకు ప్రత్యేక కారణము. మీలో ఈర్ష్యగాని అహంకారముగాని నెల కొనునేని, అది మిక్కిలి శోచనీయమగును. తమలో తాము క్షణ మేని స్నేహసద్భావములతో ఉండలేనివారు ప్రపంచములో ఆభావ ముల స్థాపింపగలరా ? చట్టములతో కట్టుపఱుపబడుట సెబ్బరయే, సందేహము లేదు ; అయినను అపక్వదశలో నిబంధనల అనుస రించుట ఆవశ్యకమగును. అనగా ఏమన్నమాట ? చిన్న మొల కను చుట్టు వెలుగు నాటి కాపాడవలయును అను మొదలగున దెల్ల గురుదేవుడు చెప్పుచు ఉండలేదా ? అదే. రెండవసంగతి— తమ మనసులకొక వ్యాపారములేనివారు వ్యర్థాలాపములకును కక్షలు పుట్టించి కుట్రలుచేయుట మున్నగు పనులకును దిగుట సహజమే. కావున నేను ఈ క్రింది సూచనలను వ్రాయుచున్నాను. మీరు వానిని అనుసరించిన నిస్సంశయముగా మేలొందుదురు. అనుసరింపకున్న మన శ్రమలన్నియు వృధలగు నపాయము గలదు.

మొట్టమొదట మఠ పరిపాలనను గూర్చి వ్రాసెదను.—

1. మఠప్రయోజనములకై విశాలమగు ఇల్లో, తోటయో, బాడిగకు తీసికొనుడు. అందు ఒక్కొక్కనికి ప్రత్యేకముగా ఒక చిన్న గది పెట్టుకొను వీలుండవలెను. పుస్తకములు పెట్టుకొనుటకు పెద్ద కూట మొకటి ఉండవలయును. చూడవచ్చినవారిని కలసికొని మాటలాడి పంపుటకు ఒక చిన్నగది ఉండవలయును. సాధ్యమైన, ఆ యింటిలో ప్రతిదినము శ్రుతులు మొదలగు పవిత్ర గ్రంథములు చదువుకొనుటకును జనులకోసము మతసంబంధమగు సంభాషణలు చర్చలు జరుపుటకును, మఱియొక పెద్ద కూటము, ఉండవలయును.

2. మఠములో ఎవనినైనను చూడవచ్చువాడు వానిని మాత్రమే చూచి పోవలయును, ఇతరులను వేధింపరాదు.

3. వంతులప్రకారము ఎవరో ఒకరు ప్రతిదినము కొన్ని గంటలు కూటములో జనులకోసము ఉండవలయును; వారు వచ్చి అడుగు ప్రశ్నలకు తృప్తికరముగ సమాధానములు చెప్పి పంపవలయును.

4. ప్రతివాడును తన గదిలోనే ఉండవలయును; కార్య విశేషమున్ననే గాని ఇతరుల గదులలోనికి పోగూడదు. ఎవరేని కావలయుననుకొన్నవారు గ్రంథాలయమునకు పోయి చదువుకొనవచ్చును. అక్కడ చుట్టబీడి త్రాగకూడదనియు ఇతరులతో మాటలాడకూడదనియు గట్టి నిషేధము లుండవలయును. మౌనముగ చదువుకొనవలయును.

5. గుంపెడుమంది ఒక గదిలో చేరి లెక్కలేకుండ వచ్చు బయటివారిని సందడిలో కలుపుకొని, దినమంతయు బాతాఖాని ఎంతమాత్రము చేయగూడదు.

6. అచ్చపు మతతత్త్వాన్వేషులు మాత్రమే బయటినుండి వచ్చి, దర్శనార్థులకైన గదిలో వేచియుండి, తాము ఎవరికోసము వచ్చినారో వారిని చూచి కాగానే వెడలిపోవలయును. అట్లుగాక వారు ఏదేని జన సామాన్యమునకు చెందు విషయము అడుగవలసి-

యున్న, ఆ దినమున అట్టి విషయములు చెప్పుటకు నేర్పఱుపబడి నాయనను కలసికొని అడిగి తెలిసికొని వెడలిపోవలయును.

7. చాడీలు చెప్పుట, దూషించుట, ఇతరులను గూర్చిన యపవాదములు తెచ్చియు కొనిపోయియు చెప్పుట – ఇవి పూర్తిగా మానవలయును.

8. ఒక చిన్న కొట్టు ఆఫీసుగదిగా ఉండవలయును. కార్య దర్శి ఆ గదిలో నుండవలయును. అందు కాగితము సిరా, జాబులు వ్రాయుటకు వలయు ఇతర వస్తువులు ఉండవలయును. అతడు ఆయవ్యయముల లెక్క వ్రాసిపెట్ట వలయును. జాబు లన్నియు అతనిచేతికి రావలయును. అతడు వానిని తెఱచిచూడక అవి యెవ రెవరివో వారికి ఇచ్చివేయవలయును. పుస్తకములు చిన్నవి, పెద్దవి వచ్చిన, అతడు వానిని గ్రంథాలయమునకు పంపవలయును.

9. పొగత్రాగుట కొక చిన్నగది యుండవలయును. దానికి వెలుపల ఆపని చేయగూడదు.

10. దూషణలకు దిగువాడును కోపము వెళ్లబోసికొను వాడును మఠపు హద్దులనుదాటి బయటికి పోవలయును. ఈ నియ మమును ఇంచుకయు ఉల్లంఘింపగూడదు.

# పరిపాలకవర్గము

1. ప్రతి సంవత్సరము ఒక సర్వాధ్యక్షుడు – అధికసంఖ్య వోట్లతో ఎన్నుకొనబడవలయును. తరువాతి సంవత్సరము మఱి యొకడు, తరువాత ఇంకొకడు ఈ విధముగా.

2. ఈ సంవత్సరమునకు బ్రహ్మానందుని అధ్యక్షునిగాను, అట్లే మఱియొకని కార్యదర్శిగాను, మూడవవానిని ఒకనిని పూజాది కమునకును భోజనపు ఏర్పాటులకును పర్యవేక్షకునిగను, ఎన్ను కొనుడు.

3. కార్యదర్శి మఱియొక పనిని కూడ చేయవలయును. అందఱి యారోగ్యమును కనుపెట్టియుండుట. ఈ విషయమున నావి మూడు సలహాలు:—

(i) ప్రతి గదిలోను ఒక్కొక్కనికిని ఒక చిన్న మంచము పెత్త మున్నగునవి ఉండవలయును. ప్రతివాడును తన గదిని శుభ్రముగా ఉంచుకొనవలయును.

(ii) త్రాగుటకును వంటపనులకును నిర్మలమైన నీరు సరఫరా కాదగిన యన్ని యేర్పాటులు చేయవలయును. ఏలన దేవతానివేదనము కావలయు మడిఅన్నమును మలినమును, అపరిశుద్ధమునగు నీటితో వండుట ఘోర పాపము.

(iii) శారదానందునికి తయారుచేసితిరే ఆమాదిరి కాషాయములు రెండు ప్రతివానికిని ఈయవలయును. ఆ యుడుపులు మురికి లేకుండ నుంచుకొనునట్లు చూడవలయును.

4. ఎవరైనను సన్న్యాసి కాగోరిన ముందుగా అతనిని బ్రహ్మచారిగా చేర్చుకోవలయును. అతడు మఠములో ఒక సంవత్సరమును బయట ఒక సంవత్సరమును వసింపవలయును. తరువాత అతనికి సన్న్యాస దీక్ష నొసగవచ్చును.

5. పూజపురస్కారములను ఈ బ్రహ్మచారులలో ఒకనికి అధీనపఱుపుడు. అప్పటప్పటికి ఒకనినుండి మఱొకనికి మార్చుచుండుడు.

## శాఖలు

మఠమున ఈ క్రింది శాఖలు ఉండవలయును—

I. విద్య II. ప్రచారము III. ఆధ్యాత్మిక సాధన.

I. విద్య—ఈ శాఖకు ఉద్దేశ్యము ఏమనగా, చదివి నేర్చుకొనగోరువారికి వలయు పుస్తకములు సరఫరా చేసి ఉపాధ్యాయులను ఏర్పఱచుట. ప్రతిదినము ప్రాతఃసాయంకాలములందు ఉపాధ్యాయులు వారికై సిద్ధముగా నుండవలయును.

II. ప్రచారము—మఠములోపలను, బయటను. మఠము లోపల ప్రచారము చేయువారు అ దేమి ఇ దెట్లు అని విచారించు వారికి — జిజ్ఞాసువులకు — వేదాది పవిత్ర గ్రంథములను చదివి వినిపించియు, ప్రశ్నల తరగతుల నేర్పఱిచియు ప్రచారము చేయ వలయును. బయటి ప్రచారకులు గ్రామగ్రామములలో మతబోధోప న్యాసములు కావింపవలయును; పలుతావుల ఈ మఠమును బోలిన మఠములు తోడంగ ప్రయత్నింపవలయును.

III. ఆధ్యాత్మిక సాధన—ఈ శాఖ అట్లు అభ్యసింపగోరు వారికి కావలసినవానిని సమకూర్పవలయును. ఈ సాధనకు దిగినవా డెవడును తాను ఇందు దిగినానని చదువుకొనువారి చదువునకును ప్రచారకుల ప్రచారమునకును అడ్డము రాకూడదు. ఈ యేర్పా టును ఎవడైనను ఉల్లంఘించిన వానిని తత్క్షణము నిష్కాసనము చేయవలయును. ఇది తప్పగూడని విధి.

మఠములో ఉపదేశోపన్యాసములు చేయువారు భక్తి జ్ఞానము యోగము అనువానిలో పాఠములు చెప్పవలయును. వంతులు పెట్టు కొని పనిచేయవలయును. ఇందులకు దినములను గంటలను నిర్ణ యించి, కార్యక్రమ పట్టికను పాఠాలగది వాకిటి తలుపునకు వ్రేల గట్టవలయును. లనగా అర్థమేమనగా భక్తిజిజ్ఞాసువు జ్ఞానపాఠము నకు నిర్ణయింపబడిన దినమున హాజరై, అయ్యో నేడు మన పాఠము కాదే అని మనసున వెతచెంద నక్కఱ లేక యుండవలయును. అట్లే తక్కిన జిజ్ఞాసువులును.

మీలో ఒకరును వామాచారపద్ధతి అభ్యసించుటకు అర్హులు కారు. కావున అది మఠమున ఏ కారణముననను (ఎవరిచేతను) అభ్యసింపబడ గూడదు. ఇందుల కెవని కేని అనంగీకారమును ఆక్షే పణ యు ఉన్న వాడు మఠమును వీడి బయటికి పోవలసినదే. ఈపద్ధ తిని మఠములో అసలు ప్రస్తావింపనే కూడదు ; ఉచ్చరింపనైనను కూడదు. గురుదేవునిస్వీయవర్గమున ఆ పాపిష్ఠపు వామాచారమును

దూర్వ గోరు ఖలునికి వర్తమానకాలమునను భవిష్యత్తునను, ఇహ
మునను పరమునను చేటు తప్పక కలుగును.

# కొన్ని సామాన్యపు హెచ్చరికలు

1. స్త్రీ ఎవతెయైనను ఒక సన్న్యాసితో మాటలాడుటకు వచ్చునేని ఆమె ఆ పనిని దర్శనార్థులకైన కూటములోనే చేయవలయును. ఏ స్త్రీనిగాని మఠపు గదిలోనికి గాని — పూజామందిరములోనికి తప్ప — ప్రవేశింపనీయగూడదు.

2. ఏ సన్న్యాసియు స్త్రీల — సన్న్యాసినుల మఠమున నివసింప అనుమతింపబడ గూడదు. ఎవడేని ఈ నియమమును పాటింప అంగీకరింపకున్నవాడు క్షిమఠమునుండి తఱుమగొట్టబడవలయును. ''ఖాళీదొడ్డి, దుష్ట పశువుల మందకన్న మేలు.''

3. సాధుశీలము లేనివారిని చేరనీయగూడదు, కఠినముగా తఱుమగొట్టవలయును. ఏ సాకునను, వేసమునను అట్టివారి నీడ సయితము నా గది గడప దాటగూడదు. మీలో ఎవడైనను దుఃశీలమును బట్టిన, వాడు ఎవడైనకానీ, వానిని తత్క్షణము తఱిమివేయుడు. శీలదుష్టులు మనకు వలదు. ప్రభువు మంచివారిని గుంపులు గుంపులుగా తేగలడు.

4. స్త్రీలు పాఠకాలమున పాఠపు గదికిని, మఱొప దేశోపన్యాసకాలమున ఉపన్యాస భవనమునకును రావచ్చును; కాని ఆకాలము కాగానే వెంటనే ఆ చోటును వదలిపోవలయును.

5. ఎప్పుడైనను సరే కోపము చెందకు; అసూయను చోరనీకు, పరోక్షమున రహస్యముగా దోషములు ఎన్నకు. తన దోషముల దిద్దుకొనక, ఇతరుల తప్పిదముల లెక్కించుట క్రౌర్యమునకును కఠినచిత్తతకును పరాకాష్ఠ.

6. భోజనమునకు గంటలు నియమింపబడవలయును. ప్రతియొక్కనికి ఒక యాసనము ఎత్తు తక్కువగ నుండు భోజనపు బల్ల

ఉండవలయును. ఆసనమున తాను కూరుచుండి, ఆ బల్లపై తన కంచమును ఉంచుకొనును. అది రాజపుటానా యాచారము.

# ఉద్యోగస్థులు

ఉద్యోగస్థులందఱు బుద్ధదేవుని యనుశాసనము ప్రకారము ఎవరికి తెలియనీక చీట్లువేసి ఎన్నుకొను మార్గమున ఎన్నుకొనబడ వలయును. అనగా–ఒకడు ఈ సంవత్సరము ఫలానావాడు అధ్యక్షుడుగా నుండవలయును అని ఉపపాదింపవలయును. అందఱును కాగితపు ముక్కలపై 'సరి' అనియో 'కూడదు' అనియో తమ యిష్టమును ఉదాహరించి ఒక కుండలో వేయవలసినది. 'సరి' యనువాని సంఖ్య ఎక్కువగా నున్న అతనిని అధ్యక్షునిగా ఎన్నుకొనవలయును. అట్లే తక్కినదియు. మీరు ఇకమీద ఉద్యోగస్థులను ఈ విధముగా ఎన్నుకొనవలసియున్నను, ఈ సంవత్సరమునకు బ్రహ్మానందుడు అధ్యక్షుడుగను, నిర్మలానందుడు కార్యదర్శిగను కోశాధ్యక్షుడుగను, సదానందుడు గ్రంథాలయ పర్యవేక్షకుడుగను, రామకృష్ణానంద అభేదానంద తురీయానంద త్రిగుణాతీతానందులు వంతులప్రకారము బోధనోపన్యాస కార్యములను చేయువారుగను ఉండవలయును అను ఈ మొదలైనవి నా సలహాలు.

ఒక పత్రికను తొడంగవలయు నను త్రిగుణాతీతుని యభిప్రాయము మంచిదే, సందియము లేదు. అయినను మీరందఱు కలసి ఐకమత్యముతో పని చేయగలిగిననే నేను అందులకు అంగీకరింతును.

మత సిద్ధాంతములు మొదలైనవానిని గూర్చి నేను చెప్పవలసినది ఇంతే. ఏమనగా—'పరమహంస దేవుడు ఒక అవతారము' అని ఎవడేని అంగీకరించిన, సరే. అంగీకరింపడేని, అదియు అంతే, సరియే. నిజము ఏమనగా — పరమహంస దేవుడు, గుణమును శీలమును బట్టి పూర్వుల నందఱిని మించిపోవును. ఉపదేశవిషయమున సకల పూర్వులకన్న ఉదారతరుడు, నూతన మార్గము త్రొక్కు-

ప్రతిభ ఎక్కువగ గలవాడు, ఎక్కువ పురోగామి అనగా ఏమన్న ట్లనగా పూర్వాచార్యులందఱు ఒక్క పక్షమును అవలంబించిన వారు. ఈ క్రొత్తయవతారము యొక్క, లేక ఆచార్యునియొక్క బోధన యేమనగా యోగభక్తిజ్ఞానకర్మ లన్నింటిలోను ఏది యుత్త మమో దానిని కలిపి ఇపుడొక క్రొత్త సంఘమును ఏర్పఱుపవల యును అని......ప్రాతవి బాగుగనే ఉండినవి, సందేహము లేదు; కాని ఈ నాల్గింటి సమ్మేళనము, భక్తిజ్ఞానములను ఎల్లవారికి, అత్యధములకు గూడ, స్త్రీ పురుష భేదము లేకుండ, ప్రచారము చేసి పఠ్యించుట – ఇది ఈ కాలమునకు తగినది, క్రొత్తమతము. పూర్వావతారములన్నియు సరియైనవే, మఱి అవి యన్నియు రామ కృష్ణునియందు మేళనము బొందినవి. సామాన్యజనునికిని ఆరంభదశ లోనివానికిని లక్ష్య నిష్ఠ చాల ముఖ్యమైనది వారికి విశిష్టపురు షులనందఱిని యథార్థముగా గౌరవింపవలసిదే అనియు ఇప్పుడు గౌరవార్హుడు శ్రీ రామకృష్ణుడనియు వారికి బోధింపుడు. నిశ్చల భక్తి లేక బలము ఉండజాలదు. అది (=బలము) లేకున్న మహా వీరుని (హనుమంతుని) తీవ్రతతో ఉపదేశింప లేదు. అంతియకాక, పూర్వమువన్నియు చాల ప్రాతవడిపోయినవి. మన ఇండియా ఇపుడు క్రొత్తది, దాని దేవుడును క్రొత్తవాడు, దాని మతము క్రొత్తది, దాని వేదాలు క్రొత్తవి. ప్రభూ! ఎప్పుడు మన దేశమున జనులు ఈ ప్రాతవానిమీద నిరంతరము పడికొట్టుకొనుట మాను కొందురో కదా! సరి, రవంత మతదురభినివేశము కూడ ఉండవల సినదే. కాని మనము ఇతరులయెడ విరోధభావము మనసులో ఉంచుకొనరాదు.

(ఈ) నా యభిప్రాయములు చూపిన దారిని పట్టుకొని ఈ నిబం ధనల ననుసరించుట వివేక మనుకొందురేని, నేను మీకు కావలయు ధనమునంతయు సరఫరా చేయగలను......అంతేకాదు. ఈజాబును గౌర్మాకును యోగిన్మాకును ఇంకను ఇతరులకును చూపి, వారి ద్వారా ఒక స్త్రీల మఠమును నెలకొల్పుడు. దానికి గౌర్మా ఒక

సంవత్సరము అధ్యక్షురాలుగా నుండనిండు. అట్లే తరువాత ఇతరులును, ఆ మఠమును చూడబోవ మీ కెవ్వరికిని అనుమతి లేదు. వారి విషయములను వా రే విచారించుకొందురు. వారు మీరు చెప్పినట్లుగా పని చేయవలసి యుండదు. వారిపనికి వ్యయింపవలయు సర్వ ధనమును గూడ నేనే ఒసంగెదను.

ప్రభువు మీకు సరియైన దిక్కున తోడుగా ముందు నడుచు చుండునుగాక! జగన్నాథస్వామిని ఇరువురు మనుష్యులు దర్శనము చేసికొనబోయిరి. ఒకడు దేవుని చూచినాడు మఱియొకడు తన మనసును వీడక అడుగడుగున జ్ఞప్తికి వచ్చుచుండిన ఏదియో ఒక పనికిమాలిన వస్తువును చూచెను. మిత్రులారా, పలువురు ప్రభువును సేవించినారు, నిజమే. కాని ఎవడైనను తన్ను ఒక అసాధారణ పురుషునిగా తలంచుకొనవలయునని అనుకొన్నట్లయిన, అప్పుడు అతడు తాను శ్రీరామకృష్ణుని సాంగత్యము కలిగినవాడైనను, దానివలన తాను గ్రహించినది తన మనస్సున అగ్రస్థానమున నున్న ఆ పనికిమాలిన వస్తువునే! అట్లుగాకున్న అతడు సరియైన పర్యవసానమును ప్రకటించును. ప్రభువే ఇట్లు చెప్పువాడు-"వారు ప్రభువు పేరుననే పాడుదురు ఆడుదురు కాని పర్యవసానమున వారు దుఃఖముపాలగుదురు" అని. ఆ క్షీణదశకు మూలకారణము అహంకారము — ఒకడు మఱి యెవడైనను ఎంతగొప్పయో తానును నిజముగా అంత గొప్పయే అని అనుకొనుట! "ఆయన నన్నుకూడ ప్రేమించుచుండెను" అని యొకడు వాదించును. అయ్యో ఓ నిక్బాటమూ, నీవు ఇట్లును తర్జుమా చేయబడుదువా? అట్టి మనుష్యుడు మఱియొకనిమీద అసూయ జెందియో, జగడమాడియో పతనమొందునా? ప్రభువు నను గ్రహమున గుంపుల మనుష్యులు దేవతల గొప్పతనముగలవారుగా అగుదురు. నిజము. మనసులో ఉంచుకొనుము. ప్రభువు కృప వ్రాలిన చోట నంతయు నంతే......విధేయత మొదటివిధి. నేను మిమ్ము చేయుమన్న దానిని మంచి యుల్లాసముతో చేయుడు. ఈ కొన్ని చిన్న విషయములను మీరు ఎట్లు

నిర్వహింతునో నన్ను చూడనిందు. తరువాత కాలక్రమాన గొప్ప విషయములును సంభవించును.

మీవాడు

వివేకానంద.

## 274

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు
1896

ప్రియ అళసింగా,

పోయినవారము నీకు 'బ్రహ్మవాదిన్' గూర్చి వ్రాసితిని. భక్తియుపన్యాసములగూర్చి వ్రాయను మఱచితిని. అవి అన్నియు కలిపి ఒక పుస్తకముగా ప్రకటింపవలయును. కొన్నివందలు అమెరికాలో న్యూయార్కులోని 'జి—'కి పంపవచ్చును. ఇక ఇరువది దినాలలో నేను ఇంగ్లండుకు పోయెదను. నాయొద్ద ఇంకను ఇతర గ్రంథములు, పెద్దవి కర్మజ్ఞానరాజయోగముల గూర్చినవి ఉన్నవి. కర్మయోగము ఇదివఱకే వెలువడినైనది. రాజయోగము చాల పెద్దపుస్తకమగును, అది ఇప్పుడే అచ్చులోఉన్నది. జ్ఞానయోగము ఇకమీద ప్రకటింపవలసియున్నది. ఆ పని ఇంగ్లండులో అగునని తలంతును.

'కె—' వ్రాసిన యుత్తర మొకటి నీవు బ్రహ్మవాదిన్‌లో ప్రకటించితివే అది చాల పొరపాటు 'కె—'అందు—వారు తన్ను కొట్టిన దెబ్బలకు బాధపడుచున్నాడు. అటువంటి జాబు చాల గ్రామ్యము, అందఱిని నొప్పించునది అగును. అది బ్రహ్మవాదిన్ ధోరణికి అనుగుణముగా లేదు. కావున ఇకముందు 'కె—' వ్రాయునపుడు ఏ తెగమీద దెబ్బకొట్టినను, అది యెంతవక్రముగా గాని మొరటుగాగాని ఉండనీ, ధోరణి పైకి పోనీక తగ్గింపదగును. ఏ తెగకుగానీ ప్రతికూలమైన విషయము, మంచిదికానీ చెడ్డది కానీ, బ్రహ్మవాదిన్‌లో చేరగూడదు. మోసాలకు

మనము పక్షపాతము చూపకూడదు అనుట, అది సరేలే. నీకు మఱొకటి జ్ఞాపకము చేసెదను - పత్రిక ఇక్కడ చందాదారులు చేరకపోవునంత సాంకేతికముగా ఉన్నది. సామాన్యపాశ్చాత్యుడు దవుడపగులు సంస్కృతపదములను సాంకేతికములను ఆమూలాలముగా ఎఱుగడు, ఎఱుగుటకు మనస్సుపెట్టడు. పత్రిక ఇండియాకు బాగుగా తగియున్నది. అదే నాకు తోచినదంతయు. సంపాదకీయములలో ప్రత్యేకపువాదపు ఏమాట ఒకటికూడ ఉండకూడదు, తీసివేయ వలయును. ఇండియాను మాత్రమే కాక, ఆ వ్రాతలలో ప్రపంచము నంతటిని ఉద్దేశించుచున్నమాటను సదా జ్ఞప్తియందుంచుకొన వలయును. ఆ ప్రపంచమునకు నీవు చెప్పదలచుకొన్నది బొత్తిగా తెలియదన్న మాటనుకూడ జ్ఞప్తియందుంచుకొనవలెను. ప్రతి సంస్కృత పదానువాదమును కడు జాగ్రత్తతో వాడవలయును. విషయములు సాధ్యమైనంతగ సులువుచేయవలయును.

ఇది నీకు చేరకముందే నేను ఇంగ్లండులో ఉందును. కావున అక్కడి నా చిరునామా — శ్రీ ఇ. టి. స్టర్డిగారింట, హైవ్యూ, కేవర్షామ్-ఇంగ్లండు.

నీ వాడు
వివేకానంద.

## 275

(శ్రీమతి బుల్‌లికి)

63, సెంటుజార్జిస్ట్రోడ్డు
లండన్
మే 30, 1896

ప్రియ శ్రీమతి బుల్‌లి,

......మొన్నటిదినము నాకు ఆచార్య మాక్సుముల్లరు గారితో ఆహ్లాదకరమైన సమాగమము కలిగినది. ఆయన ఋషి కల్పుడు. ఏండ్లు డెబ్బది యున్నను యువకునివలె అగపడును. మొగాన ఒక ముడుతకూడ లేదు. ఇండియామీదను వేదాంతము మీదను ఆయనకున్న మక్కువలో నాకు సగమైన ఉండరాదా

అని కోరుకొందును. అట్లే ఆయన యోగప్రియుడును. అందు నమ్మ
కము గలవాడు. మోసగాండ్రపట్ల ఆయనకు ఓర్పు లేదు, అంతే.

అన్నిటికి పైగా, రామకృష్ణ పరమహంస యెడ ఆయనకు
గల భక్తి అపారము. 'నైన్టీన్త సెంచురీ' లో ఆయనమీద ఒక
వ్యాసము వ్రాసి ప్రకటించియున్నాడు. ఆయన నన్ను అడిగినాడు—
"లోకము నాలుగు మూలలకు ఆయన తెలియుటకు నీవు ఏమిచేయు
చున్నావు" అని. ఏండ్లతరబడిగా రామకృష్ణుడు ఆయనను ముగ్ధు
నొనర్చియున్నాడు. ఇది మంచి సమాచారముగదా?

ఇక్కడ అన్ని పనులు మెల్లగానైనను నిలుకడగా జరుగు
చున్నవి. మహాజనుల సమక్షమున నా యుపన్యాసములను నేను
పై ఆదివారము తొడంగవలసి యున్నది.

భవదీయ నిత్యకృతజ్ఞతా ప్రేమాంచిత
వివేకానంద.

## 276

(కుమారి మేరీ హేలుకు)

63, సెంటుజార్జిరోడ్డు,
లండన్-నైరృతి.
మే 30, 1896.

ప్రియ మేరీ,

నీజాబు ఇప్పుడే చేరినది. నిజమే నీవు అసూయ చెందలేదు.
కాని ఉన్నటులుండి, నీకు దీనమైన యిండియామీద సమదుఃఖసుఖ
భావావేశము కలిగినది. మంచిది. నీవు బెదరిపో నక్కఱలేదు.
చర్చమ్మకు జాబువ్రాసి కొన్ని వారము లైనది; ఇంకను ఆమెకడ
నుండి ఒక బంతియైనను జవాబు రాలేదు. ఆ జట్టువా రందఱును
సన్న్యాసము పుచ్చుకొని ఒక కాథొలిక్కుల మఠములో చొచ్చి
నారేమో! నలువురు ముసలికన్యలు చాలుదురు, ఏయమ్మనైనను
మఠమునకు తఱుముటకు? నాకు మాక్సుముల్లరుతో చాల ఘనం
దైన సమావేశము కలిగినది. ఆయన ఒక ఋషి. నిలువెల్ల
వేదాంతి. నీవు ఏమి అనుకొందువు? ఆయన యెన్ని యేండ్లుగానో

నా గురుదేవుని భక్తిపురఃసరముగా మెచ్చుకొనువాడు. 'నైన్టీన్తు సెంచురీ' లో ఆయన నా గురుదేవునిమీద ఒక వ్యాసము వ్రాసినాడు. అది త్వరలోనే వెలువడును. మేము ఇండియా విషయములనుగూర్చి దీర్ఘముగా ముచ్చటలాడితిమి. ఆయనకు ఇండియామీద ఎంత ప్రేమ! అందులో నాకు సగమైన ఉండిన చాలునే అని అనుకొంటిని. మేము ఇక్కడ మఱియొక చిన్న పత్రికను తొడంగబోవుచున్నాము. బ్రహ్మవాదిన్ విషయ మేమి? నీవు దానిని నడుపుచున్నావా? చొరవగల నలుగురు ముదికన్నెలు ఒక పత్రికను నడపలేరేని నాకు చావే! నాయొద్దనుండి వార్తలు అప్పుడప్పుడు నీకు తెలియుచుండును. నేను ముంతక్రింద కంటికి అగపడకపోవు సూదిని కాను. నేను ఇప్పుడే ఇక్కడ తరగతులు జరుపుచున్నాను. పైవారము మొదలుకొని ఆదివారోపన్యాసము లారంభించెదను. తరగతులు చాల పెద్దవిగా నున్నవి. అవి యింటిలో సమావేశమగుచున్నవి. ఈ కావలసిన కాలమువఱకు దానిని బాడిగకు తీసికొన్నాము. నిన్నరాత్రి నేనొక భోజ్యమును తయారుచేసితిని. అది యెంత రుచిగా ఉండిన దనగా, దానిని నేనే తినజాలకపోయితిని. కుంకుమపూవు, లావెండరు, జాపత్రి, జాజికాయ, తోకమిరియము, లవంగపట్ట, లవంగము, ఏలకి, మీగడ, నిమ్మరసము, నీరుల్లి, ఎండినద్రాక్ష, బాదంపప్పు, మిరియము, బియ్యపుఅన్నము — ఇవన్నియు కలిపినది. ఇంగువ లేకపోయెను. అది యుండియున్న ఇంకను సులువుగా మ్రింగుడుపడియుండును.

నిన్నటిదినము నేను యథాచారముగా ఒక పెండ్లికి పోయితిని. ముల్లరమ్మ మమ్ములను ఆ పెండ్లి చూచుటకు పిలుచుకొనిపోయినది. ఆమె సంపన్నమైన దొరసాని, నా మిత్రము, ఒక హిందూ పిల్లవానిని తన కొడుకుగా స్వీకరించినది, నా పనికి సాయపడుటకై ఈ యింటిలో గదులు తీసికొన్నది. ఆమె మేనగోడళ్లలో ఒకతెను ఒకానొకని మేనల్లుని కిచ్చినా రనుకొనెదను. ఏమి విసిగించువెట్టి! నీవు పెండ్లి చేసికొనవని నాకు సంతోషము. ఇక సెలవు.

మీకందఱకును నా ప్రేమ, కుమారి మెక్లియడునింట విందుకు పోవు చున్నాను, కావున ఇప్పుడింక వ్యవధి లేదు.

ఒకనాడును ప్రేమ వీడని నీ
**వివేకానంద.**

## 277

(కుమారి మేరీహేలుకు)

63, సెంటుజార్జిరోడ్డు,
లండను
మే, 1896.

ప్రియసోదరీ,

మరల లండను చేరితిని. ఇపుడు ఇంగ్లండులో వాతావరణము ఆహ్లాదకరముగా చల్లగా ఉన్నది. ఇనుపకమ్ముల కుంపటిలో మాకు నిప్పు ఉన్నది. ఈసారి ఒక యిల్లు పూర్తిగా మాకున్నది, నీకు తెలియునుగదా! అది చిన్నదే, కాని వసతిగానున్నది. ఇండ్లకు వెల అమెరికాలో ఉన్నంత లండనులో లేదు. మీ అమ్మనుగూర్చి నేను ఏమి తలపోయుచుంటినో ఎఱుంగుదువా,—నేను ఇప్పుడే మన్రో అండ్ కో-7, రూస్క్రై, ప్యారిస్-అను విలాసమునకు ఆమె కొక జాబు వ్రాసి, తపాలులో వేసితిని. ఇక్కడ కొందఱు పాత మిత్రులు ఉన్నారు. కుమారి మెక్లియడు (ఐరోపా) ఖండమునుండి ఇచటికి వచ్చినది. ఆమె బంగారమువంటిది, ఆమె కరుణ ఎప్పటివలెనే యున్నది. మాది ఇంటిలో ఒక చిన్న ఆహ్లాదకరమగు కుటుంబమైనది. ఇండియానుండి మఱియొక సన్న్యాసి వచ్చియున్నాడు. పాపము! హిందూ అనగా ఏమాదిరి యన్న, ఆయనను ఉదాహరణము చూపవచ్చును. నాకుగల ఆ ధైర్యము ఆ చొరవ ఆయనకు లేదు. ఆయన ఎప్పుడును కలలు గనుచుండును. ప్రశాంత మధుర ప్రకృతి. అట్లుండుట పనికిరాదు. నేనాతనికి కొంచెము చుఱుకు కలిగింప ప్రయత్నించెదను. నేను ఇప్పటికే రెండు తరగతులు పెట్టుకొంటిని. అవి ఇంకను నాలుగైదు నెలలు సాగుచుండ గలవు. తరువాత ఇండియాకు నేను వెళ్లుట. అయినను అది అమెరికాకు

అన్నట్లే. నా హృదయము అమెరికాలో లగ్నమైపోయినది. యాంకీ భూమి — అమెరికా — నాకు ప్రేమాస్పదము. నాకు క్రొత్త వస్తువులు చూచుట ప్రియము. శిథిలమైన ప్రాతవానిని పరివేష్టించి వృథాగా చేయు కాలక్షేపమును బ్రదికినంత కాలమును నిరుత్సాహముతో పురాతన చరిత్రలలో కాలముగడపుటయు ప్రాచీనులకై ఏడ్చుచు ఉండుటయు నాకు ఇంచుకయు లక్ష్యము లేదు. అట్లుండ నీయని ఉడుకును వీర్యమును నా నెత్తుటిలో ఉన్నవి. నాకు నచ్చిన చోటును, జనమును, అన్నిటికిని అవకాశమును ఉండునది అమెరికాలో. నేను వేరు మొదలు సర్వము మార్పుకావలయునని తీవ్రముగ కోరువాడ నయిపోయితిని. నేను ఇండియాకు పోవుచున్నాను. జిగట చేపలవలె మార్పు అంగీకరింపక, మొండిగా ప్రాత పద్ధతులనే పట్టుకొని ఊగులాడువారు ఇండియా ప్రజలు. అక్కడ నేను ఏమి చేయగలనో చూతును. నేను ఒక క్రొత్త విషయమును తొడంగెదను— అంతయు క్రొత్తయే ; సులువు, పటువు, క్రొత్త నవకము గలది ; తొలిచూలి శిశువును బోలినది. నిత్యమయినదియు అనంతమైనదియు సర్వవ్యాపియు సర్వజ్ఞమును ఐనది — ఒక తత్త్వమగునే కాని, వ్యక్తి కానేఱదు. నీలో, నాలో, ప్రతియొకనిలో ఆ తత్త్వమే ఆవిష్కృతమై యున్నది. ఒకనిలో ఈ అనంతతత్త్వమంతగ రూపుదాల్చునో అత డంత గొప్పవాడగును. అంతమున సర్వములోను ఆ తత్త్వమే మూర్తీభవించును. అట్లు అంతయు ఒక్కటి యగును. తాత్త్వికముగ ఇపుడును అన్నియు ఒక్కటే. ఇదే మత సర్వస్వము. ఇకను సాధన యేమనగా ఈ యేకత్వము భావనచేయుటే, అదే ప్రేమ. ఆ ప్రాత వెట్టి ఆచారము లన్నియు వట్టి ప్రాత మూఢ విశ్వాసములు. వాని ప్రాణమును నిలుపు ప్రయత్న మెందులకు? ప్రక్కనే జీవసత్త్వుల నది ప్రవహించుచుండగా, దప్పిగొన్న జనులు త్రాగుటకు మురికిగుంట నీరు నియ్యనేల? ఇది కేవలము మనుష్యునికి ఉండు స్వార్థపరతయే కాని వేఱుగాదు. ఆయువు అల్పము, కాలము ఎగిరి పఱచుచున్నది. ఏ చోట ఏ జనుల

నడుమ ఎవని భావములు మిక్కిలి చక్కగా కార్యకరము లగునో, ఆ చోటును ఆ జనమధ్యమునే అతనివి ఉదాత్తులు సత్యపరులు నగు విశాల ధీర హృదయులు పదిమంది చాలును.

నేను నిజముగా చాల హాయిగా నున్నాను ; జీవిత సుఖమును నిండార అనుభవించుచున్నాను.

సదా నీకై ప్రేమతోనుకు
వివేకానంద.

## 278

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

శ్రీ ఇ. టి. స్టర్డి గారింట
హైవ్యూ, కేవర్షాము
రీడింగు, 1896

ప్రియ-,

......ఈలండనునగరము మనుష్యుల తలల సముద్రము పదిపదునైదు కలకత్తాలు ఒకటిగా కలిపినంత. ఇచటదిగగానే తన్ను కలసికొనుట కొరకని ఏర్పాటుచుకొనకున్న ఎవడైనను ఇచ్చటి (వీధుల) చిక్కు తిరుగుళ్ళలో, తగులుకొని దొరకకపోవును...... అయినప్పటికిని, కాళిని తత్క్షణము తరలింపుము. శరత్తువలె ఇతడును బయలుదేఱుటకు ఆలస్యముచేయునేని, ఇక్కడికి ఎవ్వరును రాకుండుటే మేలు. అట్లు ఆలస్యముచేయుటయు, రేపు ఎల్లుండి చేయవచ్చునులే అని అనుకొనుటయు పనికిరాదు. ఆపనికి అత్యధిక మగు రజోగుణము చుఱుకుదనము కావలయును......మనదేశ మంతయు తమస్సున మునిగియున్నది, మఱి వేఱు కాదు. మనకు మొదట కావలసినది రజస్సు. సత్త్వము తరువాత వచ్చును. అది చాలదూరమున ఉన్నది.

భవదీయప్రేమయుత
వివేకానంద.

## 279

(శ్రీమతి బుల్సతికి)

63, సెంటుజార్జిస్ట్రోడ్డు
లండను-నైరృతి
జూను 5, 1896.

ప్రియ శ్రీమతి బుల్సతి,

రాజయోగగ్రంథము దివ్యముగా జరిగిపోవుచున్నది. శారదానందుడు త్వరలోనే రాష్ట్రిములకు పోగలడు.

మా నాయన న్యాయవాదిగా నుండెను గాని, నా ప్రేమాస్పదమైనవా డెవడును న్యాయవాది అగుట నాకు సమ్మతము గాదు. మా గురువు దానికి చాల విముఖుడుగా నుండెను. ఏ కుటుంబములో పలువురు న్యాయవాదులుగా నున్నారో అది తప్పక దుఃఖభాజనము అగును. మన దేశమున వారు నిండిపోయియున్నారు; విశ్వవిద్యాలయాలు నూర్ల సంఖ్యగా న్యాయవాదులను తయారుచేయుచున్నవి. నా దేశమునకు కావలసినది ధైర్యమును విజ్ఞానశాస్త్ర ప్రతిభయు. కావున 'మ'—విద్యుచ్ఛక్తిశాస్త్రజ్ఞుడు కావలయునని నాకోరిక. జీవితమున అతడు భంగపడినను, తాను గొప్పవాడగుటకును నిజముగా దేశమునకు ఉపయోగపడుటకును ప్రయత్నించినాడు గదా అని నేను తృప్తిపడుదును.........ఒక్క అమెరికా దేశమున మాత్రమే, దాని వాతావరణమున నే ప్రతియొకనియందును గల శక్తిసర్వమును వెలువరించు రహస్యము ఏదియో యొకటి యున్నది......అతడు సాహసమును ధైర్యమును గలిగి తనకును తన దేశజనమునకును ఒక క్రొత్త త్రోవను కల్పించుటకు అతిశ్రమపడవలయునని నాకోరిక. విద్యుచ్ఛక్తిశాస్త్రజ్ఞుడు ఇండియాలో బ్రదికిపోగలడు.

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

మలిమాట—గుడ్విన్ను ఈ తపాలులోనే ఒక అమెరికను పత్రికనుగూర్చి జాబు వ్రాయుచున్నాడు. పని అంగాంగయోగము కలిగియుండుటకు అట్టి దొకటి ఆవశ్యకమని తలంతును. ఆయన చెప్పుమార్గమున అది సాగుటకు నాచేతనైనంత నేను చేయగలను. దానినిగూర్చి ప్రత్యేకముగా చెప్ప నక్కఱ లేదు......ఆయన బహుశః శారదానందునితో కలసికొని రాగల డని యెంచెదను.

## 280

(సోదరి నివేదితకు)

63, సెంటుజార్జిరోడ్డు, లండను.
జూను 7, 1896.

ప్రియ కుమారి నోబుల్,

నా లక్ష్యమును కొన్ని మాటలలో చెప్పవచ్చును. అదే మనగా, మానవకోటికి తమ దివ్యత్వమును బోధించుట, జీవితమున ప్రతి యుద్యమమునను దాని నెట్లు ఆవిష్కరించుటో వారికి కఱపుట.

ఈ లోకము మూఢవిశ్వాసాల సంకెలలచే కట్టుబడి యున్నది. హింసపడు పురుషునిగాని స్త్రీనిగాని కాంచి నేను జాలిపడుదును. వారిని హింసించువారికై ఇంకను ఎక్కువగా జాలి పడుదును.

పట్టపగటివలె స్పష్టముగా నాకు అగపడుచున్న ఒక విషయము-దుఃఖము అజ్ఞానముచేత కలుగుచున్నది, మఱి వేఱుగాదు. లోకమునకు ఎవరు వెలుగును — జ్ఞానమును—ఈయగలరు ? గత కాలమున త్యాగము విధిగా నుండెను ; అయ్యో, అది భవిష్యత్తునను యుగాల పర్యంతము అట్లే యుండగలదు. ఈ లోకమున పలువుర మేలుకోసము, ఎల్లవారి క్షేమముకోసము ధీరతములును సాధుతములును తమ యాత్మల నర్పింపవలసి యుండును. నిత్యప్రేమ కరుణలు గల బుద్ధులు నూర్ల సంఖ్యగా కావలసియున్నది.

లోకాన మతములు ప్రాణములేని వెక్కిరింతలు ఐపోయినవి. లోకమునకు శీలము అవసరము. నిస్స్వార్థజాజ్వలమాన ప్రేమమయ

జీవనులను ఈ లోక మపేక్షించుచున్నది. అట్టి ప్రేమ ప్రతి మాటను పిడుగువలె అమోఘమైనదిగ చేయును.

అది నీకు మూఢవిశ్వాసము గాదని నా నిశ్చయము. నీవు లోకమును కదలించుదానవు కాగలుగుట నీ నిర్మాణమున నే యున్నది. ఇంకను ఇతరులు రాగలరు. ధీరవాక్కులు ధీరతరములైన చేతలు మనకు కావలయును. ఉత్తములారా, మేలుకొనుడు, మేలుకొనుడు! లోకము దుఃఖమున మగ్గుచున్నది. మీరు (ఇపుడు) నిద్రపోగలరా? నిద్రించు దేవతలు మేల్కాంచువఱకును లోపలనున్న దేవుడు 'ఆ' అని బదులు పలుకువఱకును కుయివెట్టి అఱచి పిలుతము, జీవితమున ఇంతకన్న మఱేమున్నది? ఇంతకన్న ఘనకార్యమేమున్నది? వివరములు, నేను ముందుకు సాగిపోవుచుండ, తమంతనే స్ఫురించును. నేను పథకమును ముందుగా ఎన్నడును నిర్ణయించుకొనను. పథకములు తమంతటనే ఆవిర్భవించును, సిద్ధిగనును. నేను చెప్పునది ఇంతే — మేలుకొనుడు, మేలుకొనుడు!

అన్ని దీవెనలు నీకు సదా ఫలించుచుండునుగాక.

ప్రేమపూర్ణ భవదీయ
వివేకానంద.

## 281

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

63, సెంటుజార్జిరోడ్
లండను-నైరృతి
జూను 24, 1896.

ప్రియ శశీ,

మాక్సుముల్లరుగారికి శ్రీరామకృష్ణుని సూక్తులన్నియు ప్రత్యేక విభాగించినవి — అనగా కర్మనుగూర్చినవి అన్నియు ఒక్కటిగా, వైరాగ్యమును గూర్చిన వన్నియు ఒక్కటిగా అట్లే భక్తి, జ్ఞానము మొదలయిన వానిని గూర్చినవియు వేఱువేఱు శీర్షికల క్రిందను కావలయునట. నీవు ఆ పనికి తత్క్షణము పూనుకొనవల

యును......ఆయన యుపదేశములలో విశ్వమున కంతటికిని చెల్లు వైఖరిని చూపుటకు మాత్రమే మనము జాగ్రత్త పడవలయును.

శరత్తు అమెరికాకు రేపు బయలుదేఱుచున్నాడు. ఇచట పనిసిద్ధి చేరువకు వచ్చుచున్నది. లండనులో కార్యకేంద్రమును తొడంగుటకు వలయు ధనము ఇప్పటికే మనకు సమకూడియున్నది. పై నెలలో నేను స్విట్జర్లండుకు పోగలను. అచట ఒకటి రెండు నెలలు గడపుదును. తరువాత లండనుకు మరలుదును. ఇపుడు నేను ఇంటికి (ఇండియాకు) వచ్చిన ఏమి ప్రయోజనము? ఈ లండను ప్రపంచచక్రపు నడిమికుండ (=hub). ఇండియాహృదయము ఇక్కడ ఉన్నది. ఇక్కడ గట్టి పునాది వేయక నేను దీనిని ఎట్లు విడిచిరాగలను? అర్థము లేదు! ప్రస్తుతము కాళిని ఇక్కడ ఉంచుకొందును. సిద్ధముగా ఉండుమని అతనితో చెప్పుము......

మనకు మిక్కిలి ధైర్యము మహత్తరమైన శక్తి కడలేని యుత్సాహము కావలయును. ఆడంగితనము పనికిరాదు. నేను పోయిన జాబులో వ్రాసితినే, సరిగా అట్లే సాగిపొమ్ము. మనకు అంగాంగసాధుసంయోగము ఆవశ్యకము. అదే బలము. అందలి కీలకము విధేయత.

ప్రేమయుత భవదీయ

వివేకానంద.

## 282

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

హైవ్యూ కేవర్షామ్, రీడింగు
జూలై 3, 1896.

ప్రియ శశీ,

ఈ జాబు నీకు చేరగానే కాళిని ఇంగ్లండుకు పంపుము ...... అతడు నాకు కొన్ని పుస్తకములు తేవలయును. నావద్ద ఋగ్వేద సంహితమాత్రము ఉన్నది. యజుర్వేదము సామవేదము అథర్వ సంహిత, శతపథము మొదలుకొని ఎన్ని బ్రాహ్మణములు తేగలిగిన

అన్ని, కొన్ని సూత్రములు, యాస్క నిరుక్తము — వీని నన్నింటిని తెమ్మని చెప్పుము.

శరత్తువిషయమున జరిగినట్లు ఇంచుకయు ఆలస్యము జరుగనీకుడు. కాళిని తత్క్షణమే రానీ. శరత్తు ఇక్కడ తాను చేయుటకు ఏమియు పని లేనందున అమెరికాకు పోయినాడు. అనగా అతడు ఆఱునెలలు ఆలస్యము చేసినాడు; తరువాత అతడు వచ్చునప్పటికి నేను ఇక్కడ ఉన్నాను.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

## 283

(శ్రీ ఫ్రాన్సిసు లెగెట్టుకు)

63, సెంటుజార్జిరోడ్డు
లండను నైర్ఋతి
జూలై 6, 1896.

ప్రియ ఫ్రాంకిన్సెన్సూ, *

... అట్లాంటిక్కుకు ఈతట్టు నాకు అన్నివిషయములు బాగుగా జరిగిపోవుచున్నవి.

ఆదివారోపన్యాసములు పూర్తిగా సిద్ధిప్రదములే, అట్లే యుండినవి తరగతులును. వానికి ఏర్పఱుచుకొన్న కాలము ఐపోయినది. నేనును పూర్తిగా అలసిపోయితిని. నేను కుమారీముల్లరుతో కూడి స్విట్జర్లండులో సంచారము పోగోరుచున్నాను. గాల్సువర్ది యింటివారందఱు నాయందు మిక్కిలియు దయగలిగియుండినారు. జో వారిలో దివ్యమైన మార్పు తెచ్చినది. జోను ఆమె ఉపాయకౌశలమునకును ప్రశాంతమార్గమునకును నేను మిక్కిలి మెచ్చుకొందును. ఆమె రాజకార్యధురంధరురాలు. ఆమె ఒక రాజ్యమును సైతము పరిపాలింప సమర్థురాలు. మనుష్యులలో అంతపటువును చుఱుకు నైన సామాన్యప్రపంచజ్ఞానము నేను

---

* ఫ్రాన్సిసు లెగ్గెట్టును స్వామి ఇట్లు పిలుచువాడుక.

చూచి యెఱుగను. పై శరదృతువున ఇందుండి మరలి వచ్చి అమెరికాలో పనిని కైకొందును.

మొన్నటిరాత్రి నేను శ్రీమతి మార్టినుసతి యింటిలో విందుకుపోయియుంటిని. ఆమెనుగూర్చి చాలసంగతులు నీకు ఇదివఱకే జోవలన తెలిసియుండవలయును. సరి, ఇంగ్లండులోని పనినిశ్శబ్దముగానైనను నిశ్చయముగ పెరుగుచున్నది. మగువలలోను మగవారిలోను దాదాపు సగముమంది నాకడకు వచ్చి పనినిగూర్చి నాతో మాట్లాడినారు. ఈ బ్రిటిషుసామ్రాజ్యములో ఎన్నిలోపాలయినను ఉండనీ అది ఆశయములను అన్నివంకల వ్యాపింపజేయు మహత్తర యంత్రముగ నున్నది. నేను నా యభిప్రాయములను ఈ యంత్రమధ్యమున ఉంతమని నా సంకల్పము. అంతట అవి ప్రపంచమంతట వ్యాపింపగలవు. పెద్దపనుల గమనము మెల్లగానే యుండును. అది సహజమే. దానికి గల కష్టములు, విశేషముగా మనము పరాజితులము అగుటచే, అనేకములు అయినను, అది తప్పక జరుగుటకు, అదియే కారణము. ఏలన ఆత్మసంబంధమగు పరమలక్ష్యము లన్నియు ఎప్పుడును అట్లు అణగద్రొక్కబడినవారి నుండియే వచ్చినవి. యూదులు రోము సామ్రాజ్యమును తమ ఆత్మలక్ష్యములతోడనే ముంచివేసినారు. ఓర్పులోను పరసుఖదుఃఖములలో పాలుగొనుటలోను నా పాఠములను నేనును ప్రతిదినము నేర్చుకొనుచున్నాను అని యెఱింగి నీవు సంతోషింపగలవు. గొప్పవారును బలశాలులును అగు ఆంగ్లయిండియనుల యంతరంగమునను ఈశ్వరుని సాక్షాత్కరించుకొనగల దశను సమీపించుచున్నానని తోచుచున్నది. ధయ్యము అనునదొకటి యుండనేయున్న దానిని సైతము ప్రేమింపగల స్థితిని మెల్లగా దఱియుచున్నానని అనుకొనుచున్నాను.

నాకు ఇరువదియేడుల వయసున నేను పరదుఃఖమును లక్ష్యపెట్టని, ఎవరేమి చెప్పినను వినని దురాగ్రహోన్మత్తుడనుగా ఉంటిని. కలకత్తా వీథులలో నాట్యశాలతట్టు ఉండు కాలిత్రోవలో అడుగుపెట్టువాడగాను. ముప్పదిమూడవ సంవత్సరమప్పటికి వెల

యాంగ్ల యిండ్లలో వారితో కూడనే, వారినిగూర్చి దూషణ ఒక్క మాటమైనను పలుకకుండ, ఒకతట్టు వసింపగల్గితిని. నేను క్షీణ దశకు వచ్చితినా, లేక పరమాత్మస్వరూపమగు విశ్వప్రేమగా వికసించితినా? మఱియు ఎవడును తనచుట్టురా ఉన్న పాపమును చూడకుండునేని, తాను సత్కార్యములను చేయలేనివాడై, 'అంతయు భవితవ్యత, భవితవ్యత దాటరానిది' అను మతములో పడునని వినియున్నాను. కాని అది నాకు అగపడుట లేదు. దానికి విపరీతముగా, కార్యసాధనకైన నాశక్తి మితిమీఱి వృద్ధియగుచున్నది; మిక్కిలిగా ఫలోన్ముఖము అగుచున్నది. కొన్ని దినాలలో ఒకవిధమైన ఉద్రిక్తభావదశను చెందుదును. ప్రతివానిని ప్రతి విషయమును దీవింపవలయుననియు, ప్రేమించి ఆలింగనము చేసికొనవలయుననియు, నాకు తోచుచున్నది. 'పాపము' వట్టి భ్రాంతి యనియు నాకు గట్టిగా తోచుచున్నది. ప్రియా, ఫ్రాన్సిస్సూ, ఈ సమయాన నా మనస్సు అట్టి పారవశ్యదశలో నున్నది. నీ తలంపునను, మీ దేవికి నామీద గల ప్రేమను దయను తలంచుకొనియు, నా కన్నులు ఆనందాశ్రువులను కురియుచున్నవి. నా పుట్టిన దినమును దీవింతును. నాకు ఇక్కడ ఇంత ప్రేమయు ఇంత దయయు లభించినదికదా. నన్ను సృజించిన ఆయనంత ప్రేమనాథుడు నా ప్రతి పనిని, అది మంచిదిగాని చెడ్డదిగాని, కనుపెట్టుచునే యున్నాడు. (బెదరిపోకుము.) ఎవని సేవకై నేను ప్రతిదానిని — నా ప్రియులను, నా సంతోషములను, నా జీవితమును త్యజించితినో, ఆతని చేతిలోని ఒక యుపకరణమునే కదా, నేను; అంతకన్నను ఇపుడు నే నేమగుదును, ఎపుడుగాని మఱేమై యుంటిని? అతడు లీలాపూర్ణుడగు నా ప్రియుడు. నేను అతని క్రీడాసఖుడను. ఈ విశ్వమున కారణము లేదు గీరణము లేదు! ఈశ్వరుని కట్టువఱచు కారణము ఏమున్నది? లీలాపరు డాతడు. లీలలంతటను ఈ యశ్రువులను ఈ నవ్వులను తాను ఆడుచున్నాడు! జో చెప్పినట్లు — బలే తమాష, బలే తమాషా!

ఇది యొక హాస్యకర ప్రపంచము. అందు అందఱికంటె హాస్యనరుడు ప్రేమనాథుడగు ఆ అనంతుడే! హాస్యకరముకాదా? తోబుట్టువుల బృందము తోడియాటగాండ్ర బృందము! విశ్వకేళి రంగమున 'ఆడుకొండురా,' పోయి అని విడిచిపెట్టబడిన అల్లరి బాలుర బడి! కాదా? ఎవరిని పొగడుట ఎవరిని తిట్టుట, అంతయు ఈశ్వరుని లీల. వారికి దాని విశదీకరణములు కావలయునట ఆత నిని నీ వెట్లు విశదీకరింతువు? ఆతనికి—మెదడే లేదు; ఆతనికి యుక్తియు లేదు. తెలివిచాలని కారణజ్ఞానము లేని మనలను అవి వేకులను చేయుచున్నాడు. ఈతూరి అతడు వచ్చునప్పటికి నేను తూగాడుచు ఉండనులే.

నేను ఒకటి రెండు సంగతులు నేర్చుకొంటిని. ఆ ప్రేమ భావము ఆ ప్రేమధామము, యుక్తికి చదువుకు మాటకు అందదు. అవును - నిజము. సఖా, నింపు ముంతను మనము పెట్టియెత్తి పోవుదము.

సదా నీ పిచ్చివాడు
వివేకానంద.

## 284

(సోదరులకు)

లండను,
జూలై 7, 1896.

అనుగునిసుగులారా,

ఇక్కడపని అద్భుతముగా సాగిపోయినది. ఇక్కడ నాతో ఇండియానుండి వచ్చిన ఒక సన్యాసి ఉండినాడు. నేను అతనిని అమెరికాసంయుక్తరాష్ట్రములకు పంపివేసి, ఇండియానుండి నాకు మఱియొకనిని పంపు మని వ్రాసితిని. నిర్ణీతకాలము ముగిసినది. కావున తరగతులును ఆదివారోపన్యాసములును పై 16 వ తేదినాడు ముగింపబడవలసియున్నవి. తర్వాత 19 వ తేది ఒక నెలదినాలలో మఱికొంత కాలమో స్విస్ కొండలలో శాంతివిశ్రాంతులకై అక్కడ

పుచ్చు గోరి, అటుపోయెదను. మరల తరువాతిశరత్తులో లండనుకు మరలెదను, మరల ఆరంభింతును. ఇక్కడిపని చాలతృప్తికరముగా నుండినది. ఇండియాలోనే ఉండి ఇండియాకు నేనుచేయగల సేవకంటె ఇక్కడ ఇందు ప్రీతిశ్రద్ధలు కలిగించుటవలన, ఎక్కువసేవ నిజముగా చేసినవాడ నగుదును. అమ్మ నాకు వ్రాసినది—నీ కాపురపుమిద్దె యంతస్తును నీవు బాడిగకు ఈయగలుగుదువేని నిన్ను నావెంట ఈజిప్టుకు, ఆదేశమును చూడ సంతసముతో పిలుచుకొనిపోగలను —అని. స్విస్‌కొండలకు నేను ముప్వురు ఇంగ్లీషుమిత్రులతోకూడి పోవుచున్నాను. ఇంక ఉత్తరకాలమున, శిశిరాంతమప్పటికి, నాతో కూడ నామఠమున నివసింపగల కొందఱు ఇంగ్లీషుమిత్రులనుగూడి భారతదేశమునకు పోగలిగియుందు నని అనుకొనుచున్నాను — అక్కడ ఇంకను నామఠము వట్టిగాలిమేడగానే ఉన్నది. అది హిమాలయములలో నొక్కెడ రూపుదాల్చు తీవ్రప్రయత్నాలలో ఉన్నది.

మీ రిపుడు ఎక్కడ ఉన్నారు? ఇక్కడ ఇపుడు నడిగ్రీష్మము. లండనుసయితము చాలవేడి యగుచున్నది. నాప్రేమను శ్రీమతి ఆడమ్సుసతికిని శ్రీమతి కాంగరుసతికిని చికాగోలో ఉన్న నా తక్కిన మిత్రులకును అందింపుము.

భవదీయ ప్రియసోదరుడు
వివేకానంద.

## 285

(శ్రీమతి బుల్సతికి)

63, సెంటుజార్జిరోడ్డు
లండను-నైరృతి
జూలై 8, 1896.

శ్రీమతి బుల్సతి,

ఇంగ్లీషువారు మిక్కిలి ఔదార్యభూషితులు. మొన్న సాయంకాలము మూడునిమిషాలలో నా 'తరగతి'శిష్యులు, రాగల శరదృతువులో జరుగవలసిన పనులకు వలయు క్రొత్తయింటికిగాను

150/ పౌనులు వసూలుచేసినారు. కావలసియున్నవారు ఆక్షణమున 500/ పౌనులైనను ఇచ్చియుందురు. కాని మనకు వ్యయించుటలో తొందర కూడదు, మందగమనము శ్రేయస్కరము. పనిని సాగించుటకు ఇక్కడ చాలమందియుందురు. వారికి ఎవంతత్యాగము మనస్సునకు వచ్చునదే, బోధపడునదే. అదే ఆంగ్లుల గాంభీర్య గుణము.

భవదీయహితైషి
వివేకానంద.

## 286

(డాక్టరు నంజుండరావుకు)

ఇంగ్లండు,
జూలై 14, 1896.

ప్రియ డాక్టరు నంజుండరావూ,

'ప్రబుద్ధ భారత' సంచికలు చేరినవి. క్లాసులో పంచిపెట్టబడి కూడ ఐనది. అది చాల తృప్తికరముగా ఉన్నది. అదే యిండియాలో బాగుగా వెలపోగలదు, సందేహాములేదు. అమెరికాలో కూడ చాలమంది చందాదారులను నేను చేర్పగలిగియుందును. దానిని అమెరికాలో ప్రఖ్యాపించుటకు నేను ఇదివఱకే ఏర్పాట్లు చేసియుంటిని. గుడ్డియరు ఇప్పటికే చేసి ఐనది. కాని యిక్కడ ఇంగ్లండులో దాని వ్యాప్తి నిజముగ చాల మెల్లగానే జరుగును. ఇక్కడ పెద్ద లోపము ఏమనగా, ఇక్కడ అందఱును తాము సొంతపత్రికలు ఆరంభించి ప్రకటింప గోరుదురు. అది సరియే న్యాయ్యమే యగును. ఏలన ఎంతచేసినను పరదేశమువాడెవడును ఇంగ్లండులో పుట్టిన ఇంగ్లీషువానివలె అంతబాగుగా ఇంగ్లీషు భాషను వ్రాయలేడు. భావములు అభిప్రాయములు మంచి ఇంగ్లీషులో వ్రాయబడినపుడు హిందూ యింగ్లీషులో వ్రాయబడినప్పటికన్నను, ఎక్కువగ వ్యాపించును. అదియుగాక పరాయిభాషలో వ్యాసము వ్రాయుటకంటెను కథ వ్రాయుట చాల కష్టతరము. నీకు చందాదారుల సంపాదించుటకు ఇక్కడ నా శక్తికొలది ప్రయత్నించుచున్నాను. పరాయి

దేశపువారి సాయమును నీవెంతమాత్రము నమ్ముకొనరాదు. దేశ ప్రజానీకములు, విడివ్యక్తులవలెనే తమపనిని తామే చేసికొనవల యును. అది నిజమైన దేశభక్తి. ఏదేని ఒక దేశపుప్రజ ఆ పనిని చేసికొనజాలదేని, దానికాలము ఇంకను రాలేదన్నమాట. అది కనుపెట్టుకొనియుండవలయును. ఈ క్రొత్తవెలుగు ఇండియాయంత టను మదరాసునుండియే వ్యాపింపవలెను. ఆ యుద్దేశ్యముతో నీవు పాటుపడవలయును. ఆయినను నేను ఒక్క సూచన చేసెదను. అట్ట మిక్కిలి మోటుగానున్నది. అది వికారముగాను భయంకరముగాను ఉన్నది. సాధ్యపడునేని దానిని మార్పుము. దానిని సాంకేతికపు గుఱుతు కలదిగాను సాదాగాను ఉంపుము. మనుష్యులబొమ్మలే ఉండగూడదు. మఱ్ఱిచెట్టునకు ప్రబోధము అర్థము గాదు. కొండ కును కాదు. యోగికిని ఐరోపాదేశపు దంపతులకును కాదు. పునర్జన్మమునకు పద్మము లాంఛన మగును.

శిల్పమున, అందును వర్ణచిత్రకర్మయందు, మనము చాల వెనుకబడియున్నాము, మన మొకనాటికిని ముందుకు రాలేమని భయ మగుచున్నది. ఉదాహరణార్థము ఇది ప్రయత్నింపుము ఒక అడవి. అందు వసంతోదయము. ఆకులు రాలిపోయిన చెట్లు. అవి, క్రొత్తగా మరల చిగుర్చుచుండుట మొగ్గ తొడుగుచుండుట—ఈ దృశ్యమును చిత్రింపుము. మెల్లగా కానిమ్ము. నూర్ల భావములున్నవి ప్రకటించుటకు. లాంగ్మన్సు గ్రీనక్కంపెనిలో అచ్చువేయబడిన రాజయోగమునకు నేను తయారుచేసిన సాంకేతికమును చూడు. నీకు ఆ పుస్తకము బొంబాయిలో దొరకును. అది నేను న్యూయా ర్కులో రాజయోగమునుగూర్చి చేసిన యుపన్యాసముల సంపుటమే.

నేను పై ఆదివారము స్విట్జర్లండుకు పోవుచున్నాను. అందుండి శరదృతువులో లండనుకు మరలి వచ్చి కార్యమును మరల జరుప గలను...నాకు విశ్రాంతి చాల ఆవశ్యకముగా నున్నది ; నీవెఱుగు దువు గదా.

సర్వాశీస్సులతోడి భవదీయ
వివేకానంద.

## 287

(శ్రీమతి బుల్ల్‌కి)

సాస్ గ్రండ్, స్విట్జర్లండు
జూలై 25, 1896.

ప్రియ శ్రీమతి బుల్లి,

నేను పై రెండునెలలకాలమైనను ఈలోకమును పూర్తిగా మఱవగోరెదను. అట్లు మఱచి, గట్టినిష్ఠతో సాధన చేయగోరుదును. అదే నా విశ్రాంతి...నా కెంతో రమణీయమైన శాంతిగూర్చు మహిమ ఆకొండలకును మంచుకును కలదు. ఎంతకాలమునుండియో మంచి నిద్రలేదు. ఇపుడు ఇన్నిదినాలకన్నను నాకు మంచి నిద్ర వచ్చుచున్నది.

మిత్రుల కందఱకు నా ప్రేమ.

నీ
వివేకానంద.

## 288

(శ్రీ స్టర్డికి)

గ్రాండ్ హోటల్
వాలెయిస్,
స్విట్జర్లండు

ధన్య, ప్రియ,

...నేను కొంత చదువుచున్నాను ; మఱింతగ ఉపవాసము సేయుచున్నాను. అంతకును మించి సాధనచేయుచున్నాను. అడవుల విహారములు అతిమధురముగా ఉన్నవి. మేము ఇపుడు మూడు మంచుబండలక్రింద నెలవుకొని యున్నాము. ఇచటి సన్నివేశము ఎంతయు కన్నులపండువుగా ఉన్నది.

ఇదిగో ఇదియొకమాట. ఆర్యుల తొలిస్థానము స్విస్సుసరః పరిసరములు అనుటనుగూర్చి ఇదివఱకు ఏమిసందేహము లుండినను,

ఇపుడు అవి నా మనసునుండి తుదముట్ట తొలగిపోయి చిత్తప్రసాదము కలిగినది. స్విస్సుజనుడు టార్టారుడు, పందిలోకవంటి జుట్టుమినహా...

సదా ప్రేమయుత భవదీయ
వివేకానంద.

## 289

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

స్విట్జర్లండు
అగస్టు 5, 1896.

ధన్య, ప్రియ,

ఈ యుదయము ప్రొఫెసరు మాక్సుముల్లరు కడనుండి ఒక జాబు వచ్చినది; శ్రీరామకృష్ణపరమహంసమీద వ్యాసము XIX సెంచురి అగస్టు పత్రికలో ప్రకటింపబడినది అని. దానిని నీవు చదివితివా? ఆయన దానినిగూర్చి నా యభిప్రాయమును అడిగినాడు. నేను ఇంకను దానిని చూడనందున, ఆయనకు ఏమియు వ్రాయజాలకున్నాను. నీకడనున్న, దానిని నాకు పంపుము. బ్రహ్మవాదిను సంచికలలో, ఏదేని వచ్చియున్నను పంపుము. మాక్సుముల్లరు మన కార్యక్రమములు పద్ధతులు......మరల ఆ పత్రిక సంగతియు ఎఱుంగగోరుచున్నాడు. ఆయన మనకు ఎంతయేని సాయము చేయగలనని వాగ్దానము చేయుచున్నాడు. ఆయన శ్రీరామకృష్ణపరమహంసమీద ఒక గ్రంథము వ్రాయుటకు సిద్ధముగా ఉన్నాడు.

పత్రిక మొదలైన విషయములనుగూర్చి నీవు సొంతముగా తిన్నగా ఆయనతో జాబుల వ్యవహారము జరిపిన బాగుగా నుండునని తలంతును. నేను XIX సెంచురి పత్రికను చదివి ఆయనకు జవాబు వ్రాసినైన తరువాత, ఆయన నాకు వ్రాసిన జాబును నీకు పంపెదను, నీవు దానిని చూడుము, మన ఉద్యమమునెడ ఆయనకు చాల ప్రీతి కలిగియున్నది. దానికి తాను చేతనైన సాయము చేయ సిద్ధముగా నున్నాడు.

ఆశీస్సులతో ప్రేమతో,

భవదీయ
వివేకానంద.

మలిమాట :—

పెద్ద పత్రికకైన పద్ధతులను నీవు లెస్సగా ఆలోచింతువని నా యాశ. అమెరికాలో కొంత ధనము ప్రోగగును. మరల పత్రిక యేమో అంతయు మనకే యుండును. నీవును ప్రొఫెసరు మాక్సు ముల్లరును తీర్మానింపగల పద్ధతి నాకు తెలిసినవెంటనే, అమెరికాకు జాబు వ్రాయగోరుదును. "ఒక పెద్దచెట్టు, పండ్లు నీడగలది, దొరకిన, దానిని తప్పక ఆశ్రయింపదగును. ఒకవేళ మనకు పండ్లు లభింపకపోయినను, మనలను, నీడ ననుభవింపనీక, ఎవరు అడ్డగలరు?" అట్లు పెద్ద ప్రయత్నములు చేయవలసినది అది నీతి.

వి.

## 290

(లాలా బద్రిసాహీకి)

శ్రీ ఇ. టి. స్టర్డి గారింట
హైవ్యూ, కేవర్షామ్ రీడింగు
ఆగస్టు 5, 1896.

ప్రియసాజీ,

నీ అభినందనలకు నాధన్యవాదశతములు. నేను ఒక విచారణ చేయవలసియున్నది. నాకు కావలసిన సమాచారమును దయతో నాకు తెలుపుదువేని నేను మిక్కిలి కృతజ్ఞుడనుగా నుందును.

ఆల్మోరాలోనో దానిచెంతనో నేను ఒకమఠమును ప్రారంభింపగోరుచున్నాను. శ్రీరామ్సే అను ఒకానొకడు ఆల్మోరా చెంగట ఒకబంగళాలో నివసించుచుండె ననియు ఆ బంగళాచుట్టురా అతనికి ఒకతోటయు ఉండెననియు వినియున్నాను. దానిని వెలయిచ్చి కొనుటకు వీలు కాదా? ఎంత వెల? వెలకుకొనుటకు కాకున్నను అది బాడిగకు దొరకునా?

ఆల్మోరాసమీపముగ నామఠమును, తోట మొదలైన వానితో, నిర్మించుకొనుటకు తగినచోటు నీకు తెలిసి ఎందైన ఉన్నదా? ఒకకొండ పూర్తిగా అంతయు నాకేయుండవలయునని నా యిష్టము.

జవాబును వెంటనే వచ్చునని ఎదురుసూతును నీకును ఆల్మోరాలోని తక్కిన నామిత్రులకును నాదీవెనలును ప్రేమయు
వివేకానంద

## 291

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

స్విట్జర్లండు
ఆగస్టు 6, 1896

ప్రియ అళసింగా,

నీ జాబువలన బ్రహ్మవాదిన్‌కు ఉన్న ఆర్థిక దుఃస్థితిని ఎఱింగితిని నేను మరలి లండను చేరిన తర్వాత నీకు సాయముచేయ ప్రయత్నించెదను నీవు పత్రిక ధోరణి యున్నతిని తగ్గింపగూడదు పత్రికను మానకు, జరుపుచునే ఉండుము త్వరలో నీవు నీ వెట్టిబడిపంతులు నౌకరిని మానుకోవచ్చు, ఆపాటి సాయము నేను చేయగలిగి యుందును భయము చెందకు నాయనా, గొప్పకార్యములు చేయబడబోవుచున్నవి ధైర్యముగా నుండుము రత్నము సుమా బ్రహ్మవాదిను అది నాశనము కాగూడదు సహజముగా అట్టి పత్రిక ఎప్పుడును సొంతమైనట్టియు సొంతజనుల వలన కలుగగల యట్టియు సాయముననే జరుపబడవలయును దానిని మనము సమకూర్తము ఇక కొన్ని నెలలవఱకు పట్టు విడువకుండుము

శ్రీరామకృష్ణునిమీద మాక్సుముల్లరు వ్రాసిన వ్యాసము నైన్టీన్తుసెన్చురీలో ప్రకటింపబడినది నాకు రాగానే దానిప్రతి నీకొకటి పంపెదను ఆయన నాకు చాల సరసమైన జాబులు వ్రాయును రామకృష్ణుని జీవితమునుగూర్చి ఒక పెద్ద గ్రంథము రచించుటకు తనకు విషయములు కావలయునట అక్కడివారు సేకరింపగల విషయముల నన్నిటిని మాక్సుముల్లరుకు పంపవలసినదని కలకత్తాకు ఒక జాబు వ్రాయుము

అమెరికను పేపరుకువ్రాసిన జాబు నాకు ముందు చేరియుండెను నీవు దానిని ఇండియాలో ప్రకటింపగూడదు వార్తాపత్రికలలో

ప్రకటనచేయించుకొను ఈపని ఇక చాలు. అది నాకు విసుగు కలిగించినది. మనదారిని మనము పోవుదము, మూర్ఖులను వాగు చుండనిత్తము. సత్యమును ఏదియు అడ్డనేరదు.

నేను, నీ కగపడుచున్నట్లు ఇపుడు స్విట్జర్లండులో ఉన్నాను. ఒకచోట నిలువక ఎప్పుడు సంచరించుచునే యున్నాను. నే నిపుడు వ్రాతపని చేయజాలను, చేయనుకూడ; చదువుపని నైనను ఎక్కువగా చేయగూడదు. పై నెలనుండి నేను చేయవలయు ఒక పెద్ద లండనుపని నాకై కనుపెట్టుకొనియున్నది. చలికాలమున నేను ఇండియాకు మరలుచున్నాను. అపుడు అక్కడ అన్నివిషయములను నడిపింతును.

అందఱికి నా ప్రేమ. సాగింపుడు పనిని, ధీరహృదయులారా, మానకుడు, తప్పిపోకుడు, కాదు అనకుడు. పనిని సాగింపుడు. పనికి ప్రాపుగ ప్రభు వున్నాడు. మహాశక్తి మీతోడ నున్నది.

భవదీయ ప్రేమాశీఃప్రద

**వివేకానంద.**

మఱిమాట :— భయపడకు. ధనమును, సమస్తమును త్వరలో రాగలదు.

వి.

## 292

(శ్రీ జె. జె. గుడ్వినుకు)

స్విట్జర్లండు
ఆగస్టు 8, 1896.

ప్రియ గుడ్విను,

నేను ఇపుడు విశ్రాంతిగొనుచున్నాను. వేయువేయు జాబులలో కృపానందునిగూర్చి చాల వినుచున్నాను. అతనినిగూర్చి నాకు విచారముగా నున్నది. అతనిబుద్ధిలో ఏదో చెడిపోయి ఉండ వలయును. వానిని వానికి విడిచిపెట్టుడు. మీరెవ్వరును అతనిని గూర్చి వెతచెంద నక్కఱలేదు.

నన్ను నొప్పించుటయూ అది దేవతలకు శక్యముగాదు, దయ్యాలకు శక్యముగాదు. కాబట్టి నిమ్మళముగా నుండుము. చలింపని ప్రేమ, సమగ్రనిస్స్వార్థపరత ఇవి అన్నిటిని జయించును. మేము, వేదాంతులము ఏ సంకటము కలిగినను తమ్మే ప్రశ్నించుకొనవలయును—'ఇది నాకేల కననగుచున్నది?' 'దీనిని నేను ప్రేమతో జయింపజాలనా?' అని.

ఆ స్వామిని ఆదరించినందులకు నాకు చాల సంతోషముగానున్నది. ఆయన కావించుచుండు ప్రశంసార్హమగు పనికిని నాకు చాల సంతోషము. గొప్పపనికి, చిరము విడిచిపెట్టకుండ చేయు గొప్పప్రయత్నము, ఆవశ్యకము. కొందఱు భంగమొందిన, అందులకును మనము ఆకులపడ నక్కఱలేదు. చాలమంది పతనమొందుటయు, చిక్కులు కలుగుటయు, భయంకర సంకటములు ఉద్భవించుటయు, స్వార్థపరతయు మనుష్యహృదయములోని తక్కిన దయ్యములును ఆత్మప్రబోధాగ్నిచే తఱుమబడబోవుచున్నపుడు ఎక్కువగా పెనగులాడుటయు ఇదంతయు లోకవస్తుస్వభావముననే ఉన్నది. ఈ విశ్వమున నిశ్శ్రేయసమునకు దారి ఎంతయో కఱకుగులకమయము, మిక్కిలి నిట్రమైనది. కావున అందు పలువురు సిద్ధిపొందుట ఆశ్చర్యముగాని, పలువురు భంగమొందుట ఆశ్చర్యముగాదు. వేయితూర్లు తడబడి పొరబడి శీలమును నిరూఢము చేయవలయును.

నేనిపుడు ఎంతయు సేదదేఱి యున్నాను. కిటికీనుండి బయటికి చూచి, నాకు సరిగా ఎదుటనున్న పెనుమంచుబండ లగపడగానే హిమాలయములలో నున్నట్లు భావించుకొనుచున్నాను. నేను ప్రశాంతముగా ఉన్నాను. నా నరములకు మరల మామూలు బలము వచ్చినది. నీవు వ్రాయువానినిబోలిన చిన్నిచీదఱలు నన్ను అంటనే అంటవు. ఈ శిశుక్రీడ నన్నెట్లు కలతపఱచును? మతబోధ చేయుట పాఠాలుచెప్పుట మొదలగు నన్నిటితో కూడుకొన్న ఈ

ప్రపంచమంతయు వట్టి పసిబాలుని యాట. 'రాగ ద్వేషములు లేని వాడే సన్న్యాసి యని యెఱుంగుము.' వచ్చిన దుఃఖమే వచ్చిన రోగమే వచ్చిన చావే మాటిమాటికి వచ్చుచుండు ఈ క్షుద్రమగు బురదగుంటయైన లోకమున, కోరదగినది ఏ ముండును? "సర్వ కామములను విడిచినవా డొక్కడే సుఖి."

ఇక్కడ ఇపుడు ఈ రమణీయప్రదేశమున ఉండి కన్న ఈ విశ్రాంతిచే ఆ నిస్తరంగ నిత్యపరమవిశ్రాంతి ఇట్లుండును గదా అని ఊహను అందుకొనుచున్నాను. "ఆత్మ ఒక్కటే కలదు, మఱేదియు లేదు అని యెఱింగినతర్వాత ఏ కోరికకోసము ఎవరికోరికకోసము శారీరకదుఃఖమును అనుభవింతువు?" — (బృహదారణ్యకము— **iv iv-12).**

'కర్మ' అందురే, అందు నా భాగమగు అనుభవము నాకు కలిగినది అని నే ననుకొనుచున్నాను. నే నంతయు ముగిసితిని, ఇక ఇపుడు బయటపడ గోరుచున్నాను. "వేలమందిలో (ఎవడో) ఒకడే ప్రాప్యమును చేర ప్రయత్నించును. అట్లు (ప్రయత్నించి) పెనగు లాడువారిలో కొందతే చేరుదురు. ఏలన ఇంద్రియములు బలాఢ్య ములు, అవి మనుష్యులను క్రిందికి లాగును."

'మంచిలోకము' 'సుఖమైనలోకము' 'జనులయభివృద్ధి' ఇ వన్నియు 'వేడిమంచు' 'నల్ల వెలుతురు' అను వానితో తుల్యముగా అర్థ మగునవే. మంచిదైన, అది లోకము గాదు. ఆత్మ, తెలివి లేనిదై, ఆ యనంతమును స్వాంతమగు ప్రకృతిలో ప్రత్యక్షీకరింప దలచును; జ్ఞానమును స్థూలమైన మోటు అణువులలో ప్రత్యక్షీకరింప దలచును. కడపటికి తన పొరబాటును తెలిసికొని తప్పించుకొన ప్రయత్నించును. ఈ వెనుదిరుగుటే పారమార్థికపరతకు ఆరంభము. దానిపద్ధతి 'నేను' అనుటను నాశముచేయుట. అదియే ప్రేమ. భార్యకైన ప్రేమ కాదు బిడ్డకైన ప్రేమ కాదు మఱియేయితర జనమునకైన ప్రేమ కాదు. ఈ సంకుచితాత్మయందున్న ప్రేమ కాదు, తక్కిన సమస్తమునకైన ప్రేమ. అమెరికాలో 'మానవ

కోటి యభ్యుదయము', ఇంకను అట్టి యితరవిషయములు అని ఎంతెంతో వినుచుందువే ఆ దాంభిక భాషితములకు మోసపోకుము. పురోగతి ఎంతఉన్నదో అంత తప్పుదారిపట్టుటయు ఉన్నది. ఇది లేక అది లేదు. ఒక తెగ జనులందు ఒకవరుస సెబ్బరలు ; మఱొక తెగయందు మఱొకవరుస. అట్లే చరిత్రలో ఒక్కొక్కకాల విభాగమునందును. మధ్యయుగమున దోపిడిగాండ్రు ఎక్కువ. ఈ కాలమున వంచకులు ఎక్కువ. ఒకకాలమున దాంపత్యజీవితము మీాద తాత్పర్యము తక్కువ. మఱియొక కాలమున వ్యభిచారము మీాద తాత్పర్యము ఎక్కువ. ఒక కాలమున శరీరబాధలు ఎక్కువగ నుండును. మఱియొక కాలమున మానసికబాధలు, అంతకంటె వేయంతలు ఎక్కువగ నుండును. అట్లే జ్ఞానవిషయమునను. భూమ్యాకర్షణశక్తి, దానిని కనిపట్టి ఆపేరు పెట్టక మునుపు, ప్రకృతిలో లేకపోయెనా ? అది యొకటి యున్నదని యెఱుగుట వలన వచ్చిన విశేష మేమి ! మీారు ఎట్టియిండియనులకన్నను ఎక్కువ సుఖముగా ఉన్నారా ?

వెలగల జ్ఞానము ఒక్కటే. అది ఇదంతయు మిథ్య అని తెలిసికొనుట. ఎన్నడైనను ఇది యెఱుంగగలవారు అల్పసంఖ్యాకులే, అత్యల్పసంఖ్యాకులే. "ఆత్మనుమాత్రమే తెలిసికొనుము, తక్కిన రిత్తమాటలు మానుము. విశ్వమంతట ఈ తిరుగుటవలన మనము సంపాదించునది ఈ జ్ఞానమొక్కటే. ఇదొక్కటే పని, మానవకోటిని "మేలుకొనుడు, లెండు, ప్రాప్యమును చేరువఱకు నిలువకుడు." అని ఎచ్చరించుటయే. పారమార్థికపరత యనగా త్యాగమే కాని మఱేమియు గాదు.

ఈశ్వరుడు సకలజీవరాసుల మొత్తము. అయినను ఆయనయు ఒక్కడే, మానవశరీరము ఒక్కటియైనట్లు. మఱి నిజముగా మానవ శరీరము అణువులవంటిగదుల మొత్తము గదా. సమష్టి అనగా అన్నియుకలసిన మొత్తము దేవుడు. వ్యష్టి అనగా విడదీసినది ఆత్మ జీవుడు. కాబట్టి ఈశ్వరునిసత్త జీవునిసత్తను ఆశ్రయించియున్నది,

మానవదేహపుసత్త అణుగదుల నాశ్రయించుకొనియున్నట్లు. వ్యత్క్రమముగా అట్లే జీవునిసత్త ఈశ్వరసత్తను, అణుగదులసత్త మానవదేహసత్తను ఆశ్రయించియున్నవి. జీవుడును ఈశ్వరుడును ఒకరితోనొకరుగనుండువారు. ఒకరున్నంతకాలము ఇంకొకరును ఉండకతప్పదు. మఱియు, మనభూమిమీద తప్ప, తక్కిన యన్నియూర్ధ్వగోళములందును (లోకములందును) సెబ్బరయొక్క మొత్తమునకన్న మంచియొక్క మొత్తము మిక్కిలియు అతిశయించి యున్నందున, అన్నింటిమొత్తమగు ఈశ్వరుడు కల్యాణైకతానుడును సర్వశక్తియు సర్వజ్ఞుడును అని చెప్పనచ్చు. ఇవి ఆ యన్నింటి మొత్తమగుటనుబట్టియే ప్రత్యక్షమగు గుణములు. వానిని రుజువు చేయుటకు తర్క మక్కఱ లేదు.

బ్రహ్మము ఈ రెంటికిని అతీతము. అదియొక అవస్థకాదు. పెక్కుఒకట్లు మొత్తముగా కూడని యొకటి అదొక్కటే. అది అన్నింటను, అణుగది మొదలు ఈశ్వరునివఱకు, వ్యాపించియుండునది, మూలకారణమైనది. అది లేకున్న ఇవి యేవియు ఉండజాలవు. సత్యమైనదెల్ల ఆతత్త్వమే. బ్రహ్మమే. 'నేను బ్రహ్మ' మని నేననుకొన్నపుడు నాకుమాత్రమే సత్త. నీవు అట్లనుకొన్నపుడు సత్త నీకు మాత్రమే. అట్లే ఇతరులవిషయమునను. ఒక్కొక్కడును ఆ అఖండ తత్త్వమే.

కొన్నిదినములక్రింద, ఉన్నటులుండి నాకు కృపానందునికి జాబు వ్రాయవలయునని ఆపరాని కోరిక పొడమినది. ఒకవేళ అతడు సౌఖ్యహీనుడుగాను, నన్ను తలంచుకొనుచును ఉండెను కాబోలు. కావున నేను ఆతనికి ప్రేమాదరపూర్ణమగు ఒక జాబు వ్రాసితిని. ఈదినము తెలియవచ్చిన అమెరికాసమాచారములవలన అది అట్లేల యుండెనో నాకు తెలిసినది. ఆతనికి నేను మంచుబండల కడ కోసిన పూలను పంపితిని. కుమారి వాల్డోతో అతనికి కొంత పైకమును సమృద్ధమైన ప్రేమను అందింపుమని చెప్పుము. ప్రేమ ఎన్నటికిని నాశనము చెందదు. బిడ్డలు ఎట్లుండనీ, ఏమి చేయనీ,

తండ్రికి ప్రేమ పోదు. అతడు నాబిడ్డ. నా ప్రేమసాయములు అందఱికి నున్నంత అతనికిని కలదు. అతడు దుఃఖితుడుగా నున్నందున, అందఱికంటె అతనికే నా ప్రేమసాయము లిప్పుడెక్కువ.

ఆశీస్సులతో,

భవదీయ

**వివేకానంద.**

## 293

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

గ్రాండ్ హోటలు
వాలెయిస్, స్విట్జర్లండు
ఆగష్టు 8, 1896

ధన్య, ప్రియ,

నీ జాబుతోకూడ ఒక పెద్దజాబుల కట్ట వచ్చినది. దీనితో నాకు మాక్సుముల్లరు వ్రాసిన జాబుకూడ నీకు పంపుచున్నాను. అది ఆయన దయాసౌజన్యాతిశయము.

కుమారి ముల్లరు తాను త్వరలో ఇంగ్లండుకు పోగలనని అనుకొనుచున్నది. ఆ పక్షమున నేను వత్తు నని మాట యిచ్చిన ఫ్యూరిటి కాంగ్రెసుకు బెర్నుకు నేనుపోవజాలియుండను. సీవియరు దంపతులు నన్ను తమతో పిలుచుకొనిపోవ నొప్పుకున్నట్లైన నే, నేను కీలుకు పోయెదను. ముందుగా నీకు వ్రాసెదను. సీవియర్లు మంచివారు, దయగలవారు. అట్లని నేను వారి యౌదార్యమును దుర్వినియోగపఱచుకొనుటకు నాకు హక్కు లేదు. ముల్లరమ్మాయి విషయమునను అంతే, ఏలన అక్కడి ఖర్చులు భయపడవలసి నంత అతిగా నున్నవి. అట్లగుటవలన, బెర్ను కాంగ్రెసును, అది యింకను చాలకాలము తర్వాత, సెప్టెంబరు నడుమ, జరుగబోవు చున్నందున మానుకొనుట పరమశ్రేయ మని తలంతును,

కావున జర్మనీతట్టు పోయి, కీలునొద్ద ఆ ప్రయాణమును ముగించుకొని, అక్కడినుండి ఇంగ్లండుకు తిరుగుదు నని ఎంచు కొనుచున్నాను.

ఆయనపేరు బాలగంగాధర్ తిలక్ (శ్రీ తిలక్); పుస్తకము పేరు ఓరియను.

నీ

వివేకానందుడు.

మలిమాట :—జేకొబి వ్రాసినదియు ఒకటి యున్నది. ఆమార్గమునసే, పర్యవసానమున ఆ తేల్చుకొన్న యభిప్రాయములతోనే చేయబడిన అనువాదము కాబోలు.

వి.

మలిమాట :— ముల్లరమ్మాయిని విడిదినిగూర్చియు హాలునుగూర్చియు అభిప్రాయము అడుగుదు వని తలంచెదను. ఆ విషయమునుగూర్చి ఆమెతోను ఇతరులతోను సలహా పడకున్న ఆమె చాల అపరితోషము చెందు నని భయము.

వి.

ముల్లరమ్మాయి నిన్నటి రాత్రి ప్రొఫెసరు డ్యూసెన్‌కు టెలిగ్రాము పంపినది. 9 ఆగస్టు ఈ దినము ఉదయాన జవాబు వచ్చినది, నాకు స్వాగతము ఇడుచు. నేను సెప్టెంబరు 10 వ తేది కీలులో డ్యూసెన్నింటిలో ఉండవలయును. కావున నీ వెక్కడ నన్ను కలసికొందువు? కీలులోనా? ముల్లరమ్మాయి స్విట్జర్లండునుండి ఇంగ్లండుకు పోవును. నేను సీవియర్లతో కూడి కీలుకు పోవుచున్నాను. సెప్టెంబరు తే 10 ది నేను అక్కడ ఉండగలను.

వి.

మలిమాట:—నేను ఉపన్యాసమును గూర్చి యింకను ఏమియు నిర్ణయింప లేదు. నాకు చదువను కాలము లేకున్నది. సాలేము సమాజము బహుశః హిందూబృందముగా నుండును. వారు వెట్టి అభిమానపు మతభ్రమలు కలవారుకారు.

వి.

## 294

(శ్రీ అళసింగ పెరుమాళునకు)

స్విట్జర్లండు.
ఆగస్టు 8, 1896.

ప్రియ అళసింగా,

కొన్నాళ్ళక్రింద నీకు జాబువ్రాసిన తర్వాత నేను బ్రహ్మవాదినుకు ఈపాటి చేయగలిగితినని నీకు వ్రాయు అవకాశము పొందితిని. నీకు ఒక్క సంవత్సరమో రెండు సంవత్సరములో నెలకు నూఱురూపాయలు ఇచ్చుచుందును. అనగా 60 పౌనులో 70 పౌనులో ఎంత ఇచ్చిన నెలకు నూఱురూపాయలగునో అంత ఇచ్చుచుందును. దానిచేత నీకు బ్రహ్మవాదిన్‌పని చేయు స్వేచ్ఛ కలుగును; దానిచేత అది ఇంతకన్నను చక్కగా జరుగును. శ్రీమణి అయ్యరును మఱికొందఱు మిత్రులును అచ్చుపని మొదలగు వానికి చాలగల ధనమును ప్రోగుచేయుటకు సాయపడవచ్చును. చందాల వలని రాబడి యెంత? ఈ మొత్తములో వ్యాస రచయితలకు పారితోషికములు ఇచ్చి మంచి వ్యాసావళిని సంపాదింప వీలగునా? బ్రహ్మవాదిన్‌లో వ్రాయబడు సర్వమును ప్రతి యొకడును బోధపఱుచుకొనజాలియుండ నక్కఱలేదు. మఱి దేశభక్తిచేతను సత్కర్మ పక్షపాతముచేతను వారు బ్రహ్మవాదినుకు చందాదారులు కావలయును. వారు అని నేను అనుట హిందువులను.

అనేక విషయములు ఆవశ్యకములు. మొదటిది యేమనగా, నిశితమైన ఆర్జవము సత్యసంధత ఆవశ్యకము. అనగా మీలో ఎవరైనను సత్యమునుండి భ్రంశముపొందుదురని జాడగానైన సూచించుట కాదు. మఱేమనగా హిందువులకు ఇట్టి వ్యవహారవిషయములందు ప్రత్యేకమైన మడ్డితనమున్నది. పద్ధతిగా ఉండరు. లెక్కలు కచ్చితముగా వ్రాసిపెట్టరు.

రెండవది యేమనగా బ్రహ్మవాదిన్ పత్రికను యథామనోరథముగా నెగ్గించుటవలననే నీకు మోక్షమని యెఱింగి దాని సంకల్పించుకొన్న యుద్దేశ్యమున సర్వాభినివేశము కలిగియుండుట. ఈ

పత్రికను నీ యిష్టదేవతగా ఆరాధింపుము, విజయము ఎట్లు సేకుఱునో నీవే ఎఱింగెదవు. నేను ఇదివఱకే ఇండియానుండి అభేదానందుని రమ్మంటిని. మఱియొకస్వామి చేసినట్లుగా ఇతడు ఆలస్యము చేయడని ఎంతును. ఈ జాబు చేరగానే నీవు బ్రహ్మవాదినుకు సంబంధించిన రాబడి ఖర్చుల వివరమగు లెక్కను నాకు పంపుము. దానిని చూచి దానికి చేయదగిన సర్వమును ఏమియగునో నేను తెలిసికోగలుగుదును. జ్ఞప్తియందుంచుకొనుము—సమగ్రమగు పవిత్రత, నిస్సంగత్వము గురునికి విధేయత ఇవి విజయరహస్యములు.

మతసంబంధమగు పత్రికకు పరాయిదేశమున అధిక వ్యాప్తి, సాధ్యము గాదు. ధర్మపరతయు కృతజ్ఞతయు కలిగియుందురేని, హిందువులు, దానిని పోషింపవలసినవారు.

మఱొకసంగతి. అనిబెసెంటమ్మ నన్ను తన బసయొద్ద భక్తిని గూర్చి మాట్లాడుమని పిలిచినది. నే నొకరాత్రి అక్కడ ఉపన్యసించితిని. కర్నల్ ఆల్కాటుకూడ అక్కడనుండెను. అన్ని తెగలయెడను సమానాదరము చూపుదమని నే నట్లు కావించితిని...... మన దేశమువారు ఇది ఎఱుంగవలయును. ఆత్మ సంబంధమగు విషయములలో మన మే గురువులము, విదేశీయులు కారు. లౌకిక విషయములలో మనము వారివలన నేర్చుకొనవలయును అని.

నేను మాక్సుముల్లరు వ్యాసమును చదివితిని. ఆఱునెలల క్రిందట ఆయన దానిని వ్రాసినపుడు ఆయన చేతిలో మజుందారు రచనతప్ప మఱి యే విషయసామగ్రియు లేదనుటను మనస్సున ఉంచుకొని చూచిన ఆయన వ్యాసము బాగుగానేయున్నది. ఇపుడు తాను శ్రీ రామకృష్ణునిమీద ఒక పుస్తకమును వ్రాయగోరుచున్నాను అని నాకు దీర్ఘమును సరసమును అగు జాబు వ్రాసినాడు. నేను ఇప్పటికే ఆయనకు విషయసామగ్రి పుష్కలముగా సరఫరా చేసియున్నాను. ఐనను ఇంకను చాల ఇండియానుండి రావలసియున్నది.

సాగనీ, పనిని! వీడకు, పట్టు! నిల్చుకో, ధైర్యము! ఎదురుకో, తెంపుతో దేనినైనను!

......అంతయు దుఃఖమే, ఈ సంసారము, నీకు అగపడుట లేదా?

ప్రేమాశీస్సులతో,

భవదీయ
వివేకానంద.

**295**

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

స్విట్జర్లండు
ఆగస్టు 12, 1869

ధన్య, ప్రియ,

ఈదినము నాకు అమెరికానుండి ఒకజాబు వచ్చినది. దానిని నీకు పంపుచున్నాను. (ఒకవేళ ఎప్పటికి కాకున్నను) ప్రకృతపు టారంభమునకు, అన్నిటిని ఒక్కటచేర్చి ఏకాగ్రము చేయవలెననెడి నా యభిప్రాయమును నేను వారికి వ్రాసితిని. వారికి మఱియొక సలహాకూడ చెప్పితిని. ఆరంభములో అనేక పత్రికలు పెట్టుకొనుటకన్నను, బ్రహ్మవాదిన్ లోనే మఱికొన్ని కాగితములు, అమెరికాలో వ్రాయబడినవి, చేర్చి ఈ యమెరికను ఖర్చులకు చాలునట్లు (బ్రహ్మవాదిన్) చందాను ఇంచుక వృద్ధిచేయవచ్చును అని. వారు ఏమిచేయబోవుచున్నారో నాకు తెలియదు.

మేము ఇటనుండి పైవారము జర్మనీతట్టు బయలుదేఱుదుము. ముల్లరమ్మాయి, మేము జర్మనీకి దాటిపోగానే, తాను ఇంగ్లండుకు పోవును.

కాప్టెను సేవియరును, ఆయన శ్రీమతియు, నేనును నీకై కీలులో ఎదురుచూచుచుండగలము.

నేను ఇంకను ఏమియు వ్రాయనులేదు, చదువనులేదు. నేను చాలినంత విశ్రాంతి పొందుచున్నాను. ఆందోళన పడకుము, నీకు వ్యాసము అందుట సిద్ధము. ఆ మఱియొక స్వామి బయలుదేఱుటకు

సిద్ధముగా ఉన్నాడని నాకు మఠమునుండి జాబు వచ్చినది. ఆయన సరిగా మీరు కోరుకొనుచున్నట్టివాడే కాగల డని నా గట్టి నమ్మకము. ఆయన ఇపుడు మనకు ఉన్న గొప్ప సంస్కృతపండితులలో ఒకడు......ఆయన తన యింగ్లీషుజ్ఞానమునుకూడ వృద్ధిచేసికొన్నాడని నాకు తెలియవచ్చుచున్నది, నాకు అమెరికానుండి శారదానందునిగూర్చి అనేకములైన వార్తాపత్రిక కత్తిరింపులు వచ్చినవి. వానివలన ఆయన అక్కడ చాలబాగుగా తన కార్యముల నిర్వహించినా డని తెలియుచున్నది. అమెరికా మనుష్యునిలో నున్న శక్తినంతయు వెలికి తెచ్చు మంచి శిక్షారంగము. అట్టి అన్యగుణాదరము ఆ వాతావరణమందు కలదు. నాకు గుడ్విననొద్ద నుండియు శారదానందుని యొద్దనుండియు జాబులు వచ్చినవి. శా. నీకును నీ భార్యకును శిశువునకును తన ప్రేమను అందించుచున్నాడు.

ప్రేమాశీస్సులతో,

భవదీయ
**వివేకానంద.**

## 296

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

ల్యూసర్న్, సరస్సు
స్విట్జర్లండు,
ఆగస్టు 23, 1896.

నా ప్రియ శశీ,

ఈదినము నాకు రామదయాళుబాబునొద్దనుండి ఒకజాబు వచ్చినది. అందులో దక్షిణేశ్వరములో రామకృష్ణుని సాంవత్సరిక జన్మదినోత్సవమును సేవించుటకు చాలమంది వారస్త్రీజనము వత్తురనియు, దానివలన చాలమంది అచ్చటికి రాను వెనుదీయుచున్నారనియు వ్రాసియున్నాడు. అంతేగాక ఆయన యభిప్రాయమున పురుషులకు ఒకదినమును స్త్రీలకు ఒకదినమును ప్రత్యేకముగ ఏర్పాటుచేయవలయు నట. ఈవిషయమున నా తీర్మానము ఇది :—

1. సామాన్యస్త్రీలు దక్షిణేశ్వరమువంటి మహాయాత్రా స్థలమునకు వచ్చుటకు అనుమతింపబడకున్నచో మఱి వారిక ఎక్కడికి పోవుదురు? విశేషముగా పాపాత్ములకోసము ప్రభువు అవతరించుట, అంతగా పుణ్యాత్ములకోసము గాదు.

2. నరకద్వారములైన జాతి, వర్ణ, ధన, విద్యాప్రభృతి భేదములు లోకమున మాత్రమే పాటింపబడనిమ్ము. పవిత్రయాత్రా క్షేత్రములందు ఆ భేదములుండునేని, ఆ స్థలములకును అసలు నరకమునకును ఏమి భేదము?

3. మనది బ్రహ్మాండమైన జగన్నాథుని నగరము. అందు పాపముచేసినవారికిని, చేయనివారికిని, మహాత్ములకును, దుష్టాత్ములకును, పురుషులకును, స్త్రీలకును, బిడ్డలకును వయసుతో లెక్కలేక అందఱకును సమాన హక్కు లున్నవి. సంవత్సరములో ఒక్కదినమైనను వేలకొలది పురుషులును స్త్రీలును పాపభావమును భేదభావములను వీడుటయు, ఒక్కుమ్మడి ప్రభునామమును పాడుటయు వినుటయు—అదియే పరమశ్రేయము.

4. పుణ్యక్షేత్రమందు జనుల పాపాభినివేశము ఒక్కదినమైనను అడంపబడకున్న, ఆ దోషము మీది గాని వారిది కాదు. ఎట్టి జనులు చేరవచ్చినను వారు కొట్టుకొని పోవునంతటి ఆధ్యాత్మిక బృహత్తరంగమును సృజింపుడు.

5. దేవళముననును ఇది వారాంగన, అతడు అధమవర్ణుడు, మఱియొకడు పేద, ఇంకనొకడు పామరుడు అని భేదగణనము చేయు వారిని మీరు పెద్దమనుష్యులని అనుచున్నారు. అట్టి పెద్దమనుష్యుల సంఖ్య ఎంతతక్కువగానున్న అంత శ్రేయము. భక్తులవర్ణ జాతివృత్తులను పరిగణించువారు మన ప్రభువును అర్థముచేసికొందురా? నూర్లకొలదిగ వారాంగనలు ప్రభు పాదములకు తమశిరములు సోక మ్రొక్క వత్తురుగాతమనియు పెద్దమనుష్యుడు ఒక్కడైన రాకున్నను అది యొక విషయముగాదనియు ప్రభువును నేను వేడుకొనుచున్నాను. రండి వారాంగనలారా, రండి త్రాగుబోతులారా, రండి

దొంగలారా, రండి అందఱును; ఆయనవాకిలి అందఱికి తెఱచి పెట్ట బడియున్నది. 'దేవునిరాజ్యమున ధనవంతుడు ప్రవేశముగనుట కంటెను సూదికంటిలో ఒంటె దూరుట సులువు.' అట్టి క్రూర రాక్షస భావములను నీమనసులోనికి రానీయకు.

6. ఐనను జనులవిషయములో కొంతజాగ్రత్త ఆవశ్యకమే. దానిని ఎట్లు సమకూర్తుము? కొందఱు మనుష్యులు — వారు వయసుచెల్లినవారైన మఱియు మంచిది—ఆదినము పర్యవేక్షకులుగా పనిచేయబూనుకొనవలయును. వారు ఉత్సవప్రదేశము చుట్టును తిరుగుచు పరికించుచుండవలయును. ఎవరియందైనను పురుషునందు గాని స్త్రీయందుగాని దుర్భాషణమో దుష్ప్రవర్తనమో కంట బడిన వారిని ఆక్షణముననే తోటబయటికి వెడలగొట్టవలయును. అట్లుగాక, వారు పురుషులుకానీ స్త్రీలుకాని, యోగ్యులుగానీ వ్యభి చారులుగానీ మంచివారుగా నడచుకొనుచుండునంతవఱకు వారు భక్తులే, వారిని గౌరవింపవలసినదే.

నేను ఇప్పుడు స్విట్జర్లండులో తిరుగుచున్నాను. త్వరలోనే ప్రొఫెసరు డ్యూస్సెన్ను చూచుటకు జర్మనీకి పోవుదును. అక్కడి నుండి సెప్టెంబరు 23 న తేదియో లేక 24 వ తేదియో ఇంగ్లండుకు మరలుదును. తరువాత హేమంతశిశిరములప్పటికి నాదేశమునకు మరలుదును. నీకును అందఱికిని నా ప్రేమ.

నీవాడు
వివేకానంద.

## 297

(శ్రీ స్టర్డికి)

ల్యూసెర్న్
ఆగస్టు 23, 1896

ధన్య, ప్రియ,

ఈదినము ఇండియానుండి అభేదానందుడు వ్రాసిన జాబొకటి వచ్చినది. దానినిబట్టి ఆతడు ఆగస్టు తే 11 ది బి. ఐ. యస్. యన్. 'యస్. యస్. మొంబాసా' అను నావలో చాలవఱకు తప్పక

బయలు దేఱియుండవలయును. అంతకన్న ముందు తరలు స్టీమరు ఏదియు అతనికి దొరకలేదు. దొరకియున్న ఇంకను ముందుగానే బయలుదేఱి యుండును. మొంబాసాలో పయనించుటకు ఆతడు అనుమతి చాలనఱకు సంపాదించుకొనగల్గియేయుండును. మొంబాసా సెప్టెంబరు తే 15 ది యప్పటికి లండను చేరగలడు. నీవు ఇదివఱకే ఎఱిగియున్నట్టు కుమారి ముల్లరమ్మాయి నేను డ్యూసెన్ను దర్శింపవలయు తేదిని సెప్టెంబరు 19 కి మార్చెను. కావున అభేదానందునికి స్వాగతముపలుకుటకు నేను లండనులో ఉండను. అతడును వెట్టయుడుపులు లేకయే వచ్చుచున్నాడు. కాని అప్పటికి ఇంగ్లండులో చలి యారంభమగును అని వెఱచెదను. అందులకై అతనికి కొన్ని లోపలితొడుగులును ఒక పైకోటును కావలసియుండును. ఈవిషయములన్నియు నాకంటె నీకే చక్కగా తెలియును. కావున దయతో మొంబాసాకై కనుపెట్టి యుండుము. అతనివద్దనుండి ఇంకొక జాబునుకూడ ఎదురుసూతును.

నేను పదిరోగాలపట్టయిన పడిసెముతో మిక్కిలి బాధపడు చున్నాను సుమా. ఇప్పటికి రాజావద్దనుండి మోహినుడబ్బు, నీచేతికి వచ్చియుండునని యనుకొంటిని. అట్లువచ్చియుండు నేని, నేను అతనికి ఇచ్చినపైకము అతడు నాకు చెల్లింపనక్కఱలేదు గాన, పైకమునంతటిని నీవు ఆతనికే ఈయవచ్చును.

నాకు గుడ్విననొద్దనుండియు శారదానందునియొద్దనుండియు కొన్ని జాబులు వచ్చినవి. శ్రీమతి బుల్సలియొద్దనుండియు ఒకటి వచ్చినది. అందు నీవును నేనును ఆమె కేంబ్రిడ్జిలో నెలకొల్పబోవు చున్న యొకసమాజమునకు సమాచారములు తెలుపు సభ్యులుగా చేరకపోయినందులకు ఆమె పడినకొదువను ప్రస్తావించినది. నీవుగాని నేనుగాని అందు సభ్యులుగా ఉండ నంగీకరింపనిమాటను ఆమెకు వ్రాసితి నని బాగుగా జ్ఞప్తియున్నది. నేను ఇంకను ఒకబంతికూడ వ్రాయజాలక యున్నాను. నాకు చదువుటకును ఒకనిమిషమైనను వ్యవధిదొరక లేదు. సర్వకాలము కొండపైకి ఎక్కుటయు లోయ

క్రిందకి దిగుటయు—దీనితోడనే సరిపోయినది. కొన్నిదినాలలో మేము మరల ప్రయాణము ఆరంభింపనలయును. మోహినుకును ఫాక్సుకును నీవు మరల వారిని కలసికొన్నపుడు నా ప్రేమను అందింపుము, నీకు పున్నె ముండును.

మన మిత్రులకందఱికి నా ప్రేమ.

సదాభవదీయ

**వివేకానంద.**

## 298

(శ్రీమతి బుల్సతికి)

ల్యూసెరన్
స్విట్జర్లండు
ఆగష్టు 23, 1896.

ప్రియ శ్రీమతి బుల్సతికి,

క్రిందటి నీ జాబు ఈదినము అందినది. నీవు పంపిన 5 పౌనులకు నా రసీదు ఇప్పటికి నీకు చేరియుండును. నీ వనుకొన్నది యే సమాజసభ్యత్వమో నాకు తెలియదు. నా పేరును ఏ సమాజపు సభ్యుల జాబితాలో చేర్చుటకును నాకు ఆక్షేపణ లేదు. స్టర్డి మాటయో యన్న, ఆయన యభిప్రాయములు ఏవో నాకు తెలియవు. ఇపుడు స్విట్జర్లండులో సంచారములు చేయుచున్నాను. అక్కడినుండి నేను జర్మనీకి పోయెదను. తరువాత ఇంగ్లండుకు. తరువాత, చలికాలమునకు ఇండియాకు. అమెరికా సంయుక్తరాష్ట్రములలో శారదానంద గుడ్వినుల పని బాగుగా సాగుచున్న దని విన్నాను. నాకు చాల సంతోషముగా నున్నది. నామాటకా, నేను ఏ పనికైనను ఆ 500 పౌనులను ఇమ్మని అడుగను. నేను చేసిన పని చాలునని నా యభిప్రాయము. నేను ఇక విరామము నొందబోవుచున్నాను. నేను ఇండియానుండి మఱియొకని పంపుమని వ్రాసితిని. అతడు పై నెల నన్ను కలసికొనును. పనిని నేను తొడంగితిని. ఇకను ఇతరులు దానిని చేసి ముగింపనీ. పనిని ప్రారంభించుటకు నేను డబ్బును ఆస్తిని కొంతకాలము తాకవలసి యుండెను.

తెలిసినదా ? నా భాగపుపని ముగిసినది-నిజము. ఇకను నాకు వేదాంతమున గాని, యీ లోకాన ఏ తత్త్వశాస్త్రమున గాని, ఆపనియందేగాని ఏ అక్కఱయు లేదు. నేను మఱి యెన్నటికిని ఈ నరకమునకు అనగా ఈ లోకమునకు పునరావర్తనము లేకుండు నట్లు పోవుటకు సన్నద్ధుడ నగుచున్నాను. దాని మతసంబంధమగు ప్రయోజనము సైతము నాకు చప్పగా నున్నది. అమ్మ నన్ను మరల ఎప్పుడును ఇటు రానీకుండ తనకడకు త్వరగా చేర్చుకొనును గాక. ఈ పనులును, ఉపకారము చేయుట మొదలైనవియు చిత్తమును కడిగి నిర్మలము చేసికొనుటకు చిన్న సాధనలు. అవి నా కిక చాలును. ఈ లోకము ఎప్పటికిని ఎల్లప్పటికిని లోకముగానే ఉండును. మనము ఏమిగా ఉన్నామో, దానిని మనము అట్లే చూతుము. పనిచేయువాడెవడు ? పని ఎవరిది ? జగత్తు లేదు. అది దేవుడే. భ్రమలో మనము దానిని జగత్తు అందుము. నేను లేను, నీవు లేవు, మీరు లేరు. సర్వము ఆయనయే. దేవుడే, సర్వమును ఏకము. కావున ఇకమీద ధనవిషయ వ్యవహారములు ఏవియు వలదని నా కోరిక. అది నీ ధనము. నీ చేతికి వచ్చిన ధనమును నీ యిచ్ఛమెయి వ్యయము సేయుము. ఆశీస్సులు నీ వెంబడే ఉన్నవి.

భగవద్గత భవదీయ
వివేకానంద.

మఱిమాట :—డాక్టర్ జేన్సుపని నాకు పూర్తిగా సమ్మతమే. అట్లని అతనికి వ్రాసితిని. గుడ్విన్ను శారదానందుడును అమెరికాలో పనిని త్వరగొల్పగలరేని వారికి శుభము. వారు నాకు గాని స్టర్డికిగాని మఱియెవరికిగాని ఏవిధముగాను బద్ధులుగారు. స్టర్డిగారి అనుమతిమీద శారదానందుడు ఇంగ్లండునుండి గ్రీనేకరుకు వచ్చినట్లు గ్రీనేకరు కార్యక్రమములో అచ్చు వేసినారే, అది పెద్దతప్పు. స్టర్డీగాని మఱి యితరుడుగాని ఎవడు, ఒక సన్న్యాసికి అనుజ్ఞ యిచ్చుటకు ? స్టర్డీయే దానిని చూచి నవ్వినాడు, దుఃఖం

పను దుఃఖించినాడు. అది వట్టి తెలివితక్కువ. అంతకు తక్కువది గాదు. అది స్త్రీకి అవమానము, నిందానహము. ఆమాట, యిండి యాకు అందియుండునేని, నా పనికి ముప్పు తెచ్చున దగును. అదృష్టము బాగుగా నున్నందున, నేను ఆ ప్రకటన కాగితముల సన్నిం చిని చించి తునుకలుచేసి జలదారిలో పాఱవైచితిని. ఇంగ్లీషువారు ప్రస్తావించి సంతోషించు ప్రసిద్ధమైన ఆయాంకి ( అమెరికను) పద్ధతి ఇదేనా అని ఆశ్చర్యపడితిని. అట్లును ఈ లోకాన ఏ సన్న్యాసికిని నేను స్వామిని కాను. వారికి ఏది అనుకూలించునో దానిని వారు చేయుదురు. అందులో నేను వారి కేమేని ఇంచుక సాయము చేయగలుగుదునేని, అంతియే నాకు వారితో సంబంధము. నేను ఇనుపసంకెలయగు కుటుంబబంధమును వదలించుకొంటిని.• మత వర్గముదగు బంగారు సంకెలను తగిలించుకొనను. నేను ముక్తుడను; ఎప్పటికిని ముక్తుడనుగానే ఉండవలయును. ప్రతియొకడును, గాలి వలె విచ్చలవిడిగా, ఉండవలయునని నా కోరిక. న్యూయార్కుకు వేదాంతము వలయునేని, అట్లే బోస్టనుకుగాని, అమెరికాలో మఱి యే చోటికిగాని వేదాంతము వలయునేని, ఆ నగరము వారిని రావించి స్వాగతమిడి, ఉంచుకొని వారికి కావలసినవి సరఫరా చేయవలయును. నాకా, నేను విరామము చెందినట్లే; లోకమున నావంతు పని నేను చేసి ఐనది.

వి.

## 299

(డాక్టరు నంజుండరావుకు)

స్విట్జర్లండు,
ఆగస్టు 26, 1896.

ప్రియ నంజుండరావూ,

నీజాబు నాకు ఇప్పుడే చేరినది. నేను సంచారముచేయు చున్నాను. ఆల్ప్సులో ఎక్కువగా కొండ లెక్కుటయు మంచుబండలు దాటుటయు జరుగుచున్నది. ఇపుడు జర్మనీకి పోవుచున్నాను. ప్రొఫెసరు డ్యూసెనునొద్దనుండి తన్ను కీలులో కలసికొమ్మని నాకు

ఆహ్వానము వచ్చియున్నది. అక్కడినుండి ఇంగ్లండుకు మరలు దును. సాధ్యమైనంతవఱకు నేను ఈసారి చలికాలమునకు ఇండి యాకు మరల రాగలను.

ప్రబుద్ధ భారతపత్రిక కైన పటము నమూనాలో నేను ఆక్షేపించినది అందలి బొమ్మల డంబము బడాయి మాత్రమే కాదు; చాల బొమ్మలను ప్రయోజన మేమియు లేకుండ గుంపుగా చేర్చు టనుకూడ ఆక్షేపించితిని. బొమ్మల నమూనా ఎక్కువవివరములు లేక సామాన్యముగా ఉద్దేశ్యసంకేతగర్భముగా సంక్షిప్తముగా ఉండవలయును. ప్రబుద్ధభారతముకై నేను లండనులో ఒక బొమ్మ నమూనా చేయ ప్రయత్నించి, దానిని నీకు పంపెదను......

పని దివ్యముగా జరిగిపోవుచున్నది. ఆమాటచెప్పుటకు నాకు ఎంతయో సంతసముగా నున్నది......అయినను నీకు ఒక సలహా చెప్పెదను. నలువురు కలసి చేయు పనులన్నియు ఇండియాలో ఒక అక్రమంపు బరువుక్రింద క్రుంగిపోవుచున్నవి. మనము ఇంకను గట్టి ఉల్లంఘింపరాని వ్యాపారమార్గములు బాగుగా నేర్చుకొనలేదు. వ్యాపారము వ్యాపారమే. దాని పరమార్థమును ఎఱుంగవలయును. అందులో మైత్రిప్రసక్తి ఏమియు ఉండగూడదు. వారు చూతురు వీరు చూతురు అని సామెతగా పరిణమించిన ఈ చూపుడు సిగ్గు ఉండగూడదు. ప్రతియొకడు తనకు ఒప్పగింపబడినదాని విషయమై వివరముగు లెక్క వ్రాసిపెట్టవలయును. ఒకదానికై ఉద్దేశింపబడిన ధనమును, పస్తుచావవలసి వచ్చినను, మఱియొకదానికై వినియో గింపగూడదు. ఇది, వ్యాపారపు ఆర్జవము, సీమ. మఱియొకటి యేమనగా, అమోఘబలము. నీవు ఏమిచేసినను దానిని అప్పటికైన నీ (దేవ) పూజగా నుండనిమ్ము. అట్టి భక్తిశ్రద్ధలు వహింపుము. ఈ పత్రిక ఏతత్కాలమునకు నీకు ఆరాధ్యదేవత యగును గాక. అట్లైన నీవు మనోరథపూర్తి నందగలవు.

ఈ పత్రికలో నీవు నెగ్గుదువేని, అంతట ఆమార్గముననే అరవము, తెలుగు, కన్నడము మొదలగు దేశభాషలలో పత్రికలను

తొడంగుము. మనము సామాన్యజనులకు అందుబాటు కావల యును. మదరాసుజనులు మంచివారు, శక్త్యుత్సాహములు కలవారు, ఇంకను వారినిగూర్చి చెప్పదగిన మంచిమాటలు ఎన్నియో యున్నవి. అయినను ఈ శంకరాచార్యుల దేశము వైరాగ్యోత్సాహ మును కోలుపోయినట్లున్నది.

నాబిడ్డలు ఆ అవకాశములోనికి దూకవలయును, లోకము నెడ విరక్తి చెందవలయును,—అప్పుడు గట్టిపునాది పడును.

ధైర్యముగా ముందునకు పొమ్ము. ప్రస్తుతము బొమ్మ నమూనాలను ఇంకనుఇతరవిషయములను లెక్క సేయకుము. 'గుఱ్ఱము వచ్చిన, దానితో కళ్ళెమువారును వచ్చును' అను సామెత కలదు గదా. ప్రాణమున్నంతవఱకు పనిచేయుము, నీకుతోడు నేను ఉన్నాను. ఇక నేను పోయినతరువాత, నాయాత్మ నీతో కలసి పాటుపడును. ఈప్రాణము వచ్చును, పోవును; ధనము కీర్తి భోగము లును, భంగురములు, కొన్నాళ్ళే ఉండునవి. కాన ఒక లౌకికపు పురువుగా చచ్చుటకన్నను ధర్మానుష్ఠానస్థానమున దానిని అను ష్ఠించుచునే, లోకమునకు సత్యోపదేశము చేయుచు ప్రాణములు వదలుట ఎంతయో శ్లాఘ్యము, ముందుకు సాగిపొమ్ము!

—నిండు ప్రేమాశీస్సులతో,

భవదీయ
వివేకానంద.

## 300

కృపానందునకు (చూ. 292 వ లేఖ)

స్విట్జర్లండు
ఆగస్టు, 1896.

ప్రియ—,

''నీవు పవిత్రుడవుగా నుండుము. అన్నిటికన్న ముఖ్యముగా, త్రికరణశుద్ధి గల్గియుండుము. నిమిషమైనను దేవునియందలి నమ్మక మును వీడకు, నీవు వెలుగును కాంతువు. సత్యమైనదెల్ల నిత్య ముగా నుండును. ఏది కాదో, దానిని ఎవరును కాపాడి నిలుపలేరు.

ప్రతివిషయమునను నడినడిగా విచారణలుసలిపి నిగ్గు తేల్చు ఈకాలమున పుట్టుటచే మనము ఎంతయో అనుకూలము పొందియున్నాము. ఎవరు ఏమి తలంపనీ, చేయనీ, నీవుమాత్రము నీపవిత్రతోన్నతిని సన్నీత్యున్నతిని దేవునిమీది ప్రేమోన్నతిని తగ్గనీకుము. రహస్యపు ఏర్పాటులతోడి జనుల సమాజములయెడ అన్నిటికంటె హెచ్చుగా జాగ్రత్త వహింపుము. దేవునియందు ప్రేమగల వాడెవడును ఏ యింద్రజాలమునకు భయపడ నక్కఱ లేదు. భూమిపైగాని ఊర్ధ్వలోకమునగాని ఉన్న శక్తులన్నింటిలో పవిత్రతయే ఉన్నతతమము దివ్యతమము. సత్యమొక్కటే జయము పొందును. అసత్యము గాదు. సత్యముగుండ మాత్రమే దేవుని చేరుదారి తెలియబడును.'' నీకు ఎవరైనను సాయము వచ్చి నీతో చేతులు కలుపుదురా కలుపరా అనుటను లక్ష్యపెట్టకుము. దేవుని చేతిని తాకుదు నను నిశ్చయము కలిగియుండుము. అది చాలును...

నేను నిన్నటిదినము మాన్టిరోసా అను మంచుబండవద్దకు పోయి, అచటి శాశ్వతముగనుండు మంచుగడ్డలలో మొలచియున్న గట్టిగా నుండు పూవులను కొన్నిటిని సేకరించితిని. అందులో ఒకటి ఇందులో ఈ జాబుతో పంపుచున్నాను. నీవు ఈమైహిక జీవితపు మంచుగడ్డ నడుమ దీనివంటి తత్త్వజ్ఞానఘననిశ్చలతను పొందుదువు అని నాయాశ...

నీకల మిక్కిలియు రమణీయముగానున్నది. మనకు మెలకువలో స్ఫురణకు రాక మనసులోనుండు పొరయే కలలో మన యాత్మకు స్ఫురణకు వచ్చును. మన భావకల్పన ఎంత అసత్యముగానున్నను, అట్టి భావకల్పనల మఱుగుననే సకలమానసిక సత్యములు నిలిచియుండుట. ధైర్యము కలిగియుండుము. మానవకోటి మేలునకు మన చేతనైనంత చేయ ప్రయత్నింతము. అటుపైన దేవుడున్నాడు...

సరి. ఆతురత చెందకు; తొందరపడకు. మెల్లగా, పట్టుదలతో, మౌనముతో చేయు పనియే సర్వమును సాధించును.

దేవుడు పరముడు, నాయనా, మన ప్రయత్నము నెగ్గును. నెగ్గితీఱును. ఆతని నామమునకు జై !...

ఇక్కడ అమెరికాలో ఆశ్రమములు లేవు. ఒక్కటి యుండగూడదా అనుకొందును! ఉండునేని అది నా కెంత ప్రియముగా నుండును; ఈ దేశమునకు అది యెంత మేలు చేయును!...

## 301

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

కీలు,
సెప్టెంబరు 10, 1896.

ప్రియమిత్రమా,

నేను కడపటికి ప్రొఫెసరు డ్యూసెనును చూచితిని...నిన్నటి దినమంతయు వినోదదృశ్యములను జూచుచును వేదాంతమును గూర్చి చర్చలు చేయుచును ఆ ప్రొఫెసరుతో గూడి రమ్యముగా గడపితిని.

ఆయన వీరాద్వైతి అని పేర్కొనదగినవాడు. మఱి దేనికిని ఇంచుకయు అంగీకారము లేదు. 'ఈశ్వరుడు', ఆతని వెఱి బొమ్మ. తనకు సాధ్యమైనచో, అతడు, ఈశ్వరుడు లేకే, ఉండును. నీపత్రిక విషయము ఆయనకు చాల సంతోషకరముగా నున్నది. ఆయన సమీపకాలమున లండనుకు రాగలడట; అపుడు ఈవిషయము లన్నిటిగూర్చి నీతో కలసి మాటలాడ గోరుచున్నాడు .........

## 302

(కుమారి మేరీహేలుకు)

ఎయిర్లీ లాడ్జి,
రిడ్జివే గార్డెన్సు,
విమ్బుల్డన్ — ఇంగ్లండు,
సెప్టెంబరు 17, 1896

ప్రియసోదరీ,

రెండునెలలు స్విట్జర్లండులో కొండ లెక్కుట, నడచుట, మంచుబండలు చూచుట కావించి ఈదినము లండను చేరితిని. అది

నాకు ఒక మేలు కావించినది. దేహమున ఉన్న కొన్ని పౌనుల కొవ్వు కరగి గాలిలో కలసిపోయినది. సరి, అందులోను ఏమియు క్షేమము లేదు. ఏలన ఈజన్మపు ఈ ఘనదేహము అంతములేని పెరుగుటలో మనసును మించవలయునని మోజుపడినది. అది యట్లే పెరుగుచు పోవుచున్న, నేను ఈదేహమున తక్కిన ప్రపంచమువారికైనను గుర్తు తెలియక పోవుదును.

హారియెట్ జాబులో నున్న మంచిసమాచారము చూచి దందువలన గలిగిన నా సంతోషమును మాటలలో వర్ణించి చెప్పుట అసాధ్యము. ఆమెకు ఈదినము జాబు వ్రాసితిని. ఆమె పెండ్లిని చూచుటకు రాలేనందుకు చింతిల్లుచున్నాను. ఐనను నేను నా 'సూక్ష్మదేహమున' నా యభినందనములు ఆశీర్వాదములు పలుకుచు అక్కడ ఉండనే ఉందును. సరి. నా సంతోషము పూర్ణత చెందుటకు నీవద్దనుండియు నీ తక్కిన తోబుట్టువులవద్ద నుండియు అదేవిధమగు సమాచారమును ఎదురుసూచుచున్నాను. ఇదిగో, ప్రియమేరీ, ఇప్పుడు నీకు నాజీవితమున గ్రహించిన ఒక గొప్పనీతిని చెప్పెదను. అది యిది – 'నీ పరమలక్ష్యము ఎంత గొప్పగా నున్న నీవు అంతదుఃఖభాజనమవగుదువు.' ఏలన ఆ లక్ష్యము అనబడునది ఈలోకమునగాని, ఈ జన్మమునగాని పొంద నలవి పడునది కాదు. ఈ లోకమున పూర్ణత కోరువాడు నిజముగా వెఱ్ఱి వాడు. ఏలన అది సిద్ధింప నేరదు.

అనంతమును నీవు సాంతమున ఎట్లు చూడగలవు? కాబట్టి నీకు చెప్పుచున్నాను. 'హారియెట్' వివేకములేనిది అని యనిపించు కొనునంతవట్టుకు భావపరతయు ఉద్రేకమును లేవు. కావున కృతార్థురాలై, సుఖజీవితము గడపుచుండును. ఆమెకు చాలినంత భావము లున్నవి, అందువలన జీవితము మధుర మగును. చాలినంత లోక జ్ఞానమును శాంతమును ఉన్నది కావున లోకమున అందఱికి వచ్చు కష్టసందర్భములను తాను మెత్తపఱచుకొన గలదు. హారియెట్ మెకిన్లికి కూడ ఈ సద్గుణములు ఇంకను ఎక్కువగా నున్నవి.

ఉత్తమోత్తమురాలగు భార్య కాగలది ఆమెయే. ఐనను తగిన భర్త ఎక్కడ దొరకును? లోకాన అందఱు వివేకహీనులు, బయటి యాకారమును దూరిచూచి లోపలి గుణాలను గ్రహింపగలవారు అరుదు. ఇకను నిన్నును ఇసబెల్లాను గూర్చి నిజము చెప్పెదను. కపటమెఱుగని భాష నాది.

మేరీ, నీవు వీర్యధైర్యములు గల అరబ్బీని బోలి, వైభవముగాను దివ్యముగాను ఉండుదానవు. నీవు కాయికముగాను మానసికముగాను దివ్యమైన రాణివిగా రాజిల్లుదువు. నీవు సాహసికుడును చొరవగలవాడును ధీరుడును వీరుడును అగు భర్తకు జోడై రాణింతువు. కాని, ప్రియసోదరీ నీవు, భార్యగా అధమురాలి వగుదువు. సామాన్య నిత్యలోకాన, సులువుగా గడపుచు కావలసిన పనిని చేసికొనుచు పాటువడు నొకపాటి భర్తల ప్రాణమును తీసివేయుదువు. సోదరీ, ఏ నవలలోనికంటెను నిజమగు లోకజీవితమున అతిశయమగు అద్భుతవిషయములు ఉన్నవనుట నిజమైనను, అవి ఎక్కడనో ఏమో, కావున నీకు నా సలహా ఏమనగా నీ పరమ లక్ష్యములను సామాన్యసాధ్యస్థాయికి దించుకొనువఱకు నీవు పెండ్లి చేసికొనగూడదు. చేసికొందువేని, ఉభయులును దుఃఖముపాలగుదురు. అతడు సామాన్యపు మంచిసరసుడగు యువకుడగునేని, కొన్ని నెలలలోనే నీకు అతనిపైగల గౌరవము పోవును. అంతట బ్రదుకు చప్పన ఐపోవును. ఇక సోదరి ఇసబెల్లామాటయా—ఆమె స్వభావమున అంతయు నిన్ను పోలినదే. ఐనను ఇటీవల కొంత వస్తువులను కంటితో చూచి నేర్చుకొను అనుభవపాఠములవలన ఓర్పుశాంతులను ఎఱిగినది. ఒకవేళ మంచి భార్య కాగలదేమో.

లోకమున రెండు తెఱగుల మనుష్యులు ఉన్నారు. ధైర్యముగలిగి నెమ్మదిగా చుట్టునున్న ప్రకృతికి అనుగుణముగా లొంగి, ఊహలకు జొరక, మంచిగా దయగా మధురముగా నుండువారొక తెగ. ప్రాయికముగా అట్టిదే ప్రపంచము. వారే సుఖముచెందుటకై పుట్టినవారు. మఱియొక విధమువా రున్నారు—అతిధైర్యసాహ

సములు గలిగి, గొప్పయూహలకు జొచ్చుచు, తీవ్రమగు చిత్తవృత్తి గలిగి ఒక్కక్షణాన పొంగుచు మఱుక్షణాన క్రుంగుచు నుండువారు. అట్టివారికి సుఖము లేదు. తొలితెగవారు ఎగుడుదిగుడులేని సమవృత్తియగు సౌఖ్యమును చెందుదురు. రెండవతెగవారు సుఖపారవశ్యమునకును దుఃఖమునకును నడుమ పరువెత్తుచుందురు. ఐనను ఈ రెండవతెగనుండియే మనకు ప్రతిభాశాలులు అనువారు ఏర్పడుట. ఇటీవల ఒకసిద్ధాంతము వచ్చినదే 'ప్రతిభ ఒకవిధమగు వెఱ్ఱి' అని, అందు కొంత సత్యము ఉన్నది.

ఈ తెగకు చెందినవారు గొప్పవారుగా ఉండగోరుదురేని, వారు కడవఱకు పోరవలయును. పోరుట కనువుగ అడ్డములను తొలగింపవలయును. వారికి జంజాటము ఉండరాదు. పెండ్లికాని, బిడ్డలుగాని, ఉండకూడదు. తాము సాధింప బూనుకొన్న ఒక్కదానితోనే తప్ప దేనితోను తగని తగులాటము కూడదు. బ్రదుకుట దానికోసమే, చచ్చుటయు దానికోసమే. నేను ఆ తెగకు చెందినవాడను. నేను 'వేదాంతము' అను ఒక్క భావమునే లక్ష్యమున ఉంచుకొన్నాను. దానికి నాకున్న అడ్డముల నన్నింటిని తొలగించుకొన్నాను. నీవును ఇసబెల్లాయు ఈ లోహాన తయారైన బొమ్మలే. అయినను, అది కష్టమైనను, మీకు నన్ను చెప్పనిండు—మీరు వృథాగా మీ జీవితములను పాడుచేసికొనుచున్నారు. ఆ ఏక భావమును దృష్టిలో నుంచుకొని, అడ్డములను తొలగించుకొని, మీ జీవితమును దానికి అర్పణ చేయుడు. అట్లు కాదందురా, తృప్తిపడి సాధారణ కార్యమార్గమును పట్టుడు. లక్ష్యమును క్రిందికి దింపుకొనుడు, పెండ్లి చేసికొనుడు, సుఖజీవితమును సాగింపుడు. భోగమో యోగమో—రెంట నొకటి. ఈ జీవితమున భోగింపుడు, కాదా దానిని మాని యోగినులు కండు. ఎవరికిగాని ఏకకాలమున రెండు నుండవు. ఏమి చేసినను ఇపుడే, లేకున్న మఱెప్పుడును గాదు. త్వరగా ఈ మార్గమునో ఆ మార్గమునో—ఒకదానిని ఏరికొనుడు. 'చాల ప్రత్యేకత గలవానికి ఏదియు రాదు' అని యొక్క సామెత.

చిత్తమిడి నిజముగాను సర్వకాలమునకును అడ్డంకులు తీర్చుకొని దేనినైనను సరే, తత్త్వశాస్త్రమునో, పదార్థ రసాయనాది శాస్త్రమునో, మతమునో, సాహిత్యమునో ఒక్క-దానిని పరిగ్రహింపుము. నీ జీవిత శేషమునకు అదియే నీకు ఆరాధ్యముగా నుండనిమ్ము. సుఖమును పడయుము, కాదా గొప్పతనమును పడయుము. నీతోగాని, ఇసబెల్లాతోగాని నాకు సానుభూతి లేదు. మీరు దీనిని కొనరు, దానిని కొనరు. హారియెట్టు చక్కగా నిర్ణయించుకొన్నట్లు మీరు కూడ నిర్ణయించుకొని సుఖమార్గమును పట్టితిరా, అట్లు సుఖముగా నున్న మిమ్ము చూడవలయు నని నాకు ఇష్టము. కాదా మీరు గొప్పవా రగుటనేని చూడగోరుదును. తినుట, త్రాగుట, ఉడుపులు వేసికొనుట, వ్యర్థ సంఘాచారము అను వీనికోసమే ఒక జీవితమును వినియోగించుట తగదు. ఇది ముఖ్యముగా నీకు చెప్పుచున్నాను. మేరీ, దివ్యమైన నీ తెలివిని శక్తిని వినియోగింపక తుప్పుపట్టి పోవునట్లు చేయుచున్నావు. అందులకు ఇంచుకయు మన్నన లేదు. గొప్పవార మగుదమను గట్టి ఆశ మీకు ఉండవలయును. నేను మిమ్ములను తోబుట్టువు లందునే, నిజముగా అంతకంటెను ఎక్కువగానే మిమ్ము ప్రేమింతు నని నమ్మి, నేను మిమ్ము గూర్చి వ్రాసిన యీ కఠినోక్తులు సద్భావముతో గ్రహింతు రని నా నమ్మకము. నాకు చాల కాలమునుండి ఈ విషయములను మీకు చెప్పవలయునని తలంపు గలదు; అనుభవము కలుగుకొలది దీనిని చెప్పివేయవలయు నని తోచినది. హారియెట్టువద్దనుండి వచ్చిన సంతోషకరమైన సమాచారము ఈ మాటలు మీకు చెప్ప నన్ను బలవంత పెట్టినది. మీరును పెండ్లి చేసికొని సుఖముగా, అనగా ఐహికమున ఎంత సాధ్యమో అంత సుఖముగా ఉన్నారని విందునేని నా సంతోషము మేరలు దాటును. అట్లుకాదేని, మీరు ఘనకార్యములు చేయుచున్నారనియైనను విన వలతును.

జర్మనీలో నేను ప్రొఫెసరు డ్యూసెనును కలసికొంటిని, చాల ఆనందము కలిగినది. ఆయన ఇపు డున్న వారిలోని కెల్ల గొప్ప

జర్మను తత్త్వశాస్త్రజ్ఞుడు అని మీరు నిజముగా వినియుందురు. ఆయనయు నేనును కలసి ఇంగ్లండుకు ప్రయాణము చేసితిమి ; ఈ దినము ఇకను ఈ శేషించిన కాలము ఇంగ్లండులో నేను ఏ మిత్రునితో నుండవలయునో ఆ మిత్రుని చూడ వచ్చితిమి. ఆయనకు సంస్కృతముననే సంభాషించుట చాల ఇష్టము. ఈ పడమట ఆ భాషలో సంభాషింపగల పండితుడు ఆయన ఒక్కడే. ఆయనకు అభ్యాసము కావలయునని, ఆయన నాతో సంస్కృతముననే తప్ప నుఱి యే భాషలోను మాటలాడుట లేదు.

నేను ఇక్కడికి నా మిత్రుల నడిమికి వచ్చితిని. ఇకను ఇక్కడ కొన్ని వారములు పనిచేసి, తరువాత చలికాలమునకు ఇండియాకు మరలి పోవుదును.

ఎప్పుడును మీ ప్రియ సోదరుడు,

వివేకానంద.

## 303

(కుమారి హారియెట్ హేలుకు)

ఏర్లీ లాడ్జి, రిడ్జివే గార్డెన్సు,
విమ్బుల్డన్, ఇంగ్లండు
సెప్టెంబరు 17, 1896.

ప్రియసోదరీ.,

ఇప్పుడె స్విట్జర్లండునుండి మరలి రాగానే, మిక్కిలి మనః ప్రియమైన నీసమాచారము నాకు అందినది. కడపటికి (ఓల్డుమెయిడ్సు హోమ్) వృద్ధకన్యల యింటి సౌఖ్యమునుగూర్చి నీవు నీయభిప్రాయమును మార్చుకొనుట శ్రేయ మని తలంచితివి. అది తెలిసి నేను మిక్కిలి సంతోషించితిని. ఇపుడు నీవు చెప్పునది మిక్కిలియు సరిగా నున్నది. మానవజాతిలో నూటికి తొంబదితొమ్మిది మందికి పెండ్లి పరమ లక్ష్యము. తప్పకుండ ఇది "ఓర్చుకొనుటయు మానుకొనుటయు మనకు తప్పదు; ప్రతివానికిని జీవితమొక 'రాజీ'గానే యుండితీఱును" అనునది నిత్యనీతి సారము. దీనిని నేర్చుకొని దీనికి కట్టు

బడియుండ సిద్ధపడిన తత్క్షణమే అందఱి జీవితములకంటె ఈ వివాహితుల జీవితము అధిక సుఖమయముగ నుండును.

ప్రియా హారియెట్టూ, 'పరిపూర్ణ జీవితము' అనునది పరస్పర విరుద్ధపదముల కూడిక. కావున మన పరమలక్ష్యమును అందుకొనని వెన్నియో ఉండు నని సదా ప్రతీక్షించుచుండవలసినదే. ఈ విషయము ఎఱిగినంతట, సాధ్యమైనంతవఱకు ఉన్నదానికే సంతోషించుట మనకు తప్పని విధి. నిన్నుగూర్చి నేను ఎఱిగిన దానినిబట్టి నీకు ఓర్చుకోగల మానుకోగల ప్రశాంతియుత మగు శక్తి ఎంతయేని కలదు. కావున నీదాంపత్యజీవితము మిక్కిలియు సుఖముగా నుండు నని నిర్భయముగ జోస్యము చెప్పగలను.

నీకును నిన్ను పాణిగ్రహణము చేసినాయనకును అన్ని దీవెనలు సఫలములగుగాక. మంచిదానవును తెలివిగలదానవును కూర్చుదానవును అందగత్తెవును అగు నీబోటి భార్యను పొందుట అది యెట్టి భాగ్యమో దానిని ఆయనకు సదా స్మరింపజేయు చుండునుగాక, ప్రభువు. నేను ఇంతలో ఈ అట్లాంటిక్కును దాటుట అసాధ్య మని వెఱగుపడుదును. మీ పెండ్లిని చూచుటకు అట్లు దాటగలిగి-యుండగూడదా, నేను!

ఈ సందర్భములలో నేను చేయగల శ్లాఘ్యతమమైనది మా గ్రంథములలో ఒక దానినుండి ఇట్లు ఉదాహరించుటే.– నీవు ఈ జీవితమున ఏది యేది కోరదగినదో దానినెల్ల పడయుటకు నీ భర్తకు సాయపడుచు ఆతని అఖండప్రేమను అనుభవింతువు గాక. మఱియు మీరు మీబిడ్డల బిడ్డలను మనుమలను మనుమరాండ్రను–కాంచి, ఈ జీవితనాటకము అంతమును దరియుచుండగా, మీరు, దేని నీళ్ళస్పర్శమాత్రముచేత సకల భేదములు కరగిపోయి మనము అందఱము ఏక మగుదుమో ఆ యపార సచ్చిదానంద మహాసముద్రమును చేరుటకు ఒండొరులకు సాయపడుదురు గాక!''

నీవు జీవితాంతమువఱకును ఉమవలె పతివ్రతవుగను పరిశుద్ధవుగను ఉందువు గాక. నీభర్త, ఉమయందే ప్రాణముంచుకొన్న శివునివలె ఉండునుగాక.

ప్రేమయుత భవదీయ సోదరుడు
వివేకానంద,

## 304

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

కుమారి ముల్లరునింట,
ఏర్లి లాడ్జి, రిడ్జివే గార్డెన్సు
విమ్బుల్డన్-ఇంగ్లండు.
సెప్టెంబరు 22, 1896.

ప్రియ అళసింగా,

రామకృష్ణుని గూర్చి మాక్సుముల్లరు వ్రాసిన వ్యాసము నేను నీకు పంపినది నీకు తప్పక వచ్చియుండును. ఆయన అందు నన్ను ప్రస్తావింపనందులకు నీకు చింత వలదు. ఏలన ఆయన నన్ను ఎఱుంగుటకు ఆఱు నెలలుముందు అది వ్రాయబడినది. ఆయనవ్రాత ముఖ్యాంశమున సరిగా ఉన్న, ఆయన యెవరిని ప్రస్తావించినా డనుట ఎవరికి అక్కఱ. నేను జెర్మనిలో ప్రొఫెసరు డ్యూసెనుతో కొంతకాలము చాల ఆనందముగా గడపితిని. తరువాత ఆయన నేను కలసి లండనుకు వచ్చినాము. మేము అప్పటికే చాల మిత్రులమై పోయితిమి.

నేను త్వరలోనే నీకు ఆయనమీద ఒకవ్యాసము వ్రాసి పంపెదను. నా వ్యాసములకు ముందర ఆ ప్రాతవడ్డ (డియర్‌సర్) ప్రియమహాశయా అనుదానిని ఉంపకుము, నీకు పున్నె ముండును. నీవు ఇప్పటికి రాజయోగగ్రంథమును చూచితివా ? రాగలసంవత్సరమునకు తగినట్టు అట్టమీదికి వ్రాతసమూనా నీకు పంపజూచదను. రష్యాజార్ డెయిలీ న్యూస్‌లో ఒక దేశసంచారగ్రంథముమీద వ్రాసిన వ్యాసమును నీకు పంపెదను. అందు అతడు ఇండియాను ఆధ్యాత్మికపరదేశమనియు వివేకనిలయమనియు నిర్దేశించియున్న

భాగమును ఉన్నది యున్నట్లు నీపత్రికలో ఉదాహరింపవలయును. అంతట ఆ వ్యాసమును ఇండియన్మిర్రరుకు పంపుము.

జ్ఞానయోగోపన్యాసములను, వానిలో సులువైనవానిని నీవు నిరాటంకముగా ప్రకటింపవచ్చును. అట్లే డాక్టరు సయితము వానిని 'ప్రబుద్ధభారతము'న ప్రకటింప వచ్చును. వానిని మొదటినుండి కడవరకు చాల జాగ్రత్తగా చదివి, పునరుక్తులను అన్యోన్యవచన విరోధములను తొలగింపవలయును. ఇపుడు నాకు వ్రాయుటకు మును పటికంటె ఎక్కువ కాల ముండును. శక్త్యుత్సాహములతో పని చేయుము.

అందఱికి నా ప్రేమ — మీ

వివేకానంద.

మఱిమాట: ఉదాహరింపవలయు వ్యాసభాగమును నేను గుర్తుపెట్టియున్నాను. అందు తక్కినభాగము పత్రికకు పనికిరానిది.

పత్రికకు కంటికి దిసించు లావు కలిగింపగలమన్న నమ్మకము ఏర్పడకున్న, ఇప్పుడే దానిని మాసపత్రిక చేయుట బాగుగా ఉండు నని నాకు తోపదు. ఇపుడు అది యున్నతీఱున దాని లావును దాని విషయములును అన్నియు చాల జబ్బు. ఇంకను ఎవరును వ్రాయ బూనుకొనని విషయములు పెల్లుగా ఉన్నవి. తులసిదాసు, కబీరు, నానకు, దక్షిణయిండియా భక్తులు మొదలగువారి జీవితచరిత్రలు రచనలు మొదలయినవానిని గూర్చి వ్రాయవలసియున్నది. అవి యన్నియు సమగ్రమగు పండితశైలిలో వ్రాయవలయును. అటు గాఱయు దోషబహుళము నగు వ్రాత పనికి రాదు. వేదాంతము నుపదేశించుటయే కాక మతవిషయమున ఇండియాదేశపు ప్రాచీన విషయపరిశోధనమును పాండిత్యమును దెల్పుట నిజముగా ఈ పత్రికకు పరమలక్ష్యము. శ్రేష్ఠులగు పండితులను ఆశ్రయించి వారిచే చక్కగా వ్రాయబడిన వ్యాసములను సంపాదింపవలయును. మంచి యుత్సాహముతో శక్తికొలది పనిని సాగింపుము.

భవదీయ ప్రేమయుత

వివేకానంద.

## 305

(కుమారి జోసఫైన్ మెక్లీడుకు)

కుమారి ముల్లరింట,
ఏర్లీ లాడ్జి, రిడ్జివే గార్డెన్సు
విమ్బుల్డన్—ఇంగ్లండు
అక్టోబరు 7, 1896

ప్రియ జోజో, మరల లండనుకు చేరితిని. తరగతులు అప్పుడే ఆరంభమైనవి. ఇంచుకయేని నిరుత్సాహమును సూచింపనిదియు ఒకప్పుడును మార్పు పొందనిదియు మఱి యెల్లప్పుడు ఉత్సాహపూర్ణమై సాయపడునట్లును, బలమొసంగునట్లును ఉండు నొక పరిచితమగు మొగమును గాంతమని, సహజావబోధము చేతనే నలువంకల జూచితిని. ఆ మొగము కొన్నివేలమైళ్ల దూరమున ఉన్నను, దానిని నా మనసు సంకల్పబలమున, నా యెదుట నెలకొల్పినది. ఆత్మరాజ్యమున దూర మేమున్నది? సరే, నీవు నీ ప్రశాంతవిశ్రాంతిస్థానమునకు పోయితివి. నాకేమో పిచ్చిపని నిత్యవర్ధమానముగ నున్నది. ఐనను నాయం దెల్లపుడు నీ యాశీర్వాదములు కలవు. లేవా? ఒక గుహలో చొచ్చి ప్రశాంతముగా నుండవలయునని నా మనసు ఎప్పుడును స్వాభావికముగా కోరును. మఱి వెనుకనుండి విధి నన్ను ముందుకు త్రోయును. అంతట నేను పోవుదును. విధిని నిరోధించినవారేరి?

క్రైస్తు కావించిన కొండమీది యుపదేశోపన్యాసమున ఇట్లేల చెప్పలేదో—"ఎప్పుడు సంతోషయుతులుగాను పరోపకారపరులుగాను ఉండువారు ధన్యులు; ఏలన వారికి స్వర్గరాజ్యము ఇప్పటికే చేకూరియున్నది" అని. సకల లోకపు దుఃఖములతో హృదయము నిండియున్నట్టి యాయన, పావన భక్తుని యాత్మను ఒక శిశువుతో పోల్చినట్టి యాయన, అట్లు చెప్పియే యుండవలయును, నిజము. కాని దానిని జ్ఞప్తితో వ్రాసిపెట్టలేదు. వేయి విషయము

లలో వారు ఒక్కదానినే వ్రాసిపెట్టిరి. అనగా నా యర్థము జ్ఞప్తి యుంచుకొనిరి అని.

పెండ్లియైన కూతునొద్దకు మన మిత్రులలో చాలమంది వచ్చినారు, గాల్సువర్దీలలోను ఒకరు వచ్చినారు. శ్రీమతి గాల్సువర్ది సతి ఈ దినము రాజాలక పోయినది; ఆమెకు చాలినంత ముందుగా తెలియక పోయినది. మాకు ఇపుడొక హాలున్నది. అది చాల పెద్దదే; 200 మందో, ఇంకను ఎక్కువమందో అందు పట్టుదురు. అందొక విశాలమైన మూల యున్నది. దానిని పుస్తకభాండాగారముగా అమర్తురు. ఇపుడు నాకు సాయము చేయుటకు ఇండియానుండి మఱొకాయన వచ్చియున్నాడు.

నేను స్విట్జర్లండులో మిక్కిలి ఆనంద మనుభవించితిని. అట్లే జెర్మనియందును. ప్రొఫెసరు డ్యూసెన్ చాల దయగలిగి ఉండినాడు. మే మిరువురము కలసి లండనుకు వచ్చితిమి. ఇక్కడ మాకు చాల తమాషాగా ఉండినది. ప్రొఫెసరు మాక్సుముల్లరు కూడ మిక్కిలి స్నేహముగా ఉన్నారు. అన్నిటిలోను ఇంగ్లండులో కావించినపని గట్టిపడుచున్నది; గొప్ప విద్వాంసులుకూడ ఆసక్తియాదరములు ప్రదర్శించుచున్నందున ఇది చాల గౌరవార్హముగాను ఉన్నది. నేను ఈ చలికాలమునకు కొందఱుమిత్రులనుగూడి ఇండియాకు వత్తునేమో! ఇంతవఱకు (నాకు) ఇంపుగూర్చు నన్ను గూర్చి.

ఇకను, ఆ పావనకుటుంబము సంగతి ఏమి ? అన్నియు సర్వ క్షేమముగా జరిగిపోవుచున్నవని నా గట్టినమ్మిక. ఇప్పటికి ఫాక్సును గూర్చి నీవు విని యెఱింగియుండవలయును. అతడు బయలుదేఱుటకు పూర్వదినము 'నీవు ఎక్కువధనము సంపాదింప నారంభించునంత వఱకు మేబెల్‌ను పెండ్లిచేసికొనుటకు లేదు' అని నేనుచెప్పినమాట అతనికి మనఃఖేదము కలిగించెనేమో అని భయపడుచున్నాను. మేబెల్ ఇపుడు నీతోకూడ ఉన్నదా? ఆమెకు నాప్రేమను అందింపుము. నాకు నీ యిప్పటి చిరునామాను తెలుపుము.

అమ్మ యెట్లున్నది? ప్రాంకిన్సెన్స్ ఎప్పటికిని పదియారు వన్నె బంగారే అని నానిశ్చయము. ఆల్బర్టా తన సంగీతమును సాహిత్యమును సాధన చేయుచు అమితముగా నవ్వుచు లెక్క కెక్కు వగా ఆపిలుపండ్లు తినుచు మామూలుగా నున్నదా? మఱియొక సంగతి. నాకు ఇపుడు పండ్లును నవ్వులునే విశేషముగా ఆహారము. అవి నాయొంటికి చాల అనుకూలముగా ఉన్నవి. పైన ఎక్కడనో 'భూమి' గల ఆ ముసలిడాక్టరు, ఎప్పుడైన నిన్ను చూడను వచ్చె నేని, ఈ రహస్యమును నీవు ఆయనకు చెప్పవచ్చును. నా క్రొవ్వు చాలమట్టుకు కరగిపోయినది. అయినను నేను ఉపన్యాసము చేయు దినాలలో మంచి ఘనమైన భోజనము చేయవలసియుండును. హాల్లిసు ఎట్లున్నాడు? అంతకన్న మధుర ప్రకృతిగల శాలుని నేను ఎప్పుడును చూడలేదు. అతనిని ఆజన్మము అన్ని దీవెనలు అనువర్తించును గాక.

నీమిత్రము కోల, జొరోస్టరు తత్త్వశాస్త్రమును గూర్చి ఉపన్యసించుచున్నాడని వినుచున్నాను. నిజముగా అతనికి గ్రహములు అనుకూలముగా లేవు. మీ ఆంద్రియాస్ అమ్మాయిని గూర్చి ఏమి సమాచారము? మన యోగానందుని గూర్చియు ఏమి? మూడు జడ్ల (ZZZ) భ్రాతృమండలిని గూర్చి ఏమి? అల్ల ఆయన (పేరు మఱచితిని) భార్యనుగూర్చియు ఏమి? యు. ఎస్. కు ఒక ఓడనిండ హిందువులు బౌద్ధులు మహమ్మదీయులు భ్రాతృవర్గములు ఇంకను ఎవరెవరో వచ్చి అందు ప్రవేశించినారనియు, మఱియొక యోడనిండ మహాత్మాన్వేషులు క్రైస్తమతప్రచారకులు మొదలయినవారు వచ్చి దిగి ఇండియా చొచ్చినారనియు నాచెవికి వినవచ్చుచున్నది. బళి బేష్! ఇండియాయు యు-ఎస్సును ఈ రెండునే మతోత్సాహోద్యమములకు పూనుకొనునవి అని తోచుచున్నది. జో, కొంచెము కనుపెట్టియుండుము. ఈవిమతస్థుల దుర్నీతి భయోత్పాదకము. నేను ఈ దినము వీధిలో శ్రీమతి స్టర్జింగును కలసికొంటిని. ఆమె ఇకమీఁదట నా ఉపన్యాసములు విను

టకు రాదు. అది ఆమెకు మేలు. తత్త్వశాస్త్రము, మితిమీరినచో, మంచిదికాదు. ప్రతి యుపన్యాసమునకును ఒకమాటనైనను విన నవ కాశములేకుండునంత ఆలస్యముగా వచ్చి, వెడలబోవుచున్న నా చొక్కా-గుండీ రంధ్రమున వ్రేలువెట్టినట్లు నన్ను బలాత్కారముగా నిలువబెట్టి నా కడుపులో వాటర్లూ యుద్ధము జరుగుచున్నట్లు కాలు చుండగా మాటలాడుచుండెనే ఆమె నీకు జ్ఞప్తియం దున్నదా? ఆమె వచ్చినది. వా రందఱు వచ్చుచున్నారు. ఇంకను చాలమంది కూడ. అది ఉత్సాహజనకముగనే యున్నది.

రాత్రి యిపుడు చాల ఆలస్యమైనది. కావున, జో, సెలవు. (న్యూయార్కులో సయితము ఆచార మర్యాదలు తప్పక అనుష్ఠింపవలయునా?) దేవుడు నిన్ను ఎప్పటికిని అనుగ్రహించును గాక.

''సర్వమెఱిగిన ధాత స్త్రీ రత్నముల నన్నిటిని సౌష్ఠవమున మించినదై పోచ్చెము లేకుండు ఆకృతిని సృజింపగోరి తన గొప్ప సంకల్పశక్తిచే అందమైనవాని యందమునెల్ల ఒక్కెడ గూర్చి, అంతట చిత్తరువున దిద్దిదిద్ది తీర్చునట్లుగా, ఒక పరిపూర్ణమును ఉత్తమ లక్ష్యమునగు ఆకారమును సృజించెను. అట్టి దివ్యాద్భుత మైన నమూనానుండి, ఆమె యందమైన రూపము తీర్పబడినది.'' కాళిదాస శాకుంతలము మోనియరు విల్లియమ్సు, ఆంగ్లాను వాదమునుండి.

అది సుమా నీవు, జో జో. నేను, ఇక రవంత చేర్చెదను— ధాత ఆ రూపమునకు సకల పరిశుభ్రతను అభిజాత్యమును ఇంకను ఇతర గుణములను గూర్చెను. అంతట జో సృష్టింపబడెను అని.

సదా ప్రేమాశీర్యుత భవదీయ
వివేకానంద.

మాలిమాట:— దీనిని నేను సీవియరు దంపతుల మిద్దెయం తస్తునుండి వ్రాయుచున్నాను. ఆ దంపతులు తమ దయాదరములు నీకు అందించుచున్నారు.

## 306

(కుమారి ఎస్. ఇ. వాల్డోకు)

ఏర్లీలాడ్జి, రిడ్జివే గార్డెన్సు.
విమ్బుల్డన్,
అక్టోబరు 8, 1896.

ప్రియ (కుమారి వాల్డో)

.........నేను స్విట్జర్లండులో మంచి విశ్రాంతి పొందితిని. ప్రొఫెసరు పాల్ డ్యూసెన్ను అను గొప్ప మిత్రుని సంపాదించుకొంటిని. నేను యూరోపులో కావించిన పని, నిజము ఆరసి చూడగా మరియెక్కడి పనికన్నను ఎక్కువ తృప్తికరముగా నున్నది. ఇండియామీద దానిప్రభావము తప్పక ఎంతో యుండును. లండనులో తరగతులు మరల ఆరంభింపబడినవి. ఈ దినము ప్రారంభోపన్యాసము. రెండునందలమందియో, ఇంకను ఎక్కువయో పట్టగల హాలు—కూటము ఒకటి నా కున్నది యిప్పుడు...

నీ వెఱుగుదువుకదా! ఇంగ్లీషువారి మనఃస్థైర్యమును. అన్ని దేశాల జనులలోను వారికి పరస్పరేర్ష్య తక్కువ. అదియే లోకమున వారికి గల్గిన ప్రాధాన్యమునకు కారణము. బానిసలవలె సేవింపకయే విధేయత కలిగియుండు రహస్యమును వారు కనిపట్టినారు. అత్యంత నియమబద్ధతతో కూడియే అత్యంత స్వేచ్ఛ కలిగియుండు రహస్యమును కూడ వారు కనిపట్టినారు.

ఆ ఆర్—అను యువకుని గూర్చి నాకు ఏమియు తెలియదు. నీవు నా నిశ్చితమగు సిద్ధాంతమును ఎఱుగుదువు. కామినీకాంచనముల జయింపనివాని సేవనిని నేను నమ్మను. శాస్త్రసిద్ధాంత విషయములవఱకు మీరు ఆతనిని ఉంచుకొని చూడవచ్చును. అయినను రాజయోగప్రవచనమునుండి మాత్రము ఆతనిని ఎడముగా ఉంపుము. చక్కగా ఆడ నభ్యసించినవారికే తప్ప ఇతరులకు అది చాల అపాయకరమగు ఆట. శారదానందుని విషయముననో, ఈ కాలాన ఇండియాలోనుండు యోగులలోనెల్ల ఎవడు శ్రేష్ఠుడో

ఆతని దీవెనలు ఆతనిపై ఉన్నవి. కాబట్టి అపాయ మేమియు లేదు. నీ వేల బోధింప నారంభింపవు?.........ఈ బాలుడు ఆర్—కన్నను నీకు వేయింతలు తత్త్వజ్ఞానము కలదు. తరగతికి ప్రకటనలు పంపి, సంభాషణలును ఉపన్యాసములను వరుసక్రమమున జరుపుము.

ఎందరేని హిందువులు—నా సోదరులలో నొక్కడైనను సరే అమెరికాలో విజయ మొందుటకంటెను, మీలో ఒకరు ఆరంభింతురేని అందుకు నేను వేయి మడుంగులు సంతోషింతును. మనుష్యుడు ఎల్లెడలను జయము గోరును. తన బిడ్డవలన పరాజయము గోరును.

ఒక్క వెలుగు వెలుగుము! ఒక్క వెలుగు వెలుగుము!

ప్రేమాశీస్సులతో,
వివేకానంద.

## 307

(శ్రీమతి బుల్లతికి)

విమ్బల్డన్
అక్టోబరు 8, 1896.

ప్రియ శ్రీమతి బుల్లతి—

......నేను జెర్మనీలో ప్రొఫెసరు డ్యూసెన్నును కలసికొంటిని. కీలులో నేను ఆయనకు అతిథిగా నుంటిని. ఇరువురము కలసి లండనుకు ప్రయాణము చేసితిమి. ఇక్కడ చాల ఆనందము గూర్చు సమావేశములు మాకు జరిగినవి......మత సాంఘిక కార్యశాఖలందన్నిటను నాకు పరిపూర్ణ సానుభూతి ఉండినను, పనిని ఫలానా శాఖదని నిర్దేశించుట ఎంతయో అనివార్యము. మన ప్రత్యేకశాఖ వేదాంతప్రచారము. వేఱు పనియందు సాయముసేయుట ఆ ఏక లక్ష్యమునకంటె అప్రధానముగా ఉండవలయును. ఈ విషయమును నీవు శారదానందుని మనస్సునకు లెస్సగా బోధింతు వని నా ఆస.

రామకృష్ణుని గూర్చిన మాక్సుముల్లరు వ్యాసమును చదివితివా?......ఇక్కడ ఇంగ్లండులో అన్ని విషయములు చాల

అనుకూలముగా ఉన్నవి. పని జనులకు ఇష్టముగా నుండుటే గాదు, మిక్కిలి వారి మెప్పును పొందుచున్నది.

భవదీయ ప్రేమయుత,
వివేకానంద.

## 308

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

14, గ్రేకోట్ గార్డెన్సు
వెస్టుమిన్స్టర్, లండను
అక్టోబరు, 1896.

ప్రియ అళసింగా,

నేను స్విట్జర్లండునుండి మరలి వచ్చి దాదాపు మూడు వారము లైనవి. ఐనను తరువాతి సంగతులను ఇంతకన్న ముందు నీకు వ్రాయజాలక పోయితిని. నేను నీకు కడపటి తపాలులో కీలు పాల్ డ్యూసెన్నును గూర్చిన యొక వ్యాసమును పంపితిని. పత్రికను గూర్చిన స్టర్డి పద్ధతి ఇంకను సందేహములో ఉన్నది. నీకు అగపడు చున్నది గదా, నేను ఆ సెంటుజార్జి రోడ్డులోని నా స్థానమును విడిచి పెట్టితిని. మనకు విక్టోరియావీధి 39 లో ఉపన్యాస కూటము ఒకటి యున్నది. 'ఇ. టి. స్టర్డీగారింట' అను విలాసము ఇక సంవత్సరము ముగియువఱకు నా జాబులను నాకు చేర్పగలదు. గ్రేకోట్ గార్డెన్సు లోని గదులు నాకును ఆ మఱియొక స్వామికిని మూడు నెలలకు మాత్రమే తీసికొన్న బస. లండనులో పని క్రమముగా వృద్ధి యగుచున్నది. తరగతులు రానురాను పెద్దవగుచున్నవి. ఈ లెక్కన ఇది వృద్ధి యగుచుండు ననుటకు ఏ సందియమును లేదు. ఇంగ్లీషుజనులు స్థైర్యమును శ్రద్ధయు గలవారు. నేను విడిచి రాగానే ఈ కట్టడము చాలమట్టుకు కూలిపోవునదే. ఏదియో ఒకటి జరుగును. దానిని గ్రహించి సాగించుటకు ఎవడో సమర్థుడు ఉద్భ వింపగలడు. ఏది మంచిదో ప్రభువు ఎఱుంగును. అమెరికాలో వేదాంతమును గూర్చి యోగమును గూర్చి యుపన్యసించుటకు ఇరు వదిమందికి అవకాశ మున్నది. ఎక్కడినుండి తేగలము ఈ యుప

న్యాసకులను ? వారిని తెచ్చుటకు ధనము ఎక్కడ ఉన్నది ? సమర్థులును నమ్మకమైనవారును ఉన్నచో ఈ సంయుక్త రాష్ట్రములలో సగభాగమును పది యేండ్లలో జయింప శక్యమగును. వారు ఏరీ? అక్కడ మన మందఱము వట్టి పరమ మూఢులము. స్వార్థపరులము, పిఱికిపందలము, దేశభక్తి దేశభక్తి యను వెఱ్ఱివాగుడు మాత్రము గలవారము, మూఢాచారపరులము, ఆధ్యాత్మికపరులమని బడాయిగలవారము. మదరాసువారికి చొరవయు స్థైర్యము కలవు గాని, ప్రతివాడును తెలివిమాలి పెండ్లి చేసికొన్నవాడే, పెండ్లి! పెండ్లో పెండ్లి! ......ఇక మన బాలురకు ఈ కాలమున పెండ్లి చేయు ఆ విధము! నిస్సంగుడగు గృహస్థుడుగా నుండ నాసగొనుట చాల శ్లాఘ్యమే. ఐనను మనకు ఇపుడు మదరాసులో కావలసినది అది కాదు ; పెండ్లి మానుకొనుటయే.

నాయనా, నేను కోరునది యేమనగా. ఇనుపకండలు, ఉక్కునరములు, వానిలోపల ఉండుటకు ఏ పదార్థముతో పిడుగు చేయబడినదో ఆ పదార్థముతోనే చేయబడిన మనస్సు బలము మగతనము బ్రహ్మతేజస్సహిత క్షాత్రవీర్యము. ఆసలూరించు మన మంచి బాలురకు ప్రతిదియు ఉన్నది. మఱి వారు లక్షల కోట్ల సంఖ్యగా, పెండ్లియను, క్రూరపు యజ్ఞవేదికపై బలియీబడకుండవలెను. దేవా, నా యేడ్పులను వినవయ్యా. అట్లు విందువేని మదరాసు మేల్కాంచును. దాని హృద్రక్త మన జెల్లు వారిలో ఒక వందమందియైనను చక్కగా చదువు అభ్యసించిన చిన్నవారు సంసారమునుండి దవ్వగ నిలిచి నడుముకట్టుకొని దేశమునుండి దేశమునకు ఎత్తిపోవుచు సత్యమునకై పోరాడుటకు సంసిద్ధులుగా నుందురు. ఇండియాకు బయటకొట్టిన ఒక దెబ్బ ఇండియాలోపల కొట్టిన లక్ష దెబ్బలకు సమానము. సరి, భగవదిచ్ఛయైన అన్నియు రాగలవు.

నేను ఇత్తునని మాటయిచ్చిన పైకమును ఇయ్యజూపినది కుమారి ముల్లరు. నీవు క్రొత్తగ ప్రతిపాదించినదానిని గూర్చి నేను

ఆమెతో చెప్పితిని. ఆమె దానినిగూర్చి ఆలోచించుచున్నది. ఈ మధ్య కాలమున ఆమెకు కొంతపనిపెట్టుట మేలనుకొందును. బ్రహ్మవాదినునకును ప్రబుద్ధ భారతమునకును ఏజెంటుగా ఉండుటకు ఆమె అంగీకరించినది. నీవు దానినిగూర్చి ఆమెకు వ్రాసెదవా? ఆమె విలాసము ఏర్లెలాడ్జి, రిడ్జివే గార్డెన్సు, విమ్బుల్డన్, ఇంగ్లండు. నేను కడచిన కొన్ని వారములు ఆమెతోకూడ అక్కడ నుంటిని. కాని నేను లండనులో లేకున్న అచటిపని సరిగా జరుగదు. అందుచేత నా బసను మార్చితిని. అది ముల్లరమ్మాయికి ఇంచుక చిరాకు కలిగించినది. అందుకు నేను చింతిల్లుచున్నాను. ఆమె పూర్తిపేరు కుమారి హెన్రిమెట్టాముల్లరు. మాక్సుముల్లరు నాతో చాల స్నేహపడుచున్నాడు. నేను త్వరలోనే ఆక్సుఫర్డులో రెండు ఉపన్యాసము లొనర్పబోవుచున్నాను.

నేను వేదాంత తత్త్వశాస్త్రమువీద పెద్దగ్రంథ మొకటి వ్రాయుచున్నాను. వేదాంతమున(ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములు) మూడుమతములకును సంబంధించిన ప్రమాణవాక్యములను పనిపూని అన్ని వేదములనుండియు ప్రోగుసేయుచున్నాను. ఆ పని చేయగలవాని నొకని ఏర్పాటుచేసి నీవు నాకు సాయము చేయవచ్చును. మొదట అద్వైతమును గూర్చియు, తరువాత విశిష్టాద్వైతమును గూర్చియు, అటుపైని ద్వైతమునుగూర్చియు సంహితలనుండియు బ్రాహ్మణములనుండియు ఉపనిషత్తులనుండియు పురాణములనుండియు వాక్యములను గ్రహింపవలయును. వాని నన్నిటిని ఆయా శీర్షికలక్రింద వేఱుపఱచి, ఒక్కొక్కదానికి గ్రంథనామము అధ్యాయము మొదలైన వివరములతో బాగుగా తెలియగలయట్లు స్పష్టాక్షరముగా వ్రాసిపెట్టవలయును. తత్త్వశాస్త్రమును కొంతయైనను ఒకగ్రంథరూపమున నిర్మించిపెట్టక, ఈ పడమటి దేశమును వదలివచ్చితినేని అది ఎంతయో శోచనీయమగును.

తమిళాక్షరములలో మైసూరులో ప్రకటించినది ఉపనిషత్తులు నూటయెనిమిదియు గల ఒకపుస్తకము ఉండెను. నేను దానిని

ప్రొఫెసరు డ్యూసెన్ పుస్తకభాండాగారమున చూచితిని. అట్టిదే దేవనాగరిలో మరల అచ్చువేయబడినది ఉన్నదా ? ఉన్నయెడల నా కొక ప్రతి పంపుము. అట్లు లేకున్న, ఆ తమిళాక్షరములదే ఒకటి పంపుము. దానితోకూడ ఒక పెద్దకాగితమున తమిళాక్షరములను సంయుక్తాక్షరములను, వానికి ప్రక్కనే వానికి సమానములైన దేవనాగరి యక్షరములను వ్రాసిపంపుము. అట్లైన నేను తమిళాక్షరములను నేర్చుకొందును.

శ్రీ సత్యనాథను, మొన్న నాకు లండనులో అగపడి మదరాసు ప్రధాన-ఆంగ్లోయిండియను దినపత్రికయగు మద్రాసుమెయిలులో నా రాజయోగగ్రంథము మీద అనుకూలమగు సమీక్షయొకటి ప్రచురింపబడి యుండెనని చెప్పెను. అమెరికా దేహధర్మశాస్త్రజ్ఞులలో మొనగాడొకడు కొన్ని నాయూహలకు అభిప్రాయములకు మోహితుడైనాడని వినుచున్నాను. అట్లే ఇంగ్లండులో కొందఱు నా యభిప్రాయములను హేళనము చేసినారట. మంచిది కానీ; నా యూహలు అతి ధీరముగా చేయబడినవి. అందు చాల భాగము ఎప్పటికిని అర్థములేనిదిగానే ఉండును. అయినను, అందు కొన్నిసూచనలు ఉన్నవి. వానిని ఆ శరీరధర్మశాస్త్రజ్ఞులు ముందే గ్రహించియుండవచ్చును. అయినను, వాని పర్యవసానముతో నేను మిక్కిలి తృప్తిపడితిని, 'నన్నుగూర్చి, సెబ్బరగా మాటాడుట ఇష్టమేని సెబ్బరగానే మాటాడుదురుగాక. వారిని మాటలాడని త్తము'' అనుట నా యనుష్ఠాన పరమనీతి.

ఇంగ్లండులోని వారు పెద్దమనుష్యులు; వారు, అమెరికాలో నేను వినగంటినే కుళ్ళుకూతలు, అట్టిదానిని పలుకరు. మఱియు అక్కడ నీవు చూచు మిషనరీలు ఉన్నారే, వారందఱు చాలవఱకు ఇంగ్లీషు చర్చినుండి బెడిసిపోయినవారు (డిసెంటర్లు). వారు ఇంగ్లండు లోని పెద్దమనుష్యుల తెగకు చేరినవారు కారు. ఇక్కడ మతపరులుగా నున్న పెద్దమనుష్యులందఱు ఇంగ్లీషుచర్చికి సంబంధించినవారు. డిసెంటర్లకు ఇంగ్లండులో నోరులేదు, చదువులేదు. నీవు అప్పు

డప్పుడు నాకు ఎవరినిగూర్చి జాగ్రత్తవహింపుమని ఎచ్చరించుచుం టివో వారిమాటే ఇక్కడ వినబడదు. వారు ఇక్కడ ఎవరికిని తెలి యరు; అర్థములేని కూతలుకూయలేరు. రామ్ కే.నాయుడు ఇప్పటికే మదరాసు చేరియుండుననియు నీవు మంచి ఆరోగ్యముగలిగి ఉన్నా ననియు తలంతును.

నాధీరబాలురారా, పట్టుదల వీడక పనిచేయుచుండుడు. మనము ఇప్పుడే ఆరంభించినాము. ఎప్పుడుకాని నిరాశ చెందకుడు! ఎప్పుడుకాని చాలు అనకుడు! ...ఎవడైన ఒకడు పాశ్చాత్య ఖండమునకు వచ్చి ఇక్కడ పలుదేశప్రజనులను చూచునేని వెంటనే వానికి కనువిప్పుకల్గును. నేను కార్యసమర్థులను సంపాదించు విధమిది:—ఊరక మాటలాడను, మఱి యథాస్థితముగా మనకు ఇండి యాలో ఏమియున్నదో ఏమి లేదో దానిని చూపుదును. కనీసము పదిలక్షల హిందువులైనను ప్రపంచమంతట సంచరించి రావలయు నని నా కోరిక.

సదా ప్రేమయుత భవదీయ

వివేకానంద.

## 309

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

శ్రీ ఇ. టి. స్టర్డిగారింట,
39 విక్టోరియా వీధి, లండను
అక్టోబరు 28, 1896.

ప్రియ అళసింగా,

...నేను ఏ నెల ఇండియా చేరగలనో ఇంకను నాకు నిశ్చయము లేకున్నది. దానినిగూర్చి తరువాత వ్రాసెదను. ఆ క్రొత్త స్వామి నిన్నటిదినము ఒక మిత్రసమాజసమావేశమున తన తొలి ఉప న్యాసమును కావించెను. అది బాగుగా నుండినది. నాకు ఇష్టముగా ఉండినది. అతనిలో ఒక మంచి యుపన్యాసకుని నిర్మాణ మున్నది. నాకు గట్టిగా తెలియును.

...నీవు ఇంకను ఆ...ను. ప్రకటింప లేదు. అదియునుగాక, పుస్తకములు ఇండియాలో వెలపోవలెనన్న చౌకగా నుండవలయును. జనులకు తృప్తికరముగా నుండవలయు నన్న అక్షరములు పెద్దవిగా నుండవలెను. నీ కిష్టమగునేని దానికి నయమైన ముద్రణమును బాగుగా ప్రకటింపవచ్చును. నేను బుద్ధిపూర్వకముగనే దాని స్వామ్యమును, నాచేత పెట్టుకొనలేదు. ఆ——పుస్తకమును ఇంకను ముందుగా ప్రకటింపనందున నీవు మంచి యవకాశమును కోలు పోయితివి. మనము హిందువులము ఎంత మందుల మనగా, మన మెప్పు డైనను ఒకపనిచేసిన, దానికి అంతకుముందే అవకాశము అతి క్రాంతమైపోయి దానిచే మనము నష్టముపొందినవార మగుదుము. నీ——పుస్తకము, వట్టి మాట లొక సంవత్సరకాలము సాగినతర్వాత, వెలువడినది! పాశ్చాత్యులు దానికోసము కల్పావసానదినమువఱకు కనుపెట్టుకొనియుందురని తలంచితివా? ఈయాలస్యముచే ముక్కాలు భాగపు అమ్మకమును పోగొట్టుకొంటివి...ఆ హరమోహను తెలివి మాలినవాడు, నీకన్నను నచ్చు. వాని యచ్చుపని దయ్యాపుపని, ఆ విధముగా గ్రంథములు ప్రకటించుటచే ప్రయోజనము లేదు. అది మహాజనులను మోసగించుట, ఆపని చేయనేకూడదు. నేను ఇండి యాకు మరలునపుడు సీవియరు దంపతులును, ముల్లరమ్మాయియు, శ్రీ గుడ్విననును నాతోడవత్తురేమో! సీవియరు దంపతులు కొంతకాల మైనను ఆల్మోరాలో స్థిరవాస మేర్పఱచుకొనబోవుచున్నారు. గుడ్విను సన్న్యాసి కాబోవుచున్నాడు. అతడు, సరే, నాతో కూడ ప్రయాణము చేయును. మన గ్రంథములన్నియు అతనివలన ఏర్పడినవే. అతడు నా యుపన్యాసముల నన్నింటిని షార్టుహాండులో వ్రాసిపెట్టుచు వచ్చినందున, ఆ పుస్తకములు ప్రకటింపను వీలు కలిగి నది...ఈ యుపన్యాసములన్నియు ఎప్పటికప్పుడు ఆశువుగా చెప్పి నవే కాని, ముందుగా వానికై ఇంచుకయు సన్నాహము చేసికొ లేదు. కావున వానినన్నిటిని చక్కగా మరల పరికించి ప్రకటనకు



లండనులో శ్రీ వివేకానందస్వామి — (జూలై, 1896).

సదెపఉపవలయును...గుడ్విను నాతో కూడనే వసింపవలసియుండును ......అతడు శాకాహార దృఢవ్రతి.

భవదీయ ప్రేమయుత
**వివేకానంద.**

మలివూట—నేను ఈదినము ఇండియామ్లిర్రరుకు డాక్టరు బట్లోసునుగూర్చియు ఆయనకు కాపింపవలసిన స్వాగతోపచారమును గూర్చియు ఒక చీటిని పంపితిని. నీవును బ్రహ్మవాదినులో ఆయనకు స్వాగతమునకై కొన్ని మంచిమాటలు వ్రాయుము. ఇక్కడ అందఱును ప్రేమను అందించుచున్నారు.

వి.

## 310

(శ్రీ ఆళసింగ పెరుమాళుకు)

లండను,
అక్టోబరు 28, 1896.

[1896 వ సంవత్సరాంతమున డాక్టరు బట్లోసుగారు ఉపన్యాసార్థసంచారమునకు తరలబోవుచుండగా, వివేకానందస్వామి కలకత్తాలోని ఇండియను మిర్రరు పత్రికకు ఒకజాబు వ్రాసి అందులో ఆ ప్రఖ్యాతుడగు అతిథిని మనదేశమువారికి పరిచయము చేసి ఆయనకు ఈ ఖండమునకు స్వాగతము ఇమ్మని వారికి సలహా ఒసంగినాడు. ఆ జాబులోని ఆరంభ వ్రాతలో ఇది కొంత.]

ప్రపంచపు సంత (వరల్డుఫేరు) లో సమాజము (కాంగ్రెసు)ల సమావేశములకైన తన పదకమును లెస్సగా నెగ్గించుటకై ఆర్య సి. బోనీ తనకు సహాయునిగా ఏరుకొన్న అతిసమర్థుడు ఈ డాక్టరు బట్లోసు వానిలో ఒక సమాజము ఆయన దారిచూపి నడపించి నందున ఎట్లు ప్రఖ్యాతి గాంచినదో అదియొక చరిత్రాంశమై పోయినది.

డాక్టరు బట్లోసుగారి అతిమాత్ర ధైర్యము, విసుగుచెందని కృషి, కలతచెందని యోర్పు, క్షుణమైన తఱుగని ఆదరమును ఆ మహాసభకు గొప్ప విజయమును సమకూర్చినవి.

చికాగోలో ఆ మహాశ్చర్యకరమగు మత మహాసభను సమ హర్చినందున, ఇండియా, దాని జనులు, వారి తలంపులును, మున్నెన్నడును లోక మెఱుంగియుండనట్లుగా, మిక్కిలియు ప్రముఖ ముగా ప్రపంచదృష్టిలో నిలుపబడినవి. అది మన దేశమునకు గొప్ప మేలును, లాభమును ఐనది. అందులకై మనము మఱి యెవ్వరికన్నను గూడ డాక్టరు బర్రోసుకు కృతజ్ఞులమై ఉండవలసి యున్నది.

అంతేకాదు. ఆయన మనకడకు పవిత్రమైన మతముపేరట, మానవకోటి మహాచార్యు నొకని పేరట వచ్చియున్నాడు. ఆ నాజ రత్ మహాప్రవక్త సిద్ధాంతమునకు ఈయన చెప్పు వివరణము మిక్కిలి ఉదారముగను చిత్తమునకు ఉన్నతి కూర్చునదిగను ఉండును. ఈయన ఇండియాకు తేగోరు క్రీస్తుశక్తి ఇతరములను తగ్గించి తన్నగ్గించుకొనునది కాదు. దానికి అసహ్యము లేదు. తనకంటె వేఱైన యన్నింటిపట్లను ద్వేషము లేదు. ఇప్పటికే మన దేశమున నున్న శక్తులనడుమ ఈ శక్తి కాంక్షించున దొక సోదర స్థానమును, సహోద్యోగి స్థానమును మాత్రమే. అన్నిటికంటెను ముఖ్యమేమన ఇండియా జనులకు కృతజ్ఞతయు అతిథిసత్కారమును అసాధారణ ధర్మము లనుటను మఱవరాదు. కావున నా దేశజను లను నేను వేడుకొనుచున్నాను. ఏమనగా ప్రాచీనకాలమందువలెనే, 'ఇండియా సంపద' ఎల్లదేశాల జనులకు సామెతగా వెలసిననాటి వలెనే, ఇండియా 'ఆర్యుల' భూమియై యున్నప్పటివలెనే, నేటి దుఃఖదారిద్ర్యావమానముల నడుమనే, మన హృదయము ఉదాత్తముగా స్పందించుచున్నదని ఈ యభ్యాగతుడు తలంచుకొను నట్లుగా నడుచుకొందురుగాక.

## 311

(కుమారి మేరీ హేలుకు)

14, గ్రేకోటు గార్డెన్సు-వెస్టుమిన్‌స్టర్
లండను-ఇంగ్లండు
నవంబరు 1, 1896.

బంగారును వెండియు, నా ప్రియ మేరీ, నాయొద్ద లేనేలేదు. అయినను నాకు ఏమి ఉన్నదో దానిని నీకు ధారాళముగా ఇత్తును. అది యేదనగా జ్ఞానము;—బంగారులోని బంగారుతనము, వెండియందలి వెండితనము, పురుషుని పురుషత్వము, ఆడుదాని స్త్రీత్వము,— అన్నింటి తత్త్వము భగవంతుడు అనియు, ఆ భగవంతుని మనము అనాదికాలమునుండి బాహ్య ప్రపంచరూపముననే సాధింప ప్రయత్నించుచు, ఆ ప్రయత్నమున పురుషుడనియు, స్త్రీయనియు, బిడ్డయనియు, దేహమనియు, మనస్సనియు, భూమియనియు, సూర్యుడనియు, చంద్రుడనియు, నక్షత్రములనియు, లోకమనియు, రాగమనియు, ద్వేషమనియు, ఆస్తియనియు, ధనమనియు, సంపద మున్నగునవనియు, మఱియు ప్రేతములనియు, పిశాచములనియు, దివ్యపురుషులనియు, దేవతలనియు, దేవుడు మున్నగునవనియు మన మనఃకల్పితములగు వింతప్రాణుల వెలియిడుచున్నాము అను— జ్ఞానము.

సత్యమేమనగా భగవంతుడు మనయందున్నాడు. మనము ఆతడే. అదే నిత్యమగు అంతర్గతమగు, నిజమగు 'అహ'ము-తాను, ఒకప్పుడును బాహ్యగతముచేయరానిది ; ఈ బాహ్యమైనదానిని చేయు క్రమమంతయు వృధాకాలహరణము,వృధా ప్రజ్ఞావ్యయము. ఆత్మకు ఈ జ్ఞానము కలుగగానే అది ఈ బాహ్యకల్పనల మాని. వెనుకకు అంతర్గతముమీదికే వ్రాలి అంతస్సుఖమగును. ఇది పరిణామము—రానురాను దేహపరత తక్కువగుటయు, మనఃపరత ఎక్కువగుటయు. (సంస్కృతమున 'మనస్' తలంపు) మానవ రూపము ఉత్కృష్టతమమగు రూపము. మానవుడు అనగా మనన శీలుడు, ఇంద్రియానుభూతి మాత్రముగల జంతువుకాదు. దీనినే

అన్ని ప్రత్యాశలను మాని లోకమును ఉన్నది యున్నట్లు గ్రహించి పుడపుడు ఒక సుఖపుముక్క దొరకును అను ప్రత్యాశతో నిరంరము ఓర్వరానట్టియు ఓర్వతగినట్టియు బాధలను అనుభవించు ఏండుట. రెండవది సుఖము రూపాంతరమున ఉన్న దుఃఖమేయని తెలిసికొని, దానికై వెదకుట మాని సత్యమునకై వెదకుట. అసత్యమును వెదకు సాహసము గలవారు ఆ సత్యము నిత్యము, ఎప్పుడును న్నది, తమలోనే ఉన్నది అను ఎఱుకను సాధింతురు. అంతట ఏన యన్యోన్యసాపేక్షమగు జ్ఞానాజ్ఞానములలో ఆ సత్యమే ఎట్లు పత్యక్షమగుచున్నదో కనుగొందుము. మఱియు ఆ సత్యమే మంచి పెబ్బరల రూపమున ప్రత్యక్షమగు ఆనందమనియు కనుగొందుము. దానితోకూడనే జీవితమరణములను రెండురూపముల ప్రత్యక్షమగు ిజమగు సత్తను కనుగొందుము.

ఆ ఏకసత్త, సత్యానందైక్యము, నా నిజమగు ఆత్మ, తక్కిన అన్నింటి సత్యము అని యిన్ని తెఱంగుల చెప్పదగిన దాని రెండుగానో పెక్కుగానో చీలిన ప్రతిబింబములే ఈ పరిదృశ్యమానమగు విశ్వమంతయు అని మనసునకు తెచ్చుకొందుము. అప్పుడు, అప్పుడే - సెబ్బర లేక మంచిమాత్రమే చేయ సాధ్యమగును. ఏలన అట్టియాత్మ, మంచియు సెబ్బరయు రెండును లేని ప్రత్యక్షరూపములో ఆ పదార్థమును తనవసములో మెలపుకొను సామర్థ్యమును ఎఱింగి సంపాదించినదైనది. అదియే-అతడే-దీనినో దానినో తన యిచ్చమెయి ప్రత్యక్షము సేయనేర్చును. అతడు మంచినే ప్రత్యక్షము సేయు నని మన మెఱుగుదుము. ఆ జీవన్ముక్తుని దశయే వేదాంతమునకును తక్కినయన్ని తత్త్వశాస్త్రములకును పరమ గమ్యము.

మానవసంఘము క్రమముగా నాలుగు వర్ణముల వారిచేతను పురోహితులచేతను యోధులచేతను వర్తకులచేతను కార్మికుల చేతను-పరిపాలింపబడుచున్నది. ఒక్కొక్కదశకును దాని మహిమాతిశయములును కొఱతలును, ఉభయమును ఉన్నది. పురోహి

తుడు - బ్రాహ్మణుడు - పరిపాలించుచుండగా వంశపారంపరినిబట్టి ఇతరులను తమతో కలుపుకొనక వేఱుగా నుండుటయందు తీవ్రాభినివేశము కలదు. ఈ పురోహితులను వారి సంతతివారిని కాపాడుటకు వారిచుట్టును ఎన్నియో, దుర్గములు-వారికి తప్ప మఱెవరికిని ఏ జ్ఞానమును లేదు. ఆ జ్ఞానమును ఉపదేశించుటకు హక్కు వారికి మాత్రమే కలదనెడి నియమములనంటివి, - లేపబడినవి. దాని మహిమ ఏమనగా, ఈ కాలముననే శాస్త్రములకు పునాదులు వేయబడినవి. ఈ పురోహితులు మనసును సంస్కరింపరు, ఏలన వారు మనోద్వారమున పరిపాలింతురు.

శూరులగు క్షత్రియుల పరిపాలన నిరంకుశముగను క్రూరముగను ఉండును. ఐనను వారు ఇతరులను తమతో చేర్చుకొననివారు కారు. ఆకాలమున శిల్పములు సంఘుసంస్కారములు పరమోన్నతిని చెందును.

వర్తకులగు వైశ్యులపాలన అనంతరము వచ్చును. భయంకరమగు దానిశక్తి మాటలాడకుండనే చిదుగగొట్టి నెత్తురుపీల్చునట్టిది. దానివలని అనుకూల మేమనగా, వర్తకుడు తానే సొంతముగా అన్నియెడలకు పోవుటచే, పూర్వపు రెండు పాలనలయందును సేకరింపబడిన భావములను అభిప్రాయములను అంతటను వ్యాపింపజేయును. ఇతరులను తమతో చేరనీక తాము వేఱుగా నుండగోరు గుణము క్షత్రియులయందునకన్నను వీరియందు ఇంకను తక్కువ. కాని సంస్కృతి క్షీణింప నారంభించును.

కడపట కార్మికుల-శూద్రుల పాలన వచ్చును. దానివలని అనుకూలములు :— శరీరసౌఖ్యములు అందఱి అందుబాటునకు వచ్చుట; ప్రతికూలములు - సంస్కృతి ఇంకను క్షీణించుట. సామాన్యపు చదువును ఎక్కువగా అందఱికి వ్యాపింపజేయుట కలుగును, గాని అసాధారణ ప్రతిభాశాలులు నానాటికి తగ్గిపోవుదురు.

పురోహితుల బ్రాహ్మణుల కాలపు జ్ఞానమును, క్షత్రియుల కాలపు సంస్కృతియు, వైశ్యులకాలపు భావముల వ్యాపింపజేయు ఉత్సాహమును శూద్రులకాలపు సర్వసమతాలక్ష్యమును ఈమంచి గుణములను అన్నిటిని ఒక్కటిగా మేళవించి, ఆయాపాలనల దోషములను తొలగించి ఒకరాజ్యమును ఏర్పఱుప సాధ్యమగునేని అది పరమలక్ష్యభూత మగును, కాని అది సాధ్యమగునా ?

ఐనను మొదటి మూడిటికిని వాని విభవకాలము గడిచిపోయినది. ఇపుడు కడపటివర్గమువారికి కాలము. వారికి అది తప్పక వచ్చును. ఎవరును నిరోధింపజాలరు. నాణెములకు సర్కారువారు బంగారు ప్రమాణమును ఏర్పఱచుట మేలో వెండి ప్రమాణము ఏర్పఱచుట మేలో అను విషయములయందలి కష్టములన్నియు నే నెఱుగను గాని, (ఎవరును దానినిగూర్చి అంతగా ఎఱిగినట్లు లేదు). నాకు ఒకటి తెలియుచున్నది, ఏమనగా బంగారు ప్రమాణము పేదలను మఱింత పేదలుగాను, భాగ్యవంతులను మఱింత భాగ్యవంతులుగాను చేయుచున్నది. 'బ్రెయను' ఈ మాటలు చెప్పుట సరియే. ఏమని యనగా 'మేకులు కొట్టి మమ్ము బిగించుసిలువ బంగారముదిగ నుండుటకు మేము ఒప్పుకొనము' అని. వెండి ప్రమాణము, ఈ అసమానుల పోరాటమున, పేదలకు మేలి యవకాశ మొసంగగలదు. నేను సోషలిస్టును-సర్వసామ్యము కోరువాడను. ఏలన, అది నిర్దోషమగు పద్ధతియని కాదు, మఱి ఏమియు లేకపోవుటకంటె సగము రొట్టెయైన నుండుట మేలేకదా అని.

ఇతరపద్ధతులన్నియు అనుభవించి పరీక్షించి చూడబడినవి. అవి పనికిరాలేదు. మఱెందులకును గాకున్నను, ఇది క్రొత్తదియగుటచే దీనిని అనుభవించి చూతము. ఎప్పుడును ఈ ఒక్కరికే బాధలు ఆ యొక్కరికే సౌఖ్యములు అననీకుండ వానిని, పునర్విభాగించుట మేలే యగును. లోకమున మంచిసెబ్బరల మొత్తము ఎప్పుడును ఒక్కటే. క్రొత్తపద్ధతులచేత కాడి ఒకరి బుజాననుండి మఱియొకరి బుజానకు మాఱుచుండును-అంతే.

ఈ దుఃఖబహుళమగు లోకాన ప్రతియొక్కరికి ఒక మంచి కాలము ఉండనీ. అంతట ఈ సుఖమనబడుదాని యనుభవమునకు అనంతరము వారందఱు ప్రభువు నెదుటికివచ్చి, ఈలోకము, పరిపాలన, ఇంకను ఇతరశ్రమలు అను నీ మిథ్యాగర్వమును పరిత్యజింతురు గాక.

మీ యందఱిమెడ ప్రేమతో,

సదా శ్రద్ధాయుతుడు భవదీయసోదరుడు

**వివేకానంద.**

## 312

(శ్రీ ఆళసింగ పెరుమాళుకు)

14, గ్రేకోట్గార్డెన్సు
వెస్టుమిన్స్టరు-నైర్రుతి
నవంబరు 11, 1896.

ప్రియ ఆళసింగా,

నేను బహుశః డిసెంబరు తే 16 ది బయలు దేఱగలను; లేకున్న ఒకటి రెండు దినాలు అవతలనైనను కావచ్చును. నేను ఇక్కడినుండి ఇటలీకి పోయెదను. అక్కడ కొన్నిస్థలములు చూచి, నేపుల్సులో స్టీమరును అందుకొందును. ముల్లరమ్మాయియు సేవియరు దంపతులును గుడ్విను అనునొక చిన్నవాడును నాతోకూడ వచ్చుచున్నారు. సేవియరులు అల్మోడాలో స్థిరనివాసము ఏర్పఱుచుకొందురు. ముల్లరమ్మాయియు అట్లే చేయగలదు. సేవియరు ఇండియాసేనలో 5 ఏండ్లు ఉద్యోగస్థుడుగా నుండెను. కాబట్టి అతడు ఇండియాను విశేషముగా ఎఱుంగును. ముల్లరమ్మాయి అఱియ శిష్యురాలు, థియాసఫిస్టుగా నుండెను. గుడ్విను ఇంగ్లీషువాడు. అతడు షార్టుహాండులో వ్రాసిపెట్టుటవలననే ఆ చిన్నగ్రంథములు ప్రకటింప వీలు కలిగినది.

నేను కొలంబోనుండి మొదట మదరాసు చేరెదను. తక్కిన వారు తమ దారిని అల్మోడాకు పోవుదురు. నేను అక్కడినుండి

తిన్నగా కలకత్తాకు పోవుదును. ఇంకను సరియైన సమాచారమును నేను బయలుదేఱునపుడు నీకు వ్రాసెదను.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

మలిమాట:—'రాజయోగము' మొదటిముద్రణము అంతయు అమ్మిమైపోయినది. రెండవ ముద్రణము అచ్చగుచున్నది. దాని ప్రతులను చాల ఎక్కువగా కొన్నదేశాలు, ఇండియాయు అమెరికాయు.

వి.

## 313

(శ్రీమతి బుల్ నతికి)

గ్రేకోట్గార్డెన్సు
వెస్టుమిన్స్టరు, నైరృతి, లండను,
నవంబరు, 13, 1896

ప్రియబుల్నతికి,

...నేను చాల త్వరలో, బహుశః డిసెంబరు తే 16 ది, ఇండియాకు బయలుదేఱుచున్నాను. నేను మరల అమెరికాకు వచ్చు లోపల ఒకతూరి యిండియాను చూడవలయునని మిక్కిలి ఆశపడు చున్నాను. నేను ఇక్కడ ఇంగ్లండునుండి పలువురు మిత్రులను నాతో ఇండియాకు పిలుచుకొనిపోయెదనని యేర్పాటు చేసికొని యున్నందున, దారిలో, నేను ఎంతగా కావలయుననుకొన్నను, అమెరికాకు వచ్చుట అసాధ్యమగును.

డాక్టరు జేన్సు నిజముగా దివ్యమగు పని చేయుచున్నాడు. ఆతడు నాకు ఎన్నితూర్లో దయచూపినందులకును,నాకును నాపనికిని సాయము చేసినందులకును నాకుగల కృతజ్ఞతను తెలుపుటకు నాకు తగినమాటలురాకున్నవి...ఇక్కడ పని బాగుగా సాగిపోవుచున్నది.

రాజయోగము, మొదటి ముద్రణము సర్వమును అమ్ముడై పోయినది. ఇంకను కొన్నివందల ప్రతులు పంపుమని వచ్చినజాబులు ఇపుడు నాచేత నున్నవి. ఇదే నీవు తెలిసికొన ముచ్చటపడు వార్త.

భవదీయ

**వివేకానంద.**

## 314

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

39, విక్టోరియా వీథి

లండను, నైర్ఋతి

నవంబరు 20, 1896

ప్రియ అళసింగా,

నేను డిసెంబరు తే 16 ది ఇంగ్లండునుండి ఇటలీకి బయలు దేఱుచున్నాను. అక్కడ ఉత్తర జెర్మన్లాయిడ్ ఎస్. ఎస్. ప్రిన్జ్ రీజెంటు ల్విటోపోల్డు నావను నేపుల్సులో అందుకొందును. ఆ స్టీమరు పై జనవరి తే 14 దికి కొలంబో చేరవలసియున్నది.

నాకు సింహళము రవంత చూడవలయునను ఉద్దేశము ఉన్నది. తర్వాత మదరాసు చేరుదును. నావెంట ముగ్గురు ఇంగ్లీషు మిత్రులు వచ్చుచున్నారు — కెప్టెన్ సేవియరు, ఆతనిభార్య, శ్రీ గుడ్విను. సేవియరును ఆతని భార్యయు హిమాలయములలో అల్మోడాకు సమీపమున నొక నివాసమును తొడంగ బోవుచున్నారు. దానినే నేను నా హిమాలయ కేంద్రముగ చేసికొనదలచుచున్నాను. అదే పాశ్చాత్య శిష్యులు బ్రహ్మచారులుగాను సన్న్యాసులుగాను నివసించుచోటు నగును. గుడ్విను పెండ్లి చేసికొననివాడు. అతడు నాతో ప్రమాణముచేసి నాతోడనే వసింపగలడు. అతడు సన్న్యాసి వంటివాడే.

శ్రీ రామకృష్ణుని జన్మదినోత్సవమునకు ముందే కలకత్తాకు చేరవలయునని చాల ఆసగొనుచున్నాను...నా ప్రకృతపు పని పద కము ఎట్లనగా యువకులను మతబోధక ప్రచారకులుగ తయారు

సేయుటకు రెండు కేంద్రములు, ఒకటి కలకత్తాలోను, మఱియొకటి మదరాసులోను, తొడంగుట. కలకత్తా శ్రీరామకృష్ణుని యావజ్జీవితపు కార్యము జరిగినచోటగుటంబట్టి నా తొలిశ్రద్ధను చూఱ గొనును. అందు నిర్మాణారంభమునకు వలయు ధనము నాయొద్ద నున్నది. మదరాసుదాని కెట్లు అందువా, దానికి ఇండియాలో ధనము దొరకునని అనుకొనుచున్నాను.

మనము ఈమూడు కేంద్రములనుండియు పని ప్రారంభింతము. తరువాత బొంబాయికిని అలహాబాదునకును పోవుదము. ఈ స్థానములనుండి, ప్రభువు అనుగ్రహించునేని మనము ఇండియామీదికి దండెత్తుటే కాక, ప్రపంచమందలి యన్ని దేశములకును గుంపుల ప్రచారకులను పంపుదము. అది మనము మొట్టమొదట చేయవలయు పని. ధైర్యముతో పనిచేయుము. 39 విక్టోరియా ఇంకను కొంత కాలమువఱకు లండనులో మన ప్రధానస్థానముగా నుండును. ఏలన పని అక్కడ సాగింపబడుచుండును. స్టర్డీయొద్ద ఒక పెద్ద బ్రహ్మవాదిక పెట్టెయున్నది. అది నాకు ఇంతకుముందు తెలియదు. అతడు దానికి చందాదారులను చేర్ప కృషిచేయుచున్నాడు.

మన కిపుడు ఇంగ్లీషులో ఒక ఇండియనుపత్రిక గట్టిగా కుదిరియున్నది. దేశభాషలలోను కొన్ని యారంభింపవచ్చు. వింబుల్డనులోని కుమారి ఎమ్. నోబుల్ చాల పాటుపడునది. ఆమెయు మదరాసు రెండు పత్రికలకును చందాదారుల చేర్ప పాటుపడ గలదు. ఆమె నీకు జాబువ్రాయును. ఈవిషయములు మెల్లగానైనను తప్పకుండ వృద్ధిపొందునవే. ఈవిధమగు పత్రికలను సాయపడువారి సంఖ్య చాల అల్పమే. వారు ఒక్కుమ్మడి అనేకకార్యములు చేయుదురని మనము ప్రతీక్షింపరాదు. వారు ఇక్కడ కావలసిన పుస్తకములు కొనవలసియున్నది, ఇంగ్లండులోనిపనికి ధనము సేకరింపవలసియున్నది, పత్రికకు ఇక్కడ చందాదారులను చేర్పవలసియున్నది. అటుతర్వాత వారు ఇండియా పేపర్లకు చందాలు ఈవలయుట. అది వారికి భరింపరానిదగును. దానికి బోధన

మనిపించుకొను సర్వాతకంటె వర్తకమనిపించుకొను యోగ్యత ఎక్కువగా గలదు. కావున నీవు కనుపెట్టుకొని యుండవలయును. అప్పటికిని ఇక్కడ కొందఱు చందాదారు లుందురనియే నా నిశ్చయము. ఇంకొకవిషయము : నేను లేనప్పుడు ఇక్కడి జనులకు అందటికి చేయను పని యుండవలయును. లేకున్న అంతయు నాశనమై పోవును. కాబట్టి ఇక్కడ ఒకపత్రిక ఉండవలయును. అట్లే తర్వాత కొంతికాలమునకు అమెరికాలోను. ఇండియా పత్రికలకు ఇండియా వారే సాయపడవలయును. ఒకపత్రికను అన్ని దేశాలవారికి అంగీకార్యము కావింపవలయునన్న దానికి అన్ని దేశాలనుండియు వచ్చిన రచయితల సముదాయ ముండవలయును. అందులకు సంవత్సరమునకు కనిసము లక్షరూపాయలైనను ఉండవలయును.

నాకు అక్కఱ ఇండియాలోమాత్రము గాదు ; ఎల్లదేశాలలోను. ఆసంగతి నీవు మఱవరాదు. నేను బాగుగా ఆరోగ్యముగా ఉన్నాను. అట్లే అభేదానందుడును.

సకలప్రేమతోను సర్వాశీర్వాదములతోను,

నీ వా డు

**వివేకానంద.**

## 315

(శ్రీ లాలా బద్రీసాకు)

39, విక్టోరియావీథి,
నైరృతి - లండను
నవంబరు 21, 1896

ప్రియ లాలాజీ,

నేను జనవరి తే 7 ది యప్పటికి మదరాసు చేరెదను. కొన్నాళ్లు మైదానములలో గడపి పిదప అల్మోడావఱకు రావలయుననుకొనుచున్నాను.

నాతో ముగ్వురు మిత్రులు ఇంగ్లీషువారు ఉన్నారు. వారిలో ఇదువురు సేవియరు దంపతులు, అల్మోడాలో స్థిరనివాస మేర్పఱుచు

కొనబోవుచున్నారు. నీ వెఱుగుదువు గదా, వారు నా శిష్యులు. వారు హిమాలయాలలో నాకోసము మఠమును నిర్మింపబోవుచున్నారు. ఆ కారణముచేతనే అందులకు తగిన ప్రదేశమును చూచి పెట్టుమని నిన్ను కోరియుంటిని. మాకే ఒక కొండయంతయు కావలయును. అక్కడినుండి మంచువరుస స్పష్టముగా అగపడుచుండవలయును. ప్రదేశము నిర్ణయించుకొని దానిమీద కట్టడము పూర్తిచేయుటకు కొంతకాలము పట్టును. ఈలోపల నా మిత్రులకు బాడిగకు ఒక బంగళాను కుదిర్చెదవా, నీకు పుణ్యముండును. బంగళా ముగ్గురు కాపురముండుటకు చాలియుండవలయును. నాకు చాలపెద్దది అక్కఱలేదు. ప్రకృతమునకు ఒకచిన్నది చాలును. నా మిత్రులు అల్మోడాలో ఈ బంగళాలో వసించుచు, తరువాత చోటును వెదకబోదురు. (మఠ) నిర్మాణమునకు ప్రయత్నింతురు.

ఈ జాబునకు నీవు జవాబు వ్రాయనక్కఱలేదు. ఏలన అట్టి నీ జవాబు నాకు చేరకమునుపే నేను ఇండియాకు బయలుదేఱియుందును. నేను మదరాసుకు చేరగానే, అందుండి నీకు తంతె వార్త నంపెదను.

మీకందఱికి నా ప్రేమయు ఆశీర్వాదములును.

భవదీయ
**వివేకానంద.**

## 316

శ్రీ ఇ.టి. స్టర్డీగారింట
హైవ్యూ, కేవర్షామ్, రీడింగు
1896.

ప్రియ—

......ప్రతివాడును తనశక్తికొలది పాటువడకున్న ఏదియైనను చేయ శక్యమగునా? 'ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః.' పూనికవహించు పురుషసింహునే లక్ష్మి వరించును. వెను

మరలి చూడనక్కఱలేదు. పదండి ముందుకు! మనకు కడలేని శక్తి, కడలేని పట్టుదల కడలేని ధైర్యము కడలేని ఓర్పు ఉండవలయును. అప్పుడే గొప్పవిషయములు సాధింపబడును.

భవదీయ ప్రేమయుత
**వివేకానంద.**

## 317

(కుమారి మేరీ హేలుకు, కుమారి హారియెట్టు హేలుకు)

39, విక్టోరియా వీధి
లండను, నైరృతి
నవంబరు 28, 1896.

ప్రియ సోదరీమణులారా,

......ఇండియాకు బయలుదేఱకముందు మీకు కొన్ని పంక్తులు తప్పక వ్రాయుదమని తోఁచి వ్రాయుచున్నాను. లండనులోఁ పని ఇంతంతనరాని విజయము. ఇంగ్లీషువారు అమెరికనులంత చుఱుకైనవారు కారు. కాని ఒకతూరి నీవు వారి హృదయమును తాకిన, ఇకను అది ఎప్పటికి నీదే. నెమ్మదిగానే నేను సాధించితిని. మొత్తానకు ఆఱునెలల పనిలో పెద్దసభలలో కావించిన యుపన్యాసములు గాక, నిలుకడగా నాకు నూటయిరువదిమంది కూడిన తరగతి యుండెను. ఇచట ప్రతియొకడును కార్యతత్పరుడే; ఇంగ్లీషువాడు కార్యపరుడని ప్రసిద్ధి కదా. కెప్టెన్ సేవియరును ఆయన భార్యయు శ్రీ గుడ్విన్‌ను నాతో ఇండియాకు వచ్చుచున్నారు. వారు పని చేయుదురు, అందులకు తమ ధనమునే వ్యయింతురు. వారిమాదిరి చేయుటకు ఇక్కడ నూర్లకొలది సిద్ధముగా నున్నారు. పురుషులును స్త్రీలును, అంతస్తుకలవారు. భావము తమమనసుకు నచ్చి తమకు నమ్మకము కలిగినచో అందులకై తమ సర్వమును త్యాగముసేయ సిద్ధముగా నున్నారు! కడపటిదైనను ప్రధానమైనదే ఈవిషయము, ఏదనగా, ఇండియాలో నాపని తొడంగుటకు కావలయు ధనసాహాయ్యము నాచేతికి వచ్చియున్నది. ఇంకను ధనము ఇకమీఁదట రాగలదు. ఇంగ్లీషువారినిగూర్చి నాకుండిన యభిప్రాయములు విపరీ

తముగా మారిపోయినవి. ఇతరజాతులకన్నను దేవుడు వారిని ఏల ఎక్కువగా అనుగ్రహించెనో నాకు ఇపుడు బోధపడుచున్నది. వారు నిలుకడగలవారు, కపటమనునది యెఱుగని సత్యశీలురు, మిక్కిలి గాంభీర్యవంతులు. పైపైన గట్టిపొరయొకటి యున్నట్లు తోచునే కాని, దానిని రవంత ఛేదించిన ఇకను ఆతడు నీవాడే.

ఇకను నేను కలకత్తాలో ఒక్క కేంద్రమును హిమాలయములలో మఱియొక దానిని తొడంగబోవుచున్నాను. హిమాలయములో ఉండగలది 7000 అడుగుల యెత్తుగల ఒక్క కొండ, గ్రీష్మములో చల్లగాను శిశిరములో చలిగాను ఉండును. కెప్టన్ సేవియరును ఆతనిభార్యయు అక్కడ నివసింతురు. యూరోపియన్ కార్యస్థుల కందఱికిని అదియే చోటు అగును. మందు ఇండియా మైదానములకును ఇండియా జీవితపద్ధతులకును వారిని బలాత్కరించి లాగి నేను వారిని చంపగోరను. నేను అనుకొనియుండు పద్ధతి యేమనగా అనేక సంఖ్యాకులగు హిందూబాలురను ప్రతి నాగరకత గల దేశమునకును మతబోధ చేయను పంపుటయు, విదేశముల నుండి పురుషులను స్త్రీలను రావించి వారిచే ఇండియాలో పని చేయించుటయు. ఇది మంచి వినిమయ మగును. కేంద్రములను నెలకొల్పిన తరువాత నేను, 'జోబ్' పుస్తకములోని మహాశయుని వలె, పైకి క్రిందికి తిరుగుచుందును.

ఇక్కడ ఈజాబును ముగింపవలయును, తపాలుకు అందించుటకు. అవకాశములు నాకిప్పుడు గలుగుచున్నవి. నేను సంతోషముగా ఉన్నాను. మీరును అట్లే యుందురని నే నెఱుగుదును. అన్ని దీవెనలును అన్ని సౌఖ్యములును మీవే అగుత.

శాశ్వతప్రేమతో,

వివేకానంద.

మఱిమాట:— ధర్మపాలుని గూర్చి ఏమి? అతడు ఏమి సేయుచున్నాడు? ఆతనిని కలసికొన్నట్లైన ఆతనికి నాప్రేమ అందింపుము.

## 318

(ఆల్బర్టాకు)

14, గ్రేకోటుగార్డెన్సు
వెస్టుమిన్‌స్టరు, నైరృతి, లండను
డిసెంబరు 3, 1896.

ప్రియ ఆల్బర్టా,

నీకు దీనితో జోజోకు మేబెల్బ్రవాసిన యొక బాబును పంపు చున్నాను. అందలి సమాచారము నాకు చాల సంతోషకరముగ నుండినది. నీకును సంతోషకరమే అని నా నిశ్చయము.

నేను ఇక్కడనుండి ఇండియాకు తే 16 ది బయలుదేఱ వలయును, నేపుల్సునొద్ద స్టీమరు ఎక్కవలయును. కావున నేను ఇటలీలో కొంతకాలము ఉందును, రోములో మూడు నాలుగు దినాలు ఉందును. నేను నీ దర్శనానందమనుభవించి నీయొద్ద సెలవు గొందును.

ఇంగ్లండునుండి కెప్టెను సేవియరును ఆతనిభార్యయు నాతో కలసి ఇండియాకు వచ్చుచున్నారు. వారును నాతోనే ఉందురని వేఱుగా చెప్పనక్కఱలేదు. పోయిన వేసవిలో నీవు చూచిన వారే వారు.

అక్కడినుండి యు. ఎస్. కును యూరోపుకును ఇక నొక సంవత్సరములోపల మరలి రానుద్దేశించుచున్నాను.

ప్రేమాశీస్సులతో,

వివేకానంద.

## 319

(కుమారి జో మెక్లియడుకు)

గ్రేకోటుగార్డెన్సు
వెస్టుమిన్‌స్టరు-నైరృతి, లండను
డిసెంబరు 3, 1896.

ప్రియ 'జో',

నీయాహ్వానమునకు నాప్రియ జోజో, నాధన్యవాద శతములు. కాని నాప్రియ దేవుడు ఇట్లు తీర్మానించినాడు. ఎట్లనగా నేను

తే 16 ది కెప్టెన్ సేవియరుతోను ఆతనిభార్యతోను శ్రీ గుడ్విను తోను కలసి ఇండియాకు బయలు దేఱవలసియున్నది. సేవియర్లను నేనును నేపుల్సునొద్ద స్టీమరు ఎక్కుదుము. మఱి నాకు రోములో నాలుగుదినము లుండునుగాన, నేను ఆల్బర్టాయొద్ద వీడ్కోలు వడయుటకటు తొంగిచూచెదను.

ఇక్కడి సంగతులు చాలసందడిగానున్నవి. 39 విక్టోరియాలో తరగతి కూడు పెద్దకూటము విద్యార్థులతో నిండియున్నది. ఇంకను విద్యార్థులు వచ్చుచున్నారు.

సరే ఇప్పుడు నాపాతదేశము నన్ను రమ్మనుచున్నది; నేను పోవలయును. కావున ఈ యేప్రిలులో రష్యాను చూడవలయునన్న ఆలోచనలను మానుకొనవలసియున్నది.

ఇండియాలో అన్నివిషయములను సాగుచుండునట్లు రవంత దారిలో పెట్టి, నేను మరల అనిత్యరమణీయములగు యు. ఎస్., ఇంగ్లండు మొదలగు చోటులకు మరలెదను.

మేబెల్సువార్తను పంపుట నాయందు ఎంతయో దయ నెఱ పుట. నిజముగా అందలి సమాచారము చాలమంచిది. ఫాక్సు కోసము, పాపము, నాకు కొంచెము చింతగా నున్నది. అంతే. ఐనను మేబెలు ఆతనిని తప్పించుకొన్నది. అది మేలు.

న్యూయార్కులో అన్నియు ఎట్లు జరుగుచున్నవో, నీ వేమియు వ్రాయలేదు. అక్కడ అంతయు బాగుగా ఉన్న దని యెంతును. పాపము, కోలా సంగతి యేమి? అతడు తన జీవిక సంపా దించుకొనగలిగియున్నాడా?

ఇక్కడికి గుడ్విను వచ్చుట మిక్కిలియు కాలోచితముగా ఉండినది. ఉపన్యాసముల నన్నిటిని అతడు షార్టుహాండులో వ్రాసి పెట్టగలిగినాడు. అవి సంచికల రూపమున ప్రకటింపబడుచున్నవి. అప్పుడే దాని ఖర్చునకు చాలునంత చందాదార్లు ఏర్పడినారు.

పై వారము మూడుఉపన్యాసములు — దానితో నాలండను పని ఈసారికి ముగిసిపోవును. నిజమే. ఇపుడు ముమ్మురముగా

నుండగా దానిని విడిచిపోవుట తెలివి తక్కువ యని అందఱు తలంచుచున్నారు. కాని నా ప్రియ ప్రభువు 'బయలుదేఱు ప్రాత యిండియాకు' అనుచున్నాడు. దానిని నేను శిరసా వహించుచున్నాను.

ఫ్రాంకిన్సెన్సుకు అమ్మకు హాలిస్టరుకు ఇంకను ప్రతియొకరికి నానిత్యప్రేమయు ఆశీర్వాదములును. అవే నీకును.

భవదీయ శ్రద్ధాయుత
**వివేకానంద.**

# 320

(శ్రీమతి బుల్సతికి)

39, విక్టోరియావీథి, లండను
డిసెంబరు 9, 1896.

ప్రియ శ్రీమతి బుల్సతి,

నీవు అంతమహోదారముగా ఇయ్యబూనినందులకు నాకృతజ్ఞతను నీకు మాటలతో చెప్పుట అనావశ్యకము. ఆరంభముననే అంత పెద్దమొత్తము ధనముతో బరువెక్కించుకొని చిక్కుపడుట నాకు ఇష్టము గాదు. విషయములు ముందుకు సాగజొచ్చునేని ఆసొమ్మునకొక వినియోగమును చాల సంతోషముతో కలిగింతును. చాల తక్కువ పరిమాణమున ఆరంభింపవలయునని నా యభిప్రాయము. నాకు ఇంకను ఏవిషయమును తెలియదు. ఇండియాలో దిగి అక్కడివాడనైనంతట నేను ఎంతలో ఎట్లు ఉండునది, నాచుట్టుపట్టుల సంబంధములు ఎఱుగగలుగుదును. ఇండియాలోనుండి నాపదకములు, వానిని నేను నెఱవేర్పబోవు కార్యమార్గములు అన్నియు వివరముగా వ్రాసెదను. నేను తే 16 ది బయలుదేఱుదును. కొన్నాళ్ళు ఇటలీలో మకాముచేసి నేపుల్సులో స్టీమరు అందుకొందును.

శ్రీమతి వాగనుసతికిని, శారదానందునికిని ఇంకను అక్కడ గల నామిత్రుల కందఱికిని నా ప్రేమను అందింపుము.

నీకు పుణ్యము ఉండును. ఇకను నీసంగతియా, నిన్ను నే నెప్పుడు నాకు గల ఉత్తమోత్తమ మిత్రముగా పరిగణించుచుంటిని. ఇక నా యావజ్జీవితమును అట్లే పరిగణించుచుందును.

ప్రేమాశీర్వాదములతో,

భవదీయ

**వివేకానంద.**

## 321

(శ్రీ ఫ్రాన్సిస్సు లెగ్గెట్టుకు)

డిసెంబరు 13, 1896.

ప్రియ ఫ్రాంకిన్సెన్సూ,

గోపాలుడు స్త్రీరూపము గొన్నాడన్నమాట! * కాలమును చోటును ఆలోచింపగా అది అట్లగుట తగియేయున్నది. ఆజన్మము అన్ని ఆశీస్సులును ఆమె వెంబడినుండును గాక. ఎంతో కోరగా, ప్రార్థింపగా తత్ఫలముగ నీకును నీ శ్రీమతికిని యావజ్జీవ మంగళముగా ఆమె ఆవిర్భవించినది. నాకు ఇంచుకయు సందియము లేదు.

"ప్రాచ్య మహర్షులు పాశ్చాత్య శిశువునకు కానుకలు తెచ్చుట" అను ఆచారమును నిర్వహించుటకైనను, ఇపుడు నేను అమెరికాకు రాగలిగియుండవలయునని కోరుదును. కాని అన్ని ప్రార్థనలు చేయుచు దీవెనలు పలుకుచు నాహృదయము అచ్చట ఉన్నది. దేహమున కంటె మనస్సు ప్రభావాఢ్యము గదా!

నేను ఈనెల తే 16 ది బయలుదేఱుచున్నాను. నేపుల్సులో స్టీమరు ఎక్కెదను. రోములో ఆల్బర్టాను నిశ్చయముగా చూచెదను.

పవిత్ర కుటుంబమునకు సర్వప్రేమతో,

భవదీయ భగవద్గత

**వివేకానంద.**

* కొడుకు పుట్టునని నిరీక్షించుచుండగా పుట్టిన పుత్రికను గూర్చి స్వామి పల్కుచున్నాడు.

## 322

(ఒక అమెరికను మహిళకు)

లండను
డిసెంబరు 13, 1896.

ప్రియ అమ్మా,

నీతిలో అంతస్తులు గలవని గ్రహించితిమేని చాలును, సర్వము విశదమగును. వైరాగ్యము అప్రతిఘటనము – అహింస అను పరమలక్ష్యములను అధిగమించుటకు దారి రాగమును, ప్రతిఘటనమును, హింసను మెట్టుమెట్టుగా తగ్గించుకొనుట. లోకాన ఎవరును ప్రతిఘటింపకయు హింసింపకయు కోరికలేకయు జీవింపలేరు. ఈ పరమలక్ష్యములను, సంఘమునందుండియే సాధింపగల స్థితికి లోకము ఇంకను రాలేదు.

ఈ చెడుగులగుండ ప్రపంచము గనుముందు అభివృద్ధి దానిని మెల్లగానైనను నిశ్చయముగా, పరమలక్ష్యమునకు అర్హమగునట్లు చేయుచున్నది. అత్యధికసంఖ్యాకులు ఈ మెల్లని క్రమవృద్ధితోడనే సాగిపోవలసియుండును. అసాధారణమైనవారు, ప్రకృత పరిస్థితులలో లక్ష్యమును పొందుటకు ఈ దారిని వీడి బయటికి రావలయును.

ఆయాకాలపు విధిని అనుష్ఠించుట ఉత్తమమగు పద్ధతి. దానిని కేవలము విధి యనియే అనుష్ఠించిన, అది మనకు బంధమును కలుగనీయదు.

సంగీతము కళలలో అన్నిటికన్న మహోన్నతమైనది. దానిని గ్రహింపగలవారికి అది అన్నిటికంటె మహోన్నతమైన పూజావిధానము.

అజ్ఞానమును పాపమును నాశనముచేయుటకు మనశక్తికొలది పాటుపడవలయును. ధర్మాభివృద్ధిచేతనే అధర్మమునకు వినాశమేర్పడునని మన మెఱుగవలయును, అంతే.

భవదీయ శ్రద్ధాయుత
వివేకానంద.

## 323

(అల్బర్టాకు)

హోటల్ మినర్వా
ఫ్లారెన్సు
డిసెంబరు 20, 1896.

ప్రియ ఆల్బెర్టా,

మేము రోము రేపు చేరుదుము. అక్కడికి చేరుటకు రాత్రి చాల ప్రొద్దుపోవును గావున, నిన్ను చూడ వచ్చుటకు ఎల్లుండి సాధ్యమగుననుకొందును. మేము హోటలు కాన్టినెన్టలులో బస చేయుదుము.

నీకు నా ప్రేమయు ఆశీర్వాదములును,

వివేకానంద.

## 324

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

హోటలు మినెర్వా, ఫ్లారెన్సు
డిసెంబరు 20, 1896.

ప్రియ రాఖాల్,

నీ వెఱింగినట్లు, ఇప్పటికి నేను నాదారిలో ఉన్నాను. నేను లండనునుండి బయలుదేఱకమునుపు నీ జాబును, చిన్నిపుస్తకమును నాకు చేరినవి. 'ము—' వెఱ్ఱిని నీవు సరకుసేయకుము. నిశ్చయముగా అతడు అసూయతో వెఱ్ఱిపట్టినవాడై పోయినాడు. నాగరకుల దేశమున వాడు వాడిన బూతుమాటలకు జనులు అతనిని చూచి కేవలము నవ్విపోదురు. అట్టి నీచపుమాటలు వ్రాసినందున వాడు తనకార్యమునే చెఱచుకొన్నాడు.

అయినప్పటికిని, మనము హరమోహనునిగాని మఱియెవనిని గాని పోనిచ్చి బి—తో మనతరపున జగడమాడనీకూడదు. మనకు ఏమతపక్షమువారితోను జగడము లేదు అని జనులు ఎఱుంగవలయును. ఎవడైనను జగడము రేపిన అతడు దానిబాధ్యత తానే

వహించువాడగును. ఒండొరులు జగడాలాడుటయు దూషించుటయు మన దేశపు జనుల లక్షణములు. సోమరితనము, పనికిమాలినతనము, నీచత్వము, ఈర్ష్య, అసూయ, పిఱికితనము, జగడగొండి తనము—ఇవి మన బెంగాలీల లక్షణములు. నాతో మైత్రిగోరువాడు ఇవి మానవలయును. హరమోహానుని ఏపుస్తకమునుకూడ అచ్చు వేయనీకుము. అతడు చేయు అచ్చువేయించు పనియంతయు ప్రజను వంచించుటయే.

కలకత్తాలో నారింజలు ఉన్నయెడల, వానిని అళసింగ చేర జూచుకొని, నేను మదరాసుకు వచ్చినప్పుడు నాకు ఇచ్చునట్లు, ఒక వందపండ్లు పంపుము.

బ్రహ్మవాదినులలో ప్రకటించిన శ్రీరామకృష్ణునిసూక్తులు వాస్తవమైనవికావనియు వట్టి కల్లలనియు ముజుందారు వ్రాయు చున్నాడు!- ఆపక్షమున, కల్లరి అతడే అని ఇండియన్మిర్రరులో నిరూపింపుడని సురేశదత్తతోను రామ్బాబుతోను చెప్పుము. ఆసూక్తుల సంగ్రహణమున నే నేమియుచేసియుండనందున నేను ఏమియు చెప్పజాలను.

భవదీయ ప్రేమయుత
**వివేకానంద.**

మఱిమాట—ఈ మూర్ఖులను లక్ష్యపెట్టకుము. "ముసలి మూర్ఖునివంటి మూర్ఖుడు లేడు" అని సామెత. వారిని రవంత మొఱుగనిమ్ము. వారివ్యాపారము పోయినది. పాపము. దయ నీయులు! మొఱిగిన తృప్తి వారికి రవంత యుండనిమ్ము.

## 325

(కుమారి మేరీ హేలుకు)

డామ్బర్, "ప్రిన్జ్-రీజెంట్ లియపోల్డ్"
జనవరి 3, 1897.

ప్రియ మేరీ,

లండనునుండి వెనుకకు పంపబడిన నీ జాబు నాకు రోములో చేరినది. అంత చక్కని జాబును నాకు వ్రాయుట నీ కరుణావిశేషమే,

అందు ప్రతిముక్కను నేను ప్రీతితో అనుభవించితిని. యూరోపులో పలు వాద్యములు కలసిన ఆ వాద్యములపాట, తౌర్యత్రికము, ఎట్లు పుట్టి పెరిగినదో నా కేమియు తెలియదు. నేపుల్సువిడిచినది మొదలు నాలుగు దినాలు ప్రయాణము భయంకరమై ఏమియు హాయిగా నుండలేదు. మేము పోర్టుసెడ్డును సమీపించుచున్నాము. ఓడ మిక్కిలియు కష్టముగా సాగుచున్నది. ఆసందర్భమున నా యక్షరములు వంకరటింకరమైనందులకు నన్ను మన్నింపవలయును.

సూయెజు మొదలు ఏషియా ఆరంభ మగును. అరె, మరల ఏషియా! నేనేమి ఏషియాటిక్కా, యూరోపియనా లేక అమెరికనా? నేను ఇన్నిటి వింతసంకరమ నని తలచుకొనుచున్నాను. నీవు ధర్మపాలునిగూర్చి వాని గమనములు కార్యములు ఏమియు నాకు వ్రాయలేదు? నాకు గాంధియందునకన్నను ఆతనియందు అక్కఱ హెచ్చు.

ఇక కొన్నిదినాలలో కొలంబోలో దిగుదును. సింహళపు వింతలు విశేషాలు కొంచెము చూడవలయు నని యున్నది గాన ఆపని చేసెదను. ఒకప్పుడు సింహళములో రెండుకోట్ల జనులును పెద్ద రాజధానియు ఉండెను. దాని పాడుపడిన గుఱుతులు నూఱు చదరపు మైళ్ళు వ్యాపించియున్నవి.

సింహళీయులు ద్రావిడులు కారు, అప్పటపు ఆర్యులు. బెంగాలునుండి క్రీ. పూ. 800 లో ఆర్యులు వచ్చి అందు స్థిరనివాస మేర్పఱుచుకొనిరి. అప్పటినుండి వారు వారి దేశమునకు విశదముగ చరిత్రను ఉంచిరి. ప్రాచీనప్రపంచమున అది వ్యాపారమునకు చాల గొప్ప ప్రధానస్థానముగా నుండెను. అందలి అనూరాధపురమును ప్రాచీనుల లండను అన దగును.

షడమట ఎల్లెడలకన్నను నేను రోములో ఎక్కువ ప్రీతి అనుభవించితిని. అందలి పాంపెయిని చూచినంతట నాకు ఈకాలమున నాగరకత యనబడు దానిపైని గౌరవము తొలగిపోయినది. ఆవిరి విద్యుత్తు తప్ప వారికి అన్నియు ఉండినవి. శిల్పమున వారి

ఆశయములును పనితనమును నేటి మనవానికం టెను ఇంతంతనజాల నంత అతిశయమైనవి.

కుమారి లాక్కుతో చెప్పుము—మానవ విగ్రహముల శిలా తక్షణవిద్య ఇండియాలో గ్రీకులలో కాచినంత అభివృద్ధిగాంచ లేదని నేను ఆమెతో చెప్పినది పొరపాటు అని. ఫర్గుసన్నులోను ఇంకను ఇతర ప్రామాణికగ్రంథములలోను ఒరిస్సాలో అనగా జగన్నాథ మున— నేను అక్కడికి ఎప్పుడును పోయి చూడ లేదు లే—పాడుపడిన ప్రాచీన శేషములలో మానవప్రతిమలు, అందమునకుగాని శరీరావ యవ శాస్త్రపరిజ్ఞాన ప్రదర్శన నైపుణికిగాని గ్రీకువిగ్రహాలతో దేనితోగాని సాటికిరాగలవి యున్న వని చదువుచున్నాను. బ్రహ్మాండ మైన మృత్యువిగ్రహ మొకటి యున్నది, అదొక పెద్ద స్త్రీ సంస్థా నపు ఎముకల గూడు, ముడుతలుపడ్డ తోలుతో కప్పబడినది. అది నిజమైన యా దేవత యే అని నమ్మించునట్లున్నది. శారీరకపు సూక్ష్మ వివరముల పొందికచే అది అతిభయంకరముగను బీభత్సముగను ఉన్నది. నా గ్రంథకర్త చెప్పుచున్నాడు—"గోడలోని గూటిలో నుండు ఒక స్త్రీప్రతిమ అంతయు, వ్రేడుకవాసి లేకుండ అచ్చము వీనస్ డిమెడిచివలెనే యున్నది. ఇంకను ఇట్లే ఎన్నియో. విగ్రహా లను ధ్వంసముచేయు మహమ్మదీయులచే చాలవఱకు అన్నియు ధ్వంసము చేసివేయబడినతర్వాత మిగిలినవగు, ఇవియే సకలమగు యూరోపు దేశపు పెంట్రపోవును మించియున్నది"—అని. నేను ఎనిమి దేండ్లు సంచరించితిని, నిపుణతమములగు రచనల ననేకములను చూడ లేదు.

లాక్ సోదరితో మఱియు చెప్పుము,—ఇండియాలో ఒక అడ విలో పాడుపడ్డ దేవళము ఉన్నది, అదియు గ్రీసులోని పార్థినానును, దేనిమార్గమున అది; ఒకటి భావనకును, మఱియొకటి భావనకును వివరములకును గృహనిర్మాణ శిల్పనైపుణ్యపరమావధి యగు నని ఫర్గుసన్ తలంచుచున్నాడు. అర్వాచీనములగు మొగలాయి భవనా దుల శైలి 'భారతీయుల సారసినుల శైలి' మొదలైనవి ఇండియా

ప్రాచీనుల మాదిరులలో శ్లాఘ్యమైనవానితో పోటికి నిలువ జాలదు...

ఇట్లు నా సర్వప్రేమతో
**వివేకానంద.**

మలిమాట:— కేవలము ఆకస్మికముగ చర్చి అమ్మను, పోపునాయనను ఫ్లారెన్సులో చూచితిని. దానినిగూర్చి నీకు ముందే తెలియును.

## 326

(కుమారి మేరీకి)

రామనాథపురము
జనవరి 30, 1897.

నాప్రియ మేరీ,

విషయములన్నియు నాకు చాల వింతగా పరిణమించుచున్నవి. సింహళములో నేను దిగిన కొలంబోనుండి ఇండియాఖండపు దక్షిణపు కొనలో ఇపుడు రామనాథపురరాజాతిథిగా నేనున్నాను. రామనాథ పురమువఱకు నా ప్రయాణము జనుల గుంపులు దీపాల వెలుతురులు స్వాగతోపన్యాసములు మొదలైనవానితోడి పెద్ద యూరేగింపుగా ఐనది—నేను దిగిన ప్రదేశమందు నలువదియడుగుల ఎత్తుగల జ్ఞాపకచిహ్నము కట్టబడుచున్నది. రామనాథపురరాజు "పూజ్యపాదులు పవిత్రమూర్తులునగు స్వాములవారికి" స్వాగతోపన్యాసమును చాల అందముగా నగిషీచేసిన బంగారపు పెద్దబరణిలో ఉంచి బహుమానించినాడు. మదరాసును కలకత్తాయు బొటనవ్రేలికొనపై నిలుచుకొనియున్నట్లు నాకై ఎదురుసూచుచున్నవి. అది ఎట్లున్నదనగా, సకల భరతఖండవాసులును నన్ను గౌరవింప ఒక్కుమ్మడి లేచి నిలుచుకొన్నట్లు ఉన్నది. కావున, మేరీ, నీవు చూచుచున్నావు గదా, నేను నా యదృష్టపు శిఖరాగ్రమున ఉన్నాను. కాని నా మనసు శాంతిప్రవణమై మనము చికాగోలో ఉన్న దినాల విశ్రాంతిని మనఃశాంతిని ప్రేమను తలచుకొని వానిని అనుభవించుచున్నది.

అందుచేత నేను ఇపుడే నీకు ఈ జాబు వ్రాయుచున్నాను. ఇది చేరునప్పటికి మీ రందరు క్షేమముగా ఆరోగ్యముగా మనఃశాంతి గలిగి యుందురు గాక. నేను లండనునుండి మావారికి డాక్టరు బర్రోసును చాల నాదరముతో స్వాగతోపచారము చేయుడని జాబు వ్రాసితిని. ఆప్రకారము వారు ఆయనకు చాలగొప్ప స్వాగతోత్సవము చేసినారు. కాని ఆయన అంత గొప్పవాడని అనుభవమున అనిపించుకొనక పోయినది నా దోషము గాదు. కలకత్తా జనులు తలబిరుసువారు! ఇపుడు బర్రోసు నన్నుగూర్చి ఏమేమో ఈ ప్రపంచమంత అనుకొనుచుండును. అది నాచెవికి వచ్చుచున్నది. అట్టిది ప్రపంచము.

అమ్మకు, నాయనకు, మీ కందఱకు నా సర్వప్రేమ.

భవదీయ ప్రేమయుత

వివేకానంద.

## 327

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

మద్రాసు,

ఫిబ్రవరి 12, 1897.

ప్రియ రాఖాల్,

నేను పై ఆదివారము ఎస్. ఎస్. మొంబాసాలో బయలు దేఱవలసి యున్నది. నాకు ఆరోగ్యము బాగుగా లేనందున పూనా నుండియు ఇంకను ఇతరస్థలములనుండియు వచ్చిన యాహ్వానములను అంగీకరింపజాలకపోయితిని. నేను శ్రమచేతను వేడిమిచేతను చాల కృశించి యున్నాను.

థి—మున్నగువారు నన్ను భయపెట్టగోరిరి. కావున వారికి నా యభిప్రాయమును ఇంచుక తెలుపవలసివచ్చినది. నీ వెఱుగుదువు గదా, నేను తమతో చేరనందుకు వారు అంతకాలము నన్ను అమెరికాలో హింసించినారు. ఇక్కడకూడ వారు దానిని తొడంగ గోరినారు. కాబట్టి నేను నా యభిప్రాయము ఇది యని చెప్పి నా

మీాద సొడ్డులేక చేసికొనవలసియున్నది. అది నా కలకత్తా మిత్రుల కెవరికైనను అప్రియ మగు నేని, వారికి దేవుడే తోడగును గాక. నీకు భయ మక్కఱలేదు. నేను ఎప్పుడును ఒంటరిగా పనిచేయను. నాకు ప్రభువు ఎప్పుడును తోడే. అట్లుగాకున్న నేను ఏమి చేయ జాలుదును?

ఇట్లు నీ
**వివేకానంద.**

మలిమాట :—అన్ని అమర్చి సిద్ధముచేసియున్నట్లైన 'నీవు' ఇంటిని తీసికొనుము.

వి.

## 328

**(శ్రీమతి బుల్సతికి)**

ఆలంబజారు మఠము
కలకత్తా
ఫిబ్రవరి 25, 1897.

ప్రియ శ్రీమతి బుల్సతి,

శారదానందుడు ఇండియాలో క్షామబాధనివారణనాయ మునకై 20 పౌన్లు పంపినాడు. ఐనను ఆతనివీటనే క్షామ మున్నం దున, పాతసామెత అన్నట్లు, ముందు దానిని తీర్చుట మిగుల శ్లాఘ్యమని తలంచితిని. కావున అది ఆ విధముగా వినియోగింప బడినది.

దేశమంతటను ఊరేగింపులేమి, టాంటాం కొట్టించి ప్రఖ్యా పించుట లేమి, ఇంకను ఇతరములైన స్వాగతము చెప్పువిధములేమి —వీనిచే నాకు అన్నట్లుగా చచ్చుటకైనను ఒక నిమిషము తీఱిక లేదు. నేను చాలవఱకు చచ్చిపోయితిని! జన్మదినము దాటిపోగానే నేను కొండలకు ఒక్క దుముకున పోయెదను. కేమ్బ్రిజ్ కాన్ఫ రెన్సు వారును బ్రూక్లిన్ ఎథికల్ అసోసియేషనువారును నాకు అభి వాదన సందేశములు ఒసంగినారు. న్యూయార్కు వేదాంత అసోసి

యేమనువా రొసంగుదురని డాక్టరు జేన్సు జాబులో ప్రస్తావింపబడి నది ఇంకను అందలేదు.

మఱియు డాక్టరు జేన్సువద్దనుండి మీ కాన్ఫరెన్సు-గోష్ఠి-మాదిరికార్యమును ఇక్కడ ఇండియాలోను జరుపదగును అని సూచించుచు, నాకు ఒక జాబు వచ్చినది. ఈ విషయములయెడ ఇంచుకయు శ్రద్ధ కలిగియుండుటకు నాకు శక్యముగాదు. నాకు ఇపుడు అట్లున్నది. అంత విసుగత్తియున్నాను. నాకు కొంత విశ్రాంతి లేకున్న నేను ఇక ఆఱు నెలలైనను బ్రదుకగలనో లేనో ఎఱుగను.

నేను రెండు కేంద్రములను మదరాసులో ఒకటియు, మఱి యొకటి కలకత్తాలోను తొడంగవలసి యున్నది. మదరాసు జనుల ఆస్థయు అక్కఱయు అధికతరములు. అందులకు వలయు ధనమును వారు మదరాసులోనే సమకూర్పగలరు. కలకత్తాజనుల, అనగా దొరలుగా ఉన్నవారి ఉత్సాహము, దేశభక్తిహేతుకము. కాని వారి యాదరము ఎప్పుడును కార్యరూపము దాల్పదు. అంతేగాక, ఇంకను విపరీతముగా, ఆ దేశాన కనికరములేని పట్టి యీర్ష్యాళువులును అసూయువులును అగు జనులు నిండియున్నారు; వారు నా పనిని నాశనముచేయుటకు చేతనైన సర్వప్రయత్నములు చేయుదురు.

ఐనను నాకు ప్రతిఘటన కలిగినపుడు నాలో దయ్యము—ముండి అభినివేశము—రేగునని నీకు బాగుగా తెలియును గదా. ఆ రెండు స్థానములను, ఒకటి సన్న్యాసులకును మఱియొకటి స్త్రీలకును, తొడంగక నేను చనిపోవుదునేని నా ధర్మము పూర్తిగా నెఱవేఱినది కాకపోవును.

నాయొద్ద ఇప్పటికే ఇంగ్లండునుండి 500 పౌనుల పైకము వచ్చియున్నది. శ్రీ స్టర్డివద్దనుండి 500 పౌనులు వచ్చినవి. నీ పైకమును దానితో చేరిన, నేను రెండు కేంద్రములను తొడంగ

శక్తుడ నగుదునని నా నిశ్చయము. కాబట్టి నీవు పైకమును సాధ్యమైనంత త్వరగా నాకు పంపవలయునని నా యభిప్రాయము. దానికి చాల భద్రమగు మార్గము ఏమనగా, ఆ ధనమును అమెరికాలో ఎందేని బాంకులో మన యుభయుల పేరను, ఎవరికి తోచినపుడు వారు అడిగి తీసికొనదగినట్లుగా, నిక్షేపించుట. ఆ ధనము వినియోగింపబడకమునుపే నేను చనిపోవుదునేని, అంతట నీవు దానిని అంతయు తీసికొని, నేను అనుకొనియున్నట్లు, వినియోగింప గల్గుదువు. అట్లైన, ఒకవేళ నేను చనిపోవుదునేని, నా జనము ఎవ్వరును దానిజోలికి పోగలిగియుండరు. ఇంగ్లండునుండి వచ్చిన ధనమును అదే విధముగా శ్రీ స్టర్డీపేర నా పేర మా యుభయుల పేర బాంకులో నిక్షేపింపబడియున్నది.

శారదానందునికి నా ప్రేమ. నీకు నా నిత్యప్రేమయు కృతజ్ఞతయు.

భవదీయేత్యాది
వివేకానంద.

## 329

(శ్రీయుత శరచ్చంద్ర చక్రవర్తి, బి. ఏ. గారికి.)

ఓం నమో భగవతే రామకృష్ణాయ.

డార్జిలింగు
మార్చి 19, 1897.

శుభమస్తు. ఆశీర్వదించి నిన్ను ప్రేమతో ఆలింగనము చేసికొని నేను వ్రాయుచున్న యీ జాబు నీకు ప్రీతి గూర్చునుగాక. నా యీ పాంచభౌతికపంజరము ఇంచుక వాసిగా నున్నది. కొండలకెల్ల గురువగు ఈ హిమవంతుని మంచుగప్పిన రమణీయ శిఖరములు మృతప్రాయులగు జనులను సయితము మరల బ్రదికించునని తలంతును. నాకు అలసటవలని బాధ ఒకంత తొలగిపోయిన దని అనుభవమున తోచుచున్నది. నీవు జాబున వ్రాసి సూచించిన హృదయోద్వేగకరమగు మోక్షాపేక్షను ఇంతకుమునుపే అనుభ

వించితిని. అదియే శాశ్వతమగు బ్రహ్మమందు మనస్సును సమాహితము చేయను ప్రసరించుచున్నది. (మోక్షమును) చేరను వేఱు మార్గము లేదు. 'నాన్యః పన్థా విద్యతేఽయనాయ.' చేసిన కర్మలును ఇకమీద చేయుదమనిపించు కర్మలును తప్పక పూర్తిగ నాశనము నందువఱకు ఈ భావన అత్యధికముగా, నిప్పు మండినట్లుగా, తీక్ష్ణముగా ఉండునుగాక. అంతట సమస్త విషయ ప్రధ్వంసమును దాని వెంటనే బ్రహ్మప్రకాశమును తటాలున కలుగును. నీ హితము కోసము రానున్న ఆ జీవన్ముక్తి నీ యనురాగదార్ఢ్యముచేతనే ఊహింపదగును. ఈ విశ్వములోని సకల మతములకు సమన్వయము చేసిన మహాచార్యుని శ్రీరామకృష్ణుని నీ హృదయస్థానమున ఆవిర్భవింపుమని మరల ప్రార్థింతును. దానంజేసి కృతార్థుడవై నీవు మహా శౌర్యమును ప్రకటముగా పూనినవాడవై లోకములను (జనులను) అజ్ఞానమను మహా సముద్రమునుండి సముద్ధరించుటకు లెస్సగా యత్నింపగలవు. చిరము ఓజస్సున నెలకొన్నవాడవు కమ్ము. ముక్తి, వీరులకే కదా చేతికందును. కాపురుషులకు అందదు. ఓ వీరులారా, నడుములు బిగించుకొండి. మహామోహరూపులగు శత్రువులు ఎదుట నున్నారు. "శ్రేయస్సులకు అనేకములు విఘ్నములు" అందురు కదా. కాబట్టి సంగతి యెంత నిశ్చితమైనదైనను మిక్కిలి ఎక్కువగా యత్నము చేయుము. వీరుగో మోహగ్రాహగ్రస్తులైన జనులు! చూడు, వీరిని హృదయభేదకరమై కారుణ్యపూర్ణమైన వారి శోకనాదమును వినుము. బద్ధుల బంధమును విప్పుటకును, దీనుల క్లేశభారమును సడలించుటకును, అజ్ఞానుల హృదయాంధకూపమును వెలిగించుటకును, నడువుడు ముందుకు, ఓయి వీరులారా, ముందునకు నడువుడు! 'అభీః' 'అభీః' 'నిర్భయులుగ నుండుడు', 'నిర్భయులుగ నుండు' డని వేదాంతభేరి భాంకరించుచున్నది. అందుచే జగన్నివాసులందఱికి హృదయగ్రంథి విడిపోవునుగాక అని.

సదా భవదీయ శుభాకాంక్షి.

వివేకానంద.

## 330

(భారతి సంపాదకురాలు
శ్రీమతి సరళగోశాలునకు)
ఓం తత్సత్

రోజ్ బాంక్
బర్ద్వాన్మహారాజు భవనము
డార్జిలింగు
ఏప్రిల్ 6, 1897.

మాన్యురాలవగు అమ్మా,

నాకు నీవు భారతి పంపినందుకు ఎంతయు కృతజ్ఞుడను. నీబోటి మిక్కిలియు మేధావినుల మెచ్చుకోలును పడయగలిగినది గదా నా యీ క్షుద్రజీవితమును దారవోయుచున్న నా పక్షము అని నేను నన్నెంతో అదృష్టశాలిగా తలంచుకొనుచున్నాను.

ఈజీవితసమరమున, విశేషముగా మన దౌర్భాగ్యపు దేశమున, ఒకక్రొత్త మతమును ప్రారంభించువానికి ప్రోత్సాహము గూర్చు పురుషులే అరుదు ఐ యుండ, అట్టి స్త్రీలు ఉండ రను మాటను మఱి వేఱుగా చెప్పవలయునా? కాబట్టి విదుషియగు ఒక బెంగాలి మహిళ పలుకు ప్రశంస ఈ యిండియాదేశపు పురుషు లందఱు కలిసి బిగ్గఱగా చప్పటలు చఱచి చేయు సాధు వాదమున కన్నను ఎంతయో ప్రశస్త మగును.

పరమేశ్వరుడు ఈదేశమున నీబోంట్లు పెక్కురు స్త్రీలు పుట్టునట్లును వారు ఈ తమమాతృదేశాభివృద్ధికి తమజీవితముల నర్పించునట్లును అనుగ్రహించును గాక.

నీవు భారతిలో నన్నుగూర్చి వ్రాసిన వ్యాసపు విషయమున చెప్పవలసినది కొంత కలదు. అది ఇది. పాశ్చాత్యదేశములలో మత ప్రచారము ఇప్పటివఱకు చేయుటయు, ఇంకను చేయబోవుటయు మనదేశపు మేలుకోసమే. పాశ్చాత్యజనులు మనకు సాయపడ కున్న మనము అభివృద్ధి గన నేర మని నాకు ఎప్పటికిని దృఢముగా

ఏర్పడియుండు నమ్మకము. ఈ దేశమున ఇంకను గుణగ్రహణ పటిమ కుదురలేదు, అర్థబలమును చాలదు, అన్నిటి కంటెను శోచనీయమే మన క్రియాదక్షత ఇంచుకైనను లేదు.

చేయవలసినవి ఎన్నియో కలవు, మఱి వానికి ఈ దేశమున సాధనసంపత్తి లేదు. మనకు బుద్ధి యున్నది గాని చేతులు లేవు. మనకు వేదాంత సిద్ధాంత మున్నది. దానిని అనుష్ఠానమునకు తెచ్చు శక్తి లేదు. మన గ్రంథములలో విశ్వసమతా సిద్ధాంత మున్నది. కాని ఆచరణలో మనము చాలభేదములను పాటింతుము. స్వార్థ రహితముగ, సంగరహితముగ కర్తవ్యమగు పరమోదాత్తకర్మము ఉపదేశింపబడినది మన యిండియాలోనే. మఱి ఆచరణమున మనము అతిక్రూరులము, అత్యంతము హృదయశూన్యులము. మనకు వట్టి మాంసపుముద్ద యగు మన దేహమును గూర్చిన చింత తప్ప మఱి వేఱు చింత లేదు.

అయినప్పటికిని, మనము మనకు ఇపుడు ఉన్న దానిని పట్టుకొనియే గదా పని సాగింప శక్తుల మగుదుము. మఱి వేఱు మార్గము లేదు. ప్రతియొకడును మంచిసెబ్బరల నెఱుంగుశక్తిగలవాడే. మఱి పొరపాటులును భ్రమలును దుఃఖములును నిండియున్న యీ సంసారసాగరతరంగములకు జడియక ఒకచేత కన్నీళ్ళు తుడుచుకొనుచునే మఱియొకచేతితో, నిశ్చలితుడై, విమోచన మార్గము చూపువాడే వీరుడు. ఒకవంక ప్రాచీనసంప్రదాయమును వదలకూడదను మొండిపట్టుదలగల్గి జడపదార్థరాశిని బోలిన జన సముదాయము; వేఱొకవంక విరామము లేకయు ఓపిక లేకయు నిప్పులు విసరు నూతన సంస్కర్త. మంచిత్రోవ ఈ రెంటికి నడుమ నున్నది. తమ బొమ్మలను పూర్ణహృదయముతో ప్రేమించిన అవి సజీవము లగు నను నమ్మకము జపానులో బాలికలకు కల దని వినియుంటిని. జపాను దేశపు బాలిక తనబొమ్మను ఎప్పుడును పగులగొట్టదు. ఓమహాభాగ్యశాలిని, ఇండియాకూడ, తన జనమును, తమకు సంపదవలని అనుగ్రహమును అందమును లేక, తమ

అదృష్టము ధ్వంసమైపోయి, తమ వివేకము శూన్యమయి, సర్కారుచే లెక్క-సేయక తాము పాదమర్దితులగుచు, ఎప్పుడును కూడులేక తాము పస్తుపడుచు, తమలో తాము జగడాలు ఆడు కొనుచు అసూయపడుచు అతిదీనదశలో నుండువారిని, ఎవరైనను తన పూర్ణహృదయముతో ప్రేమించిన, మరల తాను మేలుకొని అభివృద్ధి గాంచు నని నాకు నమ్మకము కలదు. నూర్లకొలది విశాలహృదయులగు పురుషులును స్త్రీలును ఈజీవితభోగముల ననుభవింపవలయు నను తమకోరికల నన్నింటిని మానుకొని, నానాటికి పేదఱికము అజ్ఞానము అను సుడిగుండమున క్రుంగిక్రుంగి అడగారి పోవుచున్న కోట్లకొలది స్వదేశజనుల మేలునకై తాము నిజమగు కోరిక వహించి శక్తికొలది పాటుపడిననే కాని ఇండియా మేలుకొనదు, అభ్యుదయము గాంచదు. నాతుచ్ఛజీవితమున సయితము మంచితలంపులు, సత్యమై అక్కఱగలట్టి ప్రవృత్తియు, అనంతప్రేమయు లోకమును జయింప గల దని నేను అనుభవించి యెఱింగియున్నాను. ఈమంచి లక్షణములు గల ఒక్కడు సయితము కోట్లసంఖ్యల వంచకులయు పశుప్రాయులయు తామసికపు పన్నాగములను నాశనము చేయగలడు.

నేను మరల పడమటికి పోవుట ఇంకను నిశ్చయము కాలేదు. నేను పోవుదునేని, అది యిండియాకోసమే యని యెఱుంగుము. ఈదేశపు జనులబలము ఏది, ఎక్కడున్నది ? ధనబలమేది, ఎక్కడున్నది ? పడమట చాలమంది పురుషులును స్త్రీలును ఇక్కడి యధములగు చండాలురకు సయితము ఇండియామతము ద్వారము ననే ఇండియాకు అలవడిన మార్గముననే సేవచేయను సిద్ధముగా నున్నారు. అట్టివారు ఈదేశమున ఎందఱు ఉన్నారు ? వారికి ధన బలమో ? సన్మానమునకగు ధనమునకై కలకత్తా జనులు నాచేత ఉపన్యాస మిప్పించి దానికి టిక్కెట్లు అమ్మినారు ! ఇందులకై నేను ఎవరిని దూషింపను, తప్పు పట్టను. పడమటినుండి జన – ధన

సాహాయ్యము రాకున్న మనకును క్షేమము అసాధ్యమని తెలుపుట మాత్రమే నాఉద్దేశము.

నీకు సదా కృతజ్ఞుడనై, ఎప్పుడు నీక్షేమమునకై పరమేశ్వరుని ప్రార్థించు,

వివేకానంద.

## 331

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

డార్జిలింగు
ఏప్రిల్ 20, 1897

ప్రియశశీ,

మీరందఱును ఇప్పటికి మదరాసు చేరియైనది, సందియము లేదు. బిలిగిరి నిన్ను కడు జాగ్రత్తతో చూచుకొనుచున్నాడనియు, సదానందుడు నీపరిచారకుడుగా నిన్ను సేవించుచున్నా డనియు నేను అనుకొనుచున్నాను. మదరాసులో పూజ, రాజసగంధమేనియు లేక, సర్వసాత్త్విక పద్ధతిగా జరుపవలయును. ఎవరితోను వాగ్వాదాలకు చొరకు; ఎప్పుడును ప్రశాంత రీతినే, నిల్చుకొనుము. ప్రస్తుతకాలమున శ్రీరామకృష్ణపూజ బిలిగిరియింట స్థాపించి జరుపుచుండుము. అయినను పూజను అతి విస్తృతమును దీర్ఘమును కానీయకు. దానివలన కూడివచ్చు కాలమును తరగతులు పెట్టి జరుపుటకును రవంత ప్రచారోపన్యాసములు సేయుటకును వినియోగింపవలయును. నీకు ఎన్ని సాధ్యమో అన్నియు ఆరంభించుట మంచిది. రెండు వార్తాపత్రికల పనిని పర్యవేక్షించుచుండుము. దానికి నీకు సాధ్యమైనన్ని విధాలను సాయపడుము. బిలిగిరికి ఇరువురు వితంతు కూతులుకలరు. దయగలిగి వారికి చదువు నేర్పుము. వారిగుండ ఇంకను అట్టి వితంతువులు తమమతమున మంచి పూర్ణమూాల శిక్షపొందునట్లును రవంత ఇంగ్లీషును సంస్కృతమును నేర్చుకొనునట్లును విశేష ప్రయత్నము చేయుము. అయినను ఈపనియంతయు కొంచెము దూరమునుండి చేయవలయును. ఎవడుగాని

తరుణస్త్రీలకడ మిక్కిలియు జాగరూకుడుగా నుండవలయును. పతన మొక్కసారి కలిగెనా, ఇకను తప్పించుకొను మార్గము లేనే లేదు. ఆ పాపము క్షమింపరానిది.

గుప్తను కుక్క కఱచినదని విని, నేను చాల దుఃఖము చెందితిని. అయినను ఆ కుక్క పిచ్చిది కాదని వింటిని. కావున దిగులు పడవలసిన కారణము లేదు. ఎట్లయినను, అతడు గంగాధరుడు పంపిన మందు తీసికొనునట్లు చూడుము. ప్రతిదినము వేకువనే సిపూజాది ధర్మములను సంగ్రహముగా ముగింపుము. అంతట బిలిగిరిని సకుటుంబముగా పిలిచి కూర్చుండబెట్టుకొని వారియెదుట గీతను ఇతర పవిత్రగ్రంథములను చదువుము. రాధాకృష్ణుల దివ్యప్రేమను నేర్పవలయు అక్కఱ యించుకయు లేదు. వారికి సీతారాముల పట్లను హరపార్వతుల పట్లను పరిశుద్ధభక్తిని బోధింపుము. ఈ విషయమున ఏమియు పొరపాటు చేయక శ్రద్ధవహింపుము. రాధాకృష్ణుల మధ్యనున్న పవిత్రసంబంధపు కథలు బాలహృదయములకు తగవు, అని జ్ఞప్తియుంచుకొనుము. విశేషముగా బిలిగిరియు, ఇంకను రామానుజాచార్యుల అనుసారులగు నితరులును రామభక్తులు. కావున వారికి సహజసిద్ధమగు పరిశుద్ధ భక్తి ప్రావణ్యమును ఎప్పుడును చెడనీకుండ మిక్కిలి శ్రద్ధవహింపుము.

సాయంకాలములందు పౌరమహాశయులకు పరమార్థవిషయక బోధనము కొంచెము ఒసంగుచుండుము. ఈవిధముగా క్రమముగా కొండను సయితము దాటనగును.

పరిసరము లెల్లపుడును పవిత్రతాపూర్ణములుగ నుండునట్లును వామాచారగంధలేశమైనను చొరకుండునట్లును కనుపెట్టియుండుము. ఇక మిగతవిషయమునకు పరమేశ్వరుడే నీకు దారి చూపగలడు, ఏమియు భయము లేదు. బిలిగిరికి నా సగౌరవాభివాదనములను ప్రేమపురఃసర కుశలప్రశ్నలను అందింపుము. అట్టి భక్తుల కందఱకును నా నమస్కారములను తెలుపుము.

నా జబ్బు ఇపుడు చాల వాసిగా నున్నది. పరమేశ్వరుడు సంకల్పించిన, అది పూర్తిగానే మానిపోవును.

నీకు నా ప్రేమ, ఆశీర్వాదములు, అభినందనములును.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

మలిమాట :—డాక్టరు నంజుండరావుకు నా సవిశేషాభినందనములను ఆశీర్వాదములను అందింపుము. ఆయనకు నీచేతనైనంత సాయము చేయుము. బ్రాహ్మణేతరులను సంస్కృతము నేర్చుకొనుటకును మిక్కిలిగా ప్రోత్సహించుటకు నీశక్తికొలది ప్రయత్నింపుము.

వి.

## 332

(భారతి పత్రికా సంపాదకురాలగు శ్రీమతి సరళాఘోశాలు, బి. ఏ. గారికి)

డార్జిలింగు
ఏప్రిల్ 24, 1897.

అమ్మా,

కార్యవిధానమునుగూర్చి అడిగియుంటివి. దానికి జవాబు వ్రాయుచున్నాను. చాల ముఖ్యముగ నేను చెప్పవలసిన దిది— కోరిన ఫలితములకు అనుగుణమైన పరిమితిలో పనిని ప్రారంభింపవలెను. నీ ఉదారచిత్తమును, దేశభక్తిని, సడలని పట్టుదలనుగూర్చి నా మిత్రురాలు ముల్లరుకన్య చెప్పగా ఎంతో వినియున్నాను. ఇక నీ వైదుష్యమునకు సాక్ష్యము ప్రత్యక్షమే. నా యల్ప జీవితములో నే నెంతవఱకు ప్రయత్నము చేయగల్గితినో తెలిసికొనన నీవు కుతూహలపడుట నా గొప్ప యదృష్టమని తలంచుచున్నాను. నా చేతనైనంతవఱకు దానిని ఇందు నీకు తెల్పెదను. కాని ముందుగా పరిపక్వములైన నా విశ్వాసములను నీ ముందుంచెదను. సమీక్షింతువుగాక.

మనము సదా బానిసలముగానే యుంటిమి. దాయధనముగా తమకు సంక్రమించిన అంతర్జ్యోతిని భారతదేశ ప్రజలు ఎప్పుడుగాని

ప్రకటింప వీలు కలుగలేదు. ఇప్పటికి కొన్ని శతాబ్దములుగ పాశ్చాత్యులు స్వాతంత్ర్యము వైపునకు త్వరితముగ పురోగమించుచున్నారు. భారతదేశమున కులీనత మొదలుకొని భోజ్యాభోజ్య నిర్ణయము వఱకును ప్రభువు చేయవలసిన పనిగా ఉండుట ఆచారము. పాశ్చాత్య దేశములలో ప్రతిపనిని ప్రజలు తమకు తామే చేసికొందురు.

ప్రస్తుతము ఏ సాంఘిక విషయమునుగూర్చిగాని రాజు చెప్పవలసిన దేదియు లేదు. అంతేకాదు, భారత ప్రజలకు ఆత్మవిశ్వాసము బొత్తిగ లేదు. ఇక తమపై తాము వారాధారపడియుండుటను గూర్చి ఏమనగలము? ఆత్మవిశ్వాసము మన వేదాంతమునకు మూలము. ఆత్మవిశ్వాసమును ఇంచుకైన అమలులోనికి తెచ్చుట ఇంతవఱకును జరుగలేదు. కావుననే—కోరిన ప్రయోజనమును గూర్చి మొదట చర్చించుకొనుట. తర్వాత శక్తులన్నిటిని సమకూర్చుకొని దానిని సాధించుకొనుట—అను పాశ్చాత్య పద్ధతి మన దేశమున కుపయోగపడదు. కావుననే విదేశీయుల పరిపాలనలో మనము ప్రాత పద్ధతులను అతిమాత్రముగ అంటిపట్టుకొని యుండువారముగా కనిపించుచున్నాము. ఇదే నిజమగుచో, ప్రజలు చేరి చర్చించుకొని ఏ గొప్ప పనినైనను చేయ ప్రయత్నించుట వ్యర్థమే యగును. "తలయే లేకుండగా తలనొప్పికి ప్రసక్తి యెక్కడిది?" ప్రజ లేరీ? పైగా మన మత్యంత దుర్బలురము. కావున దేనినైనను చర్చింప బూనుకొంటిమేని ఆ చర్చలోనే మన శక్తియంతయు ఖర్చు పడిపోవును. ఇందుకే బెంగాలులో మనకు "ఘోష యెక్కువగను ఉన్ని తక్కువగను" కనిపించుచున్నది. రెండవ విషయము—భారతదేశమున సంపన్నులయొద్దనుండి నేను దేనినిగాని నిరీక్షింపను. యువకులపైనే మన ఆసపాటు. కావున వారిలో చేరి నిశ్శబ్దముగను ఓపికతోను సడలుపాటులేకయు పరిశ్రమించుట శ్రేష్ఠము.

ఇక పనినిగూర్చి—చదువును సభ్యతయు పై తరగతుల వారి నుండి క్రమక్రమముగా క్రిందితరగతులవారిలో ఏనాడు వ్యాపింప నారంభించెనో ఆనాడే పాశ్చాత్య దేశములలో నున్నట్టి ఆధునిక నాగరికతకును ఇండియా ఈజిప్టు రోము మున్నగు దేశములలో నున్నట్టి ప్రాచీననాగరికతకును భేదము హెచ్చినది. ప్రత్యక్షముగ నేను చూచుచున్నాను. విద్యయు విజ్ఞానమును సామాన్యప్రజలలో ఎంత వ్యాపించిన దేశ మంత పెంపొందును. భారత దేశమున అహం కారముచేతను రాజుల నిరంకుశాధికారముచేతను ఉన్న విద్యయు విజ్ఞానమును ఒక పిడికెడుమంది స్వాధీనములో చిక్కుకొనిపోయినది. అదే భారత దేశ వినాశమునకు ముఖ్యకారణము. మనకు మరల ఉన్నతి కలుగవలె నన్న మనమును ఆమార్గమునే అనుసరింపవలసి యుండును. అనగా విద్యను సామాన్యప్రజలలో వ్యాపింపజేయ వలయును. సంఘసంస్కారమునుగూర్చి దాదాపు ఏబదియేండ్లు ఎంతో ఆర్భాటము కావింపబడినది. కడచిన పదేండ్లుగా భారత దేశమున వివిధప్రాంతములగుండ సంచరించుచున్న నాకు దేశము నిండుగ నున్న సంఘసంస్కారసంస్థలు కాననగుచున్నవి. కాని ఎవరి నెత్తుటిని పీల్చుకొని కొందఱు "పెద్దమనుష్యు"లైరో ఇప్పటికిని "పెద్దమనుష్యులు"గానే ఉన్నారో అట్టివారికై ఏర్పడిన సంస్థ ఒక్క టైనను నాకు కన్పింపలేదు. మహమ్మదీయులు సిపాయిలను ఎందఱిని తెచ్చిరి? ఇంగ్లీషువా రెందఱున్నారు? ఆఱురూపాయల వేతనమునకు తమ తండ్రుల-తోబుట్టువుల - కుత్తుకలనే ఖండించు ప్రజలు లక్షల కొలదిగ భారత దేశమున తప్ప వేఱెచ్చట లభింతురు? మహమ్మదీ యులు ఏడువందల సంవత్సరములు పరిపాలించిరి. ఆఱుకోట్ల ప్రజలు మహమ్మదీయులైరి. క్రైస్తవు లిప్పటికి నూటేండ్లుగా పరిపాలించు చున్నారు. ఇరువదిలక్షలమంది క్రైస్తవులైనారు. ఇట్టి స్థితికి కారణ మేమి? దేశీయులకు సొంతబుద్ధి పూర్తిగా నశించినదా? హస్తలాఘ వము గల మనశిల్పులు యూరపియనులతో పోటీచేయలేక నానాటి కంతరించుచున్నా రేల? పెక్కు శతాబ్దులుగా నెలకొనియున్న

ఇంగ్లీషు కార్మికుని జెర్మను కార్మికుడు కదిల్చివేయ గల్గినాడే, ఏశక్తిచేత ?

విద్యాశక్తిచేత, విద్యాశక్తిచేత, విద్యాశక్తిచేత నే! యూరపు నగరములలో పెక్కింటిగుండ సంచారించితిని. పేద ప్రజలకు సైతము అచట నున్న చదువును సౌఖ్యములను చూచితిని. వెంటనే మనపేద ప్రజలస్థితి తలంపునకు వచ్చి కన్నీరు కార్చెడివాడను. —భేదమునకు కారణమేమి ? "విద్యయే" —అను జవాబు నాకు స్ఫురించినది. చదువుచేత ఆత్మవిశ్వాసముచేత వారిలోని బ్రహ్మము మేలుకొనుచుండగా మనలోని బ్రహ్మము క్రమక్రమముగా నిద్రాణ మగుచున్నది. న్యూయార్కులో నేను చూచుట కలవాటు పడిన సంభవము ; —ఐరిషువారు వలసవత్తురు, వచ్చునప్పుడు త్రొక్కి ళ్లకు గుఱియైన వారుగ, పీల్చుకొనిపోయిన మొగములు కలవారుగ, స్వదేశమున ఎట్టి ఆస్తియు లేనివారుగ, పైసా లేనివారుగ, కొయ్య తలలువారుగ—నుందురు. ఒక చేతికఱ్ఱయు దానికొక కొసన వ్రేలు పేలికల మూటయు-ఇదే ఆస్తి. నడకలో జంకు, చూపులో భయము కననగుచుండును. ఆఱు నెలలలో దృశ్యము మాఱి పోవును. వాడు నిగుడుకొని నడచును. దుస్తులు మాఱిపోవును. చూపులలోను నడకలోను ఇక నెట్టి భయలక్షణము లేదు. కారణ మేమి ? మన వేదాంతము చెప్పుచున్నది. ఆ ఐరిషువానికి స్వదేశ మున ఎటు చూచినను తిరస్కారమే. ప్రకృతియంతయు ఏక కంఠ ముగా "అబ్బాయి, నీకిక ఆసపాటు లేదు. బానిసవుగ పుట్టితివి. బానిసవుగనే ఉందువు." అని చెప్పుచుండును. పుట్టినది మొదలు కొని దానినే విని విని వాడు నమ్మి తాను చాలనీచుడనని అను కొను భ్రాంతిలో పడిపోయినాడు. అతనిలోని బ్రహ్మము ముకుళించు కొని పోయినది. అమెరికాలో అడుగిడినాడో లేదో, వెంటనే అన్ని వైపులను అతనికి "అబ్బాయి, మావలె నీవును ఒక మానవుడవు. అన్నిటికిని కర్త మానవుడే. మావంటి నీవంటి మానవుడు ఏ పని నైనను చేయగలడు. ధైర్యము వహింపుము అను ఘోష వినబడి

నది. వాడు తలయెత్తి చూచి అది అంతే అని గుర్తించెను. అతనిలోని బ్రహ్మము మేల్కొనెను. ప్రకృతి స్వయముగ "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత" "లెండి మేలుకొండి, లక్ష్యమును చేరుకొనువఱకును ఆగకుడు" (కఠోపనిషత్తు-I iii 4) అని చెప్పుచున్నదో అనునట్లుండెను.

అట్లే మన బాలురు నేర్చుచున్న విద్యయు చాల (నెగటివ్) అభావరూపమైనది. బడిపిల్లవాడు నేర్చుకొనునదేదియు లేదు. వానిలో గల ప్రతిదియు నశించిపోవును. ఫలితమేమనగా శ్రద్ధ అంతరించును. వేద వేదాంతములందు ముఖ్యముగ ఘోషింపబడు శ్రద్ధ, యము నెదుట నిలబడి ప్రశ్నింపగల ధైర్యము నచికేతునికి నిచ్చిన శ్రద్ధ, ఈ జగమును నడపుచున్న శ్రద్ధ—అట్టి శ్రద్ధ అంతరించును! "అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి" అజ్ఞుడును శ్రద్ధాహీనుడును సంశయించువాడును నశించును." కావున మనము వినాశమునకు అంత సమీపమున నున్నాము. ప్రకృతము దానికి మందు విద్యావ్యాప్తియే. మొట్టమొదట ఆత్మబోధ. ఆత్మబోధ అనగానే జడలుకట్టిన శిరోజములు దండకమండలువులు కొండగుహలు తలంపునకు వచ్చును. కాని నే చెప్పనెంచినదది కాదు. మఱి ఏది? సంసారబంధమునుండి విముక్తినొంద సాధనమగు జ్ఞానము సామాన్య లౌకిక శ్రేయస్సును కల్గింపజాలదా? తప్పక కల్గింపగలదు. స్వేచ్ఛ నిస్సంగత త్యాగము—ఇవన్నియును అత్యున్నతాదర్శములు. కాని "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" "ఈ ధర్మము ఇంచుక ఉండిన చాలు, మహాభయము (జననమరణ భయము) నుండి కాపాడును". ద్వైతిగాని విశిష్టాద్వైతిగాని అద్వైతిగాని శైవుడుగాని వైష్ణవుడుగాని శాక్తుడుగాని బౌద్ధజైనాదులుగాని భారతదేశమున పుట్టువొందిన సకల వర్గములవారును ఈ క్రింది విషయమున ఏకాభిప్రాయులై యున్నారు—జీవాత్మలో అనంతశక్తి దాగి యున్నది.

బ్రహ్మాదిపిపీలికాంతము ఉన్న ఆత్మ అభిన్నము. ఆవిష్కారములో మాత్రమే భేదము. "(నీటి పాఱుదలకు) నిరోధములను హాలికుడు త్రెంచునట్లు" (పతంజలి యోగసూత్రము, కైవల్యపాదము-3) అవకాశమును సరియైన దేశకాలములును సమకూడినప్పుడు వెంటనే ఆశక్తి ఆవిష్కృత మగును. బ్రహ్మాదిస్తంబపర్యంతము వ్యక్తము గనో అవ్యక్తముగనో సన్నిహితమై యున్న శక్తి ఒక్కటే. ప్రతి గడపను ఎక్కి ఆశక్తిని వెలికి తేవలయును.

రెండవది—దానితోగూడ విద్యను గఱపవలెను. చెప్పుట కది సులభమే కాని చేయుట ఎట్లు? మన దేశమున సర్వస్వమును పరిత్యజించిన నిస్స్వార్థబుద్ధులును దయాహృదయులును వేలకొలదిగా నున్నారు. ప్రతిఫలము లేక పారిమార్థిక బోధను కావించుచు వారు సంచరించుచుందురు కదా! అట్లే వారిలో సగముమందినైనను మనకు మిక్కిలి యావశ్యకమైన విద్యకు నిర్వాహకులుగను ఒజ్జలుగను తర్ఫీదు చేయవచ్చును. అందులకు మనకు మొట్టమొదట ప్రతి రాష్ట్ర రాజధానియందును ఒక కేంద్రము కావలయును. ఆ కేంద్రమునుండి మెల్లగా భారతదేశమంతటను వ్యాప్తిని సాధింప వచ్చు. ఇటీవలనే రెండు కేంద్రములు మదరాసులోను కలకత్తా యందును ప్రారంభింపబడినవి. త్వరలోనే మఱికొన్ని కేంద్రము లును ఏర్పడు ఆసపాటు కలదు. బీదలకు కఱపు విద్యలో విశేష భాగము నోటితోనే చెప్పవలెను. బడులు పెట్టుటకు కాల మింకను పరిపక్వము కాలేదు. ఈ ముఖ్య కేంద్రములలో క్రమక్రమముగా వ్యవసాయము పరిశ్రమ మున్నగునవి కఱపబడును. కళలవివృద్ధికై కర్మాగారములు నెలకొల్పబడును. ఈ కర్మాగారములలో తయా రైన సరకులను అమెరికా యూరపులలో అమ్మవలెను. అందుకై ఇప్పటికే ఉన్న సంఘములవంటి సంఘములు ప్రారంభింపబడును. మగవారికై ఏర్పఱుపబడిన కేంద్రములవంటి కేంద్రములు మహిళల కును ఏర్పఱచుట జరూరు. మఱి, ఆపని ఈదేశమున ఎంతకష్టమో మీకు తెలియును. అదియునుగాక "కఱచిన పాము తన విషమును

తానే పీల్చివేయవలయును.'' అట్లే కాలగదని నాదృఢ విశ్వాసము. ఇందులకు వలసిన ధనము పాశ్చాత్యదేశములనుండి రావలయును. అందులకై మన ఆధ్యాత్మిక విద్యను అమెరికాలోను యూరపులోను ప్రచారము చేయవలెను, క్రైస్తవము వంటి మతముల పునాదులను ఆధునిక విజ్ఞానశాస్త్రము కూలద్రోసినది. పైపెచ్చు భోగవ్యసనము ఆధ్యాత్మికాభిరుచిని నిర్మూలింపనున్నది. అమెరికావారును యూరపువారును ఆశతో ఇండియావైపు చూచుచున్నారు. మానవ ప్రేమ చూప ఇదే సమయము. శత్రువులదుర్గముల ఆక్రమించుకొనుట కిదే అదను.

పాశ్చాత్యదేశములలో పలువారు మహిళలు. అధికారమును మాటచెల్లుబడియు అంతయు వారికే. నీవలె ప్రతిభయు ధైర్యమును గల మహిళలు వేదాంత నిష్ణాతలు బోధింప ఇంగ్లండునకు పోదురేని ఏటేట నూర్లకొలది మగువలును మగవారును భారతదేశ మత మవలంబించి ధన్యు లగుదు రను నమ్మకము నాకు కలదు. మనదేశమునుండి పోయిన మహిళ ఒక్కతెయే, రమాబాయ్. ఆమెకు గల ఆంగ్లభాషాజ్ఞానము పాశ్చాత్యవిజ్ఞానశాస్త్ర పరిజ్ఞానము కళాభిజ్ఞత తక్కువే. అయినను ఆమె అందఱిని అబ్బురపఱచినది. నీవంటియొకతె పోవు నేని ఇంగ్లండు సైతము ఉఱ్ఱూతలూగిపోవును. అమరికాను చెప్పనేల? భారతీయ మహిళ భారతీయ వేషమున అచ్చట భారత మహర్షుల వాక్కునుండి వెలువడిన మతమును బోధించిన - ఋషిదృష్టికింబోలె నాకు కననగుచున్నది - పాశ్చాత్యప్రపంచమును పూర్తిగా ముంచివేయ గల మహాతరంగ మొకటి లేచును. మైత్రేయి, ఖానా, లీలావతి, సావిత్రి, ఉభయభారతి వెలసిన ఈదేశమున ఈసాహసము చేయగల మహిళ యుండదా ? దేవు డెఱుగును. ఇంగ్లండును మనము జయింతుము. ఇంగ్లండును మనము హస్తంగతము చేసికొందుము ఆధ్యాత్మికశక్తి చేత. ''నాన్యః పన్థా విద్యతేఽయనాయ'' ''విముక్తికి వేఱొక దారి లేదు'' సంఘములచేత సమావేశములచేత విముక్తి ఎప్పుడైనను

శక్య మగునా? మన ఆధ్యాత్మికశక్తిచేత మన విజేతలను మనము దివ్యులనుగా చేసివేయవలెను. నేనొక అల్పభిక్షువను, పరివ్రాజక సన్న్యాసిని, అసహాయుడను, ఒంటరిని. నే నేమి చేయగలను? ధన శక్తి, ప్రతిభాశక్తి, విద్యాశక్తి నీ కున్నది. నీవు ఈఅవకాశమును పోగొట్టుకొందువా? ఇంగ్లండును యూరపును అమెరికాను జయించుట- ఇదే మన కిప్పుడు ఒకమహామంత్రముగ నుండవలెను. మన దేశక్షేమ మిందులోనేయున్నది. పెరుగుట జీవితలక్షణము. మన ఆధ్యాత్మికాదర్శములతో మనము ప్రపంచమంతట వ్యాపింపవలెను. అయ్యో, ఈదేహము దుర్బలము, పైగా బెంగాలీదేహము. ఈగాసికి ఫలితముగ దీనికి ప్రాణాంతకవ్యాధి దాపురించినది. కాని ఆసపాటున్నది.

"ఉత్పత్స్యతే తు మమ కోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ"

"నాకును సమానధర్ము డొక డున్నాడు లేదా పుట్టగలడు, కాల మనంతము, ఈ పుడమి విశాలము."

ఇక శాకాహారమును గూర్చి నేను చెప్పవలసిన దిది మొదటిది నాగురుదేవుడు శాకాహారియే. కాని దేవికి నివేదించిన మాంసము నిచ్చిన దానిని ఆయన తలపై నిడుకొనెడివాడు. జీవహింస పాపమే, సందేహము లేదు. కాని రసాయనశాస్త్రము పెంపొంది శాకాహారమును మానవదేహమునకు సరిపడునట్లు చేయగలంతవఱకు మాంసమును తినవలసినదే. వేఱుదారి లేదు. అశోకచక్రవర్తి కత్తితో బెదరించి కోట్లకొలది జంతువుల ప్రాణములను కాపాడినా డనుట నిజమే. కాని, అంతకంటె వేయేండ్ల బానిసతనము అధికభయంకరము కాదా? భార్యాదుహితల మానమును రక్షింప, దోపిడిగాండ్ర చేతులనుండి మనబిడ్డలకై కొన్ని కబళములను మిగుల్చుకొన శక్తిహీనులముగ నుండుట ఎక్కువ పాపమా? కొన్ని మేకల ప్రాణములను తీయుట ఎక్కువ పాపమా? బత్తెము సంపాదించుకొనుటకు శరీర కష్టము చేయ

నక్కఅలేని పైతరగతివారు పదుగు రున్నారే, వారు మాంసము తినకుందురుగాక. రాత్రింబగళ్లు శరీరకష్టము చేసి ఆహారము సంపాదించుకోవలసినవారికి శాకాహారమును నిర్బంధముగ విధించుట మనదేశము బానిసదేశ మగుటకు గల కారణములలో నొకటి. మంచి పుష్టికరమైన ఆహారమువలన కలుగు మేలుములకు జపాను దేశమే ఉదాహరణము.

సర్వశక్తి విశ్వేశ్వరి నిడెందమును ఉత్సాహముతో నింపును గాక.

భవదీయ
వివేకానంద.

## 333

(కుమారి మేరీకి)

డార్జిలింగు
ఏప్రిల్ 28, 1897.

ప్రియ మేరీ,

కొన్నాళ్లైనది నీచక్కని జాబు నాకు అంది. నిన్నవచ్చినది హారియట్ వివాహలేఖ. సుఖులగు ఆదంపతులను పరమేశ్వరుడు అనుగ్రహించును గాక.

ఇక్కడ దేశమంతయు ఒక్కటిగా లేచినది నన్ను సంభావించుటకు. ఎక్కడ పట్టినను లక్షలజనులు జయధ్వానములు హర్ష ధ్వానములు చేసిరి. నాబండిని రాజులు లాగుట, రాజధానుల వీథులలో ఎల్లెడల తోరణములు, వానిపై దగదగమెఱయు దీక్షా వాక్యములు నీతిసూక్తులు! ఇంకను ఏమేమో! ఇదంతయు త్వరలోనే గ్రంథాకారమున ప్రకటింపబడును. నీకొక ప్రతిచేరగలదు. అయినను నేను అప్పటికే ఇంగ్లండులోని కష్టమగు కార్యముచే గ్రహచారవశమున అలసిపోయియుంటిని. ఇకను ఈయతిమాత్రపు శ్రమ, విశేషముగా దక్షిణయిండియా యుష్ణోగ్రతతోకూడి నన్ను పూర్తిగా క్రుంగజేసి పడద్రోసినది. కావున నేను ఇండియాలో

తక్కినచోటులను దర్శించు సంకల్పమును మానుకొని మిక్కిలి చేరువ నున్న పర్వతోపరిస్థానమునకు డార్జిలింగుకు ఒక్కగంతున పోయి చేరవలసినవాడ నైతిని. ఇపుడు నాకు చాల వాసిగా నున్నది. ఇంకను ఒక్క నెల అల్మోడాలో ఉందునేని నాకు అంతయు పూర్తిగా మాని పోవును. జ్ఞప్తి కలుగుచున్నది, నేను యూరోపునకు రాగల యొకయాకస్మిక సందర్భమును ఇపుడే కోలుపోయితిని. రాజా అజిత్సింగును ఇంకను పలువురు రాజులును పై శనివారము ఇంగ్లండుకు తరలుదురు. వారు తమతో నేనుకూడ రావలయునని అవశ్యముగా ఎంతయో కోరిరి. కాని గ్రహచారవశమున వైద్యులు నేను ఇపుడే ఏశారీరక మానసిక క్లేశమును పూనగూడ దని నిషేధించినారు. కావున ఎంతయో మనఃఖేదముతో, సరే తరువాత త్వరలోనే పోవచ్చునులే అని, దానిని మానుకొనవలసిన వాడ నైతిని.

డాక్టరుబర్ట్రోసు ఇప్పటికి అమెరికా చేరియుండును అని యనుకొందును. పాపము! ఆయన పరమతాసహన రూపమగు క్రైస్తుమతమును ప్రచారము చేసి బోధింపవలయునని వచ్చినాడు! కాని, మామూలు ప్రకారమే ఆయనమాటలను ఎవరును వినలేదు. ఆయనకు చాలదయతోడనే స్వాగతము పలికి ఆతిథ్యమిడినారు. అందుల కేమి కొదువ లేదు. ఐనను ఆపని చేయించినది నాజాబు. అతనికి నేను వివేకము కఱప జాల నైతిని. అంతేకాదు. ఆయన వింతమనుష్యుడుగా తోచుచున్నాడు. నేను ఇటు ఇంటికి మరలినందులకైన మాసర్వదేశజనుల సంతోష వ్యాపారముల జూడగా అతనికి పిచ్చిపట్టిన ట్లయినదని వార్తవింటిని. ఎటుచూచినను మీరు అంతకన్న తెలివిగలవాని నొకనిని పంపియుండవలసినది. ఏలన ఆమతముల మహాసభ డాక్టరుబర్ట్రోసుచేత హిందువుల చిత్తమునకు ఒక ప్రహసనముగా చేయబడినది. ఆధ్యాత్మికశాస్త్ర విషయమున ఈలోకములో హిందువులకు వెలుతురు చూపగలశక్తి ఏదేశమువారికిని లేదు. క్రైస్తుదేశమునుండి ఇక్కడికి వచ్చిన వారం

దఱును క్రైస్తవులలో బలవంతులును ధనవంతులును అగుటచేతను, హిందువులు అట్టివారు కామిచేతను క్రైస్తవమతము హిందూమతమున కన్నను మేలైనది అను అప్రాతవడ్డ వాదమును చేయు — మూర్ఖులుగనే ఉన్నారు. అదివింతె. దానికి హిందువులు నేర్పుమీఱ మిక్కిలి సూటిగా బదులిడుదురు — "కావుననే హిందూమతము మతము. క్రైస్తవమతము మతము గాదు. ఏలన మృగప్రాయమగు ఈలోకాన వంచకత్వము — వంచకత్వమొక్కటే నెగ్గును అభ్యుదయమును గాంచును, ధర్మము ఎప్పుడును కష్టాల పాలగును. పాశ్చాత్యదేశీయులు పదార్థరసాయనాదిశాస్త్రములలో ఎంతటి ప్రావీణ్యముగలవారైనను, ఆధ్యాత్మిక పారమార్థికవిద్యలో కేవలము శిశుప్రాయులని తోచుచున్నది. పదార్థాదిశాస్త్రము కేవలము ఐహికలౌకికాభ్యుదయమును ఈగలదు. పారమార్థికశాస్త్రము, ఆత్మవిద్య, నిత్యశాశ్వతజీవితమును ఈగలదు. ఒకవేళ శాశ్వత జీవితము లేకున్నను పరమోద్దేశములగు పారమార్థికపు తలంపుల ఆనందానుభవము మఱింతచుఱుకై మానవుని సౌఖ్యవత్తరునిగా చేయును. ఐహికసంపదకై తెలివిమాలినడచుకొనుటెల్ల ఒండొరుల పోటీకిని, మితిలేని తృష్ణకును, వ్యష్టివినాశమునకును సమష్టివినాశనమునకును కారణ మగును.

ఈడార్జిలింగు కడురమణీయమైన స్థానము. ఇక్కడనుండి అప్పుడప్పుడు మేఘములు అడ్డముతొలగి అవకాశముకలిగినపుడెల్ల దివ్యమగు కాంచనజంగ (27,579 అడుగుల యెత్తైనది) చూడనగుచుండును. మఱియు ఇక్కడి యొక కొండమీదినుండి అపుడపుడు 29,700 అడుగుల యెత్తుగల గౌరీశంకరమును పొడకట్టుచుండును. అంతేకాదు. ఇక్కడి జనులు సయితము - టిబెట్టువారును నేపాళులును, ఇంకను, అందఱికి పైగా, చాల అందగత్తెలగు లెప్చ స్త్రీలును — వ్రాసిన బొమ్మలవలె మనస్సును హరించుచుందురు. చికాగోలోని కోల్స్టన్ టరన్బుల్ అను ఒకాయనను నీవు ఎఱుగుదువా ? అతడు నేను ఇండియా చేరుటకు కొన్ని వారములు ముందు

ఇక్కడికి వచ్చియుండెను. అతనికి నాపై ఎక్కువప్రీతి కలిగియుండి నట్లున్నది. దానివలన ఇక్కడి హిందూజనులు అందఱు అతనిని మిక్కిలి యిష్టపడుచుండిరి. జో, శ్రీమతి ఆడమ్సు, సోదరిజో సెస్ఫైర్, ఇంకను తక్కిన మనమిత్రులు — వీరందఱిని గూర్చిన విశేషము లేవి ? మనప్రియమైన మిల్లులు ఎక్కడ ఉన్నారు ? మెల్లగానైనను నిశ్చయముగా 'పిండికొట్టు'చున్నారా ? నేను హారియెట్టుకు కొన్ని పెండ్లి బహుమానములు పంపగోరితిని. అయినను నీవందువే 'భయంకర'విధులని, వానివలన ఆపనిని సమీప కాలాంతరమునకు నెట్టుకొన వలసినవాడ నైతిని. బహుశః వారిని చాలత్వరలోనే యూరపులో కలసికొందునేమో. నీవు నీవివాహనిమిత్తనిశ్చితార్థమును నాకు తెలుపజాలియున్న, నేను సందేహములేకుండ మిక్కిలి సంతోషించి యుందును. సావాగ్దానము ప్రకారము ఒకజాబులో అరడజను కాగితాలను నింపుదును.

నాశిరోజములు కట్టలుకట్టలుగా నరిసిపోవుచున్నవి. నామొగ మంతటను ముడుతలుపడుచున్నవి. ఆకండలు కరగుటచే నా వయస్సు ఇకను ఇరువది యేండ్లు పెరిగినది. నాకు ఇపుడు వడివడిగా కండరములు తగ్గిపోవుచున్నవి. ఏలన రొట్టెలేదు, వరియన్నములేదు, ఉర్లగడ్డలులేవు, కాఫీలో ఒకచక్కెర పలుకైనను లేదు. కేవలము మాంసమే ఆహారముగా తినుచున్నాను! నేను ఒకబ్రాహ్మణ కుటుంబముతో నివసించుచున్నాను. వారిలో, స్త్రీలుతప్ప, తక్కిన యందఱును మోకాలివఱకు ఉండుపొట్టిచల్లాడములు తొడుగు కొందురు. నేనును ఇపుడు అట్టియొకదానినే తొడుగుకొనియున్నాను. కొండజింకవలె శిలనుండి శిలమీదికి దూకుచును, కొండరస్తాలలో నాబలమంతయు పూని పైకి క్రిందికి పెనుదాటుల దాడుసేయుచును ఉండగా, నీవు చూతువేని, నేను నీకు ఎంతయో ఆకస్మికవిస్మయము కలిగించియుందును.

నేను ఇక్కడ చాల హాయిగా ఉన్నాను. ఏలన మైదానములలో జీవితము యాతనమై పోయినది. నేను వీథులలో నాముక్కు

కొనను ముందుకు చూపినను అంతలో ఒకవింతగుంపుజనులు మూగుదురు! కీర్తి అంతయు పాలును తేనెయు కాదు! నేనొక పెద్దదాడి పెంచబోవుచున్నాను. ఇపుడ దంతయు నరిసిపోవుచున్నది. అది పూజనీయమగు ఆకారమును కలిగించును. అమెరికనుల వృథాదూషణలనుండి కాపాడును. ఓ నరిసిన వెంట్రుకలారా, మీరు ఎంతదాపగలరే! కీర్తియంతయు మీకే! జయము జయము మీకు!

తపాలుకాలము కావచ్చినది. కావున ముగించుచున్నాను. మంచికలలు మంచి ఆరోగ్యము అన్ని దీవెనలు నీకు సిద్ధించును గాక.

నాయనకు అమ్మకు మీకందఱకు నా ప్రేమ!

నీవాడను,

**వివేకానంద.**

## 334

ఆలంబజారు మఠము

కలకత్తా

మే 5, 1897.

ప్రియ—

నేను ధ్వంసమైపోయిన నాయారోగ్యమును మరల బడయుటకై ఒక నెలకాలము డార్జీలింగుకు పోయియుంటిని. ఇపుడు నాకు చాల వాసిగా నున్నది. డార్జీలింగులో నారోగము చాలవఱకు మాయమై పోయినది. నేను రేపు అల్మోడాయను మఱియొక పర్వతస్థానమునకు ఈవాసిని పూర్తి చేసికొనుటకై పోవుచున్నాను.

దేశము సర్వమును ఒక్కమనుష్యునివలె లేచి సన్మానగౌరవించినను, జనులు నాపై ఎంతో వేదురుగొన్నను, నేను ఇంతకు మునుపునీకు వ్రాసియున్నట్లు ఇక్కడి విషయములు నాకేమియు ఆశాజనకములుగా కానరాకున్నవి! ఇండియాలో క్రియాభాగము

ఉండదు. అంతే కాదు. కలకత్తా సమీపమున భూమి వెల చాల పెరిగిపోయినది. ప్రస్తుతకాలమున నాయభిప్రాయ మే మనగా, మూడురాజధానులలో మూడు కేంద్రములు ఏర్పఱిచి (పని) తొడంగ వలయును అని. వానిని నాతరిబీదుబడులుగా ఉంచుకొని, వాని నుండి నేను ఇండియా యంతటిపైకిని ఎత్తిపోయి ఆక్రమింపవలయు నని కోరుదును.

ఇండియా, ఇకకొన్నియేండ్లు నేను ఉన్నను. లేకపోయి నను ఏమి, ఇప్పటికే రామకృష్ణునిదై పోయినది.

ప్రొఫెసరుజేమ్సు ఎంతయో దయగలిగి నాకు ఒకజాబు వ్రాసి నాడు. అందు మిక్కిలి హీనస్థితికి వచ్చిన బౌద్ధమతమును గూర్చిన నాయెత్తిచూపిన విషయములను తాను ఎత్తిచూపియున్నాడు. నీవును వ్రాసితివి, ధర్మపాలునికి ఆవిషయమున చాలకోపము వచ్చి యున్నది అని. శ్రీ ధర్మపాలుడు మంచివాడు. నాకు అతని మీద ప్రేమే. కాని అతడు ఇండియా విషయములపై ఉద్రిక్తుడగుట ఎంతయు తప్పు.

ఆధునిక హిందూమత మనునది దాని సర్వవికారములతో కూడి అభివృద్ధి ఆగి మోదువడిన బౌద్ధమతమే, వేఱొకటి గాదు. హిందువులు ఈసంగతిని విశదముగా ఎఱుగుదురు గాక. అట్లెఱిగి నట్లైన, వారేమియు గొణుగక సులభముగా వానిని మాను కొందురు. బుద్ధుడుపదేశించిన ప్రాచీనరూపపు బౌద్ధమతమునెడను బుద్ధుని యెడను నాకు ఎంతేని గౌరవము గలదు. మనము హిందు వులము ఆయన నొక యవతారముగా పూజింతుమనుట నీవు చక్కగా ఎఱింగినదే. సింహళపు బౌద్ధమతమును అంతే, ఏమియు అంతకంటె మేలుగాదు. నాసింహళదర్శనము నాభ్రాంతుల నన్నిం టిని తొలగించినది. అక్కడ ఇప్పుడు జీవించియుండు జనులు హిందు వులే. బౌద్ధు లందఱు యూరోపియనులుగా మాఱిపోయినారు. శ్రీ ధర్మపాలుడును ఆయననాయనయు యూరోపియను పేరులు పెట్టుకొనియుండిరి – ఇటీవల వారు మార్చుకొన్నారులే. ఇపుడచటి

బౌద్ధులు అహింసా సిద్ధాంతమును గౌరవించు తెఱంగు ఎక్కడ చూచినను కసాయియంగళ్ళు పెట్టుట! వారి మతగురువులు దానిని ప్రోత్సహింతురు. నిజమైన బౌద్ధమతము ఇప్పటికిని చాల మేలు సేయు నని నేను ఒకప్పుడు తలంచితిని. మఱి ఆయభిప్రాయమును బొత్తిగా మానుకొన్నాను. బౌద్ధమతము ఏల ఇండియానుండి తఱుమ గొట్టబడినదో ఆకారణము నాకు స్పష్టముగా అగపడుచున్నది. సింహాళీయులు బౌద్ధమత శేషము ఇంకను ఏమేని ఇం దున్న దానిని ఆభయంకర విగ్రహాలతోను అవినీతికరమగు ఆపోకిరి ఆచారముల తోను కర్మలతోను గూడ పెకలించుకొనిపోయిన మన మెంతయో సంతోషింపదగును.

థియాసఫిమతమువారినిగూర్చి – ఒకసంగతి నీకు జ్ఞప్తి యుండవలయును – థియాసఫి మతమువారును బౌద్ధమతమువారును మన యిండియాలో ఊరుగాని పేరుగాని మఱి యే లెక్కగాని లేని వారు. వారు ఏవో కొన్ని పత్రికలు ప్రకటించి, ఎంతయో బురదను వెదజల్లి, పాశ్చాత్యుల చెవుల కెక్క ప్రయత్నింతురు.

నేను అమెరికాలో ఒకమనుష్యుడను, ఇక్కడ వేఱొక మనుష్యుడను. ఇక్కడ దేశీయు లందఱు నన్ను తమ ప్రమాణపురుషు నిగా పరిగణించుచున్నారు; అక్కడనో అందఱిచేతను దూషింపబడు ఒకమతప్రచారబోధకుడను. ఇక్కడ రాజులు నాబండిని లాగు దురు; అక్కడ నన్ను మేలితరగతి హోటలులోనికైనను రానీయరు. కాబట్టి నావచనములు అవి కొందఱికి ఎంత అప్రియములుగా నున్నను ఇక్కడ మనుష్యజాతియంతటికిని, నాజనులకందఱికిని, మేలుకూర్చునవిగ నుండవలయును. అంగీకారము, ప్రేమ, సత్యము తోను ఆర్జవముతోను కూడుకొన్న అన్నిటిమెడను ఓర్తు. వంచనను కపటతను ఎన్నడును ఓర్వగూడదు. నేను ఇపుడు ఇండియాలో ప్రమాణపదవిలో ఉన్నందున — వారు నాతో ఇచ్చకములాడి నన్ను మిథ్యాప్రశంసలు చేయప్రయత్నించిరి. కావున వారిమోసము లకు చెల్లుబడి కలిగించినవాడ నగుదునేమో అని తలంచి, నేను

నాపనిని కొన్ని ధీరోక్తులు నిష్కర్షగా పలికి ఆపవలసివచ్చినది. నేను అట్లే కావించితిని. నేను చాల సంతోషముతో ఉన్నాను. నాయారోగ్యము నాకు అనుకూలముగా ఉండియున్న నేను ఇప్పటికి ఆచెడిబతికినవారిని ఇండియాలోనే లేకుండ చేసియుందును. అందులకై నాపూర్తి ప్రయత్నమునైనను చేసియుందును...... నేను చెప్పెదును, విను, ఇండియా ఇప్పటికే రామకృష్ణునిదైపోయినది. పరిశుద్ధముచేయబడిన హిందూమతముకొరకు నేను ఇక్కడ నాపనిని రవంత అంగోపాంగములతో కూర్చితిని.

నీవాడను,

వివేకానంద.

## 335

(సోదరి నివేదితకు)

బేలూరు మఠము
కలకత్తా
మే 5, 1897.

నాప్రియ కుమారి నోబుల్,

మిక్కిలిమైన దయాప్రేమలతో నాకు ఎంతేని యుత్సాహము కలిగించు నీజాబు నీవనుకొన్నంత కంటెను నాకు బలము కలిగించినది.

మానవుడు తన్ను పూర్తిగా నిరాశాహతునిగా తలంచుకొను సమయము ఉన్నది, సందేహము లేదు. — అందును విశేషముగా తానొక పరమోద్దేశమును మనస్సులో ఉంచుకొని దానికై తన యావజ్జీవము పాటుపడి, అది ఒకపాటియైనను. నిర్వ్యాఘమగును గదా అను ఆశకలిగిన ఆక్షణముననే దానికి ఒక భయంకరమగు పెట్టు, విఘాతము తగిలిన, అప్పుడు అట్లనుకొనును. నేను రోగమును లక్ష్యపెట్టను. మఱి నన్ను నిరుత్సాహపఱుచునది యే మనగా, నాపరమోద్దేశముల సాధింప బ్రయత్నించుటకు, నాకు ఇప్పటికి ఇంచుక యవకాశమైనను దొరకలేదే - అది. నీవెఱుగుదువు గదా, అందుల కున్న కష్టము అర్థికము.

హిందువులు ఊరేగింపులు అవి ఇవి చేయుచున్నారు కాని వారు ధన మీయజాలరు. ఈలోకములో నేను పొందిన సాయము ఒక్కటి మాత్రమే, అది యింగ్లండులో కుమారి మే —— వలనను శ్రీ స —— వలనను. అక్కడ నుండగా ఒక వేయిపౌనులు కలకత్తా లోని ప్రధాన కేంద్రమును తొడంగుటకైనను చాలియుండునని తలంచితిని. ఆ నా అంచన ఇప్పటికి పదిపండ్రెండేండ్లకు ముందటి నాకలకత్తాయనుభవమును బట్టి వేసినది. ఇటీవల వెలలు మూడు నాలుగింతలు పెరిగిపోయినవి.

ఎట్లైనను పని తొడంగబడినది. ఒకశిథిలమైన ప్రాతచిన్న యిల్లు 6, 7, షిల్లింగుల అద్దెకు తీసికొనబడినది. అందు దాదాపు ఇరువదినలుగురు యువకులు తరిబీదుచేయబడుచున్నారు. నేను నాయారోగ్యమును మరలపొందుటకు ఒక నెల డార్జిలింగుకు పోవలసి యుండినది. ఇపుడు నాకు చాల వాసిగా ఉన్నది. ఆమాట నీకు తెలుపుటకు నాకు సంతోషము. నేను . మందు ఏమియు తీసికొన లేదు సుమా, నీ వా మాటను నమ్ముదువా ? కేవలము మానసిక చికిత్సయే ! మైదానములలో అత్యుష్ణము. నేను రేపు మఱియొక పర్వతస్థానమునకు పోవుచున్నాను. నీసమాజము ఇంకనుసప్రాణమే, నాకు నిశ్చయము. ఇక్కడ జరుగు పనినిగూర్చి నీకు నెలకొక తూటి మైనను వృత్తాంతమును తెలుపుచుందును. లండను పని సరిగా జరుగుటయే లే దని నాకు వార్త వచ్చుచున్నది. అదియే ముఖ్య మైన కారణము, నన్ను అక్కడికి జూబిలీకోసము వచ్చుచుండు రాజులు తమతో రమ్మని యెంత పిలిచినను నేను, ఇంగ్లండుకు రానందులకు. నేను అక్కడ ఎంతయో పాటుపడవలసియుండును, వేదాంతమున మరల శ్రద్ధకలిగించుటకు. అది మరల మిక్కిలి యైన శారీరక క్లేశమే గదా యగును.

ఐనను నేను ఒక నెలదినాలపాటి -అక్కడ ఉండగలయట్లు త్వరలోనే రావచ్చును. ఇక్కడ నాకార్యము ఆరంభ మగుటను

నేను చూడగాంతునేని, నేను ఎంత సంతోషముగాను స్వేచ్ఛగాను ప్రయాణములు చేయుదునో గదా!

ఇంతవఱకు పనినిగూర్చి. ఇకను సొంతముగా నిన్నుగూర్చి. అట్టి నీప్రేమ, నీనమ్మకము, నీభక్తి, నీగుణానురాగము, నీమెచ్చుకోలు, — అవి నాప్రియకుమారీ నోబులూ ఎవని కేని ఈజీవితమున పడ్డపాటునకు నూటింతపైనకల్గిన ప్రతిఫలమగును. అన్ని దీవెనలు నీకు ఫలించునుగాక. నాజీవిత మంతయు, మామాతృభాషలోమే మనునట్లు, నీసేవకు సిద్ధముగా నున్నది.

నీవద్దనుండియు, ఇంగ్లండులో మఱి రేమిత్రులవద్దనుండియు వచ్చు ఏజాబులును ఎప్పుడును మనఃప్రియములు గాక, ఉండినది లేదు, ఇక నెన్నడును ఉండ బోదు. శ్రీ హేమండును ఆయన శ్రీమతియు దయార్ద్రములును రమణీయములును అగు రెండు జాబులు వ్రాసినారు. శ్రీ హేమండు బ్రహ్మవాదిన్ పత్రికలో ఒక ముచ్చటమైన పద్యమును, నాకు అందులకు అర్హత లేకున్నను, నన్నుగూర్చి వ్రాసినాడు. నేను హిమాలయమునుండి నీకు మరల వ్రాసెదను. అక్కడ, ఈమాద్పుమైదానములలోని కన్నను,ఆహిమదర్శనమున తలపులు విశదములుగను నరములు బలవంతములుగను ఉండును. కుమారి ముల్లరు ఇప్పటికే అల్మోడాలో ఉన్నది. శ్రీమంతులు సేవియరుదంపతులు సిమ్లాకు పోవుదురు. ఇంతకాలము వారు డార్జిలింగులో ఉండినారు. ప్రియమిత్రమా, ఇట్లు విషయములు వచ్చుచు పోవుచు ఉండును. పరమేశ్వరు డొక్కడే మార్పు లేనివాడు, ప్రేమమయుడు. ఆపరమేశ్వరుడు నీహృదయమును తన నిత్యవాసస్థానముగా చేసికొనవలయునని సదా ప్రార్థన,

వివేకానంద.

## 336

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

అల్మోడా
మే 20, 1897.

నాప్రియ రాఖాల్,

నీజాబువలన నాకు ముఖ్య సమాచారము లన్నియు తెలిసినవి. సుధీరునొద్దనుండియు ఒకజాబు వచ్చినది. మనమాస్టరు మహాశయునివద్దనుండియు ఒకటి వచ్చినది. నిత్యానందుని (యోగేన్ ఛాటర్జీ) వద్దనుండియు. క్షామపీడ ప్రదేశములనుండి రెండు జాబులు వచ్చినవి.

ఇప్పుడను ధనము నీళ్ళమీద తేలియాడుచున్నట్లు ఉన్నది.........అయినను అది తప్పక రాగలదు. అది వచ్చినపుడు భవనములు భూమి ఒకశాశ్వతనిధి-ప్రతిది సరిగా రాగలదు. అయినను పొదిగి పిల్లలు ఏర్పడునంతవఱకు ఎవరును నిశ్చయము కలిగి యుండ లేరు. నేను ఇకను రెండుమూడు నెలలలోపల ఉష్ణోగ్రపుమైదానములకు దిగిపోబోను. తరువాత నేను ప్రయాణము వెడలి తప్పక కొంతధనము సంపాదింతును. ఇది ఇట్లగుట చే, ఎనిమిది కాతాల వెడల్పుగల ఆభూమి సంపాదింప సాధ్యపడదని నీవు తలంతువేని, ఉత్తపుణ్యానకు దానిని నీవుపోగొట్టుకొనుచున్నట్లు. మధ్యస్థపు కొనుగోలువానికి సంచకారము చెల్లించుటవలన కీడేమియు లేదు. ఈవిషయములలోనెల్ల నీవివేకమునే వినియోగింపుము. ఇంతకన్న ఇక నేమియు నేను సలహా చెప్పజాలను. తొందరవలన పొరపాటు చేయు దైవయోగము విశేషముగా నున్నది.........మాస్టరు మహాశయునితో ఆయన చెప్పినది నాకు చాల సమ్మతమే అని చెప్పుము.

గంగాధరునికి అక్కడ బిచ్చమెత్తుట మొదలగునవి కష్టమని తోచిన, అతడు తనసొంతడబ్బు ఖర్చుపెట్టియే తనకు భోజమున సంపాదించుకొనవలయును. ఉపేన్ పత్రిక 'వసుమతి'లో ప్రతివారము అత డొక జాబు ప్రకటింపవలయును. ఆపక్షమున ఇతరు

లును సాయము చేయ వచ్చును - అను ఈవిషయమును గంగా ధరునికి వ్రాయుము.

శశి వ్రాసిన ఒకజాబువలన అతనికి నిర్భయానందుడు కావలసి యున్న దని తెలిసినది. ఈమార్గము శ్లాఘ్యతమ మని నీకు తోచి నట్లైన నిర్భయానందుని పంపుము, గుప్తను వెనుకకు పిలిపించు కొనుము. బెంగాలీలో నున్న మఠము విధులు చట్టములు, ఒకప్రతి శశికి పంపుము. బెంగాలీ కాకున్న ఇంగ్లీషులో నున్నవయినను సరే. పంపి, అక్కడి పని చట్టాలు విధులు అనుసరించి జరుప బడునట్లు చూచుకొమ్ము, అని అతనికి జాబు వ్రాయుము.

కలకత్తాలో సమాజము — అసోసియేషను — చక్కగా జరుగుచున్న దని తెలియుచున్నది. చాల సంతోషము. ఎవరైనను ఒకరు ఇరువురు చేరకున్నను పరవా లేదు. కాలక్రమమున ప్రతి యొకడును వచ్చును. ప్రతియొక్కనితోను స్నేహముగాను, సమ భావముగాను ఉండుము. మధురవాక్కులు చాలదూరమునను విన బడును. ప్రయత్నించి క్రొత్తవారిని వచ్చునట్లు చేయుట విశేష ముగా ఆవశ్యకము. మనకు అధికాధికముగా క్రొత్తసభ్యులు కావలయును.

యోగిను క్షేమముగా ఉన్నాడు. అల్మోడాలో ఎక్కువ వేడిగా నున్నందున, నేను ఇప్పుడు అక్కడికి ఇరువదిమైళ్ళదూర మున ఉన్న దివ్యమైన ఒకతోటలో ఉన్నాను. అక్కడి కంటె ఇక్కడ చల్లగా ఉన్నది కాని, ఇంకను నా కేమో వెచ్చగానే ఉన్నది. కలకత్తాలో కన్నను వేడి అంత విశేషముగా తక్కువ గాదు.

నాకు ఉండిన జ్వరలక్షణములన్ని పోయినవి. నేను ఇంత కన్న చల్లనిచోటికి పోవ ప్రయత్నించుచున్నాను. ఉష్ణమువలనను నడకగాసివలనను నాకు కాలేయ సంబంధమైన బాధ కలుగును. గాలి ఇక్కడ చాల పొడిగా నుండును. దానివలన నాముక్కులో సర్వకాలము మంటగా నుండును. నాలుక, కొయ్యవాటి ఉండును.

ఇకను నన్ను ఆక్షేపింపకు. అట్లుగాకున్న, నేను ఇప్పటికిని హాయిగా ఇంతకన్నను చల్లనిచోటికి పోయియుందును. "............... ఎప్పటికిని పథ్యనియమములను పాటింపుము" ఏమి కుచ్ఛకూతలు నీవు పలికినది? నీవు నిజముగా ఈమూర్ఖుల మాటలకు చెవి యొగ్గుదువా? మినుపప్పున గుణముయున్నదని నీవు నన్ను దానిని తిననీకుండుట వంటిదే ఇదియు. ఇంకను విశేష మేమనగా, వరి యన్నమును పొట్టునకు వేసి తినిన, అందు గుణముండదు! ఏమి యద్భుతమైన జ్ఞానమోయి, నాప్రియుడా! ఈవిషయమున నిజ మేమనగా, నాప్రాతస్వభావము మరల వచ్చుచున్నది. అది నాకు స్పష్టముగా కనపడుచున్నది. ఈ దేశభాగమున, ఇపుడు, నేలగ మంతయు ఇక్కడి రంగును రకమును పొందుచున్నది. రాత్రులు నాయాహారమును చాల తేలిక - లఘువు - చేయవలయు నని తలచుచున్నాను. ఉదయమునను మధ్యాహ్నమునను కుపుపిండ తినెదను. రాత్రులు పాలుపండ్లు మొదలైనవి మాత్రమే. అందుకే పండ్లు దొరకును నేను కనుక ఈ పండ్లతోటలో ఉన్నాను! నీకు తెలియలేదా ?

నీ వేమియు దిగులుపడకు. శివుని సహవాసి అంత త్వరగా చనిపోవునా? ఇప్పుడే సాయంకాలము [illegible]. ఇక రాత్రి యంతయు పాటుపాడవలసియున్నది. ఈ దినాలలో నా స్వభావమున హెచ్చుగా కోపగించుకొను గుణము లేదు. నాజ్వరలక్షణము కాలేయమువలననే. నాకది స్పష్టముగా తెలియుచున్నది. సరి. నేను దానినికూడ నావశమునకు తెచ్చుకొందును. ఏమిభయము?... ధైర్యముగా బలోత్సాహములు వహింపుము, పనిచేయుము. ప్రబలమైన గడబిడ చేయకుము.

మఠములో అందరికిని నాప్రేమను అందింపుము. ఈసారి రాగల సభాసమావేశమున అందరికిని నాకుశలప్రశ్నను అందింపుము. వారితో నేను శారీరకముగ ఉండకున్నను మానస

సికముగ ఉన్నానని చెప్పుము. ఏలన అక్కడ పరమేశ్వరునినామము పాడబడును గదా - "యావ త్తవ కథా రామ సఞ్చరిష్యతి మేదినీమ్". 'రామా, ఎందాక నీచరితము ఈభూమిపై అంతటను చుట్టి వచ్చుచుండునో' అని అన్నాడు గదా. ఏలన, నీవెలుగుదువు గదా, ఆత్మ సర్వవ్యాపి.

ప్రేమపూర్వకముగా నీవాడు
**వివేకానంద.**

## 337

(శ్రీ మోహిముకు)

అల్మోడా
మే 20, 1897.

ప్రియమోహిమ్,

నీజాబు నాకు చాలసంతసము గూర్చినది. ఒక్కసంగతి నీకు చెప్ప మఱచితిని-నీవు నాకు పంపిన జాబునకు ఒకనకలు నీవు పెట్టుకో. అంతే కాదు, వేర్వేఱు మనుష్యులవద్దనుండి మఠమునకు వచ్చు జాబులయు, వేర్వేఱు మనుష్యులకు మఠమునుండి వెడలు జాబులయు నకళ్ళు వ్రాసి జాగ్రత్తగా భద్రపఱుపవలయును.

అన్నిసంగతులు చక్కగా జరిగిపోవుచున్న వనియు, అక్కడను కలకత్తాలోనుగూడ పని క్రమముగా అభివృద్ధిగాంచుచున్నదనియు తెలియుచున్నది. నాకు చాల సంతోషముగానున్నది.

ప్రయాణపు బడలిక తప్ప నాకు ఇప్పుడు మఱేమియు లేదు. ఆరోగ్యముగా ఉన్నాను. ఆ బడలికయు కొన్నాళ్ళలో తీఱిపోవును. సందేహము లేదు.

మీకందఱకు నాప్రేమయు, దీవెనలును.

మీవాడను
**వివేకానంద.**

## 338

(డాక్టరు శశి భూషణ్ఘోషుకు)

ఆల్మోడా,
మే 29, 1897.

నాప్రియ డాక్టరు శశి,

నీజాబును రెండుమందుల సీసాలును నాకు సరిగా చేరినవి. నీమందులు సేవించి చూతమని నిన్న సాయంకాలము మొదలు పెట్టితిని. ఏదేని ఒక్కమందుకన్నను ఈరెంటి సంయోగము గుణ వత్తరముగా నుండు నని నాయాశ.

నేను సాయంప్రాతఃకాలముల గుఱ్ఱపుస్వారి రూపాన కడుం గడు వ్యాయామముచేయ నారంభించితిని. అదిమొదలుకొని నాకు నిజముగా చాల మేలుగా నున్నది ఈకసరత్తు తొలివారముననే నాకు ఎంతో మేలని తోచినది. బాలుడనుగా ఉండి కుస్తీలు పట్టుచుండినకాలమునకు తరువాత నేను ఇంత కులాసాగా ఉన్నట్లు ఎప్పుడును తోపలేదు. దేహ ముండుట ఎంత ఆనందము అని నాకు నిజముగా తోపజొచ్చినది. ప్రతికదలికయు నాబలమును నామనసుకు తెచ్చుచుండెను; కండలప్రతిచలనమును నాకు ఆనం దము కలిగించుచుండెను. ఆయుల్లాసము ఇంచుక తగ్గినట్టు లున్నది. కాని నేను చాలబలము కలిగియున్నట్లు నాకు తోచుచుండును. బల పరీక్షలో, కుస్తీలో జి. జి. ని నిరంజనును ఇరువురిని ఒక నిమిష ములో ఓడింపగలను. డార్జిలింగులో నాకు నేను మునుపటివాడను కాను అను భావన నిరంతరము ఉండెను. ఇక్కడ నాకు ఏరోగ మును లే దని మనసుకు తోచుచున్నది. అయినను ఒకస్పష్టమైన మార్పు కలదు. నేను నాజీవితమున ఎప్పుడుగాని పడుకమీద పరుండ గానే నిదురపట్టి యెఱుగను. అధమపక్షము రెండుగంటలైనను పొరలాడుచుండవలయును. మదరాసునుండి డార్జిలింగువఱకే,అనగా మొదటినెలయందు మాత్రమే, నాతల దిండుకు ఆనగానే నేను నిదురపోవుచుంటిని. తత్క్షణమే నిదురపోవు ఆ స్వభావము ఇపుడు బొత్తిగా పోయినది. నా మునుపటి పొరలాడుచుండువాడుకయు,

సాయంభోజనానంతరము ఏమో వేడిగా ఉన్నట్లు తోచుటయు నాకు మరల కలిగినవి. పగటిభోజనమునకు తర్వాత నాకు ఆ యుష్ణ భావన ఏమియుఉండదు. ఇక్కడ ఫలవృక్షాలతోటయున్నందున, ఇక్కడికి వచ్చినవెంటనే మామూలుకంటె ఎక్కువగా పండ్లు తిన నారంభించితిని. కాని ఇక్క డ ఇపుడు దొరకు పండు ఒక్కటే, జల్దరు (=ఏప్రికాట్) పండు. నానిటాలునుండి చాలరకములు తెప్పింప ప్రయత్నించుచున్నాను. పగళ్ళు భయంకరముగా వేడిగా ఉన్నను దాహము అగుటలేదు.........మొత్తముమీద నాకు చాలబలమును ఉల్లాసమును మరల పుట్టిన భావనయు, అతిమాత్రపు ఆరోగ్యభావనయు కలిగియున్నవి. పాలు అతిగా త్రాగుట వలన దేహము ఎక్కువగా బలిసిపోవుచున్న దని భయపడు చున్నాను. యోగిను వ్రాసినదానిని నీవు వినకు, ఒప్పుకొనకు. అతడు తానెప్పుడును తన దేహారోగ్యమును గూర్చియే చింతించు చుండువాడు ; అందఱిని తనవలెనే చేయవలయు నని వానికోరిక. నేను లక్నోలో ఒకబర్ఫీలో పదియాఱవభాగమును తింటిని. దాని వలన నాకు అల్మోడాలో జబ్బుచేసిన దని యోగిను అభిప్రాయము. ఇకను కొన్నాళ్ళలో యోగిను ఇక్కడికి రాగలడు. నేను వానితో కూడి పని నారంభించి చేయుద మనుకొనుచున్నాను. మఱచితిని. మన్నెజర్వపుతాకిళ్ళకు సులువుగా లొంగిపోవు ప్రకృతి నాది. కాబట్టి అల్మోడాలోని తొలివారపు నాఅనారోగ్యమునకు నేను ఒకరై మీదుగా ప్రయాణముచేయుట కొంతవఱకు కారణమయి యుండవచ్చును. మంచుశిఖరాల యెదుట కూరుచుండి ధ్యానము చేయుచు 'న తస్య రోగో న జరా నమృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్' 'యోగ తేజోమయ శరీరమును పొందిన వానికి రోగము లేదు, జర లేదు, మృత్యువు లేదు' అను ఉపనిషత్తును వల్లించుచుండగా నన్ను నీవు తప్పక చూడవలె నయ్యా, డాక్టరూ.

కలకత్తాలో రామకృష్ణమిషను సమావేశములు చక్కగా నెఱవేఱుచున్నవి అని తెలియుచున్నది. నాకు అందులకు చాల సంతోషము. ఆపెద్దపనిలో సాయపడువారికి అన్ని దీవెనలు ఫలించును గాక.

సర్వప్రేమతో,

భవదీయ భగవద్గత
వివేకానంద.

## 339

(శ్రీబాబు ప్రమదాదాస మిత్రకు)*

అల్మోడా
జూ 30, 1897.

ప్రియమహాశయా,

తమ కేదో ఇంటిలో మాన్పరాని దుఃఖము సంభవించినదని వినుచున్నాను. జ్ఞానులైన మిమ్ము ఈదుఃఖము ఏమిసేయగలదు? ఐనను ఐహికమున మృత్యువుతో జోడువీడనిదే ఐన ఈజీవితమునకు సంబంధించిన స్నేహప్రవృత్తి సముదాచారమును బట్టి నేను దానిని ప్రస్తావించుచున్నాను. అయినను ఆదుఃఖసమయములు పలుమాఱు మేలిపారమార్థికసిద్ధిని కలిగించును; రవంతసేపు మేఘములు తొలగి సత్యసూర్యుడు వెలికి ప్రకాశించునట్లు, కొందఱి విషయమున బంధము సగము సడలిపోవును. బంధనములన్నింటిలో పెద్దది (ఐహిక) పదవి. కీర్తినాశన భయము మరణభయమునకంటెను గొప్పది. ఐనను ఈబంధము సయితము రవంత సడలు సటులున్నది, మనసు ఒకనిమిషము మానవుల యభిప్రాయముల వినుటకన్నను స్వాంతర్వాసియగు దేవుని వినుట మేలని కనిపట్టినట్లగును. ఐనను మరల మేఘములు క్రమ్మును. ఇది నిజముగా మాయ.

*ఇది ప్రమదాదాసమిత్రకు స్వామిజీ వ్రాసిన తుది జాబు. ఆకాలపు ద్వివిధ చిత్తవృత్తులకును ఈఉభయుల చిత్తవృత్తులును ఉదాహరణములు. ఆచిత్తవృత్తుల కనాదిగ నుండు ప్రేమాధ్యాత్మిక సాహచర్యమునకు ఈజాబు నికషము. స్వామిజీ ఇందు స్వాభిప్రాయమును పరాకాష్ఠగ ప్రతిపాదించి గాఢప్రేమను సామరస్య శక్తిని చూపు మని ప్రమదాదాసమిత్రను కోరుచున్నాడు.

చాలకాలము నాకు తమతో సొంతముగా తిన్నగా జాబులు జవాబులు లేకున్నను, ఇతరులవలన తమ్ముగూర్చిన సకలసమాచారములు నాకు అందుచునే యుండెను. కొంతకాలమునకు పూర్వము మీరు గీతానువాదప్రతి నొకదానిని నాకు దయతో ఇంగ్లండునకు బంపితిరి. దానికాగితపు సంచిమీద మీచేతివ్రాత ఒక్క గీటు మాత్రము ఉండెను. ఆ బహుమానమును అంగీకరించుచువ్రాసిన నా కొన్ని మాటలు మీమనసున మీయందలి నాపాతప్రేమను గూర్చి సందియములు కలిగించిన వని నాతో ఎవరో చెప్పినారు.

బాబూ, ఆ సందేహములు నిరాస్పదములని యెఱుగుడు. నాలుగైదేండ్లకాలమున ఆ యింగ్లీషు'గీత'మీది కాగితపుసంచిపైన ఆయొక్క గీతకన్నను ఎక్కువ వ్రాయుటకు తమకు తీఱుబాటు లేక పోవునేని, నాయీవ్రాతకంటెను ఎక్కువను చదువుటకుమాత్రము తమకు తీఱుబాటు కలుగునా అని నాతలంచుటయే నా యంగీకారవచనము అంత సంగ్రహ మగుటకు కారణము. మఱేమియు గాదు, రెండవకారణ మేమనగా మీరు శ్వేతచర్మలగు హిందూమత ప్రచారకులకు విశేషముగా మిత్రులరనియు, నల్లతోలుగలిగి వంచకులైన యీదేశమువారు మీకు గిట్ట రనియు, నాకు తెలిసినది. ఆకారణముచే నాకు భయము గలిగియుండెను. మూడవ కారణ మేమనగా నేను మ్లేచ్ఛుడను, శూద్రుడను, ఇంకను ఏమేమో! నేను దేనినైనను తిందును, ఎవరితో కలసియైనను తినుదును, అంతేకాదు. నాయభిప్రాయములలో చాల వైపరీత్యము వొచ్చినది. నిర్గుణము పరమము కేవలము ఏకము అగు బ్రహ్మమును నేను చూతును, ఒకపాటిగా ఎఱుగుదును. కొందఱు విశేష వ్యక్తులందు ఆ బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుచుందును. ఆవ్యక్తులను 'దేవుడు' అనిన నాకర్థమగును. అట్లుగాక, 'అనుమానప్రమాణసిద్ధుడగుసృష్టికర్త'యను మొదలగువానివంటి ప్రతిభావికల్పములైన సిద్ధాంతములవంకకు నామనస్సు పాఱదు.

అట్టి భగవంతుని నాజీవితమున చూచితిని. ఆయన యాదేశ ముల ననుష్ఠించుటకే నేను జీవించియున్నాను. స్మృతులును పురాణ ములును పరిమితజ్ఞానులగు మనుష్యులు వ్రాసినవి. వానిలో హేత్వా భాసములు ప్రమాదములు జాతిప్రీతిద్వేష (దోష)ములు అసూయా ద్రోహచింతలు నిండియున్నవి. వానిలో హృదయౌదార్య ప్రేమలతోనిండిన కొన్ని భాగములే ఉపాదేయము లగును, తక్కినవి పరిహరింపదగును. ఉపనిషత్తులును భగవద్గీతయు మాత్రమే నిజమునకు పవిత్రగ్రంథములు. రాముడు కృష్ణుడు బుద్ధుడు చైతన్యుడు నానక్కు కబీరు మొదలగువారే నిజమునకు అవతారమూర్తులు. వలన వారిహృదయములు ఆకాశవిశాలములుగా ఉండినవి. ఇక అందఱికి పైవాడు రామకృష్ణుడు. రామానుజ శంకరాదులు వట్టిపండితులుగను సంకుచిత హృదయులుగను చూ పట్టుదురు. ఏదీ ఆ ప్రేమ, ఇతరుల దుఃఖములగాంచి కరగి యేడ్చు ఆహృదయము ఏదీ? వట్టి శుష్కపాండిత్యపుబడాయి! తాను ఒక్కడే మోక్షమొందుదునను గడబిడ! అది సాధ్యమా, మహాశయా? అది సాధ్యమై ఎప్పుడైన నుండెనా, ఇక నుండ బోవునా? ఏవిధమైన అహంభావపు జాడమైనను, మిగిలియున్నచో దేనినేని ప్రాపింపశక్యమగునా?

ఇంకొక గొప్ప అసందర్భము. – వర్ణవ్యత్యాసము గొప్ప భేదకారణము మాయామూలము అను నమ్మకము దినదినమునకు నామనసున ఎదుగుచున్నది. వర్ణవ్యత్యాసమంతయు, అది జన్మ మునుబట్టినది కానీ, గుణమునుబట్టినది కానీ పెద్ద ప్రతిబంధకము. "నిజమే. అయినను దానినంతయు మనస్సులో ఉంచుకొనుము. బాహ్యమున వ్యావహారికానుభవములతోడి, ఈ ప్రపంచమున వర్ణమువంటి భేదములు తప్పక పాటింపవలయును." అని కొందఱు మిత్రులు సలహా చెప్పుదురు......హృదయమున ఏకత్వ భావము ఉనగా ఆచరణప్రయత్నము చేయలేని పిఱికిదుర్బలత అన్నమాట. బాహ్యమున పిశాచబేతాళరాక్షసనారక తాండవము,

దుర్బలహింస స్వేతరపీడనము — దరిద్రమారణము! మాలవాడే ధనికుడైనచో, ఓహో అతడే మతరక్షకుడు!

వీనియన్నిటికి పైన,— మతశిక్షావినయనములు శూద్రునికి వలదట. అతడు బోధనవిషయమునను విదేశగమన విషయమునను మంచిచెబ్బరల వివేకము పాటింప నక్కఱ లేదట. పాటించుట నిష్ప్రయోజన మట. అవును. అట్లు పాటించిన అంతెఊడిగము పోగొట్టుకొన్నట్టే కదా! నేనొక శూద్రుడను. మ్లేచ్ఛుడను. కావున నాకు ఆ బాధ అంతయు పనిలేదు. నాకు మ్లేచ్ఛుని యన్న మైన నేమి, మాలవాని అన్నమైన నేమి? వర్ణవిభేదము మున్నగు వెట్టులు మతాచార్యులు వ్రాసిన గ్రంథాలలో మాత్రమే ఉన్నవి; దేవుడు వెలువరించిన గ్రంథాలలో లేవు. తమ పూర్వులు సాధించినదాని ఫలములను ఆ బ్రాహ్మణులను అనుభవింపనిండు. నేను దేవుని వాక్కును అనుష్ఠింతును. ఏలన నా మేలు అందు ఉన్నది.

నేను అనుభవమున నెఱింగిన మఱియొక సత్యమిది:— పరోపకారార్థమైన సేవయే మతము. ఆచారానుష్ఠానముల వంటి తక్కినదెల్ల వట్టివెట్టి. తనసొంత మోక్షమునకై ఆశపడుట తప్పుకూడ. ఎవడు తనసర్వస్వమును పరార్థమై త్యజించునో, వానికే మోక్షము. "నామోక్షము నామోక్షము" అని రాత్రింబగళ్లు పాడినపాటయేపాడుచు తమబుద్ధిని అలయునంతగ వినియోగించువారు ఇప్పటియు భావియు నగు తమ నిజమగు క్షేమమును నాశనముచేసికొని అల్లాడుదురు. దీనిని నాసొంత కనులతో పలుమాఱు కాంచియున్నాను. ఈనానావిషయములగూర్చి పర్యాలోచించుకొనుచున్నవాడనై తమకు జాబువ్రాయుటకు మనసు రాక యుంటిని. ఈయసందర్భముల నన్నిటిని లక్ష్యపెట్టక, నాపై మీస్నేహము ఎప్పటియట్లు గాఢముగా నుండునేని, నేను దానిని నిజముగా చాల సంతోషకరమగు పర్యవసానముగా తలంతును.

భవదీయేత్యాది
వివేకానంద.

## 340

అల్మోడా
జూను 1, 1897

ప్రియ శ్రీ—,

వేదములకు నీవు చెప్పు ఆక్షేపణలు, వేదము లనగా సంహితలే అర్థమగునేని, చెల్లును. వేదము లన్నమాటలో సంహితలు బ్రాహ్మణములు ఉపనిషత్తులు అను మూడు భాగములును చేరును. అదియే ఇండియాలో అంతటను సంప్రదాయముగా వచ్చు అభిప్రాయము. వీనిలో తొలి రెండుభాగములును కర్మలనుగూర్చి చెప్పునవగుటచేత వానిని పరామర్శకు కైకొనక చాలవఱకు నెట్టియుంచినారు. ఉపనిషత్తులుమాత్రమే ఎల్లతత్త్వవేత్తలచేతను ఎల్ల మతనిర్మాతల చేతను పరిగ్రహింపబడినవి.

సంహితలు మాత్రమే వేదములు అను నభిప్రాయము చాల ఇటీవలిది; కీ. శే. దయానందస్వామిచే నారంభింపబడినది. ప్రాచీన మతాభినివిష్టులగు ప్రజలపై ఈయభిప్రాయమునకు ఏమియు పట్టు లేదు.

ఈ యభిప్రాయమునకు కారణ మిది:— దయానంద స్వామి సంహితలకు ఒకక్రొత్తయర్థముచెప్పి, దానిమీద ఆధారము చేసి, అంతటికిని సర్వము సంగతమై అన్యోన్యవిరోధములేకుండు నొకసిద్ధాంతమును తాను కనిపట్టగల నని తలచెను. ప్రతిబంధములు ఎప్పటియట్లే నిలిచినవి, కాని అవి ఇపుడు బ్రాహ్మణముల మీదపడినవి. అర్థభేదసిద్ధాంతములును 'ప్రక్షిప్తము'లను సిద్ధాంతములును ఎన్ని ఉన్నను (సమన్వయపడవలసినది) చాల మిగిలియే యున్నది.

సంహితలను ఆధారముచేసి సర్వసంగతమగు నొకమతమును నిర్మింప సాధ్య మగునేని, ఉపనిషత్తులను ఆధారముచేసి సర్వసంగతమును ఏ విరోధములు లేనిదియునగు నొకమతమును నిర్మింపగలుగుట దానికంటెను వేయింతలు నిజము. మఱి విశేష మే మనగా, ఇందు పూర్వసంప్రదాయసిద్ధమగు ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా

పోనక్కఱ లేదు. ఈమార్గమున పూర్వాచార్యు లందఱును నీ పక్షమున ఉందురు. నీకు క్రొత్త అభివృద్ధికి ఎంతయేని అవకాశము ఉన్నది.

గీత ఇప్పటికే హిందూమతమునకు బైబిలు అయియున్నది. సందేహము లేదు. అట్లగుటకు దానికి పూర్తి అర్హత కలదు. ఐనను కృష్ణుని వ్యక్తిత్వము కాలగర్భమున పూడుకొనియున్నందున నేడు ఆతనిజీవితచరిత్రమునుండి సంజీవనమగు నుత్సాహమును రాబట్టుకొనుట సాధ్యపడదు. అంతేకాదు. వర్తమానకాలమున క్రొత్త ఆలోచనలును క్రొత్తప్రవృత్తియు కావలయును.

ఈమార్గముల ఆలోచించుటకు నీకు ఇది సాయపడు నని నాయాశ.

ఆశీస్సులతో,

భవదీయ,

**వివేకానంద.**

## 341

(శుద్ధానందస్వామికి)

అల్మోడా
జూను 1, 1897.

ప్రియ శుద్ధానందా,

నీజాబున అక్కడనున్నవారి కుశలమును అన్నివివరముల తోడి సమాచారములను తెలిసికొంటిని. నాకును అరోగ్యము మేలుగా నున్నది. ఇక మిగతవిషయము డాక్టరు శశిభూషణునివలన తెలిసికొనగలవు. బ్రహ్మానందుడు సంస్కరించిన రీతిగానే ఇప్పుడు శిక్ష జరుగనిమ్ము. మార్పులుచేయదగునేని, తరువాత చేయింపుడు. అందఱి అంగీకారమును బడసియే చేయవలసియుండు ననుటను మఱచిపోరాదు.

నేను ఇపుడు అల్మోడాకు కొంతఉత్తరాన నున్న ఒక వర్తకునితోటలో నివసించుచున్నాను. ఎట్టెదుట హిమాలయ శిఖరములు, సూర్యునికిరణములు అందు ప్రతిఫలించుచుండగా,

ముద్దచేసిన వెండివలె మెఱయుచు సంతోషము కలిగించుచున్నవి. అడ్డములేని గాలిని సేవించుటచేతను, మితమగు భోజనముచేతను, ఎక్కువగా వ్యాయామముచేయుటచేతను నాదేహము సుదృఢముగను స్వస్థముగను ఉన్నది. మఱి యోగానందుడు చాల అస్వస్థుడుగా నున్నా డని వినుచున్నాను. అతనిని ఇక్కడికి రమ్మనుచున్నాను. మఱి యతఁడు ఈకొండగాలులకు నీళ్ళకు భయపడుచున్నాడు. 'ఇక్కడతోటలో కొన్నాళ్ళుండి, నీవ్యాధిలో మేలు తోఁపకున్న, నీవు కలకత్తాకు మరలి పొమ్ము' అని ఇప్పుడే అతనికి జాబు వ్రాసితిని. అతనికి ఇష్టమువచ్చినట్లు చేయగలడు.

అచ్యుతానందుడు ప్రతిదినము సాయంకాలము అల్మోడానగరిలో జనులను పిలిచి వారికి గీతాదిశాస్త్రములు చదివి వినిపించుచున్నాడు. అక్కడ ప్రతిదినము చాలమంది నగరవాసులును స్కంధావారమందలి సైనికులును చేరుచున్నారు. అందఱిని అతడు సంతోషపెట్టుచున్నా డని వినుచున్నాను. 'యావా నర్థః' (గీత II-46) ఇత్యాది శ్లోకమునకు నీవు వంగార్థము వ్రాసితివే, అది సరి యని తోఁపలేదు. ఆయర్థ మే మనగా (నేలనెల్ల) నీటివెల్లువ ముంచియుండగా, నీరుత్రాగుటలో ప్రయోజనము లేదు' అని. ఈయర్థోపన్యాసము సరిగా లేదు. వెల్లువ వచ్చినపుడు జనులకు దప్పి ఉండదా ఏమి ?

'భూమిని నీటివెల్లువ నింపినపుడు నీరు త్రాగుట నిరర్థకము, అప్పుడు వాయుమార్గమున గాని, మఱేదేని కంటికి అగపడని రహస్యోపాయము చేతనేని జనుల దప్పి తీఱును.' అనుటే ప్రకృతి నియమమగు నేని, అప్పుడు ఈ చెప్పిన యర్థము సార్థక మగును. అన్యథా కాదు.

శంకరుల (అర్థము)నే అవలంబింపదగును.

కాదా, ఇట్లేని కాదగును: "భూతలమంతట వెల్లువ యున్నను, దప్పిగొన్నవారికి నీరుత్రాగుటయందు చిన్నగుంటలు ఎంత ప్రయోజనమో-" అని. రవంత నీరే చాలును అని యర్థము. "జలరాశి

ఉండును గాక. నాయక్క—ఐ రవంతనీటితోనే తీఱును.'' ఎల్ల వేదములు ఉండగా, జ్ఞానియగు బ్రాహ్మణునికి ఇట్లే ప్రయోజనము. ఎట్లు వెల్లువయందు(ను) త్రాగుటమాత్రమే ప్రయోజనమో, అట్లే ఎల్ల వేదములందును జ్ఞానముమాత్రమే ప్రయోజనము.

గ్రంథకారాభిప్రాయమునకు మిక్కిలి చేరువైన వేఱొక వ్యాఖ్యయు కలదు: భూతలమంతయు వెల్లువలో మునిగినను, జనులు త్రాగుటకు గ్రహింపదగిననీటినే, హితమైననీటినే-వెదకుదురు, ఇతరమును గాదు. వెల్లువ ముంచినను, భూమిలో తారతమ్యముండుట వలన నీళ్ళు నానావిధములైనవి వేఱువేఱు గుణములు ధర్మములు గలవి ఉండును. అట్లే ఎఱుకగలవాడైన బ్రాహ్మణుడును, వివిధ జ్ఞానమార్గములు వెల్లువపొడిచిన వేదమనుపేరి శబ్దసముద్రమందు సంసారపుదప్పిని తీర్చుకొనుటకు ఏది నిఃశ్రేయసమునకు సమర్థమో దానినే గ్రహించును. అది బ్రహ్మజ్ఞానమే గదా.

శుభాశంసలతో దీవెనలతో,

నీవాడు,
వివేకానంద.

## 342

(మేరిహేల్బాయిస్టరుకు)

అల్మోడా
జూను 2, 1897.

ప్రియ మేరీ,

నేను నీకు పెద్దకథోపకథన సల్లాపప్రాయమగు జాబు వ్రాయుదు నని మాటయిచ్చియుంటినే దానిని ఇపుడు, అది చాల పెరుగునన్న మంచియుద్దేశముతో, ఆరంభించుచున్నాను. అది కొనసాగక తప్పిపోవునేని అది నీకర్మఫలమే అగును. నీవు దివ్యారోగ్యమును అనుభవించుచున్నా వని నా నిశ్చయము. నేను చాల జబ్బుపడి ఉంటిని సుమా. ఇపుడు రవంత తేఱుకొనుచున్నాను. త్వరలోనే వ్యాధిపూర్తిగా మాని స్వాస్థ్యము పొందుదు నని ఆసగొనుచున్నాను.

లండనులోని పనినిగూర్చి యేమి? అది నాశనమయిపోవు చున్న దని భయపడుచున్నాను. నీవు అపుడపుడు లండను చూడ బోవుదువా? స్టర్డీకి క్రొత్తబిడ్డ పుట్టినది కదా?

ఇపుడు ఇండియా మైదానములు అగ్నిజ్వాలలు క్రక్కు చున్నవి. నేను దానిని ఓర్వజాలను. కనుక ఈ పర్వతస్థాన మున నున్నాను. ఇక్కడ మైదానములకంటె రవంత చల్లగా నుండును.

నేను అల్మోడాలో ఒక వర్తకుని అందమైన తోటలో నివసించు చున్నాను. అది చాల మైళ్ళవఱకు కొండలను, అడవులను ఆనుకొని యున్నది. మొన్న రాత్రి ఒక చిఱుతపులి ఇచటికివచ్చి, ఈ తోటలో నున్న మందనుండి ఒక మేకను వేసికొని పోయినది. నౌకరుల యఱ పులును పెద్ద టిబెటు కావలికుక్క మొఱుగుటలును చెవులను భయంకరముగా చెవుడుపఱచినవి. నేను ఇక్కడ ఉన్నందుచేత ఈ కుక్కలు వాని గంభీరపు మొఱుగుటలచే నాకు నిద్రాభంగము కలిగింపకుండుటకై కొంత దూరాన గొలుసులతో కట్టివేయబడి యున్నవి. కాబట్టి ఆ చిఱుతపులికి సందు దొరకినది, కొన్ని వారా లకు సెలవుగా మంచి మేత సంపాదించుకొన్నది. అది దానికి చాల మేలు చేయునుగాక!

కుమారి ముల్లరు నీకు జ్ఞప్తిలో ఉన్నదా? ఆమె కొన్నా ళ్ళిక్కడ ఉందమని వచ్చియుండినది. ఈ చిఱుతపులి వృత్తాంతమును విన్నపుడు భయపడినట్లున్నది. పదనుచేసిన తోళ్ళకు లండనులో చాల గిరాకి ఉన్నటులున్నది. ఆ గిరాకి మఱి దేనికంటెను కూడ, మా చిఱుతపులులను పెద్దపులులను నాశనము చేయుచున్నది.

నేను నీకు ఈ జాబు వ్రాయుచుండగా, నా యెదురుగా అప రాహ్ణపు ఎండకాంతిని ప్రతిబింబింపజేయుచు పెద్ద మంచు శిఖరాల దీర్ఘ శ్రేణులు నిలబడియున్నవి. వాని దూరము ఇక్కడినుండి విహంగమార్గమున దాదాపు ఇరువదిమైళ్లును, చుట్టగు కొండ రస్తాలగుండ నలుబది మైళ్లును ఉండును.

జమీందారిణి పత్రికలో ప్రకటితములైన నీ యనువాదములను మెచ్చుకొన్నా రనుకొందును. ఈ జూబిలి తరుణమున మా కుమారరాజులను కొందఱినిగూడి ఇంగ్లండుకు రాదగిన మంచి యవకాశము కలిగినది, నాకును ఎంతయో ఆశగా ఉండినది. కాని నా వైద్యులు నన్ను అంత త్వరగా పనిలో చొరసాహసింపనీయక నిషేధించిరి. ఏలన యూరపుకు వచ్చుట యనగా పనియే కదా. ఏమందువు? 'పనిలేకున్న, కూడులేదు'.

ఇక్కడ ఈ కావిబట్ట చాలును, నాకు భోజనమునకు కొదువయుండదు. ఎట్లో, నేను మిక్కిలిగా కోరిన విశ్రాంతిని పొందుచున్నాను. అది నాకు మేలు సేయునని నా యాశ.

నీపని నీకెట్లు సాగుచున్నది? సంతోషముతోనా దుఃఖముతోనా? కొన్ని యేండ్లకాలము నీకు పనియే లేకుండ మంచి విశ్రాంతి యుండవలయునని యిష్టపడవా? నిదుర, భోజనము, వ్యాయామము; వ్యాయామము, భోజనము, నిదుర: ఇది, ఇంకను కొన్ని నెలలవఱకు నాకార్యక్రమము. శ్రీ గుడ్విన్ను నాతో ఉన్నాడు. అతనిని ఇండియా యుడుపులలో నీవు చూచియుండవలసినది. నేను త్వరలోనే అతని తల గుండు కొట్టించి అతనిని పూర్తి సన్న్యాసిగా చేయబోవుచున్నాను.

నీవు ఇంకను కొన్ని యోగములు సాధన చేయుచున్నావా? వానివలన నీకేమేని లాభము కలదా? శ్రీ మార్టిను చనిపోయినాడని నాకు తెలిసినది. ఆయన శ్రీమతి ఎట్లున్నది? నీవు ఆమెను అప్పుడపుడు చూతువా?

కుమారి నోబులును నీ వెఱుంగుదువా? నీ వెపుడైనను ఆమెను చూతువా? ఇక్కడ నా జాబు ముగియుచున్నది. ఏలన ఒక పెద్ద దుమ్ము తుపాను నా మీదికి కొట్టుచున్నది. వ్రాయుటకు సాధ్యపడదు. నా ప్రియ మేరీ, ఇదంతయు నీ కర్మ. ఏలన నేను ఎన్నియో ఆశ్చర్యకర విషయముల వ్రాయవలయుననియు ఎంతో యందమైన కథలు చెప్పవలయుననియు ఉద్దేశించితిని. వానిని

'ఇక భవిష్యత్కాలమునకే' అని, నిలుపవలసినవాడ నైతిని. నీవు కనుపెట్టుకొని యుండవలయును.

సదా భవదీయ భగవద్గత
**వివేకానంద.**

## 343

(సోదరి నివేదితకు)

ఆల్మోడా
జూను 3, 1897.

ప్రియ కుమారీ నోబులూ,

......నామట్టుకు నేను పూర్తిగా తృప్తిచెందితిని. నేను మా జనులను చాలమందిని మేలుకొల్పితిని. అదే నేను కోరినదంతయు. అన్ని విషయములు వాని దారిని పోవును గాక. కర్మ ఏలునుగాక. నాకు లోకమున బంధము లేవియు లేవు. నేను జీవితమును చూచితిని. అంతయు స్వాత్మయే. జీవితము స్వాత్మకు, ప్రేమ స్వాత్మకు, గౌరవము స్వాత్మకు,సర్వము స్వాత్మకు. నేను వెను దిరిగి చూచుకొన్నప్పుడు, నా సొంతముకోసము చేసికొనిన పనిఒక్కటికూడ నాకు అగపడలేదు. నా పాపకర్మలు సయితము నా సొంతముకోసము గాదు. కావున తృప్తిగా ఉన్నాను. విశేషముగా మంచి పనిని విశేషముగా గొప్ప పనిని ఏదేని చేసితి నని నేను తలంచుట లేదు. మ జేమన లోకము అంతటి యల్పము, జీవితము అంతటి నీచము, బ్రదుకు అంతటి క్షుద్రదాస్యవృత్తి! మనుష్యులు మంచిసెబ్బరల వివేకము గల యాత్మలు, ఈ స్వాత్మ కోసము, ఈ హేయనీచ పారితోషికము కోసము పరువెత్తుదురా అని ఆశ్చర్యపడుదును, నవ్వుకొందును.

ఇది నిజము. మనము ఒక కూటయంత్రమున, ఒక వాగురలో పట్టువడియున్నారము. ఎంత త్వరగా అందుండి తప్పించుకొన్న మనకంత మేలు. నేను సత్యమును సాక్షాత్కరించుకొంటిని. ఈ దేహము తేలనీ మునుగనీ, ఎవరికి లక్ష్యము?

నేనిపుడు నివసించుచుండునది చాల అందమైన పర్వతో ద్యానవనము. ఉత్తరాన దిఙ్మండలము నోరగా అంతటను హిమాలయ పర్వతము హిమశిఖరము వెనుక హిమశిఖరముగా వ్యాపించియున్నది. వాని నిండ అడవులు మెండుకొని యున్నవి. ఇక్కడ చలిగా లేదు; చాల వెచ్చగాను లేదు. సాయంవేళలును ప్రాతర్వేళలును చాల భోగ్యములుగా నున్నవి. ఈ గ్రీష్మర్తు వంతయు ఇక్కడ నుండగోరుదును. వానలు ఆరంభింపగానే క్రింది మైదానములకు పనిచేయను పోయెదను.

నే నొక విద్యార్థిగ, ఏకాంతముగా ప్రశాంతముగా కూరు చుండి నిరంతరము గ్రంథములు చదువుచుండగల జీవితమునకై జన్మించితిని. కాని అమ్మ వేఱుగా అనుగ్రహించినది. ఐనను ఆ ప్రవణత ఉండనే ఉన్నది.

భవదీయేత్యాది
**వివేకానంద.**

## 344
(శ్రీ బ్రహ్మానందస్వామికి)

ఆల్మోడా
జూను 14, 1897.

ప్రియ రాఖాల్,

నీవు పంపిన చారునిజాబులోని విషయము పూర్ణముగా నాకు అభిమతమే.

'రాణి-చక్రవర్తిని'కి సమర్పింప సంకల్పితమగు అభివాదన పత్రమందు ఈ క్రింది అంశములు పరికింపవలయును—

(1) అందు అతిశయోక్తులు ఉండకూడదు, అనగా ఇండియాలో పుట్టిన మనకు వాడుకైన "ఆమె దేవునిప్రతినిధి" అను ఈ మొదలగు వచనములు, ఉండకూడదు.

(2) మతము లన్నిటికిని ఆమె తనపాలనలో అభయమిచ్చి నందున మనము ఇండియాలోను ఇంగ్లండులోను మనవేదాంత సిద్ధాంతములను నిర్భయముగా బోధింపగలిగితిమి.

(3) ఇండియాదేశపు బీదలకు ఆమెచూపిన దయ. అందులకు ఉదాహరణము - క్షామనివారణకు తాను సొంతముగా తనవంతు ధన మొసంగి ఆంగ్లులనందఱిని అసాధారణౌదార్యకార్యములకు ప్రేరణచేయుట.

(4) ఆమెకు దీర్ఘాయువు కలుగవలెనని, ఆమె పరిపాలన యందలి దేశములప్రజల కవిచ్ఛిన్న సౌఖ్యాభ్యుదయములు ప్రాప్తింపవలెనని-దేవుని ప్రార్థించుట.

దీనిని తప్పులేని యింగ్లీషులో వ్రాయించి నాకు అల్మోడాకు పంపుము. నేను సంతకము చేసి దానిని సిమ్లాకు పంపెదను. అది సిమ్లాలో ఎవరివిలాసమునకు పంపవలయునో తెలుపుము.

ప్రేమయుతభవదీయ
**వివేకానంద.**

మఱిమాట :—శుద్ధానందుడు మఠమునుండి ప్రతివారము నాకు వ్రాయు జాబుల నకలును వ్రాసి పదిలముగా నుంపవలసినదని నామాటగా చెప్పుము.

వి.

## 345

(శ్రీ అఖండానందస్వామికి)

అల్మోడా,
జూను 15, 1897.

ప్రియ అఖండానందా,

నిన్నుగూర్చి వివరముగా సమాచారములు అందుచున్నవి. నేను మిక్కిలి సంతోషించుచున్నాను. లోకమును జయింపగలది. ఆవిధమయిన పనియే, జాతిమతభేదముల ప్రయోజన మేమి? బళి, బళి, నావలన లక్షయాలింగనములను లక్షదీవెనలను అంగీకరింపుము. పాటుపడుడు, పాటుపడుడు, పాటుపడుడు-నేను మఱి దేనిని లక్ష్యపెట్టను. పాటుపడుడు, పాటుపడుడు, పాటుపడుడు, చచ్చునంతవఱకు పాటుపడుడు. బలహీనులుగా నుండువారు తమ్ము గొప్పపనివారినిగాను గొప్పవీరులనుగాను చేసి

కొనవలయును. ధనమునకై చింత వలదు. అది మింటినుండి రాలును. నీవు ఎవరి విరాళములను అంగీకరింతువో వానిని వారిని, తాము కోరుదురేని, తమపేరనే ఇయ్యనిమ్ము. పరవాలేదు. ఎవరి పేరు, దాని కేమి విలువ ? పేరు ఎవరికి కావలయును ? తీసి పాఱ వేయుము, దానిని ! పస్తుపడిన నోళ్ళకు అన్నపు కబళములను అందిచ్చు ప్రయత్నమున పేరు ఆస్తి సర్వము నాశనము కానీ ; అహోభాగ్యము ! అహోభాగ్యము ! నీవు ముమ్మాఱు దేవుని అనుగ్రహమును పడసితివి పో ! వశీకరించుకొనునది ప్రేమయే కాని బుద్ధి కాదు, గ్రంథములు పాండిత్యము, యోగము ధ్యానము, జ్ఞానము అన్నియు ప్రేమతో పోల్చిన, ధూళియు దుమారమే. ప్రేమ నీకు అతిమానుషశక్తుల నొసంగునది; ప్రేమ నీకు భక్తి నొసంగునది, ప్రేమ నీకు జ్ఞానమును ఒసంగునది, ప్రేమయే నీకు మోక్షమార్గము చూపునది. నిజముగా ఇది పూజ ; మానుషదేహ దేవాలయమున నుండు ప్రభుని యారాధన. 'నేదం య దిద ముపాసతే'-'జనులు ఉపాసించునట్టి ఇది కాదు.'* ఇది యారంభమాత్రమే. మనము ఇండియా అంతటను; అంతే కాదు భూలోకమంతటను, ఈవిధముగా వ్యాపింపకుందుమేని మన ప్రభువు ఘనత ఏదీ ?

మన ప్రభుని పాదస్పర్శ మానవునికి దివ్యత్వము ఒసంగునో ఒసంగదో జనులను చూడనిమ్ము. అహంకారపు స్వార్థపరత్వపు మమకారపు తుది జాడలు సయితములేని ఇదే జీవన్ముక్తి యనబడునది. బళి! సెబాసు! ప్రభువునకు జయము! క్రమముగా వ్యాప్తి కలిగింప ప్రయత్నింపుము. నీకు శక్తి కలదేని, కలకత్తాకు పొమ్ము ; మఱియొక బాలుర గుంపుతో ధనమును ప్రోవు సేయుము. వారిలో ఒక్కనినిగాని ఇరువురినిగాని ఏదేని ఒకచోట పనిచేయ నియమింపుము ; అంతట మఱి యొందైన నారంభింపుము. ఈ విధముగా వ్యాపింపజేయుము. వారిని తనిఖీ చేయుచుండుము. పని క్రమముగా శాశ్వత ప్రతిష్ఠిత మగును. దాననే మతవ్యాప్తియు విద్యావ్యాప్తియు

* భగవదితర విషయములనుట.

తనంతటనే కలుగును. దీనినెల్ల నీవు చూడగలవు. కలకత్తాలో వారికి ప్రత్యేకోపదేశములు ఒసంగియున్నాను. అట్టి పనిని నీవు చేయుము, నిన్ను నా భుజాలమీద ఎత్తుకొని పోయెదను. బళి! కొంచెము కొంచెముగా ప్రతి జిల్లాయు ఒక కేంద్రము, శాశ్వత కేంద్రము అగును, నీవే చూతువు. నేను త్వరలో మైదానములకు వచ్చుచున్నాను. నే నొక సైనికుడను. రణరంగమున ప్రాణములు వదలెదను. ఇక్కడ అంతఃపుర కాంత వలె కూర్చుండియుండుట నాకుతగునా?

భవదీయ సర్వ ప్రేమయుత

**వివేకానంద.**

## 346

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

అల్మోడా
జూను 20, 1897.

ప్రియ రాఖాల్,

మునుపటికంటె నీవు ఆరోగ్యముగా నున్నావని తెలిసినది. సంతోషము. సరి. సోదరుడు యోగిను నగ్నసత్యములు పలుకుట చాల అరుదు. కాబట్టి వానిపలుకు వినుటకు ఎంతమాత్రమును ఆత్ర పడకు. నేను ఇపుడు దండియైన కండబలము కలిగి, దప్పిలేక ఆరోగ్యముగా నున్నాను. కాలేయము సయితము బాగుగా పనిచేయు చున్నది. శశిబాబు మందునకు ఏమి గుణములుకలిగెనో నాకు నిజము తెలియదు. కావున దానిని సేవించుట ఆపి యున్నాను. నాకు మామిడిపండ్లు దండిగా ఉన్నవి. స్వారిలో చాల అసాధారణపు నేర్పరిని అగుచున్నాను. నిలువక ఒక్క ఊపున ఇరువది ముప్పది మైళ్లు దవుడు తీసిన యనంతరముకూడ ఇంచుకేని నొప్పిగాని అలసటగాని తోచుట లేదు. బలుపు భయమునకై పాలను బొత్తిగా మానివేసితిని.

నిన్న అల్మోడాకు వచ్చితిని. ఇకను తోటకు పోను. ఇక మీదట నేను కుమారి ముల్లరుకు అతిథిగా ఇంగ్లీషువారి పద్ధతిలో ప్రతిదినము మూడు భోజనములు చేయవలసి యున్నది.

శుద్ధానందుడు రడక్స్ ప్రాక్టిస్ ఆఫ్ మెడిసిన్, లేక అట్టి యేదో మఱియొకటి తాము జరుపుచున్నాము అన్న యర్థముగా వ్రాయుచున్నాడు. తరగతిలో అట్టివానిని బోధించు అర్థములేనిపని ఏమి? పదార్థ విజ్ఞానమునకు ఏదైనను ఒక సాధారణమైన యుపకరణ సామగ్రియు, అట్లే రసాయన శాస్త్రమునకును అట్టిదే ఒకటియు ఒక దూరదర్శినియు, ఒక సూక్ష్మదర్శినియు-ఇవన్నియు 150 నుండి 200 రూపాయలకు లోపుగా వచ్చును. శశిబాబు వారమున కొకపరి ప్రయోగప్రదర్శనపూర్వకముగ రసాయన శాస్త్రమున ఒక ఉపన్యాసము చేయవచ్చును. అట్లే హరి ప్రసన్న పదార్థ విజ్ఞానము మొదలైనవానిని గూర్చి ఉపన్యసింపవచ్చును. బెంగాలిలో దొరకగల ఆయా శాస్త్ర గ్రంథములన్నియు కొని వానిని చదివించుచుండుము.

ప్రేమయుత భవదీయ

**వివేకానంద.**

## 347

(సోదరి నివేదితకు)

ఆల్మోడా

జూను 20, 1897.

నా ప్రియకుమారి నోబులూ,

......నీకు విశదముగా నన్ను చెప్పనిమ్ము. నీవు వ్రాయు ప్రతిమాటయు నాకు విలువగలది; ప్రతిజాబునకు నూఱుతూర్లు స్వాగతము. నీకు ఎప్పుడు మనసువచ్చినను ఎప్పుడు అవకాశము కలిగినను ఏమియిష్టమైనను నాకు వ్రాయుము. దేనియందుగాని నేను అపార్థము చేసికొనను, గుణగ్రహణము చేయకమానను. చాలకాలముగా పనినిగూర్చి నాకు ఏ సమాచారమును రాలేదు. నీవు ఏమైనను చెప్పగలవా? ఇండియాజనులు నాకై ఎంత సంతోషపు జయధ్వానములు చేసినను వారినుండి నేను ఏసాయమును ప్రతీక్షింపను. వారు అంతటి పేదలు!

నేను ఏవిధాన శిక్షింపబడి తయారుచేయబడితినో ఆ విధాననే కార్యమును నారంభించితిని—అనగా చెట్లక్రిందను ఎట్లో దేహమున ప్రాణమును నిలుపుకొనుపాటి డబ్బుతోను. పదకములో ఇంచుక మార్పునుకల్గినది. నేను నాబాలురను కొందఱిని క్షామపీడితములగు జిల్లాలలో సేవ చేయుటకై పంపితిని. అది అమానుషాద్భుతముగా గుణముచూపినది. నేను ఎప్పుడును తలంచినట్లు హృదయపూర్వక ముగా, హృదయపూర్వకముగా మాత్రమే మనము ప్రపంచమును అందుకొనగలమని నాకు తెలియుచున్నది. కావున ప్రకృతపు పదకము ఇట్లు:—అనేకసంఖ్యల యువజనులను, పై తరగతివారినే—ఏలన క్రిందితరగతి వారికైనట్లైన నేను కొంత కనుపెట్టుకొని యుండవలసియుండును—తరిబీదు చేసి వారిలో కొందఱిని ఒక జిల్లాకు పంపుట. ఇదే తొలియాక్రమణ అవస్కంధము. ఈమత మార్గమును ఇట్లు త్రవ్వువారును సౌరంగికులును పోయి అడ్డములు తొలగించి సిద్ధము చేసినతర్వాత తత్త్వమును సిద్ధాంతమును నాటుటకు చాలినంత కాలము ఉండును.

కొందఱు బాలురు అప్పుడే శిక్షణ పొందుచున్నారు. అయినను ఇటీవలి భూకంపము మేము పనికిపెట్టుకొన్న యొక పెదబాడుగింటిని కూల్చివేసినది. దానిని లెక్కసేయకు. తలదాచుకొనువసతి లేకయు క్లేశములతోను పాటుపడవలయును.........ఇప్పటి కింకను బోడి తలలు గుడ్డపేలికలు యాదృచ్ఛికపుభోజనమునే. అయినను ఇది మార్పుచెందవలయును, చెందును, సందియము లేదు. బుద్ధినంతయు మనసునంతయు పూన్చి అందులకై పాటుపడుచున్నాము కదా!

ఇక్కడి జనులకు వదలుకొనుటకేమియు లేదనుట నిజమే. ఐనను వైరాగ్యము, మా నెత్తుటిలోనే ఉన్నది. నావద్ద తరిబీదగు చున్న బాలు డొకడు ఒకజిల్లాకు ఎగ్జిక్యూటివు ఇంజనీరుగా ఉండిన వాడు. ఇక్కడ అది ఒకపెద్ద పదవి, అంతస్తు. దానిని వాడు గడ్డి పరకవలె విడిచిపెట్టినాడు!

సర్వప్రేమతో, పరమార్థమున భవదీయ

వివేకానంద.

## 348

(శ్రీ అఖండానందస్వామికి)

అల్మోడా
జూను 30, 1897.

ప్రియ అఖండానందా,

నీవు చెప్పినరీతిగా నేను జిల్లా మేజిస్ట్రేటుగారైన శ్రీ లవింజికి ఒక జాబు వ్రాయుదును. అంతేకాక, నీవు డాక్టరు శశి కార్యమార్గమును వివరించు పెద్ద జాబు వ్రాసి దానిని ఆయనచేతనే మరల సరిచూపించి,-ఇండియన్మిర్రరుకు పంపుము. దాని నకలునొకదానిని పైన ఉదాహరించిన పెద్దమనుష్యునికి పంపుము. మన మూర్ఖులు జనుల దోషములనే వెదకుదురు. వారికి కొన్ని మంచి గుణములుకూడ అగపడనిమ్ము.

నేను ఇందుండి సోమవారము వెడలిపోవుచున్నాను.

అనాథ శిశువులను సంపాదించు క్లేశమును గూర్చి నీవు చెప్పినదేమి? నీకు ఇష్టమైన, మతమున నలువురు ఐదుగురు మనుష్యులు కావలయునని అడుగుము. గ్రామగ్రామమున వెదకిన, రెండు దినాలలో నీకు కొందఱు అనాథ శిశువులు దొరకుదురు.

అవును, నిజమే, మనకొక శాశ్వత కేంద్రము కావలయును. మఱి......వారి సాయము లేకపోయిన, ఈ దేశాన ఏదైనను చేయ శక్యమా? రాజ్యాంగ సంబంధమైన విషయములు మొదలైనవానిలో కలియకు. వానితో ఏ సంబంధమును ఉంచుకొనకు. అట్లే నీకు ఎవరితోను ఏ జగడమును ఉండ నక్కఱలేదు. నీవు నీ దేహమును మనసును ఇంకను నీకు ఉన్నదానినంతయును ఏదేని ఒక్క పనికి వినియోగింపవలయును. ఇక్కడ యూరపియను శ్రోతలకు ఒకటి యింగ్లీషునను, ఇండియావారలకు ఒకటి హిందీలోను ఉపన్యాసములు చేసితిని. ఇది హిందీలో నా కన్న భాషితము, ఐనను ఎల్లవారికి సమ్మతముగా నుండెను. సహజమే. పాశ్చాత్యులు, వారి వాడుకచొప్పున, అది ఒక నల్లతోలువానివలని దని పట్టరాని సంతోషము చెందిరి! 'ఆహా ఎంత ఆశ్చర్యము!' అను మొదలగు

సాధువాదములు పలికిరి. రాగల శనివారము యూరోపియనులకు మరల నొక ఉపన్యాసము ఉండును. ఇక్కడ ఒక పెద్ద సమాజము ఆరంభింపబడినది. అది యుత్తరకాలమున ఏపాటి పనిచేయునో కనుపెట్టి చూతము. విద్యను మతమును నేర్పుట ఆ సమాజము వారి యుద్దేశము.

రాగల సోమవారము బెరెయిలీకి ప్రయాణము; తరువాత సహారన్పూరునకు; అటు తర్వాత అంబాలాకు; అక్కడినుండి బహుశః కెప్టెన్ సేవియరుతో కలసి ముసూ్సరికి, అంతట రవంత చల్లబడగానే మైదానములకు మరలుట, రాజపుటానాకు ప్రయాణము మొదలయినవి. అతిమాత్రపు వేగముతో పనిచేయుచు పొమ్ము. ఎప్పుడును భయపడకు! నేనుకూడ పాటుపడ తీర్మానించుకొంటిని. దేహ మేమో పోవలయును. దానిని గూర్చి పొరపాటేమియు లేదు. మఱి దానిని సోమరితనాన పోనీయనేల? "తుప్పు పట్టిపోవుటకంటెను అఱిగిపోవుట మేలు." నేను చనిపోయినపుడు సయితము ఆందోళన చెందకు. నా వట్టి యెముకలు కూడ దివ్యాద్భుతములను ఒనరించును. మనము పది యేండ్లలో ఇండియా యంతటను వ్యాపింపవలయును. మనపని అంతకు తగ్గునేని, ప్రయోజనము లేదు. ఒక మల్లునివలె పనిచేయుట! జయము గురుమహారాజుకు! ధనము మున్నుగా కావలసిన వన్నియు తమంతట రాగలవు. మనకు మనుష్యులు కావలయును, ధనము గాదు. ప్రతి దానిని చేయునది మానవుడు; ధనమేమి చేయగలదు? మనుష్యులు మనకు కావలయును. ఎంత ఎక్కువమంది చేరిన అంత మేలు...... ఉదాహరణార్థముచూడుము. ము—, చాల ధనమును ప్రోగు చేసినవాడు. మఱి ఒక్క మనుష్యుడైనను లేకపోయెను. అతడేమి మేలు సాధించినాడు?

భవదీయ ప్రేమయుత

వివేకానంద.

## 349

(స్వామి శిష్యుడగు, శరచ్చంద్రునికి)
ఓం నమో భగవతే రామకృష్ణాయ.

అల్మోడా
జూలై 3, 1897.

ఎవని వీర్యముచేత నీ లోకములును
మేమును ధన్యత్వ మమరగాంచితిమొ
ఈశు నా శ్రీరామకృష్ణు స్వతంత్రు
శర్వుని మ్రొక్కెద సతతంబు భక్తి.

ఆయుష్మంతుడా, శరచ్చంద్రా.

ప్రయోగ (=కార్య) నిపుణులు కాక ఆగమము లెఱింగిన వారు "ప్రభవతి భగవాన్ విధిః" 'సర్వ శక్తియగు విధి ప్రాభవము కలిగి ఏలును' అందురు. ప్రయోగనిపుణు లన్ననో పౌరుషమును గొప్పగా తలంతురు. పురుషుని సంకల్పము దుఃఖమును తొలగించు నని పౌరుషమును నమ్మినవారికిని, పౌరుషముచే దుఃఖమును తొలగించుట అశక్యమని విధిని నమ్మినవారికిని జగడము వివేకము లేమివలన కలుగును అని యెఱింగి, ఉన్నత జ్ఞాన శిఖరము నెక్క ప్రయత్నింపుము.

నిజమైన జ్ఞానమునకు విపత్తు ఒరగల్లు అని అందురుగదా! ఆమాట "తత్ త్వం అసి" 'నీవు అది అగుదువు' అను తత్త్వమును చెప్పు అధికారమునందు నూఱుతూర్లు చెప్పదగును. ఇదియే వైరాగ్యరోగమును పట్టియిచ్చునది. ఆ లక్షణమును పెంపొంద జేసికొన్న వాని జీవనము ధన్యము. నీకు రుచింపకపోయినను 'కొంతకాలము ప్రతీక్షించి యుండుము' అను ప్రాచీన వాక్యమును నీకు చూపుచున్నాను. తెడ్డు వేసివేసి యలసినవాడవు ఆ పనిచేయక అలపు తీర్చుకొనుము. మునుపటి త్రోపుడులవలన కలిగిన వేగము పడవను ఆవలిగట్టుకు చేర్చునులే. ఇది గీత (IV-38) లో చెప్పబడినది.-"యుక్తకాలము వచ్చినపుడు యోగ సంసిద్ధుడు దానిని తన

హృదయమందే పొందును" అని. ఉపనిషత్తునందును (కైవల్యము —2) చెప్పబడినది: "అమృతత్వము ధనముచేత సాధ్యముకాదు, సంతతిచేత సాధ్యముకాదు, త్యాగముచేతనే సాధ్యమగును." అని. ఇచట త్యాగమనగా వైరాగ్యమే. ఆ వైరాగ్యము వస్తుశూన్యము, వస్తుభూతము అని ఇరుదెఱంగులు. వస్తు శూన్యవైరాగ్యమునకై పురుగులు తినివేసిన మస్తిష్కము గలవాడు తప్ప ఇతరుఁడు ప్రయత్నింపడు. వస్తుభూత వైరాగ్యమనగా ఇతర వస్తువులనుండి మనస్సును ముడుచు కొనుటయును, ఈశ్వరునందు (ఆత్మయందు) ఏకతానముగా నిలుపుకొనుటయునే. ఈశ్వరుడు వ్యక్తివిశేషము కాజా లడు, సమష్టి అనియే గ్రహింపవలెను. వైరాగ్యము గలవాడు ఆత్మ యనగా జీవాత్మ అని తలంపడు. మఱి సర్వవ్యాపియు సర్వాం తర్యామియు సర్వమునకును ఆత్మయు నగు ఈశ్వరుడనియే తలం చును. అతడు సమష్టి రూపముననే అందఱికిని అగపడుచున్నాడు. ఇట్లయినందున, జీవునికిని ఈశ్వరునికిని స్వరూపమునుబట్టి భేదము లేకపోవుటచేత వారికైన సేవాప్రేమ రూపకర్మలకును భేదము లేదు. ఇక్కడ ఒక విశేషము—జీవుని జీవుడు అనుబుద్ధితో సేవింతు వేని అది దయ యగును; ప్రేమ గాదు. మఱి అతడు ఆత్మ యని సేవింతువేని అది ప్రేమ యగును. ఆత్మ యొక్కటియే ప్రేమకు విషయమని శ్రుతివలనను స్మృతి వలనను ప్రత్యక్ష ప్రమా ణము వలనను తెలియనగుచున్నది. ఈశ్వరునియందు ప్రేమ యనియు, జీవునియందు దయ యనియు చైతన్యభగవానుడు చెప్పిన మాట యుక్తమే. జీవేశ్వర విషయమున ఆ భేదమును చెప్పిన ఆ భగ వానుని తీర్మానము సరియే, ఏలన ఆయన ద్వైతవాదిగదా. మనకు అద్వైతులకు అట్లు గాదు. మన మతమున జీవబుద్ధి బంధనహేతు వగును. కాబట్టి మనకు శరణము ప్రేమయే గాని, దయ కాదు. జీవుని విషయమున సయితము కరుణ అను మాటను ప్రయోగిం చుట సాహసికజల్పితమని మన యభిప్రాయము. మనము సేవించు

వారమే కాని కనికరించువారము కాము. మనకు అన్నిటియందును. 'స్వానుభవము'ను 'ప్రేమానుభవము' నే కాని అనుకంపానుభూతి లేదు.

ఓ శర్మా, అన్ని హెచ్చుతగ్గులను ఒకటి చేయునదియు, సంసారమను వ్యాధిని మాన్పునదియు, ఈ పరిదృశ్యమాన ప్రపంచమునందలి ముత్తెఅంగుల దుఃఖమును తొలగించునదియు, సకల పదార్థముల నిజమైన స్వభావమును వెలియిడునదియు, మాయాంధకారమును ధ్వంసము చేయునదియు, ఆ బ్రహ్మాస్తమ్బపర్యంతము ప్రతిదాని ఆత్మత్వమును ప్రకాశింపజేయునదియు, అగు ఆనీ వైరాగ్యము నీకు మేలొనగూర్చునుగాక.

ధృతచిర ప్రేమబంధుడై ఇట్లు అనుదినము ప్రార్థించు,

**వివేకానంద.**

## 350

(సోదరి నివేదితకు)

అల్మోడా
జూలై 4, 1897.

నాప్రియ కుమారీ, నోబులూ,

ఈకాలమున లండనునుండి నేను వింతగా మేలైనట్టియు కీడైనట్టియు శక్తుల ఆటవస్తువను అగుచున్నాను ..... మఱియొకవంక నీజాబులు ఉత్సాహము కలిగించునవిగాను ప్రకాశము కలిగించునవిగాను ఉన్నవి. అవి నాయుత్సాహమునకు బలమును ప్రత్యాశను కలిగించు చున్నవి. దానికి ఇపుడు అదెంతయో కావలసియున్నది. దేవు డెఱుగును.

నేను ఇంకను హిమాలయములలోనే యున్నాను, ఇంకను ఒక్క నెలకాలము ఇందే ఉండబోవుచున్నను, ఇటు రాకమునుపే కలకత్తాలో పని యారంభించితిని. దాని యభివృద్ధిని గూర్చి వారు నాకు ప్రతివారము జాబు వ్రాయుచుందురు.

ప్రకృతమున నేను క్షామవిషయమున ఎక్కువ కార్యవ్యగ్రుడనై యున్నాను. భవిష్యత్కార్యమునకు కొందఱు యువకు

లను తరిబీదు చేయుటకన్నను, పారము చెప్పుపనిలో ఎక్కువశక్తిని వినియోగింపలేక యున్నాను. (క్షామబాధితులకు) అన్నముపెట్టు పనికి నా శక్తియంతయు నా ధనాదిసాధనము లన్నియు, వినియుక్తములగుచున్నవి. మన మిప్పటికి చేయగలపని చాలకొంచెపాటిదే ఐనను దానిగుణము అత్యాశ్చర్యకరముగ ఉన్నది. బుద్ధునికాలమునకు ఈవల ఇపుడే మొదటిసారి బ్రాహ్మణబాలురు కలరా తగిలిన మాలవారి పడుకలప్రక్కన పరిచర్యచేయుట కానవగుచున్నది.

ఇండియాలో ఉపన్యాసములును ఉపదేశములును ప్రయోజనకరములు గావు. మనకు కావలసినది కార్యబలరూపమగు మతము. దానిని, మహమ్మదీయులు చెప్పునట్లు, దేవుడు మనపాలిట నున్న, నేను చూపవలయునని తీర్మానించుకొన్నాను.................. మీసమాజపు కర్తవ్యసూచకపత్రము నాకు సర్వథా సమ్మతముగా నున్నది. నీవిక భవిష్యత్తున చేయగలది ప్రతిదియు నాసమ్మతికలిగియుండు నని నీవు తలంపవచ్చును. నీశక్తియందును నీసానుభూతియందును నాకు పూర్తినమ్మకముగలదు. నేను ఇప్పటికే నీకు చాల అప్పుపడియున్నాను. నీకు నేనుపడియున్న నాకృతజ్ఞతా ఋణములు ప్రతిదినము అనంతము లగుచున్నవి. నాకు ఒక్కటేయూరట; ఏమనగా, అదిపరులమేలునకే కదా అని. అట్లుగాకున్న నా వింబుల్డన్ మిత్రులు నాకు చూపిన ఆశ్చర్యకరమగు దయకు నేను ఇంచుకయు అర్హుడనుగాను. అప్పటమైన ఇంగ్లీషువారగు మీరు మంచివారు. స్థిరచిత్తులు, ఈశ్వరుడు మిమ్ము ఎల్లప్పుడు అనుగ్రహించును గాక. దూరాననుండి ప్రతిదినము నీగుణములను మెచ్చుకొనుచుందును, నాశాశ్వత ప్రేమను, తక్కిన మనమిత్రుల కందటికిని దయతో అందింపుము.

సర్వప్రేమతో,

పరమార్థమున భవదీయ

**వివేకానంద.**

## 351

(బ్రహ్మానందస్వామికి)
ఓమ్ నమోభగవతే రామకృష్ణాయ

ఆల్మోడా
జూలై 9, 1897.

ప్రియ రాఖాల్,

ఈదినము 'మన సమాజోద్దేశములు' అను దాని యచ్చు తప్పులు దిద్దవలసిన కాగితములను దిద్ది నీకు పంపుచున్నాను. మన సమాజసభ్యులు సరిచూచిన 'చట్టములు విధానములు' అనుభాగము తప్పులునిండి యున్నది. దానిని చాలజాగ్రత్తగా దిద్ది మరల అచ్చువేయింపుము. లేకున్న జనులు నవ్విపోదురు.

.........బర్హాంపూరులో జరుగుచున్నట్టి పని మిక్కిలియు చక్కగా శ్లాఘ్యముగా ఉన్నది. అట్టి పనులు జయము పొందును గాని, సిద్ధాంతములును రాద్ధాంతములును మనసును తాకునా, కరగించునా? పనిచేయుము, పాటుపడుము. జీవితమును (పనులు చేసి) జీవింపుము. సిద్ధాంతములును అభిప్రాయములును ఏమి లెక్క? తత్త్వశాస్త్రమును యోగమును తపస్సును—పూజా మందిరమును—నీయెండిపోయిన వరియన్నము—కూరగాయల నైవేద్యములు—ఇవన్నియు కలసి ఒక్కమనుష్యుని మతమగును, లేదా, ఒక్కదేశపు మతమగును. పరోపకార మొక్కటియే సకల విశ్వమునకు చెందు మతము. అది పురుషులకు స్త్రీలకు, పసివారికి ముసలివారికి, మాలవాని వఱకు, అంతే కాదు, మృగములవఱకును—అందఱికిని బోధపడు మతము. వట్టి అభావాత్మకమగు మతము ప్రయోజన పడునా? ఱాయి ఎప్పుడును అపవిత్రము గాదు, ఆవు ఎప్పుడును అసత్యము పలుకదు, చెట్లు దొంగతనముగాని దోపిడిగాని చేయవు. అయిన నేమి? అదేమి లక్క? నీవు దొంగి లింపవు అనుకో; అసత్యము పలుకవు అనుకో, అపవిత్ర జీవితమును గడపవు అనుకో, మఱిదినమునకు నాలుగుగంటలు ధ్యానమగ్నుడవుగానుండి, దానికి రెండింతలకాలము మతపరాయణుడవై మడిగా

గంటవాయింతువనియు అనుకో—ఐనను ఇ వన్నియు ఎందులకు? నీవుచేసినట్టి ఆపని, కొంచెమే ఐనను, బర్హాంపురమునంతయు నీకు ఎల్లప్పటికి పాదాక్రాంత మయియుండునట్లు చేసినది. ఇప్పుడు జనులు నీవు ఏమిచేయుమని కోరినను చేయుదురు. ఇపుడు నీవు జనుల యెదుట "రామకృష్ణుడు దేవుడు" అని వాదింప నక్క అలేదు. అది లేకుండ, వట్టియుపన్యాసములు ఏమిసేయును? వట్టిమాటలు ఉర్ల గడ్డలకు వెన్న మెత్తునా? మాటలకు మామిళ్లు రాలునా? ఆవిధముగా నీవు పదిజిల్లాలలో చేయగలవేని, ఆపదిజిల్లాలును నీవి ఐపోవును, నీచేతిలోనే యుండును. నీవు తెలివిగల బాలుడవయినందులకు తగినట్లుగా, ప్రకృతము నీవు ఆపనియందే నీబలమునంతయు ఉంచుము. దాని యుపయోగమును వృద్ధిసేయుటకే నీబుద్ధినంతయు నీభావమునంతయు నీయాత్మ (బలము) నంతయు వినియోగింపుము. కొంతమంది బాలురను ఇంటింటికి పోయి, అలాఖియా సాధువుల వలె, వారు ఏమేమి తేగలరో—ధనమో పాతగుడ్డలో బియ్యమో తినుబండములో—ఏదియైనను కానీ, వాని నెల్ల తెచ్చునట్లు ఏర్పాటు చేయుము. తర్వాత ఆ తెచ్చిన వానిని పంచిపెట్టుము. అది పని, నిజముగా పని సుమా. అనంతరము జనులకు నమ్మకము కుదురును; తమకు ఏమి చెప్పినను చేయుదురు.

కలకత్తా సమావేశపు ఖర్చులకు ఈయవలసినదంతయు ఇచ్చి, మిగిలిన దానిని క్షామబాధనివారణమునకు ఇమ్ము. లేకున్న దానితో కలకత్తా సందుగొందులలో నివసించు లెక్కలేని పేదలకు సాయము సేయుము. జ్ఞాపకార్థపు మండపములును అట్టి యితర నిర్మాణములును నాశనమై పోనీ. ఈశ్వరుడు తాను శ్రేష్ఠమని తలచినదానిని చేయును. నాకు ఇప్పుడు ఆరోగ్యము దివ్యముగా ఉన్నది.

నీవు సామగ్రిని ఏల ప్రోగుచేయుట లేదు? మైదానమునకు వచ్చి పత్రికను నేనే ఆరంభింతును. దయాప్రేమలు నీకు ఈలోకము నంతయు కొనిపెట్టగలవు. ఉపన్యాసములు గ్రంథములు తత్త్వశాస్త్రము—ఇవన్నియు వానికంటెను తక్కువే.

బీదల సేవకై ఒక కార్యభాగము నారంభింపుము—అని శశికి కూడ జాబు వ్రాయుము.

......పూజఖర్చులను నెలకు ఒక రూపాయో రెండో అగునంతగా తగ్గింపుము. ఈశ్వరుని బిడ్డలు పస్తుపడి చచ్చు చున్నారు...నీళ్ళతోను తులసిదళములతోను మాత్రమే పూజను ముగించి, ఆయన భోగమునకై, అనగా అన్నపు నివేదనకై ఏర్ప ఱుపబడియున్న సొమ్ము బీదల దేహములలో వసించు సజీవ దైవత మునకు భోజనము పెట్టుటకై వినియోగింపబడును గాక. అప్పుడు దేవుడు సమస్తమును అనుగ్రహించును. యోగినుకు ఇక్కడ అనా రోగ్యమని తోచినది. కాబట్టి ఈ దినము అతడు కలకత్తాకు బయలు దేఱినాడు. నేను రేపు మరల దేవల్ధరకు పోయెదను. నా ప్రేమను నీవు అంగీకరించి అందఱికి అందింపుము.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

## 352

(కుమారి మేరీహేలుకు)

అల్మోడా
జూలై 9, 1897.

ప్రియ సోదరీ,

నీ జాబులోని నీ నిరాశాభావమును గ్రహించి చాల దుఃఖము చెందుచున్నాను. దాని కారణము నాకు బోధపడుచున్నది. నీ మెచ్చరికకు కృతజ్ఞుడను. నీ యుద్దేశమును నేను పూర్ణ ముగా గ్రహించితిని. నేను అజిత్సింగుతో కలసి యింగ్లండుకు రాతలయునని ఏర్పాటు చేసికొంటిని. కాని వైద్యులు అనుమతింపమి వలన అది తప్పిపోయినది. హారియెట్టు అతనిని కలసికొన్నదని నాకు తెలియవచ్చునేని నేను ఎంతయో సంతోషింతును. అతడు మీలో ఎవరిని కలసికొన్నను చాల సంతోషించును.

పెక్కు-అమెరికన్ పత్రికలనుండి అనేకములగు కత్తిరింపులు నాకు వచ్చినవి, అందు అమెరికను స్త్రీలనుగూర్చిన నా పలుకుల ఖండనము గలదు. అందులో నేను జాతినుండి వెలివేయబడితిని

అను వింత సమాచారమును ఉన్నది! సన్న్యాసి నగు నాకు వర్ణమున్నదట! అందుండి వెలివేయబడితినట!

నాకు జాతి పోలేదు గదా, అంతేకాదు, నేను పడమటికి వచ్చుటచే, సముద్ర ప్రయాణమునకున్న ఆక్షేపణ చాలవఱకు ఎగురగొట్టబడినది. నన్ను వెలివేయవలయునేని, నాతో కూడ ఇండియాలో పరిపాలించుచున్న రాజులలో సగముమందిని, ఇండియాలో చదువుకొన్నవారిలో చాలవఱకు అందఱిని కూడ కలిపి వెలి వేయవలసినదే. అంతేగాదు, సన్న్యాసము పుచ్చుకొనకమునుపు నా జాతికే చెందిన అగ్రేసరుడగు రాజొకడు నన్ను గౌరవించుటకై ఒక విందును సమకూర్చినాడు. అందు ఆ జాతికి సంబంధించిన గొప్పవారు చాలమట్టుకు అందఱును వచ్చినారు. అట్లుగాక ఇండియాలో సన్న్యాసులు ఎవరితోను కలసి భోజనము చేయగూడదు. ఏలన మర్త్యమాత్రులతో భోజనము చేయుట దేవతల గౌరవమునకు తక్కువ యగును గదా. వారు నారాయణులుగా తలంపబడుదురు, ఇతరులు నరులు. మఱియు నా ప్రియ మేరీ, రాజుల సంతతి వారిచే ఈ పాదములు కడుగబడి తుడువబడి పూజింపబడినవి. ఇంతకు పూర్వము ఇండియాలో ఎవరికిని జరిగియుండనంతటి పెద్ద యూరేగింపు నాకు జరిగినది.

నేను వీధిలోనికి – బయటికి రా తెంపుచేసితినేని, అందులో జనులను సరుదుపాటు చేయుటకు పోలీసువారు రావలయు నక్కఱ యుండెడిది అన్న, అది చాలును; ఇంక నేమియు చెప్ప నక్కఱ లేదు. అది వెలివేయుటే సుమా! నిజముగా అది క్రైస్తవమత ప్రచారకుల (=మిషనరీల) తలబిరుసును తొలగించినది. ఇపుడు ఇక్కడ వారెవాటి? ఏ లెక్కయు లేని అల్పులు! ఇంతకాలము వారు లేరను ఆనందపు అజ్ఞానములో ఉన్నాము. ఇంగ్లీషు చర్చికి సంబంధించిన పెద్ద మనుష్యులను విడిచి, తక్కిన మిషనరీలను గూర్చియు, ఆ జాతి పుట్టుపూర్వాలను గూర్చియు ఒక యుపన్యాస ములో ఏమో కొంత చెప్పితిని. ఆసందర్భమున ఎక్కువగా చర్చికి పోవు

నట్లును చాల మతాభినివేశము గలయట్లును అగపడు అమెరికను స్త్రీలను గూర్చియు, లేనిపోని నిందలు కల్పించు వారి శక్తిని గూర్చియు సూచింపవలసి వచ్చినది. దీనిని పట్టుకొని ఆ మిషనరీలు నేను అమెరికను స్త్రీలను అందఱినిగూర్చియు మొత్తముగా ఏమేమో ఆక్షేపించితిని అని, ఇట్లు వారికి కానిమాట ఏది చెప్పినను అమెరికా జనులకు సంతోషముగా నుండునని, అచటి నా పనిని నాశనము చేయుటకై ప్రకటించుచున్నారు. ప్రియ మేరీ, నేను అన్నివిధాల భయంకర విషయములను యాన్కీలకు (అమెరికనులకు) విరోధముగా, దూషణగా చెప్పియుందు ననుకో, అయినను దానిచేత మా తల్లులను మా ఆడుతోబుట్టువులను గూర్చి వారు ఏమేమో చెప్పుదురే అందు అయుతాంశమైనను తీఱునా? ఉభయ జాతుల క్రైస్తవ యాన్కీలలో మగవారును ఆడువారును క్రైస్తవేతరులమగుమాపై వహించిన ద్వేషమును కడిగివేయుటకు వరుణాలయపు నీళ్ళన్నియునైనను చాలునా? బొత్తిగా పనికిరానివే అగును. మఱి మేము వారికి చేసిన కీడు ఏమున్నది? యాన్కీలు ముందు తాము ఆక్షేపణలను ఓర్చుకొనుటకు నేర్చుకొని తరువాత ఇతరులను ఆక్షేపింపనిమ్ము. ఇతరులదూషింప సిద్ధముగా నున్నవారు ఇతరులవలన ఆక్షేపణగంధమేని ఓర్చుకొనలేరనుట ప్రసిద్ధమన స్తత్త్వశాస్త్రసారాంశము. మరల ఇంకొక మాట, వారికి నేను ఏమి బాకి? మీ కుటుంబమును శ్రీమతి బుల్సతియు, లెగ్గెట్టులును, ఇంకను కొందఱు దయాశాలులు తప్ప నాయందు దయచూపినవా రెవరు? నా తలంపులను, అభిప్రాయలను పూర్తిగా క్రియారూపము చెందించుటలో నాకు సాయపడ ఎవరు ముందునకు వచ్చిరి? రానందువలన అమెరికనులు విశాల హృదయులుగను పరమార్థపరులుగను ఉండ నేర్చుకొనుటకై నేను మృత్యువు వాకిలి చేరునంతవఱకు పాటుపడవలసివచ్చెను. నా బలము నంతయు అమెరికాలో వ్యయింపవలసి వచ్చెను. ఇంగ్లండులో నేను ఆఱు నెలలే పనిచేసితిని; ఒక్కటితప్ప ఒక్క యుచ్ఛ్వాసముమాత్రమైనను నింద లేదు. ఆ యొక్కటియును ఒక అమెరికను స్త్రీ పని.

అది తెలియరాగానే నా ఆంగ్లమిత్రులకెల్ల ఎంతయో యూరట కలిగెను. ఆక్షేపణలు లేకపోవుటమాత్రము గాదు. ఇంగ్లీషుచర్చికి సంబంధించిన యాచార్యులెందఱో నాకు గాఢ మిత్రులై, నేనడుగకయే, నాకు ఎంతో సాయపడిరి. ఇంకను ఎంతయో సాయపడుదురన్న నిశ్చయము నాకు కలదు. అక్కడ నా పనిని కనుపెట్టి దానికి సాయము సంపాదించుటకు ఒక సమాజము ఉన్నది. నలువురు మాన్యులు నా పనికి సాయపడుటకై నాతో ఇండియాకు వచ్చిరి. ఇంక 'డజన్ల' మంది అట్లు రాను సిద్ధముగా నుండిరి. ఈమాఱు నేను పోయినప్పుడు నూర్లు సిద్ధపడుదురు.

నాప్రియాతిప్రియ మేరీ, నాకోసము నీ వేమియు భయపడకుము.........లోకము విశాల మైనది, చాల విశాల మైనది. 'యాన్కులు' నాపై ఉగ్రులైనను, నాకు ఒకచోటు ఉండి తీఱవలయును. ఎట్లైనను నాపని నాకు తృప్తికరముగానే యున్నది. నేను దేనికిని ఎప్పుడును ఒకపదకము వేసికొనలేదు. ఏవి యెట్లు వచ్చిన నేను వానిని అట్లే గ్రహించితిని. ఇండియా సామాన్య ప్రజలను ఉద్ధరించు బలమైన కార్యయంత్రము నారంభింపవలయును అని నామనసున ఒకయభిప్రాయము ప్రముఖముగా ఉండినది, దానిని కొంతవఱకు సాధింపగలిగితిని. నాబాలురు క్షామము రోగము దుఃఖము అనువాని నడుమ, ఆకలరా తగిలిన మాలల చాపమెత్తల ప్రక్కనుండి పరిచర్యచేయుట, పస్తులు పడుచున్న చండాలురకు భోజనము పెట్టుట, మున్నగు రీతుల ఎట్లు పనిచేయుచున్నారో చూచిన నీహృదయము సంతసమున పొంగియుండును. ఈశ్వరుడు నాకును వారికిని అందఱికిని సాయము అనుగ్రహింపగలడు. "మనుష్యులు ఏపాటి?" ఆ నా మనః ప్రియుడు నాతో ఉన్నాడు. ఆతడు నేను అమెరికాలో ఉండినప్పుడును, ఇంగ్లండులో ఉండినప్పుడును ఇండియాలో నేను అనామకుడనై, ఒకచోటినుండి ఒకచోటికి—పలుచోట్లకు—ఇట్లు పర్యటనము చేయుచుండినప్పుడును నాతోడనే యుండినాడు. వారు

ఏమాటలన్నను అవి నాకేమి లెక్క? వారు వట్టి చంటిబిడ్డలపాటి, అంతకంటె వారి కేమియు తెలియదు. ఏమీ! నేనా, ఆత్మను సాక్షాత్కరించుకొన్నవాడను, ఈఐహికపు నిరర్థకతను నిస్సారతను చక్కగా ఎఱింగినవాడను అగు నేనా నామార్గమునుండి ఈశిశువుల జల్పితములవలన తప్పింపబడువాడను? నీకు నేను అట్లే అగపడుచున్నానా?

నేను నన్నుగూర్చి ఇంత చెప్పవలసియుండినది; ఏలన అది నీకు నేను బాకీ. నాపని ముగిసినదని నాకు తోచుచున్నది. ఎక్కువగా అంచనవేసినను, నాకు ఇక మూడునాలుగేండ్ల ఆయుఃశేషముండును. నామోక్షమునకైన కోరిక యంతయు విడిపోయినది. నేను ఎప్పుడును ఐహికభోగములకు ఆసగొనలేదు. నాయంత్రమును చక్కగా పనిచేయు స్థితిలో నేను చూడవలయును. అంతట ఇండియాలోనైనను మానవుల మంచికై ఉద్ధరణమునకు ఏశక్తియు వెనుకకు నెట్టలేని యంత్రదండమును సమకూర్చితిని గదా అని నిశ్చయముగా నెఱింగి, ఇక తరువాత ఏమి సంభవించినను లెక్కసేయక, కన్ను మూయుదును. ఉన్న దేవుడొక్కడే, నేనునమ్మిన దేవుడొక్కడే.—సర్వాత్మల సమష్టి. అన్నిటికిని పైగా సకల జాతులకును సకలవర్గములకును జెందిన దుర్జనులును దుఃఖితులును పేదలును—వీరే నాదైవము, నాఆరాధనకు విశిష్టలక్ష్యము. ఈదైవమును ఆరాధించు అవకాశము నాకుండునేని, అందుకై మరలమరల వేయిజన్మములైనను ఎత్తుదునుగాక! వేలకొలది దుఃఖముల అనుభవింతునుగాక!

నీ బహిరంతరముల నున్నవాడు, ప్రతిచేతితోను పనిచేయువాడు, ప్రతికాలితోను నడుచువాడు, నీవే దేహముగా గలవాడు ఎవడో వానిని పూజింపుము. తక్కిన విగ్రహాల నన్నింటిని పగులగొట్టుము.

ఎక్కువవాడు, తక్కువవాడు, యోగి పాపి, దేవుడు కీటము-ఇవన్నియు ఐ ఈ రూపాలలో కనబడుచు,ఎఱుగబడుచునుండు వాడు,

సత్యమైనవాడు, సర్వవ్యాపకుడైన వాడు ఎవడో వానిని పూజింపుము, తక్కిన విగ్రహముల నన్నింటిని పగులగొట్టుము.

పూర్వజన్మము లేనివాడు, భవిష్యజ్జన్మము లేనివాడు, మృతి లేనివాడు, గమనాగమనములు లేనివాడు, ఇంతకుముందును ఇకమీదను మనల నందఱను తనలో కలుపుకొనువాడు ఎవడో వానిని పూజింపుము, తక్కిన విగ్రహముల నన్నింటిని పగులగొట్టుము.

అహో, మూర్ఖులు, సజీవదేవతలను, ఈ ప్రపంచమంతయు నిండిన ఆతని యనంతప్రతిబింబములను, లెక్కసేయక ఊహాఛాయల వెంట పరువెత్తుచున్నారు! ప్రత్యక్షుడగు ఆతనిని పూజింపుము, తక్కిన విగ్రహాలను పగులగొట్టుము.

నా ఆయుష్కాలము కొంచెమే. నేను చెప్పవలె ననుకొన్న దానిని, కొందఱికి నొప్పికలిగించినను ఇతరులకు కోపము కలిగించినను, నేను బయటికి చెప్పవేయవలసియున్నది. కావున నా ప్రియ మేరీ, నా పెదవులనుండి ఏమిరాలినను, నేను ఏమి పలికినను నీవు బెదరకుము. ఏలన నా వెనుకనుండు శక్తి వివేకానందుడు గాదు, మఱి ఆతడు ఈశ్వరుడు; ఆతడు ఏది శ్రేష్ఠమో దాని నెఱుగును. నేను లోకమును సంతోషపెట్టవలయునేని, అది నిజముగా లోకమునకు కీడు చేయుటయగును. అధిక సంఖ్యాకులమాట, వారిపాలనను లోకపు దుఃస్థితిని చూడగా, తప్పై యున్నది. ప్రతిక్రొత్తయాలోచనకును ప్రతిరోధము తప్పకకలుగును. అది నాగరికులలో నాజూకైన హేళనముగను గ్రామ్యులలో పెడబొబ్బలు అసహ్యపు దూషణలుగను, రూపొందును.

ఈ వానపాములును నిటారుముగ నిలువవలయును, పసిపాపలును వెలుగును చూడవలయును. అమెరికనులు క్రొత్త సారాతో మత్తిలియున్నారు; నా దేశమును నూఱుసంపద వెల్లువలు ముంచినవి, దాటిపోయినవి. ఏ శాలునకును ఇంకను ఎఱుగ శక్యముకాని అనుభవసారమును మేము నేర్చుకొనియున్నాము. అది నిస్సారత,

మిథ్యాత్వము. ఈ భయంకర లోకము మాయ. త్యజింపుము, సుఖముగా నుండుము. పుం స్త్రీజాతిభేదమును, అన్ని ఆస్తిపాస్తులను-వదలిపెట్టుము. మఱి వేఱు బంధమేదియు లేదు. వివాహము, స్త్రీ పుంజాతిభేదము, ధనము ఇవియే సజీవ పిశాచములు. ఇవి పడిపోవుకొలది తత్త్వదర్శనమున కన్నులు విప్పారును. ఆత్మ తనదేయైన యనంత శక్తిని మరల పడయును. హారియెట్టును చూచుటకై ఇంగ్లండులో ఉందమని ఎంత కోరుచున్నాను! నేను చావకమునుపు మీ నలువురు అక్కచెల్లెండ్రను చూడవలయును అని ఒక్క కోరిక నాకు మిగిలియున్నది, అది జరిగితీరవలయును.

సదా ప్రేమయుత భవదీయ

**వివేకానంద.**

## 353

(కుమారి జో స్మైఫెస్మెక్లియడుకు)

అల్మోడా

జూలై 10, 1897.

నా ప్రియ జోజో,

నీ జాబులను చదువుటకు నాకు తీరికయున్నదని నీవు కడపటికి కనుగొన్నందుకు చాల సంతోషము.

ఉపన్యాసములు చేసిచేసి అలసి నేను హిమాలయములను ఆశ్రయించితిని. డాక్టర్లు నన్ను ఖేత్రిరాజుతో ఇంగ్లండుకు పోనీయక పోయినందులకు ఎంతయో దుఃఖముగా నున్నది. అది స్టర్డికి వెఱ్ఱియెత్తించినది.

సేవియర్లు సిమ్లాలో ఉన్నారు. కుమారి ముల్లరు ఇక్కడ అల్మోడాలో ఉన్నది.

ప్లేగు—బొబ్బలమారి—అడగిపోయినది; ఐనను క్షామము ఇంకను ఉన్నది. వానలు ఇంకను కురియనందున, లక్షణములను చూడగా అది ఇంకను భయంకరాకారమును దాల్పవచ్చును.

ఇక్కడినుండి కొన్ని క్షామపీడిత జిల్లాలలోని సేవాకార్యమును నా బాలురచే చేయించుచు, కార్యవ్యగ్రుడనై యున్నాను.

నీవు సర్వథా రమ్ము. ఇదిమాత్రము నీకు జ్ఞప్తియం దుండవలయును, మఱవరాదు. యూరోపియనులును, (వారు నేటివులు, దేశీయులు అను) హిందువులును ఇక్కడ నూనెనీరువలె జీవింతురు. ఈ దేశీయులతో కలియుట యనగా యూరోపియనులకు నరకమున పడుటే.

రాజధాని నగరములందు సైతము చెప్పదగిన మంచి హోటళ్లు లేవు. నీతో ఎందఱో నౌకర్లను పెట్టుకొని ప్రయాణము చేయవలసి యుండును. హోటళ్ళకంటె నౌకర్ల కగు ఖర్చు నయమే లే. మొలచుట్టును ఒక గుడ్డనుమాత్రము చుట్టుకొన్నవారి దర్శనము నీవు ఓర్చుకొనవలసి యుండును. నేనుకూడ ఒక మొలగుడ్డతోనే నీకు అగపడుదును. ఎక్కడ చూచినను మురికిపెంట. గోధుమరంగు మనుష్యులు ఐనను నీతో చాలమంది తత్త్వశాస్త్రము మాటలాడువారు ఉందురు. ఇక్కడ నీవు ఇంగ్లీషువారితో కలసి యుందువేని, నీకు సుఖాలు, భోగాలు ఎక్కువగనే యుండును; కాని హిందువులను, ఉన్నవారిని ఉన్నయట్లుగా నీవు ఇంచుకయు చూచి యెఱుంగగలిగి యుండవు. చాలవఱకు నేను నీతో కూడి భోజనము చేయు అవకాశము ఉండదుకాబోలు. ఐనను నేను నీతోకూడ ననేక స్థలములకు ప్రయాణము చేసి, నా చేతనైనంతవఱకు నీ ప్రయాణము నీకు సంతోషకరముగా ఉండునట్లుచేసెదను. ఇవి నీవు ప్రతీక్షింపగలవి. ఏమేని మేలు కలిగిన, ఇంకను మంచిదే. ఒకవేళ మేరీహేలుకూడ నీతో ఇటు వచ్చునేమో. మిషిగనులో అర్చర్డుదీవిలో అర్చర్డు చెఱువుకడ కుమారి కాంప్బెలు అను యువతి యున్నది. ఆమె గొప్ప కృష్ణభక్త. ఆమె ఉపవాసములు చేయుచు ప్రార్థనలు చేయుచు అందు ఒంటరిగా ఉన్నది. ఆమె ఒకమాఱు ఇండియాను చూచుటకు ఏమైనను సరే ఇచ్చును. అయినను ఆమె నిఱుపేద. ఆమెను నీతో పిలుచుకొని వత్తువేని, ఆమె ఖర్చులను

ఎట్లో నేను అచ్చుకొనఁ బ్రయత్నింతును. శ్రీమతి బుల్సని వృద్ధుడగు లాండ్సుబర్గును తనతో పిలుచుకొని వచ్చునేని, యా
నార్థుని జీవితమునే కాపాడినట్లగును.

బహుశః నీవు అమెరికాకు మరలి వెళ్ళునప్పుడు నీతో నేను
ావచ్చును. హాలిస్టరును చంటిబిడ్డను నామాటుగా ముద్దు
ానుము. ఆల్బెర్టాకును లెగ్గెట్టకును మేబెలుకును నా ప్రేమను
ందింపుము. ఫాక్సు ఏమి చేయుచున్నాడు? ఆతనిని నీవు చూచి
ప్పుడు నా ప్రేమను అందింపుము. శ్రీమతి బుల్సతికిని శారదా
ందునికిని కూడ నా ప్రేమ. నేను ఎప్పటి యట్లె బలవంతుడను
గ నేయున్నాను. అయినను అదెల్ల ఇక నెల్లప్పటికిని జీవితము ప్రశాం
తముగా గడచుటమీద ఆధారపడియుండును. ఇక అల్లరులు
కలతలు లేవు.

ఈసంవత్సరము టిబెట్టునకు పోవలయునని నాకు చాల ఆశగా
నుండినది. ఆదారి చాల శ్రమ కలిగించునది యని, వారు నన్ను
పోనీయలేదు. అయినప్పటికిని చిన్న కొండగుట్టాలమీద ఏటవాలు
కొండగట్లమీద పెనుదాట్లదాడులతో తృప్తిపడుచున్నాను. నీకైసి
కిలు కన్నను ఇది ఎక్కువ ఉద్రేకము కలిగించునది—విమ్బుల్డన్
కడ నాకు ఆయనుభవ మొకమాఱు కలిగినదిలే— ఎక్కువేలయడు
గుల లోతు గల ఏటవాలు కొండగట్లమీద కొన్నియడుగుల
వెడల్పు మాత్రమేగల రస్తాలమీద మైళ్ళమీదమైళ్ళు కొండలపై
కిని మైళ్ళమీదమైళ్ళు కొండల క్రిందికిని (ఆదాడులు).

సదాభవదీయ భగవద్గత
వివేకానంద.

మలిమాట :—అక్టోబరప్పటికి, లేదా నవంబరు ఆరంభ
మప్పటికైనను, ఇండియాలో చేరగలయట్లుగా రావలెను. వచ్చు
టకు అది శ్రేష్ఠమగు కాలము. డిసంబరు, జనవరి, ఫిబ్రవరి—
ఈమూడునెలలును ఈదేశమంతట విశేషములను చూడవచ్చును
తర్వాత ఫిబ్రవరి ముగియునప్పటికి మరల వెనుకకు బయలుదేఱుము

మార్చి మొదలు ఎండల వేడి ఎక్కువ కాజొచ్చును. దక్షిణ యిండియాలో ఎల్లప్పుడును వేడియే.

వి.

మదరాసులో త్వరలోనే ఆరంభింపబోవు ఒకపత్రికలో పని చేయుటకు గుడ్విను అచటకి పోయియున్నాడు.

వి.

## 354

(శుద్ధానందస్వామికి)

అల్మోడా
జులై 11, 1897.

నాప్రియ శుద్ధానందా,

నీవు పోయినసారి పంపిన నివేదికను చూచి చాల సంతోషించితిని. నాకు ఆక్షేపింపదగినది ఆవంతయు అగపడలేదు. ఒక్క మాట: అక్షరములు మఱికొంత స్పష్టముగ వ్రాయవలెను.

ఇంతవఱకు చేయబడిన పని నాకు పూర్తిగా తృప్తికరముగా ఉన్నది. అయినను అందు ఇంకను ముందంజ వేయవలయును.—రసాయన పదార్థవిజ్ఞాన శాస్త్రములకును, జంతు దేహధర్మశాస్త్రము నకును వలయు ఉపకరణములు కూర్చి ప్రారంభపాఠములను ప్రయోగములతోకూడ ఆరంభింపుడని నేను మునుపు సలహా చెప్పియుంటిని. దాని సంగతి యేమియు నాకు ఇంకను తెలియ లేదు.

బెంగాలీ భాషలో అనువాదము చేయబడిన యీ అన్ని శాస్త్రాల పుస్తకములను కొనవలసినది అని, మఱియొక సూచన చేసియుంటినే, దాని సంగతి యేమయ్యెను?

కనీసము ఏకకాలమున ముగ్గురు మహాంతులైనను—కార్యభాగమును చూచుకొనుటకు ఒకడు, ప్రయోగభాగమును చూచుకొనుటకు ఒకడు, వైజ్ఞానికభాగమును చూచుకొనుటకు ఒకడును—అగునట్లు ఎన్నుకొనవలయును.

చదువునేర్పు పనికి కావలసిన అధికారిని సంపాదించుట కష్టము. తక్కిన రెంటికిని బ్రహ్మానంద తురీయానందులు చక్కగా

పనికి రావచ్చును. కలకత్తానుండి బాబులు మాత్రమే ప్రేక్షకులుగా వచ్చుచున్నారని తెలియుచున్నది. అది నాకు చాల దుఃఖకరము. వారు ఎందులకును పనికి వచ్చువారు కారు. మనకు కావలసినది ధీరులగు యువకులు, బాగుగా పనిచేయువారు; తెలివి లేని పనికి మాలినవారుగారు.

తప్పకుండ మఠమునకు ప్రతివారము సమాచారములు పంపుడనియు ఏర్పడబోవు పత్రికకువలయు బెంగాలీ వ్యాసములను టీకలను వ్యాఖ్యానములను పంపుడనియు అభేదానందునికిని శారదానందునికిని జాబువ్రాయుమని బ్రహ్మానందునితో చెప్పుము. గిరీశచంద్రఘోషు పత్రికకు వలయు వానిని సిద్ధపఱుచుచున్నాడా? దృఢాధ్యవసాయముతో పనిచేయుము, సిద్ధముగా నుండుము.

మహులాలో అఖండానందుడు ఆశ్చర్యకరముగా పని చేయుచున్నాడు. ఐనను అక్కడి పద్ధతి బాగుగా లేదు. వారు తమ శక్తినంతయు ఒక చిన్న గ్రామములో వృథాగా, ఖండ ఖండముగా వ్యయముచేయుచున్నట్లున్నది. అదియు ఊరక బియ్యమును పంచిపెట్టుట. ఈసాయముచేయుటతోగూడ, మతబోధయు చేయబడినదను మాట నాకు వినరాలేదు. తమకు తాము సొంతముగా సాయముచేసికొనుటను జనులకు నేర్పువఱకు లోకములోని ధనమంతయునుగూడ ఇండియాలోని ఒకచిన్న గ్రామమునకు సాయపడుటకును చాలదు, నైతిక వైజ్ఞానిక విద్యగఱపుటే మనముఖ్యకర్తవ్యము. విద్యగఱపుచున్నట్లుగా ఏవార్తయు ఎఱుకపడలేదు. ''ఇందఱు యాచకులకు సాయము చేయబడినది'' అను విషయ మొక్కటియే ఎఱుకపఱుపబడినది. మనకు గల సాధనములు అల్పములు. వీనిలో వేఱు వేఱు జిల్లాలలో సాధ్యమైనంత విశాలమగు దేశమునకు అందుబాటగునట్లు కేంద్రముల నారంభింపుమని బ్రహ్మానందునితో చెప్పుము.

పైగా, ఇంతవఱకు అది నిష్ఫలమే అయినట్లుతోచుచున్నది. ఏలన జనులకు విద్యగఱపి మేలుకొల్పి, ఎవరిమట్టుకు వారు సొంతముగా తమమీదనే ఆధారపడియుండుటను మితవ్యయము చేసి

కొనుటను, పెండ్లిండ్లు మానుకొనుటను, దానిచే భవిష్యత్ క్షామ బాధలను తప్పించుకొనుటను నేర్చుకొనునట్లు చేయుసమాజములను ఉత్సాహముతో వారిచే ఆరంభింప చేయుటయందు వారు కృతార్థులు కాలేదు. దానము హృదయద్వారమును తెఱచును; మఱి ఆ లఘుద్వారముగుండ చొచ్చుకొని పనిసాగింపుము.

మిక్కిలియు సులువగు మార్గమిది: ఒక గుడిసెను తీసికొనవలసినది. దానిని గురుమహారాజు గుడిగా చేయవలసినది! పేదలు సాయము పొందుటకును, పూజ సేయుటకు సయితమును అక్కడికి రానిమ్ము. ప్రాతఃసాయంకాలములయందు అక్కడ కథ, పురాణము చెప్పుట, జరుగనిమ్ము. ఆవిధముగ జనులకు నీవు నేర్ప గోరునదంతయు నేర్పవచ్చును. క్రమముగా జనులకు శ్రద్ధకలుగును. వారే ఆ దేవళమును పోషించి కాపాడగలరు. గుడిసెదేవళము కొన్ని యేండ్లలో ఒక బ్రహ్మాండమైన సంస్థగా పెరుగవచ్చును. క్షామనివారణకార్యమునకు పోవువారు ప్రతి జిల్లాలోను మంచి మధ్య ప్రదేశమును ఎన్నుకొని అక్కడ అట్టి గుడిసెదేవళమును, స్థాపింపనిమ్ము. అందుండి మన సేవాలేశము వెలువడవలెను.

తనకు సమ్మతమగు పనియైనచో మిక్కిలి మూర్ఖుడు సైతము, సాధింపగలడు. ప్రతి పనిని తన యభిరుచికి తగినట్లు మార్చు కొనగలవాడే తెలివిగలవాడు. ఏ పనియు అల్పము గాదు. ఆవ గింజంతగా అగపడుచున్నను, బ్రహ్మాండమగు మఱ్ఱిచెట్టును తనలో ఇముడ్చుకొనియున్న మఱ్ఱివిత్తనమువలె ప్రతిదియు గొప్పదే. దీనిని గుర్తించి, సమస్తమును మహాత్కార్యముగా గావించువాడే తెలివిగలవాడు.

మఱియు వారు అర్హుల యన్నమును వంచకులు తీసికొన కుండ కనుపెట్టియుండవలయును. ఇండియాలో ఆశ్చర్యముగొల్పు సోమరిపోతులు దొంగలు మిక్కిలిగా ఉన్నారు. వారు ఎప్పుడు గాని పస్తుచావరు, ఎల్లప్పుడును వారికి ఏదియో దొరకుచుండును. క్షామనివారణ పనిలో నున్న ప్రతి వానికిని ఇట్లు వ్రాయుమని

బ్రహ్మానందునికి చెప్పుము. వారు నిష్ప్రయోజనముగా ధనము ఖర్చు పెట్టగూడదు. అత్యల్పమగు పెట్టుబడినుండి అత్యనల్పమును శాశ్వతమునగు పనియే, మనకు కావలసినది.

అన్నియు సొంతబుద్ధితో ఆలోచించుకొన్న క్రొత్త భావములుగా ఉండవలయును అని ఇప్పుడు నీకు తెలియుచున్నదిగదా; అట్లు కాకపోయిన, నేను చనిపోగానే, అంతయు విఱిగి పడిపోవును. నీవు "మన వశమున ఉన్న అల్ప సాధనములతో శ్లాఘ్యతమమగు శాశ్వత ఫలమును ఎట్లు పొందగలము?" అను విషయమును ఆలోచించుటకు ఒక సమావేశమును కూర్చుము. ఇట్లు సమావేశము కావలసియుండును అని అందఱికి కొన్ని దినములు ముందుగానే తెలుపుము. ప్రతివాడును తనకు తోచిన సూచన చేయనిమ్ము. అన్నిటిని విమర్శపూర్వకముగా చర్చింపుడు. దాని నివేదిక ను నాకు పంపుము.

కడపటిసంగతి, నేను నా సోదరశిష్యులవలన ప్రతీక్షించినంత కంటె ఎక్కువ పనిని నా బిడ్డలవలన ప్రతీక్షింతును. నేను ఎప్పుడు గాని ఉండగలిగినంతకంటె నూఱింతలు ఎక్కువ గొప్పగా నా ప్రతి బిడ్డయు ఉండవలయునని కోరుదును. మీలో ప్రతియొకడును అతిమానుషస్థాయిని సాధించితీఱవలయును. 'తీఱవలె' ననునదియే నా మాట. విధేయత, సంసిద్ధత, ప్రీతి—ఈ మూడును ఉన్నచో, ఏదియు నిన్ను ఆపజాలదు.

ప్రేమాశీస్సులతో,

వివేకానంద.

## 355

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

డ్యూల్ధార్, ఆల్మోడా,
జూలై 13, 1897.

నా ప్రియ రాఖాల్,

ఇక్కడినుండి అల్మోడాకు పోయి, యోగినుకోసము ప్రత్యేక ప్రయత్నములు కావించితిని. కాని అతడు, రవంత కోలుకొనగానే,

మైదానములకు బయలుదేఱిపోయినాడు. శుభలకనుమను చేరి, తాను అక్కడికి క్షేమముగా చేరినవార్తను అక్కడనుండి నాకు జాబు వ్రాయగలడు. ఇక్కడ 'దండి' గాని, మఱే యేదేని ప్రయాణసాధనముగాని సంపాదింప సాధ్యపడనందున, లాటు పోజాలక పోయెను. అచ్యుతునను నేనును మరల నిచటికి వచ్చితిమి. మొదవిఱుగు వేగమున మంచి యెండలో గుఱ్ఱపుస్వారి చేసినందువలన, ఈ దినము నా ఆరోగ్యము కొంచెము చెడియున్నది. శశిబాబు మందును రెండు వారములు నేను సేవించితిని. ఏఫలమును కలుగలేదు... కాలేయమునందలి నొప్పి పోయినది. వ్యాయామము మిక్కుటమైనందున నా చేతులును, కాళ్లును కండ పెరిగి బలిసినవి. బొజ్జ ఎక్కువగా పెరుగుచున్నది. పైకి లేచునపుడును కూర్చుండునప్పుడును నాకు ఊపిరి యాడుటలేదు. ఇది పాలు త్రాగుటవలన కాబోలు. నేను పాలు మానవచ్చునేమో శశిని అడుగుము. ఇంతకు మునుపు నేను రెండుసార్లు ఎండపెట్లచే బాధపడితిని. అప్పటి నుండి నాకు ఎండ తగిలిన కన్నులు ఎఱుపెక్కును. రెండు మూడు దినాలు వరుసగా ఆరోగ్యము చెడియుండును.

మఠమునుండి సమాచారములు అన్నియు తెలిసినవి, చాల సంతోషము. క్షామనివారణకార్యము బాగుగా జరుగుచున్నదని వింటిని. 'బ్రహ్మవాదిన్' కార్యాలయమునుండి క్షామనివారణార్థము ఏమైనను డబ్బు వచ్చినదా, నాకు తెలుపుము. ఇక్కడనుండియు త్వరలోనే కొంత పైకము పంపబడగలదు. పెక్కితర ప్రదేశములలో గూడ క్షామమున్నది కాబట్టి ఒక్క చోటనే ఇంతకాలము ఉండవలసిన యక్కఱ లేదు. ఇతర స్థలములకు పొండని వారితో చెప్పుము. ఒక్కొక్కని నొక్కొక్కచోటికి పొమ్మని వ్రాయుము. అట్టి పనియే నిజమైన పని. ఈ విధముగా క్షేత్రము సిద్ధపఱుపబడునేని, అందు తత్త్వజ్ఞానబీజములు చల్లవచ్చును. ఎల్లప్పుడు దీనిని జ్ఞాపకము ఉంచుకో—మనలను దూషించు ప్రాచీనాచార దురభిమానులకు అట్టికార్యమే జవాబు.

శశియు శారదుడును సూచించుచున్నట్లు దానిని అచ్చొత్తించుటకు నా కేమియు ఆక్షేపణ లేదు.

మఠమునకు ఏపే రుండవలయునో మీరే తీర్మా ్నము చేయుడు.........ధనము ఇక ఏడువారాలలో రాగలదు. భూమినిగూర్చి నాకు తరువాతి సమాచారము ఏమియు తెలియలేదు. ఇందుకు కాశీపూరులోని క్రిస్టోగోపాలుని తోటను మనము సంపా దింపగలుగుదుమేని బాగుగా నుండు నని నాకు తోచుచున్నది. నీవు ఏమందువు ? భవిష్యత్తున మహాత్కార్యములు సాధింపబడగలవు. నామాట నీవు ఒప్పుకొందువేని మఠములోగాని బయటగాని ఈ సంగతి ఎవరికిని తెలియనీయకుము. నిశ్శబ్దముగా విచారణలు చేయుము. పన్నాగములను రహస్యముగా పెట్టకున్న కార్యము చెడును. అది పదునైదూపదునాలువేలకు లోపల కొన శక్య మగునేని, తత్క్షణము కొనివేయుము. అది నిజముగా మంచిది అని నీకు తోచిననే కొనుము.ధనమింకను ఎక్కువ అడుగుదురేని, ముందుగా కొంత పైకము చెల్లించి ఆయేడువారాలకై కనుపెట్టుకొని యుండుము. ప్రస్తుతము దానిని కొనుట మేలు అని నాయభిప్రాయము, తక్కిన దంతయు తర్వాత రాగలదు. మన సమాజముల కన్నిటికి ఆతోట కేంద్రముగ నుండును. నిజముగా అది మన తొలిమఠము. ఆపని చాల రహస్యముగా జరుగనిమ్ము.

మానవుని యిప్పటి ప్రవర్తనను బట్టి అతని మునుపటి చిత్త వృత్తులు నిర్ణయింపబడునట్లు ఫలితములను బట్టి కార్య గుణ దోషములు నిర్ణయింపబడును.

కాశీపూరులో తోటభూమి వెల హెచ్చినది. సందేహము లేదు. కాని, మన చేతనున్న ధనము సన్నగిల్లినది. ఏదియో ఒకటి చేయుము. కాని త్వరగా చేయుము. ఏపనియైనను ఆలస్యము చేత చెడును. గంగయొడ్డున ఉన్న మఠము ఎంతపెద్దదైనను, ఈ దినము కాకున్న, రేపైనను. తోటను మాత్రము సంపాదింపవలసి నదే. ఎవడైన ఒకప్రతినిధి ద్వారా ఈ విషయమును విచారించి

జరుపుదువేని, అది యింకను మేలుగా నుండును. మనము కొను కుట ఇష్టపడుచున్నామని విన్నచో వారు ఎక్కువ వెల చెప్పుదురు. పనిని అతిరహస్యముగా చేయుము. నిర్భయముగ నుండుము. శ్రీరామకృష్ణుడు మనకు తోడు, ఏమి భయము? నా ప్రేమ అందఱికి అందింపుము.

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

మలిమాట :— (కవరుమీద).........కాశీపూరునకై విశేషప్రయత్నములు గావింపుము... బేలూరులో భూమిని విడిచి పెట్టుము. పైనున్న మీరు, ఘనత యెవరికి చెందవలయును అని మీలో వాదము లాడుచుండగా బీదలు పస్తుపడి చావవలసిన దేనా? సకలఘనతను మహాబోధి దక్కించు కొనునేని, అట్లే కానిమ్ము. బీదలకు మేలు కలుగనిమ్ము. పని చక్కగా సాగుచున్న దనుట సువార్త. మఱింత శక్త్యుత్సాహములతో పనిచేయుము. నేను వ్యాసములను పంప నారంభించుచున్నాను. సాకరైను నిమ్మపండ్లు చేరినవి.

వి.

## 356

(సోదరి నివేదితకు)

అల్మోడా
జూలై ?3, 1897.

నా ప్రియ కుమారి నోబులూ,

కొన్ని పంక్తులే వ్రాసినందులకు క్షమింపుము. నేను కొండలమీదినుండి మైదానములకు పోవుదారిలో నున్నాను; ఏదైన నొకచోటు చేరిన తరువాత ఇంకను విపులముగా వ్రాసెదను.

'చనవులేని నిష్కాపట్యము' అనుటలో నీవు ద్దేశించిన అర్థమేమో నాకు బోధపడలేదు. నాయందు నిలచియున్న ప్రాగ్దేశీయుల శుష్కాచారలేశమును తొలగించుకొని కేవలము ప్రకృతిబిడ్డవలె

నామనోగతమును చెప్పివేసెదను. పూర్ణస్వేచ్ఛా ప్రకాశమున ఒక్కదినమైనను జీవించుట, అడ్డులేని నిష్కాపట్యపు గాలిని ఒక్కసారి పీల్చుట! అహా! అదియే కదా అన్నిటిని మించిన పావిత్ర్యము!

ఈలోకమున ఇతరులవలని భయముతోనే మనము పని చేయుదుము, ఆభయముతోనే మాటలాడుదుము, ఆభయముతోనే ఆలోచింతుము, అక్కటా, మనము శత్రుమయమైన భూమిలో పుట్టినారము. "ప్రతియొకడు తన్ను విశేషముగా కనుపెట్టుటకు నియమితుడగు వేగుకాడో" నను ఈభయమును, ఎవడు నిర్జింపగలిగినాడు? తన్ను తాను ముందునకు త్రోసికొను వానికి దుఃఖము! ఇట్టిది యెన్నడేని మిత్రుల భూమి యగునా? ఎన డగుంగును? ప్రయత్నించుట మాత్రమే మనకు శక్యము.

పని అప్పుడే ఆరంభమైనది. ప్రకృతము క్షామనివారణయే చేతికి సిద్ధముగానుండు పని. చాల కేంద్రములు ఏర్పాటుపబడినవి. పని సాగుచున్నది.—క్షామనివారణ, రవంతమతబోధ, కొంత విద్య నేర్పుట—సాగుచున్న పని ఇప్పటికింకను నిజముగా మిక్కిలి అల్పమే. తరిబీదులోనున్న బాలుర సమయము తటస్థించినపుడు అందులకు పిలుచుకొని పోబడుచున్నారు. ప్రకృతము పని జరుగుచుండు చోట్లు మదరాసును కలకత్తాయు. శ్రీగుడ్విన్ను మదరాసులో పనిచేయుచున్నాడు. ఒక్కడు కొలంబోకు పోయినాడు. పనియంతటినిగూర్చి ఒకమాసిక నివేదిక, ఇదివఱకే నీకు చేర్పబడకున్నచో, పైవారము మొదలుకొని ఇకను చేర్పబడును. నేను కార్యకేంద్రమునుండి దూరముగా నున్నానుకదా. కాబట్టి పనులు కొంచెము మందముగా జరుగును. అయినను మొత్తము మీద పని తృప్తికరముగా నున్నది.

నీవు ఇక్కడికి వచ్చుట కంటెను ఇంగ్లండున ఉండియే మాకై ఎక్కువ పని చేయగలవు. పేదయిండియనులకైన నీగొప్ప యాత్మత్యాగమునకు భగవంతుడు నిన్నను గ్రహించును గాక.

ఇంగ్లండులో పని, నేను అక్కడ నున్నప్పుడు, మెఱుగుగా సాగునని నీ వన్న మాట నేను పూర్తిగా అంగీకరింతును. కాని, నేను ఇక్కడ అమర్చిన (కార్య) యంత్రము ఒకపాటి వేగముతో ముందునకు నడవకముందు నేను ఇండియాను వదలుట సరిగాదు. నాపరోక్షమున ఇక్కడ దానిని నడుపగలవారు చాల మందియున్నారని నాకు నిశ్చయము 'అల్లా ఇచ్ఛగించునేని' అని ముసల్మానులను నట్లు, ఇక కొన్ని నెలలలో ఆపని జరిపెదను. నా కార్యనిర్వాహకులలో ప్రముఖుడొకడు, ఖేత్రిరాజు. ఇప్పుడు ఇంగ్లండులో ఉన్నాడు. అతడు త్వరగా ఇండియాకు మరలునని ఎదురు సూచుచున్నాను. అతడు నిస్సందేహముగ నాకు చాల ఉపయోగముగా ఉండగలడు.

నిత్యప్రేమాశీస్సులతో,

భవదీయ
**వివేకానంద.**

## 357

(శ్రీ అఖండానందస్వామికి)

ఓం నమో భగవతే రామకృష్ణాయ !

ఆల్మోడా
జూలై 24, 1897.

ప్రియ అఖండానందా,

నీజాబు చేరి అందలి సమాచారము చదివి మిక్కిలి సంతోషించుచున్నాను. అనాథ శరణాలయమును గూర్చిన నీకోరికలు మిక్కిలి బాగుగా నున్నవి. శ్రీగురుమహారాజు వానిని త్వరగానే తీర్పకపోడు. ఒకశాశ్వత కేంద్రమును ప్రతిష్ఠింప నీశక్తికొలది ప్రయత్నింపుము.........ధనమును గూర్చి నీ వెపుడును చింత పడ నక్కఱలేదు. రేపు నేను అల్మోడానుండి మైదానములకు తరలుచున్నాను. ఎక్కడ రవంత సంచలనము కలిగినను అక్కడ నేను క్షామమునకైన చందాజాబితా ఆరంభింతును. ఆవిషయమున నీకు ఏచింతయు వలదు, మనసు నిర్మలముగా నుంచుకో. ప్రతిజిల్లా

యందును మన కలకత్తా మరపు నమూనాలో ఒకమఠము ఏర్పడినచో, నాహృదయములోని కోరిక తీఱును. మత ప్రచారము చేయుటను బొత్తిగా ఆగిపోనీయకు. మతప్రచార ప్రబోధము కన్నను చదువునేర్పుపని ముఖ్యమైనది, గొప్పది. ఉపన్యాసముల చేతను దానినిబోలిన ఇతరకార్యముల చేతను గ్రామజనులకు మతము చరిత్ర, ఇంకనుదాని వంటివి, ముఖ్యముగా చరిత్ర, నేర్పవలయును. మన విద్యాబోధనకార్యమునకు సాయము చేయుటకు ఇంగ్లండులో ఒకసమాజము ఉన్నది. అది, మిక్కిలి శ్లాఘ్యమగు పనిని చేయుచున్నదని నివేదికలను బట్టి తెలియుచున్నది. కావలసివచ్చినపుడు, సమయము వచ్చినప్పుడు, అట్టి సాయము మనకును ఎల్లయెడల నుండియు వచ్చును. భయపడకుము. తాము పనిలో దిగగానే సాయము వచ్చునని ఎవరు తలంతురో వారే పనిచేసి నెగ్గువారు.

సమస్తబలమును నీయందున్నది, స్వశక్తిని నమ్ముము. నాహార్దతమమగు ప్రేమను దీవెనలను అంగీకరింపుము. వానిని బ్రహ్మచారిణికి అందింపుము. అపుడపుడు మఠమునకు ఉత్తేజకములగు జాబులు వ్రాయుము. వానిచే అందఱును ధైర్యోత్సాహములు పూని పనిచేయుదురు.

గురుమహారాజుకుజై !

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

## 358

(మేరీ హేల్బాయిస్టరుకు)

ఆల్మోడా
జూలై 52, 1897.

ప్రియ మేరీ,

నేను ఇచ్చిన మాటను చెల్లించుకొనుటకు నాకు కాలము ఇష్టము అవకాశమును ఇప్పుడు కల్గినవి. కావున ఈ జాబు మొదలిడుచున్నాను. నేను కొంతకాలము చాల బలహీనుడనుగా నుంటిని.

ఆ కారణముచేతను ఇతర విషయములచేతను జూబిలి తరుణమున నా యింగ్లండు ప్రయాణము కాలాంతరమునకు పెట్టుకొనవలసి వచ్చినది.

మంచివారును నాకాప్తమైనవారును అత్యంత ప్రియమైనవారు నగు నా మిత్రులను మఱొకమాఱు కలసికొనలేక పోయినందులకు తొలుత చాల దుఃఖించితిని. కాని కర్మను మాన్ప తరముగాదు. నేను నా హిమాలయాలతో తృప్తిపడి యుండవలసినవాడనైతిని. అన్నియు ఆలోచింపగా అది హీనవినిమయము; ఏలన మానవుల మొగముగుండ ప్రకాశించు సప్రాణమగు ఆత్మ సౌందర్యము ఎంతటి ప్రకృతి సౌందర్యమునకన్నను చాల ఎక్కువ సంతోషకరము.

ఆత్మ విశ్వజ్యోతి కదా ?

లండనులోని పని పెక్కు కారణములచే మందగించినది. వానిలో అంత్యమైనను అతి ముఖ్యమైన కారణము ధనాభావము. నేను అక్కడ ఉండునపుడు ధనము ఎట్లో వచ్చుచుండును, బండి సాగిపోవుచునే యుండును. ఇపుడు ఎవరు పట్టినను బుజము ముడుచుకొనుచుండును. నేను మరల రావలయును, పనికి మరల ప్రాణము పోయవలయును.

నేను ఇక్కడ ఎక్కువగా గుఱ్ఱపుస్వారి మొదలగు శరీర వ్యాయామము చేయుచున్నాను. మఱి డాక్టర్లు పెట్టిన పథ్యమునకై మీగడతీసిన పాలు ఎక్కువగా త్రాగవలసి యుండెను. అందువలన నేను వెనుకకంటె ఎక్కువ ముందుకు పెరిగినాను, బొజ్జ పెద్దదైనది! నేను ఎప్పుడును ముందుకు పోవువాడనే ఐనను; ఇప్పుడే అతి ప్రముఖముగా ఉండ నిచ్చగింపను. నేను పాలు త్రాగుట మానివేసితిని.

నీవు మంచి ఆకలి కలిగి అన్నము తినుచున్నావట. తెలిసినది. సంతోషము.

నీవు వింబుల్డన్‌లోని కుమారి మార్గరెట్ నోబుల్‌ను ఎఱుగుదువా? ఆమె నాకోసము కష్టపడి పనిచేయుచున్నది. నీకు సాధ్యమగునేని ఆమెతో జాబులు జవాబులు నడుపుము. అక్కడ నీవు నాకు చాల సాయము చేయగలిగియుందువు. ఆమె విలాసము—బ్రాంట్వుడ్డువార్పుల్రోడ్డు, విమ్బుల్డన్.

నా చిన్న మిత్రమును కుమారి ఆర్చర్డను చూచితివన్న మాట. ఆమె నీ ప్రీతిని చూఱగొన్నది, మంచిది. నేను ఆమెయందు గొప్ప ఆశలు పెట్టుకొనియున్నాను. నేను ముసలివాడ నైనపుడు ఈజీవితపు పను లన్నింటినుండి పూర్తిగా విరామము చెంది, నా యత్యంత బాలమిత్రములయిన నీవు కుమారి ఆర్చర్డు మొదలగు వారి ప్రశంసలతో లోకము మాఱుమ్రోగుచుండ వినవలయునని ఎంతో ఆశపడుచున్నాను!

మఱొకమాట, నేను చాల వడిగా ముసలివాడ నగుచున్నందులకు సంతోషించుచున్నాను, నా వెంట్రుకలు నరిసిపోవుచున్నవి. 'బంగారులో — అనగా నలుపులో - వెండిపోగులు వడిగా వచ్చుచున్నవి.

మతప్రచారకుడు పిల్లవాడుగా నుండుట మంచిది కాదు. ఏమందువు? నీవు అట్లు తలంపవా? ఎప్పుడును నా జీవితకాలమంతయు నా యభిప్రాయమదే. ఇప్పుడును నా యభిప్రాయమదే. జనులకు ముసలివానియందు విశ్వాస మెక్కువ. అది ఎక్కువ పూజ్యముగను తోచును. ఐనను లోకములో దొంగలందఱిలో నికృష్టతములైన దొంగలు ముసలి దొంగలే కదా?

నిర్ణయించుటకు లోకమునకు దానిప్రమాణము దానికి ఉన్నది. అది అయ్యో, నిజమునకు చాల భిన్నముగనుండును.

నీ 'విశ్వమతము'ను 'రివ్యూ డీడో మాండ్స్' తిఱుగగొట్టినదన్న మాట! దానిని లక్ష్యపెట్టకు. మఱేదైన పత్రికలో వేయింప ప్రయత్నింపుము. దారి చేసికొన్నతర్వాత చొరవ అతి వేగముగ గల్గును. ఇది నిశ్చయము. పని నీకు ఇష్టముగా ఉన్నందు

లకు సంతోషము. ఇక అది సాగిపోవును, అందు నాకు సందియము లేదు. మనభావములకు (మంచి) భవిష్యత్తు కలదు, ప్రియ మేరీ, త్వరలోనే అనుభవమునకు వచ్చునులే.

ఈజాబు నీకు ప్యారిసులో, నీ రమణీయమైన ప్యారిసులో, చేరు ననుకొందును. ఫ్రెంచివారి పత్రికలనుగూర్చి అక్కడ రాబోవు చున్న ప్రపంచపు సంతనుగూర్చి నీవు నాకు కట్టలు కట్టలుగా జాబులు వ్రాయుదువు అని అనుకొందును.

నీకు వేదాంతమును యోగమును సాయము చేసినందులకు చాల సంతోషము. ఇతరులను అందఱిని నవ్వించి తాను దుఃఖితుడుగా ఉండు, సర్కసు హాస్యగాని వంటివాడను నేను. అది నా దురదృష్టము.

నీవు సహజముగానే ఉల్లాస స్వభావముగలదానవు. ఏదియు నీ మనసు నంటదు. నీవు చాల తెలివిగల పిల్లవు. ఏలనగా పురుషానురాగమునకు, దానికి సంబంధించిన వెట్టికి జాగ్రత్తతో దూరముగా నున్నావు. కాబట్టి నీవు నీ పున్నెమునుచేసి నీ యావజ్జీవ శ్రేయమునకు విత్తనమును నాటుకొంటివి. జీవనమున మన చిక్కు ఇది — వర్తమానమును అనుసరింతుము గాని భవిష్యత్తును చూడము. తాత్కాలికముగా రవంత సంతోషము కలిగించునట్టిది తన్నే అనుసరింపుమని మనలను ఆకర్షించును. దీని ఫలముగా, ప్రస్తుతపు అల్పసంతోషమునకై భవిష్యత్తున సదా బాధలపరంపరలను కొనితెచ్చుకొనుచుందుము.

నేను ప్రేమింపవలసినవారు నాకెవ్వరు నుండరాదనియు, బాల్యమున నేనొక అనాథుడనుగా ఉండియుండవలసినదనియు నా కోరిక. నా జీవితమున నా కత్యంతమనోవ్యథ, నా తమ్ములు నా చెల్లెండ్రు, తల్లి మున్నగు నా స్వజనమునుగూర్చియే. మానవుని పురోభివృద్ధికి అత్యంత ప్రతిబంధకములు చుట్టములే. అట్లుండ జనులు పెండ్లిండ్లచే ఇంకను క్రొత్తచుట్టములను కల్పించుకొన జూచుట ఆశ్చర్యము కదా!

ఒంటరిగా నుండువాడు సుఖి. అందఱికిని మేలుచేయుము, ప్రతివానిని ప్రేమింపుము. కాని ఎవరిమీదను వ్యామోహము గొనకుము. అది ప్రతిబంధకము. ప్రతిబంధకము, కేవలము దుఃఖమును కలిగించును. నీచిత్తమున నీవు ఒంటరిగానుండుము; అదియే సుఖము. మనము విచారించుకొనవలసిన వా రుండకూడదు. మనల నెవరు విచారించుకొందురా యను చింతయు నుండకూడదు. ఇదే విముక్తికి మార్గము.

ప్రశాంతమును మృదువును నిర్భరమును గంభీరమును నిర్నిరోధమునగు నీ మనస్సుతీరుకు నేను ఎంతయో అసూయచెందుదును. నీవు ఇప్పటికే ముక్తవు, మేరీ, ఇప్పటికే నీవు ముక్తవు. నీవు జీవన్ముక్తవు. నాలో పురుషలక్షణములకంటె స్త్రీలక్షణము లెక్కువ. నీలో స్త్రీ లక్షణములకంటె పురుషలక్షణము లెక్కువ. బిడ్డలు లేని స్త్రీలు తమ మరులునంతయు చూపుటకు ఒక పిల్లినైనను తెచ్చి పెట్టుకొనునట్లు నేను ఇతరుల కెట్టి మేలును చేయలేకున్నను వారి బాధనుమాత్రము సదా నా నెత్తిమీదికి తెచ్చుకొనుచుందును.

ఇందు ఏమైనను పారమార్థిక మున్నదని తలంతువా? అర్థములేని తెలివితక్కువ సంగతి! అదెల్ల విషయసంబంధమగు నరముల బానిసతనము. అంతే అది. అహో! ఈ మాంస (దేహ)పు బానిసతనమును తొలగించుకొనుట ఎట్లో!

నీమిత్రము శ్రీమతి మార్టినుసతి ప్రతినెల తన పత్రికాప్రతులను నాకు చాలదయతో పంపుచున్నది. అయినను స్టర్డీగారి ఆదరము చాల తగ్గిపోయినటులున్నది. ఈవేసవిలో నేను ఇంగ్లండుకు రానందువలన ఆయన చాల ఆశాభంగముపొందినటులున్నాడు. ఏమి సేయగలను?

మేము ఇక్కడ, రెండు మఠములు ఆరంభించినారము, కలకత్తాలో ఒకటియు మదరాసులో ఒక్కటియు. కలకత్తాలోని మఠము శిథిలమైన బాడిగకొంప, ఇటీవలి భూకంపమునకు ఉఱ్ఱూతలూగినది.

కొందఱు బాలురు మన సంఘములో చేరియున్నారు. వారు శిక్షణపొందుచున్నారు. మఱియు మేము పెక్కుచోట్ల క్షామ బాధితులకుసాహాయ్యకార్యక్రమము ఆరంభించినారము. ఆపని వేగముగా జరుగుచున్నది. ఇంకను ఇండియాలో వివిధప్రాంతాలలో అట్టి కేంద్రములను ఆరంభింప ప్రయత్నింపగలము.

ఇకకొన్నాళ్ళలో నేను మైదానములకు పోవుచున్నాను. అక్కడినుండి కొండల పడమటి భాగములకు పోవుదును. మైదానములలో ఇంకను చల్లబడిన తర్వాత నేను దేశమంతట ఉపన్యాసములుచేయుచు పర్యటింతును, ఏమి సాధింపవీలగునో చూచెదను.

ఇక వ్రాయుటకు నాకు కాలము లేదు. ఎందఱో నాకై కాచుకొని యున్నారు. కావున నా ప్రియ మేరీ, ఇంతటితో నిలిపెదను, నీకు సంతోషమును సుఖమును కలుగును గాక.

విషయసుఖములు నిన్నెన్నడును మరులు గొల్పకుండుగావుత మని సదా ప్రార్థించు,

సదా భవదీయ భగవదాసక్త,

వివేకానంద.

## 359

(శ్రీమతి లెగ్గెట్టుకు)

అల్మోడా,
జూలై 28, 1897.

ప్రియజననీ,

నీవు దయతో ఆ చక్కని జాబును వ్రాసినందులకు పెక్కు ధన్యవాదములు. ఆహ్వానమందుకోగలట్లు నేనును ఖేత్రి రాజుతో కలసి లండనులో ఉండియుండవలయునని నా ఆస. పోయినసారి నేను లండనులో ఉన్నతరుణమున పెక్కువిందులకు పోవలసియుండెను. అది ఇక జరుగకూడనట్లు విధినిర్ణయము ఉండెను. నాయనారోగ్యము నన్ను రాజుగారితో ప్రయాణముచేయుట కనుమతింపదాయెను.

ఆల్బర్టా మరల అమెరికాలో తనయింట నున్నదన్న మాట! నాకు రోములో ఆమె చేసిన సమస్త సాయమునకు నేను ఆమెకు

కృతజ్ఞత అప్పుపడియున్నాను. హాల్లి ఎట్లున్నది? వారిరువురికి నాప్రేమ. క్రొత్త చంటిబిడ్డను నాబుచ్చిచెల్లెలిని నామాఱుగా ముద్దుగొనుము.

నేను తొమ్మిదినెలలు హిమాలయములలో కొంత విశ్రాంతి నొందుచుంటిని. మరల పనిని మొదలుపెట్టుటకు, ఇపుడు మైదానములకు పోవుచున్నాను.

ఫ్రాంకిన్సెన్సుకును జోజోకును, మేబెలుకును, నాప్రేమ; అట్లే నీకును సదా నాప్రేమ.

సదాభగవదాసక్త భవదీయ,

వివేకానంద

## 360

(సోదరి నివేదితకు)

ఆల్మోడా,
జూలై 29, 1897.

నాప్రియకుమారీ, నోబుల్,

స్టర్డీజాబొకటి నాకు నిన్న చేరినది. అందు నీవు ఇండియాకు వచ్చి, స్వయముగా అన్ని విషయములను కండ్లార చూడ నిశ్చయించుకొంటి వని యున్నది. దానికి నిన్న జవాబు వ్రాసితిని. మఱి నీపదకములనుగూర్చి కుమారిముల్లరు ద్వారా నేను ఎఱింగిన దానినిబట్టి ఈ విశేషజ్ఞాపికయు ఆవశ్యక మని తోచి, దానిని తిన్నగా నీకే వ్రాయుట మే లని తలంచితిని.

భారతదేశ సేవారంగమున నీకు గొప్ప భవిష్యత్తు కల దని నా కిపుడు ఏర్పడిన గట్టినమ్మకము దాచుకొనక నీకు చెప్ప నిమ్ము. ఇప్పుడుకావలసినది పురుషుడుకాదు, స్త్రీ. ఇండియనులకోసము, విశేషముగా ఇండియన్ స్త్రీలకోసము, పాటుపడుటకు నిజమైన సింహి ఒకతె కావలసియున్నది.

ఇండియా ప్రస్తుతము గొప్ప స్త్రీలను కనజాలకున్నది. వారిని ఆమె ఇతరదేశాలనుండి ఎరవు తెచ్చుకొనవలసియున్నది.

నీవిద్య, నీశ్రద్ధ, పవిత్రత, పట్టరాని ప్రేమ, నిశ్చయము, అన్నిటికిపైగా నీనాళములలోని ఆ కెల్టుల రక్తము—ఇవన్నియు ప్రస్తుతము మాకు కావలసిన మహిళవు నీవే అని నిర్ణయించుచున్నవి.

అయినను కష్టములు అనేకములు. ఇక్కడి దుఃఖాలను గూర్చియు, మూఢవిశ్వాసములనుగూర్చియు, బానిసతనమును గూర్చియు, నీవు ఇంచుకేని తెలిసికొనగల్గుట అసాధ్యము. నీవు అర దిగంబరులగు స్త్రీపురుషులసమూహము నడుమ ఉందువు. వారికి వర్ణములను గుఱించియు, 'ఇతరులతో కలియము, మేము వేఱు' అను ఏకాంతతాబుద్ధినిగూర్చియు వింతభావములు గలవు. తెల్లవారిని, భయముచేతనో ఏవగింపుచేతనో పరిహరించుట, వారి చేత తాము ప్రగాఢముగా ఏవగింపబడుట—ఇవియు గలవు. ఇక నిన్ను తెల్లవారు నిలుకడలేనిదానినిగా తలచి నీవు ఎటుపోయినను ఏమిచేసినను ఏమిచెప్పినను అనుమానముతో కనుపెట్టియే యుందురు.

మఱియొకసంగతి. ఇక్కడ వాతావరణము భయంకరోష్ణముగనున్నది. మా చలికాలము ఎక్కుచోటుల మీ యెండకాలమువలె ఉండును. ఇక దక్షిణభారతమున ఎండ లెప్పుడును మండుచుండును.

నగరములకు బయట ఎక్కడను యూరోపియనులకు తగిన, వసతులేవియు ఉండవు. ఈ సందర్భములన్నిటిని నీవు లక్ష్యపెట్టక పనిలో ప్రవేశింపసాహసింతువేని, నీకు సర్వథా స్వాగతము, సహస్రధా స్వాగతము! ఇక నామాటకా, తక్కినచోటులలోవలెనే ఇక్కడను నేను అకించనుడను. మఱి నాకు ఉన్న మాటచెల్లుబడి సర్వమును నీసేవకు వినియోగింతును.

ఇందులోనికి దూకకముందు నీవు చక్కగా ఆలోచించుకొనవలయును. పనియనంతరము, నీవు దానిని నెఱవేర్పలేక తప్పిపోయి

కృతజ్ఞత అప్పుపడియున్నాను. హాల్లి ఎట్లున్నది? వారిరువురికి నా ప్రేమ. క్రొత్త చంటిబిడ్డను నాబుచ్చిచెల్లెలిని నామాఱుగా ముద్దుగొనుము.

నేను తొమ్మిదినెలలు హిమాలయములలో కొంత విశ్రాంతి నొందుచుంటిని. మరల పనిని మొదలుపెట్టుటకు, ఇపుడు మైదానములకు పోవుచున్నాను.

ఫ్రాంకిన్సెన్సునకును జోజోకును, మేబెలుకును, నా ప్రేమ; అట్లే నీకును సదా నా ప్రేమ.

సదాభగవదాసక్త భవదీయ,

వివేకానంద

## 360

(సోదరి నివేదితకు)

అల్మోడా,
జూలై 29, 1897.

నా ప్రియకుమారీ, నోబుల్,

స్టర్డీజాబొకటి నాకు నిన్న చేరినది. అందు నీవు ఇండియాకు వచ్చి, స్వయముగా అన్ని విషయములను కండ్లార చూడ నిశ్చయించుకొంటి వని యున్నది. దానికి నిన్న జవాబు వ్రాసితిని. మఱి నీపదకములనుగూర్చి కుమారిముల్లరు ద్వారా నేను ఎఱింగిన దానినిబట్టి ఈ విశేషజ్ఞాపికయు ఆవశ్యక మని తోచి, దానిని తిన్నగా నీకే వ్రాయుట మే లని తలంచితిని.

భారతదేశ సేవారంగమున నీకు గొప్ప భవిష్యత్తు కల దని నా కిపుడు ఏర్పడిన గట్టినమ్మకము దాచుకొనక నీకు చెప్ప నిమ్ము. ఇప్పుడుకావలసినది పురుషుడుకాదు, స్త్రీ. ఇండియనులకోసము, విశేషముగా ఇండియన్ స్త్రీలకోసము, పాటుపడుటకు నిజమైన సింహి ఒకతె కావలసియున్నది.

ఇండియా ప్రస్తుతము గొప్ప స్త్రీలను కనజాలకున్నది. వారిని ఆమె ఇతరదేశాలనుండి ఎరవు తెచ్చుకొనవలసియున్నది.

నీవిద్య, నీశ్రద్ధ, పవిత్రత, పట్టరాని ప్రేమ, నిశ్చయము, అన్నిటికి పైగా నీనాళములలోని ఆ కెల్టుల రక్తము—ఇవన్నియు ప్రస్తుతము మాకు కావలసిన మహిళవు నీవే అని నిర్ణయించుచున్నవి.

అయినను కష్టములు అనేకములు. ఇక్కడి దుఃఖాలను గూర్చియు, మూఢవిశ్వాసములనుగూర్చియు, బానిసతనమును గూర్చియు, నీవు ఇంచుకేని తెలిసికొనగల్గుట అసాధ్యము. నీవు అరదిగంబరులగు స్త్రీపురుషులసమూహము నడుమ ఉందువు. వారికి వర్ణములను గుఱించియు, 'ఇతరులతో కలియము, మేము వేఱు' అను ఏకాంతతాబుద్ధినిగూర్చియు వింతభావములు గలవు. తెల్లవారిని, భయముచేతనో ఏవగింపుచేతనో పరిహరించుట, వారిచేత తాము ప్రగాఢముగా ఏవగింపబడుట—ఇవియు గలవు. ఇక నిన్ను తెల్లవారు నిలుకడలేనిదానినిగా తలచి నీవు ఎటుపోయినను ఏమిచేసినను ఏమిచెప్పినను అనుమానముతో కనుపెట్టియే యుందురు.

మఱియొకసంగతి. ఇక్కడ వాతావరణము భయంకరోష్ణముగనున్నది. మా చలికాలము ఎక్కుచోటుల మీా యెండకాలమువలె ఉండును. ఇక దక్షిణభారతమున ఎండలెప్పుడును మండుచుండును.

నగరములకు బయట ఎక్కడను యూరోపియనులకు తగిన, వసతులేవియు ఉండవు. ఈ సందర్భములన్నిటిని నీవు లక్ష్యపెట్టక పనిలో ప్రవేశింపసాహసింతువేని, నీకు సర్వథాస్వాగతము, సహస్రధా స్వాగతము! ఇక నామాటకా, తక్కినచోటులలోవలెనే ఇక్కడను నేను అకించనుడను. మఱి నాకు ఉన్న మాటచెల్లుబడి సర్వమును నీసేవకు వినియోగింతును.

ఇందులోనికి దూకకముందు నీవు చక్కగా ఆలోచించుకొనవలయును. పనియనంతరము, నీవు దానిని నెఱవేర్పలేక తప్పిపోయి

నను, నీకు అందులో విసుగు పుట్టినను, నీవు ఇండియాకై పాటు పడి నను పడకున్నను సరే, నీవు వేదాంతమును మానినను లేక అందే యున్నను సరే, నామట్టుకు నేను నా ప్రాణము లున్నంతవఱకును నీకు అండగా నిలుతును, ఏనుగు దంతములు ముందుకు వచ్చునే కాని వెనుకకు పోవు. అట్లే మనుష్యునిమాటలు ఎప్పుడును వెనుకకు త్రిప్పుకొనబడవు. నీకు నేను అట్లు మాట యిచ్చెదను. మఱియు నేను నీకు రవంత ముందు జాగ్రత్తకైన ఎచ్చరిక చేయవలసియున్నది. నీవు ఇచట స్వతంత్రముగా నీ కాళ్ళమీదనే నిలిచియుండవల యును. కుమారి ముల్లరు ఆశ్రయమునగాని మఱెవ్వరి ఆశ్రయమున గాని ఉండకూడదు. కుమారి ముల్లరు తన మార్గాన, తాను మంచిదే. మఱి గ్రహచారవశమున, ఆమె చిన్నపిల్లగా ఉన్న ప్పుడు, తాను నాయకురాలుగనే పుట్టితిననియు, లోకమును ఊపి వైచుటకు మఱే యోగ్యతలును అక్కఱ లేదనియు, ధన మొక్కటి యున్న చాలుననియు ఒక యభిప్రాయము ఎట్లో ఆమె తలలో దూఱినది! ఈ యభిప్రాయము ఆమెకు తెలియకయే ప్రముఖముగా పైకి వచ్చుచున్నది. నీవు కొన్నిదినాలలోనే 'ఆమె పొత్తున ఉండలే' నని గుర్తింతువు. ఆమె ఇపుడు కలకత్తాలో తనకోసము నీ కోసము ఇంకను ఇతరులగు మిత్రులకోసము ఇక్కడికి రాగల యూరోపియనులకోసము అమెరికనులకోసము ఒక ఇంటిని అద్దెకు తీసికొన నుద్దేశించుచున్నది.

అదెల్ల ఆమె దయయు మంచితనమునే. ఐనను మఠాధ్యక్షు రాలుగా నుందమను ఆమె పద్ధతి ఒకప్పటికిని జరుగనేరదు. దానికి రెండు కారణములు—ఆమెకుగల దుడుకుతనమును, తలపొగరు నొక కారణము, అత్యంత చిత్తచాపల్యమొక కారణము. ఒకింత దూర ముగనున్నచో చాలమందిలో స్నేహము అతి శ్లాఘ్యముగా నుండు ను. తన కాళ్ళపై తాను నిలబడగలవానికి అన్నియు బాగుగా జరుగును.

శ్రీమతి సేవియరు స్త్రీరత్నము, అంతమంచిది, అంత దయ గలది. సేవియర్లు మాత్రమే భారతీయులను ద్వేషింపని ఇంగ్లీషు వారు. స్టర్డీ సయితము ద్వేషించువాడే. సేవియరు దంపతులు మాత్రమే తమ్ము మాకు రక్షకులుగను ప్రాపకులుగను భావింపక ఇచటికి వచ్చినవారు. ఐనను వారికి ఇంకను నియతములగు పన్నకములు లేవు. నీవు వచ్చినపుడు వారిని కార్యసహాయులుగ ఉంచుకొనవచ్చును. అది వారికిని నీకును ఉభయులకును నిజముగా సాయముకాగలదు. అయినను అన్నిటిని పరిశీలించినంతట 'తన కాళ్ల మీద తాను నిలుచుటే' ప్రతివానికిని ఆవశ్యకము.

ఈసారి శరదృతువులో అమెరికానుండి నా స్నేహితురాండ్రు ఇరువురు, బోస్టనామె శ్రీమతి ఓల్ బుల్లును, కుమారి మెక్లీయడును ఇండియాను చూడవచ్చుచున్నారని నాకు తెలియుచున్నది. కుమారి మెక్లీయడును నీ విదివఱకే లండనులో కలసికొంటివి, ఎఱుగుదువు. ప్యారిస్ పద్ధతిలో వస్త్రధారణము మొదలైనవి చేసికొన్న చిన్న అమెరికను దొరసానియే, ఆమె. శ్రీమతి ఓల్‌బుల్లుకు ఏబది యేండ్లుండును, నాకు అమెరికాలో మిత్రము, చాలదయగలది.

వారును యూరపుమార్గముగా వచ్చుచున్నారు కావున, నీవు ప్రయాణమున ఆ జట్టును కలసికొందువేని ప్రయాణపు విసుగు తోపకుండును.

చివరకు స్టర్డివద్దనుండి చాలకాలమునకు ఒక జాబు వచ్చినందులకు సంతోషించుచున్నాను. అందులో చాల బెట్టు నిరాదరము కానసగుచున్నది. లండనులోని కార్యము చెడిపోయినందులకు అతడు చాల భగ్నాశుడైనట్లున్నాడు.

నిత్యప్రేమతో,

సదా భగవదాసక్త భవదీయ

వివేకానంద.

## 361

(శ్రీ రామకృష్ణానంద స్వామికి)

అల్మోడా,
జూలై 29, 1897.

ప్రియ శశీ,

నీపని అక్కడ చాల బాగుగా జరుగుచున్నదని నాకు సమాచారము తెలిసినది. మూడు భాష్యములలోను పూర్తి ప్రావీణ్యము సంపాదింపుము. యూరోపువారి తత్త్వశాస్త్రమును దానికి సంబంధించిన అన్నివిషయాలను కూడ చక్కగా చదువుము. ఇతరులతో యుద్ధము చేయుటకు ఎవనికైనను కత్తిడాలు కావలయును. ఈ సంగతి ఎప్పుడును మఱచిపోగూడదు. సుకులుడు ఇపుడు అక్కడికి చేరి నీకు చక్కగా కావలసిన పరిచర్య చేయుచున్నాడనుకొందును. సదానందునికి అక్కడ నుండుట ఇష్టము గాదేని అతనిని కలకత్తాకు పంపుము. ప్రతివారము కలకత్తా మఠమునకు పనిని, రాబడిని, సెలవును—ఇంకను ఇతరసమాచారములను గూర్చిన నివేదికను పంపుచుండుము, మఱవకు.

అళసింగని తోబుట్టువు భర్త ఇక్కడ బద్రిదాసువద్ద నాలుగు వందల రూపాయలు, తాను మదరాసు చేరగానే మరల పంపెదనని చెప్పి అప్పు తీసికొని పోయినాడు. అళసింగని అడిగి కనుగొని దానిని త్వరగా పంపుమని చెప్పుము. ఏలన నేను ఎల్లుండి ఇక్కడి నుండి బయలుదేఱి పోవుచున్నాను; ముస్సూరి కొండలకా, మఱియెక్కడికైననా అనుట తరువాత తీర్మానించుకొందును.

నేను ఈ స్థానమున నున్న ఇంగ్లీషువారిమధ్య ఒక యుపన్యాసము చేసితిని. అందఱును దానికి చాల సంతోషించినారు. కాని నేనంతకుపూర్వదినమున హిందిలో ఒక ఉపన్యాసము కావించియుంటిని; ఆ హింది యుపన్యాసమే నాకెక్కువ ప్రీతికరముగ

నుండినది. హిందిలోకూడ ఉపన్యసింప జాలుదునని అంతకుముందు నేనెఱుంగను.

ఎవరైనను క్రొత్తబాలురు మఠములో చేరుచున్నారా? ఉందురేని కలకత్తాలో చేయుచున్న విధముగానే ఇక్కడను పని కొనసాగింపుము. ప్రస్తుతము నీ జ్ఞానమును మితిమీఱి వినియోగించుకొనకు. అట్లైన అది పూర్తిగా వ్యయమై పోవునేమో. ఆపని తరువాత చేయవచ్చును లే.

నీ యారోగ్యమున విశేషశ్రద్ధవహింపుము. అందుకు విపరీతము అనదగినట్లు దేహముమీది అతిశ్రద్ధయు ఆరోగ్యనాశకమే. జ్ఞానబలము లేకున్న నీవు కొట్టు గంటను ఎవ్వరును లక్ష్యము సేయరు. అది నిజము. అది నిజమని యెఱిగి, నీకు కావలసిన ఆ జ్ఞానాదినంతయు ఆ మేరకు చక్కగా సమకూర్చుకొనుము. నీకును గుడ్వినుకును ఇతరులకును నాహార్ద ప్రేమయు ఆశీర్వాదములును.

ప్రేమయుత భవదీయ,

వివేకానంద.

## 362

(కుమారి మెక్లియడుకు)

మఠము, బేలూరు,

ఆగస్టు 11, 1897

ప్రియ జో,

.........మంచిది. అమ్మ పని కేమియు నష్టము కలుగదు. ఏలన అది సత్యము ఆర్జవము పవిత్రత అను పునాదిపై కట్టబడి నేటివఱకు నిలుపబడియున్నది. 'నిండు త్రికరణశుద్ధి'యే దాని సాంకేతిక శబ్దము.

సకలప్రేమతో నీవాడను,

వివేకానంద.

## 363

(శ్రీమతి బుల్సతికి)

మఠము *
ఆగస్టు 19, 1897

ప్రియ శ్రీమతి బుల్సతి,

...నాయారోగ్యము బాగులేదు. నాకు కొంత విశ్రాంతియున్నను, రామామూలు బలోత్సాహములు, పై శిశిరకాలము నఱకు నాకు పూర్తిగా కలుగు నని తోపదు. నాకు 'జో' కడనుండి జాబు వచ్చినది. మీరిరువురు ఇండియాకు వత్తురట కదా. ఇండియాలో మిమ్ము చూచుటకు నేను నిజముగా మిక్కిలి సంతసింతును. అయినను ఇండియా ఈ ప్రపంచమంతటిలోనికి కశ్మలానారోగ్యములు నిండిన బిలమువంటిది. పెద్దనగరాలలో తప్ప మరెందును యూరోపియను లకు వలయు వసతులు ఉండవని నీవు మొదటినుండియు ఎఱింగి యుండుట మంచిది.

అభేదానందుని న్యూయార్కునకు పంపుచున్నా నని శ్రీస్టర్డీ నాకింగ్లండునుండి జాబువ్రాసినాడు. నేను లేకున్న ఇంగ్లండులో పని అసాధ్య మని తోచుచున్నది. ఒకపత్రిక మాత్ర మారంభింప బడును. దానిని శ్రీ స్టర్డీ నడుపును. ఈతరుణమున నేను ఇంగ్లండుకు రావలయునని ఏర్పాటు చేసికొంటిని గాని, నన్ను డాక్టర్లు బుద్ధిలేక రానీయ రైరి. ఇండియాలో పని సాగుచున్నది.

యూరపియనుగానీ అమెరికనుగానీ, ఇప్పుడు ఇక్కడ ఎందుల కైనను ఉపయోగపడునని నాకు తోపదు. పాశ్చాత్యునికి ఎవనికైనను ఇచటి వాతావరణము దుర్భరమగును. ఆనిబెసెంటు తనకు అసాధారణ శక్తు లున్నను, ఆమె కార్యరంగము థియాసఫిస్టుల మధ్య మాత్రమే. ఇచట మ్లేచ్ఛులు అనుభవించు కేటాయింపు మొదలగు అగౌరవములను ఆమెయు అనుభవించుచున్నది. గుడ్విను సయితము అపుడపుడు బాధపడును. అతనిని సమాధాన పఱుపవలసియుండును. గుడ్విను మగవాడు కావున జనులతో

* నిజమున కీ జాబు అమ్బాలనుండి వ్రాయబడినది.

కలియగలిగియున్నందున మంచిపని చేయుచున్నాడు. ఈదేశాన స్త్రీలకు మగవారి సంఘములో ప్రవేశము లేదు. స్త్రీలు ఇండియాలో స్త్రీల నడుమ మాత్రమే మేలు చేయగలిగియుందురు. ఇండియాకు వచ్చిన యింగ్లీషు మిత్రులు ఇంకను ఏమియు సాయపడలేరైరి. ఉత్తరకాలమున నైనను వారు ఎందు ఏమేని సాయపడగలరో లేదో నాకు తెలియదు. ఈసందర్భము లన్నియు ఇట్లున్నను, ఎవతెయైనను రాగోరిన, ఆమెకు స్వాగతము.

శారదానందుడు రాగోరునేని రావచ్చును. ఇపుడు నాయారోగ్యము చెడియుండుటచే, అతడు ఇప్పుడిక్కడ పనిని అమర్చి సమకూర్చి సాగించుటలో చాల ఉపయోగపడునని నా నిశ్చయము. కుమారి మార్గరెట్ నోబుల్ అనునొక యింగ్లీషుయువతి ఇండియాకు వచ్చి ఇక్కడి స్థితిగతులను ఎఱుగవలెననియు, అట్లెఱిగినచో స్వదేశమునకు మరలినపుడు తాను కొంత పనిచేయవచ్చుననియు చాల ఉవ్విళ్లూఱుచున్నది, నీవు లండను మార్గాన వత్తువేని, ఆమెను నీవెంట ఇక్కడికి రమ్మని వ్రాసి యున్నాను. ఇక్కడికి వచ్చి సమక్షమున చూడకుండ దూరాననుండి ఇక్కడి సందర్భములను, ఒకనాటికిని బోధపఱచుకొనుట చాల కష్టము. ఈరెండు రకాలును, ఆదేశ సందర్భమును ఈదేశ సందర్భమును అన్ని విషయాలలో అంతపూర్తిగా భిన్నములగుటవలన అమెరికానుండి గాని ఇంగ్లండునుండిగాని ఇండియానుగూర్చి సరియైన భావమేర్పఱుచుకొనుట అసాధ్యము.

నీవు 'ఆఫ్రికామధ్యకు బయలుదేఱుచున్నాను' అని యనుకొనుము. ఇక్కడ అంతకంటెను శ్రేయమైనది నీకు కనిపించినచో అది అప్రతీక్షితమే యగును.

ఎప్పుడు నీవాడను.

వివేకానంద.

## 364

(శ్రీరామకృష్ణానందస్వామికి)

అంబాలా
ఆగస్టు 19, 1897.

ప్రియ శశీ,

మదరాసులో పని ధనాభావమువలన అభివృద్ధికి రాకున్న దని వినవచ్చుచున్నది. అది నా మనస్సునకు చాల బాధ కలిగించుచున్నది. అళసింగని బావమఱది 'అప్పుగొన్న పైకము చెల్లువచ్చిన దని అల్మోడాలో ఎఱింగి సంతోషించుచున్నాను. నాయుపన్యాస ఫలముగా మిగిలిన పైకమునుండి ఖర్చులకై కొంత పైకమును తీసికొమ్మని ఆహ్వాన సంఘమునకు తెలియబఱుపు మని గుడ్విను నాకు వ్రాసెను. ఉపన్యాస సమయమున వచ్చిన పైకమును సన్మానము కోసము ఖర్చుపెట్టుట చాల నీచమైన పని. ఈవిషయమును గూర్చి ఎవరితోను ఏమియు చెప్పుట నాకిష్టము లేదు. పైకము విషయము వచ్చునప్పటికి మన దేశ ప్రజలు ఎట్టివారో నేను చక్కగా తెలిసికొంటిని. నాతరపున నీవు సొంతముగా అక్కడి మిత్రులతో మాటలాడుము. ఖర్చులను భరించుటకు ధనాద్యుపాయములను వారే సమకూర్తురేని అంతయు సరియే యని నాజూకుగను మర్యాదగను వారికి బోధపఱుపుము. అయినను వారు అట్లు కావింపజాలరేని మీ రందఱును కలకత్తాలోని మఠమునకు మరలి రండు. లేదా రామనాధపురమునకు పోయి మఠమును అక్కడ స్థాపింపుడు.

నే నిపుడు ధరమ్‌శాల వద్దనుండు కొండలకు పోవుచున్నాను. నిరంజన్, దిను, కృష్ణలాల్, లాటు, అచ్యుత్—వీ రందఱును అమృతసరమున ఉందురు. నీవు ఇన్నాళ్ళను సదానందుని మఠమునకు ఏల పంపవైతివి? అతడు ఇంకను అక్కడనే యున్నయెడల, అమృతసరమునుండి నిరంజను వద్దనుండి జాబు రాగానే అతనిని పంజాబునకు పంపుము. పంజాబు కొండలలో మఱికొన్నాళ్ళు విశ్రాంతి పొందిన యనంతరము, నేను పంజాబులో పని యారం

భింప నుద్దేశించుచున్నాను. పంజాబును రాజపుటానాయు నిజముగా పనికి మంచి దేశములు. పనియారంభించిన యనంతర మే, ఆలస్యము చేయకుండ నేను నీకు మరల వ్రాయగలను.

ఇటీవల నాయారోగ్యము చాల చెడియుండినది. నేను ఇపుడు మెల్లగా కోలుకొనుచున్నాను. నీకును అళసింగకును, జి.జి. కిని, ఆర్.ఏ.కును, గుడ్విను, గుప్త, సుకులులకును, ఇంకను తక్కిన అందఱికిని నా ప్రేమ.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

## 365

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

అమృతసరస్సు
సెప్టెంబరు 2, 1897.

ప్రియరాఖాల్,

యోగిను బాగ్బాజారులో ఉన్నయింటిని రు 20,000 కు కొను మని నా కొక జాబులో వ్రాసినాడు. మనము ఆయింటిని కొన్నను, ఇంకను లెక్కలేని కష్టాలు ఉన్నవి. ఉదాహరణము: దానిని కొంతభాగము పడగొట్టి, అండలి అతిథుల గదిని ఒక పెద్ద హాలుగా చేయవలయును. ఇంకను అట్టి మార్పులు మరమ్మత్తులు చేయవలసినవి ఉన్నవి. అంతే కాక, ఆయిల్లు చాలపాతది, ఎక్కడ పట్టినను ఊగులాడునట్లున్నది. ఐనను గిరీశ్బాబుతోను, అతులుని తోను సలహాపడుము; మీరు ఏది శ్రేష్ఠ మని తీర్మానింతురో దానిని చేయుము. ఈదినము రెండుగంటల బండికి నేనును నా జట్టులో చేరిన వారమును కాశ్మీరమునకు బయలుదేఱుచున్నాము. ఇటీవల ధరమ్శాలకొండలలో ఉండినందువలన నాయారోగ్యము చాల బాగుపడినది; గవదకాయలు, జ్వరము మొదలైనవి అన్నియు పూర్తిగా మాయమైనవి.

నీవు వ్రాసిన యొక జాబువలన నాకు అన్నిసమాచారములు తెలిసినవి. నిరంజను, లాటు, కృష్ణలాలు, దిననాథ్, గుప్త, అచ్యుత్ అందఱును నాతో కాశ్మీరమునకు వచ్చుచున్నారు.

క్షామనివారణకు రు. 1,500/ విరాళము ఇచ్చిన మదరాసు మహాశయుడు ఆ పైకము వినియోగింపబడిన విధమునకు లెక్క అడుగుచున్నాడు. ఆయనకు ఆ లెక్కను పంపుము. మాకు ఇంచు మించుగా క్షేమమే.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

మలిమాట — మఠమున అందఱికిని నా ప్రేమను అందింపుము.

వి.

## 366

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

ప్రధాన న్యాయమూర్తి
ఋషివర ముఖోపాధ్యాయునింట
శ్రీనగర్, కాశ్మీర్.
సెప్టెంబరు 13, 1897.

ప్రియ రాఖాల్,

ఇపుడు కాశ్మీరము! ఈదేశమునుగూర్చి నీవు విన్న దివ్యమగు వివరము లన్నియు నిజము. ఇంత అందమైన చోటు మఱి లేదు. ఇక్కడి జనులును ఎఱుపు, చాల అందమైన వారు. వారి కన్నులు మాత్రము అందముగా లేవు. ఇంత మురికియైన గ్రామాలును పట్టణాలును నేను మఱెక్కడను చూడ లేదు. ఇదియు ఒక విశేషమే. శ్రీనగరులో నేను ఇపుడు ఋషివర బాబు ఇంట ఉన్నాను. ఆయన మిక్కిలి అతిథిసత్కారపరుడు, దయాశాలి. నా జాబు లన్నియు ఆయన యింటి విలాసమునకు పంపుము. ఇక కొన్ని దినాలలో మఱెక్కడికైనను విహార ప్రయాణములు చేయ గలను. మరలునపుడు శ్రీనగరు దారిగా వత్తును. అప్పుడు జాబులను కూడ తీసికొందును. గంగాధరుని గూర్చి నీవు పంపిన జాబును నేను చదివితిని. మధ్యయిండియాలోను గోరఖ్పూరులోను అనాథ శిశువులు అనేకులు ఉన్నారని అతనికి వ్రాయుము. అక్కడినుండి

పంజాబు జనులు చాలమందిబిడ్డలను తెచ్చుచున్నారు. నీవు మహేంద్రబాబును ప్రోత్సహించి, ఈవిషయమై ఒకకల్లోలమును లేపవలయును. ఈయనాథుల విచారణను పూనుకొనునట్లు కలకత్తా జనులను ప్రేరేపింపవలయును. అటువంటి ప్రయత్నము చాల అభిలషణీయము. మిషనరీలు తమ విచారణకు తీసికొనియున్న అనాథలనందఱిని హిందువులకు ఇచ్చివేయునట్లుగా చూడవలసినది అన్న ప్రార్థనతో ముఖ్యముగా ప్రభుత్వమువారికి ఒక అర్జీ పంపవలయును. గంగాధరుని రమ్మని చెప్పుము. రామకృష్ణ సమాజము తరపున ఘోరమైన పోరాటము సాగింపవలయును. నడుము బిగింపుము. ఈయుద్ధము సాగింప ప్రతియింటికిని పొమ్ము. మహాజనసమావేశాదులను జరుపుము. నీకు జయము, సిద్ధి కలుగనీ కలుగక పోనీ, భయంకర కల్లోలమును లేపుము. గోరఖ్పూరులోనుండు బెంగాలి మిత్రులకు వ్రాసి, వారివలన అన్ని విషయములు సేకరింపుము. ఈవిషయమైన కల్లోలము సకల దేశవ్యాపి కాసిమ్ము. రామకృష్ణసంస్థ పూర్ణముగా ప్రతిష్ఠిత మగును గాక. విరతి విరామము లేకుండ ఆందోళన సాగించుటయే సమస్తమంగలి ఈ రహస్యము. శారదుని పనిసాగిన క్రమపద్ధతి చూడ నాకు మిక్కిలి సంతోషము కలిగినది. గంగాధర శారదులు తాము చూడబోయిన ప్రతిచోటను ఒక కేంద్రము స్థాపించుటలో నెగ్గువఱకు తృప్తిచెంది కూర్చుండకూడదు.

ఇప్పుడే నాకు గంగాధరుని యొద్దనుండి జాబు వచ్చినది. అతడు ఆజిల్లాలో కేంద్రము మొదలిడ నిశ్చయించుకొన్నాడనుట మంచిసమాచారము. అతనిమిత్రము ఆమాజిస్ట్రేటు—న్యాయాధిపతి—నాజాబుకు దివ్యమైన జవాబు పంపినాడని అతనికి జాబు వ్రాయుము. కాశ్మీరమునుండి మైదానములకు రాగానే నేను లాటును, నిరంజనుని, దినుని, కోకాను వెనుకకు పంపివేయగలను. ఇకను ఇక్కడ వారికి తగిన పని యేమియు లేదు. ఇక మూడు నాలుగువారాలలో శుద్ధానందుని, సుశీలుని వీ రిరువురను

గాక మఱొక్కని నాయొద్దకు శ్రీశ్యామచరణ్ ముఖోపాధ్యాయునియింటికి—అనగా అంబాలా సైనికనిలయము కాంటెను మెంటులోని వైద్యకూటము మెడికల్‌హాలు—అను విలాసమునకు పంపుము. అక్కడనుండి నేను లాహోరుకు వెళ్ళెదను. వారికిరువురకు తొడుగుకొనుటకు రెండు లావైన—కావిరంగు జెర్సీలు—మేలి ఉన్నిచొక్కాలును, పరుండుటకు కంబళ్ళును ఉండవలయును. నేను లాహోరులో వారికోసము ఉన్ని 'చద్దర్లను', ఇంకను వారికి కావలసిన ఉన్నివస్త్రములన్నియు కొనెదను. 'రాజయోగ' గ్రంథానువాదము పూర్తియైయున్న, దానికి వలయు వ్యయమంతయు భరించి ముద్రించి ప్రకటింపుము............భాష దుర్బోధముగ నున్న చోట్ల సులువును సుబోధమును చేయుము. తులసికి, చేతనైన ఆ రాజయోగగ్రంథమునకు హిందీ తర్జుమాను వ్రాయుమని చెప్పుము. ప్రచురింపబడినచో ఈ పుస్తకములు మఠమునకు చాల ఎక్కువగా సాయపడును.

ఇపుడు నీయారోగ్యము పూర్తిగా బాగున్న దనుకొందును. ధరమ్‌శాలచేరినప్పటినుండి నా ఆరోగ్యము బాగుగనే ఉన్నది. శీతలప్రదేశములు నాకు ప్రియములు. అక్కడ శరీరస్థితి బాగుండును. కాశ్మీరములో కొన్నిచోట్లుచూచి ఒకదివ్యమైనచోటును ఎన్నుకొని అక్కడ ప్రశాంతజీవితమును గడపెదను, లేదా మరల ఊర్లు దిమ్మరుచుందును. డాక్టరు ఏసలహా చెప్పునో దానిని చేసెదను. రాజు ఇపుడు ఇక్కడ లేడు. అతని తమ్ములలో పెద్దవాడు సర్వసేనాధిపతి. అతని ఆధ్యక్ష్యమున ఒకయుపన్యాసము ఏర్పాటు చేయు ప్రయత్నములు జరుగుచున్నవి. దీనిని గురించి అంతయు తరువాత వ్రాసెదను. ఉపన్యాస సమావేశము ఇంకను ఒకటి రెండుదినాలలో జరుగునేని, నేను ఇక్కడ నిలుతును, లేకున్న నాసంచారములకు వెడలెదను. సేవియరు ఇంకను ముర్రీలో ఉన్నాడు. ఆ కుదిలించు టాంగాలలోను జట్కాలలోను తిరుగుచున్నందున అతని యారోగ్యము చాల దెబ్బతిన్నది. ముర్రీలోని

బెంగాలి పెద్దమనుష్యులందఱు చాలమంచివారు, మర్యాదగానుండు వారు. గి.చ. ఘోషునకు, అతులునకు, మాస్టరు మహాశయునకు, ఇంకను ఇతరులకు నా నమస్కారములు అందింపుము. ప్రతియొకని ఉత్సాహమును అభివృద్ధిలో నుంపుము. మనము కొనవలయునని యోగిను సూచించిన యింటి సమాచార మేమయినది? అక్టోబరు నెలలో నేను ఇందుండి తరలివచ్చి పంజాబులో కొన్ని యుపన్యాసములు చేసెదను. అటుతర్వాత నా పర్యటన సింధుద్వారా కచ్చికి, భుజ్ కు, కథియవాడుకు, సందర్భములు అనుకూలముగానున్న పూనావఱకును సాగవచ్చును. అట్లుగాకున్న బరోడాద్వారా రాజపుటానాకును, అందుండి వాయవ్యరాష్ట్రమునకును * తరువాత నేపాళమునకును, కడపటికి కలకత్తాకును చేరుదును. ఇది నా ప్రస్తుత కార్యక్రమము. అయినను సర్వమును దైవాధీనము. అందఱికి నా ప్రేమయు క్షుశలప్రశ్నలును.

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

## 367

(శ్రీ శుద్ధానందస్వామికి)

ప్రధానన్యాయమూర్తి
ఋషివరముఖోపాధ్యాయుని యిల్లు
శ్రీనగర్—కాశ్మీరము,
సెప్టెంబరు 15, 1897.

నా ప్రియ శుద్ధానందా,

మేము కడపటికి కాశ్మీరము చేరుకొన్నాము. ఈ ప్రదేశ రామణీయకము నంతటిని గూర్చి నీకు చెప్ప నక్కఱ లేదు. నా అభిప్రాయమున యోగులకు తగినచోటు ఇదొక్కటియే. ఇపుడు ఈదేశాన నివసించు ప్రజలు చాల దేహసౌందర్యము కలవారైనను ఎంతయు మురికిలో మునుగుచున్నారు. నేనొక నెలదినములు

* అంటిప్పటి ఉత్తరప్రదేశమును పంజాబులో కొంతభాగమును చేరియుండెను.

దర్శనీయముల చూచుచు బలవృద్ధి పొందుచు నీటిమీద ప్రయాణము చేయబోవుచున్నాను. నగరమున ఇపుడు మన్నెపుజ్వరము మిక్కిలి చెలరేగి ఉన్నది. సదానందునికి క్రిస్టొలాలునకు జ్వరము వచ్చి యున్నది. ఈదినము సదానందునికి మేలుగా నున్నది గాని క్రిస్టొలాలునకు ఇంకను జ్వరము ఉన్నది. ఈదినము వైద్యుడు వచ్చి అతనికి విరేచనమునకు మందునిచ్చినాడు. రేపటికి అతని ఆరోగ్యము కుదుటపడునని అనుకొందును. మేము రేపే బయలుదేరెదము. ఈ రాష్ట్రప్రభుత్వమువారు నాకు తమ పెద్దపడవనొకదానిని కొన్నాళ్ళు వాడుకొనుటకు ఇచ్చియున్నారు. అది చాల అందముగను వసతిగలి గియు ఉన్నది. వారు పెక్కుజిల్లాల తహసీలుదారులకు ఉత్తరువులు పంపియున్నారు. ఇక్కడిజనులు మమ్ము చూచుటకు గుంపులు గూడుచున్నారు, మేము సుఖముగా ఉండుటకు తమ చేతనైన దంతయు చేయుచున్నారు.

ఇండియను మిఱ్ఱరునుండి ఒక కత్తిరింపును ఎవరో తమ పేరు తెలుపక నాకు పంపి, 'ఇందులకు ఏమి జవాబు చెప్పెదవు' అని అడిగియున్నారు. డాక్టరు బర్రోసు ఎందో అమెరికను పత్రికలో వ్రాసిన ఒక వ్యాసమునుండి ఉద్ధారములు అందులో ఉదాహరింప బడి యున్నవి. అవి అన్నియు అబద్ధములు. వానికి నాజవాబులు వ్రాసి వానితో ఆ కత్తిరింపును బ్రహ్మానందునికి తిరుగ పంపితిని.

నీవు అక్కడ ఆరోగ్యము గలిగియున్నావనియు, నీ మామూలు పని సాగించుచున్నావనియు తెలిసినది. నాకు చాల సంతోషము. శివానందుని యొద్దనుండియు ఒక జాబు వచ్చినది. ఆ జాబులో అతడు అక్కడి పని వివరములు వ్రాసియున్నాడు.

ఒక నెల మైనతర్వాత నేను మరల పంజాబునకు వెళ్ళెదను. అక్కడ అంబాలావద్దకు మీలో ముగ్గురు వత్తురని నిరీక్షించు చుందును. ఒకవేళ అక్కడ ఒక కేంద్రము ఏర్పడునేని దానిని చూచుకొనుటకు మీలో ఒకరు అందు నిలువవలసియుండును. నిరం జనుని లాటును, క్రిస్టొలాలును వెనుకకు పంపివేయుదును.

నేను పంజాబు సింధువులగుండ త్వరితమగు సంచారము కావించి, కథియవాడ్ గుండ బరోడాలో తిరిగి, వెనుకకు రాజ పుటానాకు వచ్చి అందుండి నేపాళమునకును కడపట కలకత్తాకును చేరగలను.

నాకు శ్రీనగరులో ఋషివర బాబునింటికి జాబులు వ్రాయుము. నేను వెనుకకు మరలునపుడు దారిలో ఆ జాబులను తీసికొందును.

అందఱికి ప్రేమాశీస్సులతో,

భవదీయ

వివేకానంద.

## 368

(శ్రీ హరిపాదమిత్రకు)

శ్రీనగరు, కాశ్మీరు,
1897.

ప్రియ హరిపాదా,

కడచిన తొమ్మిది నెలలుగా నా ఆరోగ్యము చాల చెడియుండెను. ఎండవేడిమి దానిని మఱింత పాడుచేసినది. కాబట్టి నేను కొండలమీంద ఒకచోటినుండి మఱియొక చోటికి తిరుగుచుంటిని. ఇప్పుడు కాశ్మీరమున ఉన్నాను. నేను చాలచోట్లకు ప్రయాణములు చేసితిని. కాని ఇట్టి దేశమును ఎక్కడను చూడలేదు. నేను త్వరలోనే ఇందుండి పంజాబుకు పోయి పనిచేయ నారంభింతును. సదానందునివలన నిన్నుగూర్చిన అన్ని సమాచారములును ఎఱింగితిని. అతడు ఇంకను ఎప్పటికప్పుడు నీసంగతి వ్రాయుచున్నాడు. పంజాబును చూచిన తర్వాత నేను కరాచికి వచ్చుట నిశ్చయము. కాబట్టి మన మక్కడ ముఖాముఖి కలసికొందము.

ఆశీర్వాదములతో,

వివేకానంద.

## 369

(కుమారి జోసిఫైన్మెక్లియడుకు)

శ్రీనగర్-కాశ్మీరము,
సెప్టెంబరు 30, 1897.

ప్రియకుమారీ మెక్లియడూ,

నీవు నిజముగా రాగోరుదువేని త్వరగా రమ్ము. నవంబరు మొదలుకొని ఫిబ్రవరి మధ్యవఱకు ఇండియా వాతావరణము చల్లగా నుండును. నీవు చూడగోరున దంతయు అప్పుడు చూడ గల్గుదువు. సర్వమును చూడవలయు నన్న ఏండ్లు పట్టును.

ఇపుడు చాల తొందరలో ఉన్నాను. కావున కార్డు నిట్లు ఆదర బాదర వ్రాసినందుకు క్షమింపుము. శ్రీమతి బుల్సుకు నా ప్రేమను అందింపుము. గుడ్విను త్వరగా నయమయి అతడు తేఱుకొనుట కైన నా శుభాశంసలను నిండు దీవనలనుకూడ అందింపుము. అమ్మకు ఆల్బర్టాకు చంటిబిడ్డకు హాలిస్టరుకు, కడపట చెప్పినను తక్కువకాని ఫ్రాంకికి నా ప్రేమను అందింపుము.

భగవద్గత భవదీయ
వివేకానంద.

## 370

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

శ్రీనగర్, కాశ్మీరము
సెప్టెంబరు 30, 1897.

ప్రియ రాఖాలూ,

నీవు ప్రేమతో వ్రాసిన జాబును మఠమునుండి వచ్చిన జాబును చేరినవి. ఇక రెండుమూడు దినాలలో పంజాబునకు బయలు దేఱుచున్నాను. నాకు విదేశపు తపాలుగూడ వచ్చినది. కుమారి నోబుల్ జాబులో అడిగిన ప్రశ్నలకు ఈక్రిందివి నా జవాబులు:—

1. చాలవఱకు అన్ని శాఖలు ఆరంభింపబడినవి. ఐనను ఉద్యమము ప్రారంభదశలోనే ఉన్నది.

2. సన్న్యాసులలో చాలమంది చదువుకొన్నవారే. వారిలో చదువులేనివారు మతసంబంధముకాని ఐహికపు చదువు లౌకికవిద్య నేర్చుకొనుచున్నారు. మఱి అన్నిటికిపైగా, హితముచేయుటకు పూర్ణ పరార్థపరత ఆవశ్యకము. అది తప్పక కలుగుటకై ఇతరముల కంటె పారమార్థిక సాధనలపై ఎక్కువశ్రద్ధ చూపబడుచున్నది.

3. లౌకిక విద్యోపాధ్యాయులు:— లౌకిక విద్యగఱపుటకు, ఇంతకుముందు తాము సొంతమునకు చక్కగా విద్యనేర్చుకొన్న వారు లభింతురు. వారిని మన పద్ధతియందు తరిబీదు చేయుటయు, గుణశీలములు పెంపొందించుటయు మాత్రమే కావలసినది. వారిని వినయవంతులనుగను నిర్భయులనుగను చేయుటయే తరిబీదు. బీదలకు మొదట శరీరవిషయాలలో సాయము చేయుటయు, తర్వాత మానసికముగా పైస్థాయిని అందుకొనునట్లు చేయుటయు అవలంబింపవలసిన పద్ధతి.

కళలు - పరిశ్రమలు:— కార్యక్రమమున ధనాభావముచే ఆరంభించుటకు వీలుకానిది ఈశాఖ మాత్రమే. ప్రస్తుతమునకు అనుసరింపవలసిన మిక్కిలి సులువగు పద్ధతి 'మీరు పండించు కొన్నదానినే మీరు ఉపయోగించుకొను'డని భారతీయులను ప్రోత్స హించుట. ఇండియాదేశపు శిల్పఖండములు మొదలగువానిని బయటి దేశాలలో వెలపుచ్చుట. ఇందుకు పూనుకొనువారు మధ్యస్థులుగను, దలారులుగను ఉండరాదు; అమ్మకమున వచ్చిన ధనమునంతయు కార్మికుల మేలునకే వినియోగించువారుగా ఉండవలయును.

4. 'జనులు చదువుకొనుటకు వచ్చువఱకు ఒక చోటినుండి మఱియొక చోటికి సంచారముచేయుట ఆవశ్యకముగా నుండును. ఈ పరివ్రాజక సన్న్యాసులు ఆధ్యాత్మిక శీలము లేనివారుగ నుండుట కంటెను, అట్టి శీలము కలవారుగ నుండినచో వారివిలువ చాల హెచ్చును.

5. మనకు మాటచెల్లుబడి అన్నివర్ణములవారిలోను కావలెను. మన ప్రభావము ఇప్పటివఱకు అగ్రవర్ణస్థులమీదికి మాత్రమే ప్రస

ంచినది. పెక్కు క్షామ కేంద్రములలో క్షామనివారణ కార్యశాఖపని సమ్మరముగా సాగుచున్నందున, నిమ్నవర్గాల వారిపై కూడ మన మాట చెల్లుబడి ఇప్పుడు నానాటికి హెచ్చగుచున్నది.

6. హిందువులు చాలవఱకు అందఱును మాకార్యమును అంగీకరింతురు. అట్టి పనులలో కార్యమార్గమున తోడ్పడుట వారికి అలవాటు లేదు. అంతే.

7. అవును. ఆరంభమునుండియు మా దాన క్రియలయందేమి ఇతర ధర్మకార్యములందేమి ఇండియాలోని వేర్వేఱు మతాల విషయమున మేము ఎట్టి తారతమ్యమును చూపుటలేదు.

ఈసూచనలను అనుసరించి కుమారి నో.కు జవాబు పంపుము.

రోగిను వైద్యవిషయమున ఎట్టి యజాగ్రత్తయు లేకుండు నట్లు పరికింపవలయును. కావలసివచ్చిన మూలధనమునుండియు పైకమును వ్యయము చేయుము. నీవుపోయి భవనాథుని భార్యను కలిసికొంటవా?

బ్రహ్మచారి హరిప్రసన్న రాగలిగిన, చాల సాయముగా నుండును. ఎక్కడనైనను ఒకయిల్లు సంపాదింపవలయును అని శ్రీసేవియరు చాల తొందరపడుచున్నాడు. దానిని గూర్చి ఏమైనను త్వరగా చేసిన బాగుండును. హరిప్రసన్న ఇంజనీరు. అతడు ఆ విష యమున త్వరగా ఏమైనను చేయగలిగియుండును. అంతే కాక ప్రదేశాల అర్హత అతనికి చక్కగా తెలియును. డేరా డూనుకుగాని ముస్సూరికిగాని సమీపమున, అనగా అతి శీతము గానిదియు అన్ని ఋతువులలోను వాసయోగ్యమైనదియు నగు చోటు కావలయునని వారి (=సేవియర్ల)యభిమతము. కావున అంబాలాలో మెడికల్ హాలునొద్ద—శ్రీయుత శ్యామపాదముఖర్జీ కడకు తత్క్షణమే హరిప్రసన్నను పంపుము. నేను పంజాబును చేరగానే శ్రీసేవియరును అతనితోగూడ పంపెదను. నేను పంజాబు, కరాచి, తరువాత కథియవాడు గుజరాతులమీదుగా కాక, రాజపుటానా

గుండ నేపాలునకు సంచారముచేసి త్వరితముగ మఠమునకు మరలుచున్నాను. తులసి మధ్యభారతమునకుపోయినా డన్నారు గదా క్షామనివారణ కార్యమున కేనా?

అందఱికి నాదీవెనలును ప్రేమయు. కాళీ న్యూయార్కు చేరినా డని నాకు సమాచారము తెలిసినది కాని, అత డేమియు జాబు వ్రాయ లేదు; జనులకు ఆశ్చర్యము కలుగునంతగా తన పని పెంపొందిన దని స్టర్డి వ్రాసినాడు. మఱికొంతమంది కూడ అతని పనిని ప్రశంసించుచు నాకు వ్రాసియున్నారు. అయినను, అమెరికాలో అంతకష్టములేదు. పని యెట్లో ఒకవిధముగా సాగిపోవును. హరిప్రసన్నతోకూడ శుద్ధానందుని, ఆతనిసోదరుని పంపుము. నా జట్టు వారిలో గుప్తయు అచ్యుతును నావెంట వత్తురు.

భవదీయ ప్రేమయుత
**వివేకానంద.**

## 371

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

శ్రీనగర్, కాశ్మీరము
సెప్టెంబరు 30, 1897.

ప్రియశశీ,

కాశ్మీరమున కొన్నిచోట్లు చూడబోయి ఇప్పుడే మరలు చున్నాను. ఇకను ఒకటిరెండు దినాలలో పంజాబునకు తరలెదను. నాయారోగ్యము ఇపుడు చాలమేలుగా నున్నందున, నేను మును పటి వలెనే సంచారము చేయ నిశ్చయించుకొంటిని. అతిమాత్రపు ఉపన్యాసాలు లేవు. ఒకవేళ పంజాబులో ఒకటిరెండు ఉపన్యాసము లుండవచ్చును. లేకున్న ఏమియు లేదు, అంతే. మనదేశజనులు నా ప్రయాణవ్యయములకు ఇప్పటికి ఒకపైసాయైనను ఇయ్యలేదు. ఇక పైపెచ్చు నీతో ఒకబృందమునంతయు వెంటగొనుట, బళి, అదంతయు ఎంత చీదరపుట్టించునో నీవు సులువుగా గ్రహింపగలవు. ఇంగ్లీషుశిష్యులయొద్దనుండియే ధనము రాబట్టుకొనవలసియుండుట లజ్జాకరము. కావున మునుపటివలెనే ఒకకంబళి మాత్ర

ముతో బయలుదేఱెదను. నీవు గ్రహింపగలయట్లే ఇక్కడ గుడ్విను వంటి మనుష్యునితో ఏమియు ప్రయోజనము లేదు.

సిలోనునుండి ఒకసన్న్యాసి, పి. సి. జి. నవర్ వామరు అను పేరుగలాయన నాకు అనేక సంగతులతో జాబు వ్రాసినాడు. అందు తాను ఇండియాకు వచ్చి చూడ వలయు నని వ్రాసియున్నాడు. సయామీసు రాజవంశమున పుట్టిన సన్న్యాసి ఆతడే కాబోలు. అతని విలాసము—వెల్లవట్ట, సిలోన్—అని. అనుకూలముగా నున్న ఆతనిని మదరాసుకు ఆహ్వానింపుము. ఆతనికి వేదాంతమున నమ్మకము ఉన్నది. ఆతనిని మదరాసునుండి ఇతరస్థలములకు పంపుట అంతకష్టముగా ఉండబోదు. అట్టివానిని మన సన్న్యాసి బృందమున చేర్చుకొనుటయు శ్లాఘ్యమే. నీకును తక్కిన యందఱికిని నాప్రేమయు దీవెనలును.

భవదీయ

వివేకానంద.

మఱిమాట :— ఖేత్రిమహారాజు అక్టోబరు తే 10 ది బొంబాయికి చేరగలడు. అతనికి స్వాగతాభివందన పత్రము సమర్పింప మఱవకు.

వి.

## 372

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

శ్రీనగర్, కాశ్మీరము
సెప్టెంబరు 30, 1897.

నాప్రియ రాఖాలూ,

గోపాల్దాదా వ్రాసిన జాబువలన నీవు కొన్నగరులో ఆప్రదేశమును చూచితి వని నాకు తెలిసినది. దానికి బాడిగ లేదనియు అది 16 బీగాలు అనగా 5 ఎకరములు ఉండుననియు, వెల ఎనిమిదిపదివేలకు తక్కువే అనియు తెలియ వచ్చుచున్నది. ఆ చోటు ఆరోగ్యమైనదగునా అను మొదలగు విషయములన్నియు ఆలోచించి నీకు ఎట్లు శ్రేష్ఠము అని తోచునో అట్లు చేయుము. ఇంకను

ఒకటి రెండుదినాలలో నేను పంజాబునకు తరలెదను. కావున నాకు జాబులను ఇకను ఈవిలాసమునకు వ్రాయకుము. ఇటుతరువాతి నావిలాసమును తంతి ద్వారా తెలిపెదను. హరిప్రసన్నను పంప మఱవకుము. "నీయారోగ్యము త్వరలోనే బాగుపడును. శిశిరము వచ్చుచున్నది. ఏమి భయము? బాగుగా భోజనము చేయుము, సంతోషముగా ఉండుము" అని గోపాల్ దాదాతో చెప్పుము. యోగిను ప్రకృతపు ఆరోగ్యస్థితినిగూర్చి "స్ప్రింగ్ డేలు ముఠ్ఠ్"— అను విలాసమునకు శ్రీమతి సి. సేవియరుకు ఒక జాబువ్రాయుము, దానికవరుమీద—'రాకను నిరీక్షింపుము' అని యుదాహరింపుము. అందఱికిని నాప్రేమయు దీవెనలును.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

మఱిమాట :— ఖేత్రిమహారాజు అక్టోబరు తే 10 ది బొంబాయి చేరును. ఆతని కొక స్వాగతాభివందన పత్రము సమర్పింప మఱవకు.

వి.

## 373

(శ్రీమతి ఇందుమతి మిత్రకు)

కాశ్మీరము.
1897.

ప్రియ జననీ,

నేను నీకు జాబు వ్రాయజాలనందులకును, బెల్గాముకు రాజాలనందులకును నీవు ఆందోళన పడకుము—నేను చాల అనారోగ్యము వలన బాధపడుచుంటిని; కావున అక్కడికి అప్పుడు వచ్చుట శక్యము గాకపోయెను. ఇపుడు హిమాలయములలోని సంచారముల వలన నా కారోగ్యము చాలవఱకు మరల సమకూరినది. నేను త్వరలో పని మరల ఆరంభింతును. ఇక రెండువారాలలో పంజాబుకు వెళ్ళెదను. లాహోరులోను అమృతసరస్సులోను ఒకటి రెండు ఉపన్యాసములు చేసి నేను కరాచీమీదుగా గుజరాత్, కచ్ మొద

లగు చోట్లకు బయలుదేఱుదును. నిన్ను కరాచీలో తప్పకుండ కలిసికొందును.

ఈకాశ్మీరము భూలోకమున అచ్చపు స్వర్గమే. ఈప్రపంచమున మఱెక్కడను ఇట్టి దేశము లేదు. కొండలు, నదులు, చెట్లు, చిన్న మొక్కలు, పురుషులు, స్త్రీలు, జంతువులు, పక్షులు — అన్నియు దివ్యరామణీయకమునకు ఒండొంటితో పోటీవేసికొని మించజూచుచున్నవి. నేను ఇంతకాలము ఈదేశమును చూడకుండినందుకు చిత్తమున వెతచెందుచున్నాను. నీమానసిక శారీరక పరిస్థితిని నాకు వివరముగా జాబు వ్రాయుము. నీకు నావిశేషాశీర్వాదములు. నేను నీక్షేమమునే చిత్తమున సదా కోరుచుందును. ఈమాట నిజము అని తెలిసికొనుము.

శ్రద్ధాయుత భవదీయ
వివేకానంద.

## 374

(సోదరి నివేదితకు)

శ్రీనగర్, కాశ్మీరము
అక్టోబరు 1, 1897.

ప్రియ మార్గో,

కొందఱు, తమ కెవరైనను దారిచూపినచో, శ్రేష్ఠమగు పనిచేయుదురు. పుట్టిన వాడెల్ల దారిచూపజాలడు. అయినను శ్రేష్ఠమగు మార్గదర్శకుడు "చంటిబిడ్డవలె దారిచూపువాడు." బిడ్డ, తనకు ప్రతివారి యాశ్రయము కావలసినట్లు అగపడుచున్నను, నిజముగా ఇంటికి రాజు. కడకు నాకు తోచినమట్టుకైనను, అదే రహస్యము. .........అనుభవము చాలమందికి గలుగును కాని ఆ అనుభవమును ప్రకటింపగలవారు కొందఱు మాత్రమే. తక్కినవాని చేతకంటె—ప్రేమను, గుణగ్రహణమును, సానుభూతిని ప్రకటింపగల శక్తిచేతనే మానవుడు ఆశయముల వ్యాపింపజేయ సమర్థుడగుచున్నాడు.

నేను నీకు కాశ్మీరమును అభివర్ణించిచెప్ప ప్రయత్నింపను. ఒక మాటచాలును, ఇది ఈ భూలోకస్వర్గము; దీనిని విడిచి పెట్టుటకు దుఃఖపడుచున్నాను. మఱియే దేశమును విడిచిపెట్టుటకును నేను ఎన్నడును దుఃఖపడలేదు. ఇక్కడ ఒక కేంద్రమును ఆరంభించునట్లు, ఈరాజును ప్రోత్సహింప నాచేతనైనంతగ ప్రయత్నించుచున్నాను. ఇక్కడ చేయవలసినది ఎంతో యున్నది! దానికి గల పరికరము ఎంతో ఆశాజనకముగా ఉన్నది! .........

తమ సమస్త ప్రేమను నాకే యొసంగు జనులను నేను చూచుచున్నాను. బదులుగా నేను మాత్రము ఎవనికిగాని నాసమస్త ప్రేమను ఈయగూడదు. ఏలన అట్లు ఇచ్చిన యాదినమే పని నాశనమగును. ఇది పెద్దకష్టము. అయినను కొందఱు నాసమస్తప్రేమను బదులుగా రాబట్టుకొన జూతురు. వారికి ఆ అకర్తృక విశాలదృష్టి లేదు. అలవడినంతమంది ఉత్సాహ పూరితప్రేమ నాయందుండుట పనికి అత్యావశ్యకము. నేనేమో వ్యక్తిదృష్టి బొత్తిగా లేకుండవలయును. అట్లుండకున్న అసూయయు జగడాలును సమస్తకార్యమును నాశముచేయును. నాయకుడు ఎప్పుడును వ్యక్తిదృష్టి లేనివాడుగా నే ఉండవలయును. ఇదెల్ల నీకు బోధపడినదని నానిశ్చయము. అనగా ఇతరుల భక్తిని తన ప్రయోజనమునకు వాడుకొనుచు అంతలో లోలోన ముసిముసినవ్వులు నవ్వుకొనుచు ఎవడును పశువుగా నుండవలయు ననికాదు. నాయుద్దేశము; నేనుండుపద్ధతియే నాయుద్దేశము. నాప్రేమలో నేను గాఢముగా వ్యక్తిదృష్టిగల్గియే ఉన్నాను. కాని అక్కఱకలిగిన, బుద్ధుడు పలికినట్లు పలువురమేలునకై పలువురక్షేమమునకై నాహృదయమును నాచేతితో పెఱికివేసికొనగల శక్తి నాకుఉన్నది. ప్రేమోన్మాదమే; అయినను అందు ఏబంధకమును ఉండకూడదు. జడమును ఆత్మగా పరిణమింపజేయునది ప్రేమశక్తి! అంతేకాదు! అదియే మన వేదాంతమునందలి సారాంశము. తత్త్వమొక్కటే, అదే అజ్ఞానికి ప్రకృతిగాను, జ్ఞానికిపరమాత్మగాను కననగును. నానాటికి కొంతగా

ప్రకృతియంతయు ఆత్మాధిష్ఠితమని ఎఱుగుటే నాగరకతా చరిత్రము. అజ్ఞానికి నిరాకారములో సాకారము గోచరించును. జ్ఞానికి సాకారములో నిరాకారము పొడకట్టును. ఖేదమోదములవలన కష్టసుఖములవలన మనము నేర్చుకొనుచుండు పాఠమి దొక్కటే......

సదా ప్రేమతో సత్యముతో,

భవదీయ

వివేకానంద.

## 375

(శ్రీ శారదానందస్వామికి)

ముఱ్ఱీ

అక్టోబరు 10, 1897.

ప్రియ శారదా,

నీకు ఆరోగ్యము బాగుగా లేదని నీజాబువలన తెలిసికొని చింతిల్లుచున్నాను. నీవు జనులకు అప్రియుడగువాని నొక్కని ప్రియునిగ చేయగలవేని నిన్ను తెలివిగల వాడవని పేర్కొందును. అక్కడ భవిష్యత్తున పనికి ఏమియు అవకాశము లేదు. అంతకన్నను నీవు ఢాకాకో, మఱియొకస్థలమునకో పోయియున్న బాగుగా నుండి యుండును. అయినప్పటికి పని నవంబరులో ముగియు ననుట మంచి విషయమే. నీ ఆరోగ్యము ఎక్కువగా దెబ్బతిన్నచో, నీవు మరలి వచ్చుట మంచిది. పనికి విశాలమైన రంగము మధ్యరాష్ట్రములలో ఉన్నది. క్షామము లేకున్నను మనదేశమున దారిద్ర్యబాధిత జనుల సంఖ్యకు కొదువ లేదు. ఎక్కడనైనను, సరే, నీవు పురోవృద్ధిపై కన్నుపెట్టి, చోటును ఎన్నుకొన్న, నిజముగా చాల పని సాధింపగలవు. అయినను చింతింపకు. చేసినపనికి నాశము లేదు; లేనే లేదు; ఎప్పటికిని లేదు. ఎవ రెఱుంగ గలరు, ఆచోటనే భవిష్యత్తు బంగారమును పండింపవచ్చును!

నేను త్వరలోనే మైదానాలలో నా పని ఆరంభింతును. ఇపుడు నాకు కొండలపై ప్రయాణము చేయవలయు ఆవశ్యకత లేదు.

నీయారోగ్యమును చూచుకొనుము.

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

## 376

(శ్రీ అఖండానందస్వామికి)

ముర్రీ
అక్టోబరు 10, 1897.

ప్రియ అఖండానందా,

నీజాబు వచ్చినది. చాల సంతోషము. నీవు ప్రస్తుతము పెద్ద పన్నాగము పెట్టుకొనవలదు. ప్రకృత సందర్భములయందు ఏది సాధ్యమో దానిని మాత్రమే చేయుము. క్రమముగా తనంతటనే దారి నీకు అగపడును. మనము అనాథశరణాలయమును పెట్టవలసి నదే, అందుకు వెనుదీయుట లేదు. బాలికలను దిక్కుమాలినస్థితిలో విడువను రాదు. అనాథబాలికల శరణాలయమునకు పర్యవేక్షకురాలుగా ఒకమహిళ కావలయును. అందుకు మాతృశ్రీ చాలబాగుగ ఉపయోగపడునని నానమ్మకము. లేకున్న అందులకు గ్రామమందు బిడ్డలులేని ముసలివితంతువును ఎవతెనైన ఏర్పాటుపుము. బాలురకు వేఱుచోటును బాలికలకు వేఱుచోటును ఉండవలయును. కెప్టెన్ సేవియరు ఈవిషయమున నీకు సాయమునకై పైకము పంపుటకు సిద్ధముగా ఉన్నాడు. అతని విలాసము నెడూహోటలు, లాహోరు —నీవు అతనికి జాబు వ్రాయుదువేని, జాబుపైని 'రాక నెదురు సూచునది' అను మాటలు వ్రాయుము. నేను త్వరలో, రేపో ఎల్లుండియో, రావల్పిండికి పోవుచున్నాను. తరువాత జమ్ముగుండ లాహోరును ఇతరస్థలములను చూచి కరాచిమొదలైనవానిద్వారా రాజపుటానాకు మరలుదును.

నేను క్షేమముగ నున్నాను.

భవదీయ
వివేకానంద.

మలిమాట:—మహమ్మదీయ బాలురను సయితము నీవు చేర్చుకొనవలయును. అయినను వారి మతము జోలికి ఎన్నడును పోకుము. నీవు చేయవలసిన పని ఒక్కటే. వారికి భోజనాదికము నకు ప్రత్యేకమగు ఏర్పాట్లుచేయవలయును. వారికి నీతిధైర్యసాహ ములు ఇతరులకు మేలుచేయు ప్రపణత కలుగునట్లు బోధింపవ యును. మత మనగా అదియే సుమా!

గహనములగు నీయాధ్యాత్మికపు ఊహలను ప్రస్తుతము ఒక ప్రక్కకు నెట్టిపెట్టుము.

మన దేశమున మనకు ఇపుడు కావలసియుండునది పౌరుష మును దయయు. 'స ఈశః అనిర్వచనీయ ప్రేమస్వరూపః' 'ఆ దేవుడు ఇట్టిదని వర్ణించి చెప్పనలవిపడని ప్రేమయే స్వరూపముగాగలవాడు' మఱి 'ప్రకాశ్యతే క్వాపిపాత్రే' 'ఎక్కడనో తగిన వానియందు ప్రకాశము పొందును' అని చెప్పుటకు మాఱుగా మనము 'స ప్రత్యక్షః సర్వేషాం ప్రేమరూపః' 'ఎల్లజీవులయందును ప్రేమరూపాన ఎప్పు డును ప్రత్యక్షముగానే యున్నాడు' అని చెప్పవలయును.— నీమనసు కల్పించిన మఱియే దేవుని పూజింపబోవుచున్నావు? వేదములు ఖొరాను పురాణములు మున్నగు పవిత్రగ్రంథముల మొత్తము అంతయు ప్రకృతమునకు ఒకప్రక్కన ఉండనీ. దేశమున ప్రత్యక్షముగనున్న ప్రేమదయాదేవుని పూజ ప్రవర్తిల్లును గాక. భేదభావము బంధకము; అభేదభావము ముక్తి. ఐహికతతో చావ తాగియున్న జనుల మాటలు మిమ్ము భయపెట్టకుండును గాక 'అభీః! అభీః!' 'భయమునలదు.' 'మనుష్యులుగారు, మఱిపురుగులు!' అన్ని మతాల బాలురను చేర్చుకొనుము. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, ఇంకను ఎవరుకానీ. అయినను కొంచముగ నెమ్మదిగా ఆరంభింపుము. అనగా నాయభిప్రాయము, వారి అన్నపానాలు రవంత వేఱుగా ఉండనీ, వారికి మతమున సకలవిశ్వమునకు సమ్మత మగు సామాన్యభాగమును మాత్రమే బోధింపుము.

............కెప్టెన్ సేవియరు చోటుకై చాల ఆత్రపడు చున్నాడు. సాధ్యమైనంత తర్వాలో ముస్సూరి సమీపమునగాని మఱియెందైనగాని మంచి మధ్యప్రదేశమున ఒకచోటు కావలయు నట!............అనగా ఆచోట, అతిశీతముగాగాని అత్యుష్ణ ముగాగాని ఉండకూడదు. డేరాడూన్ గ్రీష్మమున ఓర్వరాకయుం డును, శిశిరమున చాలమనోజ్ఞముగా నుండును. ముస్సూరి సంగతి చెప్పవలయునన్న, అది చాలమంది అభిప్రాయమున శిశిరమునకు సరియైన చోటు కాదు, ఆమాట నేను ధైర్యముగా చెప్పగలను. దానికి పైనగాని క్రిందగాని, అనగా బ్రిటిషురాజ్యమునగాని, గర్హ్వాల్ రాజ్యమునగాని ఏదైనను ప్రదేశము తప్పక దొరకగలదు. మఱియొక విషయ మే మనగా, త్రాగుటకును తక్కిన అన్ని పనుల కును సంవత్సరము పొడుగునను నీటి సరఫరా యుండవలయును. అచ్యుతానందుని గుప్తను మాత్రము నావెంట నుంచుకొని నేను ముఱ్ఱీనుండి రావల్పిండికిని, అందుండి జమ్మూకును, అక్కడనుండి లాహోరునకును, లాహోరునుండి తిన్నగా కరాచికిని పోవుదును. ఇది నా పదకము....శశిబాబుకు నాహార్దప్రేమను దీవెనలను అందింపుము. మాస్టరు మహాశయుడు అంత దీర్ఘకాలమునకు తర్వాత పనిచేయను ఉత్సాహముతో నడుము కట్టినట్లున్నది. ఆతనికి నా విశేషప్రేమను, కుశలప్రశ్నలను అందింపుము. స్త్రీవలె విశ్రాంతిగోరు నాతడు పనిచేయుటకు పూనుకొని లేచుటను చూడగా, నా ధైర్యము బారుదాటులతో మింటి కెగసినది. నేను అతనికి రేపే జాబు వ్రాయుచున్నాను. జైగురు మహారాజుకు! పనికి పూను కొనుము, పనికి పూనుకొనుము.

ప్రేమయుత భవదీయ,

వివేకానంద.

## 378

(శ్రీ జగ్మోహన్లాలుకు)

ముఖ్రీ
అక్టోబరు 11, 1897

నా ప్రియ, జగ్మోహన్లాల్,

...నీవు బొంబాయికి తరలునపుడు, నేను జైపూరుకు పంపుచున్న ముగ్గురు సన్న్యాసులను విచారించుకొమ్మని ఎవరితోనైనను మాట చెప్పిపొమ్ము, వారికి భోజనము పెట్టించి, ఉండుటకు మంచి చోటు చూపుము. నేను వచ్చునంతవఱకు వారు అచటనుందురు. వారు (పాపము) అమాయికులు, చదువుకొన్నవారు కారు. వారు నా వారు. వారిలో ఒకడు నా సోదరశిష్యుడు. వారు ఇష్టపడుదురేని, వారిని ఖేత్రికి తీసికొనిపొమ్ము. అక్కడికి నేను త్వరలో రాగలను. ఇపుడు నేను ప్రశాంతముగా ప్రయాణము చేయుచున్నాను. ఈ సంవత్సరము నేను అంతగా ఉపన్యసింపను బోను. ఈ వట్టి సందడిలోను దగాలోను, కార్యరూప మగు మేలు ఏమియు లేనందున వానిలో నాకు ఇక నేమియు నమ్మకము లేదు. కలకత్తాలో నా సంఘము నారంభించుటకు నేను నిశ్శబ్దమైన ప్రయత్నము చేయవలయును. దానికోసము ధనము ప్రోగుచేయుటకై పలుప్రధానస్థానములను నిశ్శబ్దముగా దర్శింపబోవుచున్నాను.

ఆశీస్సులతో,

భవదీయ
వివేకానంద.

## 379

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

ముఱ్రీ
అక్టోబరు 11, 1897

నా ప్రియరాఖాల్,

కాశ్మీరమున ఆరంభించి, కడచిన పదిదినాలుగా, ఏదియో ఒక అణచుకోరాని అంతఃప్రేరణచేతం బోలె, నేను పనిచేయు చున్నట్లు నాకు తోచుచున్నది. అది దైహికమో, మానసికమో,

ఏదియో రోగము కావచ్చు. ఇపుడు ఇక నేను ఏపనికిని అర్హుడను కాను అన్న తీర్మానమునకు వచ్చితిని. . .మీయెల్లరవిషయమున నేను చాల కఠినముగా నుంటిననని నాకిపుడు తెలియుచున్నది. ఐనను మీరు, నా తప్పిదముల నన్నింటిని ఓర్చుకొందురని నాకు తెలియును. మఠమున అట్లు చేయువాడు మఱెవడును లేడు. నేను నీవిషయమున మిక్కిలి కఠినముగా నుంటిని. ఏదేదిజరిగినదో అది జరిగి పోయినది. అది అంతయు పూర్వకర్మఫలము. నా పశ్చాత్తాపము వలన ఏమి ప్రయోజనము? నా కందు నమ్మకము లేదు. అది యంతయు కర్మ. అమ్మ పనిలో ఏదేది నాద్వారా నెఱవేఱవలసి యుండెనో, దాని నెల్ల ఆమె నాచేత చేయించినది. చేయించి ఇపుడు నా దేహమును మనస్సును శిథిలములుగ జేసి నన్ను ఒక తట్టుకు నెట్టివేసినది. ఆమె సంకల్పము నెఱవేఱునుగాక.

నేను ఇపు డీ పనియంతటినుండియు విరతుడ నయ్యెదను. ఒకటిరెండు దినాలలో నేను అన్నిటిని త్యజించి, ఒంటరిగా బయట తిరిగెదను. ఇక నా జీవితశేషమును ప్రశాంతముగా ఎక్కడనో ఒకచోట గడపెదను. మీకు అందఱకు సమ్మతమగునేని నన్ను మన్నింపుడు; కాదేని మీ ఇష్టము వచ్చినట్లు చేయుడు. ధనములో చాలభాగము శ్రీమతి బుల్ ఇచ్చినది. ఆమెకు శరత్తునందు ప్రగాఢమగు నమ్మకమున్నది. మఠకార్యమును శరత్తుసలహాతో చేయుము; కాదేని నీ ఇష్టమైనట్లు చేయుము. నేను ఇంతకాలము వీరుడనుగ నుంటిని. నాపని మెఱుపువలె వడిగాను వజ్రమువలె గట్టిగాను ఉండవలయునని నాకోరిక. అట్లే నేను చావను చత్తును. కాబట్టి నాపనిని నాకోసము చేయుము. ఇందు సిద్ధియా భంగమా అను విమర్శ చొరనే చొరదు. ఏయుద్ధమునను నేను ఎన్నడును పరారినై ఎఱుగను. ఇకను ఇప్పుడా...? ప్రతిపనియందును జయాపజయములు గలవు. పిఱికివాడైనవాడు మరణానంతరము ఏదియో క్రిమిగానో కీటముగానో పుట్టును. పిఱికికి లక్షలయేండ్ల తపస్సునకు పిమ్మటను మోక్షము లేదు. సరి, మఱి నేను తుదకు ఒకపురుగుగా పుట్టు

దునా ?...నా కన్నులకు ఈ ప్రపంచము వట్టియాట. అది ఎప్పటి కిని అట్లే యుండును. దీనినిగూర్చిన మానావమానములు . లాభ నష్టములు తలపోసికొనుచు ఆటు దీర్ఘమాసముల నొకడు గడప వలయునా ?......నేను కార్యపరుడను, ఊరక సలహాపైన సలహా ఇయ్యబడుచున్నది ; ఒకడు ఒకటి చెప్పును. మఱియొకడు మఱియొకటి చెప్పును ; మఱియు, ఒకడు బెదరించును. వేఱొకడు భయపెట్టును. నా యభిప్రాయమున, ఈ జీవితము అంత యక్కఱయు జాగ్రత్తయు భయమును కలిగి కడవెళ్ళ బ్రదుకగోరు టకు, అంత మధురమైనది కాదు. ధనము, ప్రాణము, మిత్రులు బాంధవులు, మనుష్యులు—వీనికైన ప్రేమ, నామీఁది ప్రేమ— వీని నన్నింటిని ముందుగానే గట్టిగా నిశ్చయించుకొని, పనిలో ప్రవేశింపగోరునేని, అంత భయాక్రాంతుడుగా నుండవలయునేని, అతడు—గురుదేవుడు "కాకి తాను చాల తెలివిగలదానను అని యనుకొనును, అయినను అది పెంటను తినక యుండజాలదు." అని చెప్పుచుండిఁనట్లు దానినే పొందును. అన్నియు ఆలోచింపగా, డబ్బును, మఠములును సమాజములును, మతప్రచారమును, ఉప న్యాసములును—వీని యన్నింటిని వెన్నంటియుండు ఉద్దేశము ఏమి? జీవితమంతటికిని ఉన్న యుద్దేశము ఒక్కటే—విద్య. అట్లుగాకున్న పురుషులవలనను స్త్రీలవలనను, భూమివలనను ధనమువలనను ఏమి ప్రయోజనము ?

కాబట్టి ధననష్టముగానీ, మఱియే నష్టముగానీ, నేను బాధ పడజాలను, బాధపడబోను. నేను యుద్ధముచేయునపుడు, కాసె బిగించుకొని చేయుదును ; అంతమాత్రము నేను పూర్తిగా ఎఱుగు దును. మఱియు "లక్ష్యపెట్టకు, నిర్భయముగా ఉండుము, ఓ ధైర్య శాలీ, ఇదిగో ఇక్కడనే, నీ ప్రక్కనే ఉన్నాను, నేను" అని పలుకు ఆ మనుష్యుని, ఆ వీరుని, ఆ దేవుని నే నర్థము చేసికొందును. ఆ మనుష్యరూపదేవునికి నేను లక్షనమస్కారములు చేసెదను. అట్టివారి సన్నిధానము లోకమును పవిత్రము చేయును, వారు లోక

రక్షకులు. ఇక తక్కినవారు 'ఓహోయి, పోకుడు ముందునకు, ఈ భయ మున్నది ఆ భయమున్నది' అని ఎప్పుడును ఏడ్చుచుందురు, ఆ అరోచకులు, ఎప్పుడును భయముతో వణకుదురు. కాని ఆ దివ్య మాత యనుగ్రహము వలన, ఎంతటి భయంకరమైన అరోచకితయు నన్ను పిఱికిగా చేయలేదు. నాచిత్తము అంత దృఢముగా నున్నది. పిఱికివారికి నేను ఏమిసలహా చెప్పుదును? చెప్పుటకు నాయొద్ద ఏమియు లేదు. మఱి సిద్ధిపొందక తప్పినను గొప్పకార్యములు చేయ సాహసించిన ఆధీరాత్ముల పాదములను, ఎప్పుడుగాని క్రుంగని తప్పించుకొనని ఆ వీరులపాదములను, భయమువలన గాని గర్వమువలనగాని ఆజ్ఞోల్లంఘనము చేయని ఆ యోధులపాదముల నాశ్రయింపవలయునని నాకోరిక. నేను బలశక్తులమూలకందమగు ఆదివ్యమాత బిడ్డను, నాకు నీచముగా వంగివంగి బతిమాలుకొనుట, ఇచ్చకము లాడుట, మూలుగుట, అవమానకరముగ జడత్వము నొందుట—అనునవియును నరకమును ఒక్కటే. ఓ విశ్వమాతా, ఓనాగురుదేవా, నన్ను నిరంతరముగా "వీడు వీరుడు" అనుచుంటిరే! నేను పిఱికి పందనై చావకుందునుగాక అని ప్రార్థించెదను. సోదరా, ఇదియే నా ప్రార్థన—"ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా" "ఎవడో నాకు సమానమగు లక్షణములు గలవాడు పుట్టగలడులే." ఈ వేల కొలది శ్రీరామకృష్ణుని భక్తులలో ఎవడోఒకడు, నన్ను బోలిన వాడు, నన్ను అర్థము చేసికొనగలవాడు తలయెత్తును లే.

ఓ వీరుడా, మేలుకొనుము, ఇక కలలు గనకుము. మృత్యువు నిన్ను నీముందఱికురులతో పట్టుకొన్నది...ఐనను భయపడకుము. యుద్ధమునుండి నేనెపుడును పరువులెత్తలేదు. మఱి అది నేడు జరుగునా? అపజయమొందుదునని నేను యుద్ధమునుండి పాఱిపోవుదునా? ఓటమి, వీరుడు తన్ను అలంకరించుకొను నాభరణము. ఏమీ, యుద్ధము చేయకుండనే, అపజయమును అంగీకరించుటయా! అమ్మా ఓ అమ్మా!...ఒకడును ఉపనాయకుడుగా నుండుటకు సయితము శక్తిలేనివాడు. అయినను మనసు 'నేను ప్రధానుడను' అను నీచపు

భావనతో నిండిపోయినది...''మాకు అంతయు బోధపడుచున్నది'' ...నేను ఇపుడు విరామము పొందుచున్నాను. సర్వమును నీవశము చేయుచున్నాను. మనసున ధైర్యమును, చేతులలో బలమును, కన్నులలో తేజమును కలిగి నిక్కముగ ''లోకజననికి బిడ్డలు'' అని పించుకొనగల మనుష్యులను అమ్మ నాకు పంపునేని, అట్టివానిని ఒక్కని పంపినను సరే, అపుడు నేను మరల పనిచేయుదును, అపుడు నేను మరలుదును. అట్లుగాకున్న అమ్మ సంకల్పమును బట్టి, ఇదే అంతము అని యనుకొందును. నేను అత్యంతమగు తొందరలో ఉన్నాను. తుపాను వేగముతో పనిచేయ గోరుదును. నాకు భయ రహితహృదయులు కావలయును.

పాపము, శారదుని నేను తీక్ష్ణముగా తిట్టితిని. మరేమిచేయు దును?...నేను తప్పకుండ తిట్టుదును. అయినను నేను చెప్పకొని యేడువవలసినది ఎంతయో కలదు. శ్వాసాయాసముచే ఊపిరాడక నిలబడి నిలబడి, నేను వానికోసము ఒక వ్యాసము వ్రాసితిని. ఇదియంతయు బాగుగానే ఉన్నది. అట్లుగాకున్న వైరాగ్యము ఎట్లు వచ్చును?...తుదకు నన్ను అమ్మ బంధముతో చంపునా? నేను మీ యందఱకును అశాంతి కలిగించినవాడనే. మీ కిష్టమైనది చేయుడు.

నిండుహృదయముతో మిమ్మందఱిని దీవింతును. అమ్మ మీ హృదయములలో శక్తియై ప్రతిష్ఠగనును గాక. 'అభయం ప్రతిష్ఠాం' 'అభయమను అవలంబము' — ఆమె మిమ్మందఱిని నిర్భయులను చేయునుగాక. ఇది నా జీవితానుభవమున చూచియున్నాను— ఎవడు తన్నుగూర్చి అతిగా మెలకువ గలిగియుండునో వాడు అడు గడుగునను ఉపాయములు చెందును. ఎవడు అభిమానగౌరవములు పోవునని భయపడునో, వాడు అవమానమునే పొందును. ఎవడు నష్టముకలుగునని భయపడునో వాడు ఎప్పుడు నష్టములే పడును. ...మీకు సర్వశ్రేయములు కలుగునుగాక!

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

## 380

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

ముఠ్
అక్టోబరు 12, 1897

నా ప్రియరాఖాల్,

నిన్నటి జాబులో చాల దీర్ఘముగా వ్రాసితిని. కొన్ని విషయములను గూర్చి ప్రత్యేకముగా నీకు కొన్ని సలహాలు చెప్పిన మేలని ఎంచితిని....(1) పైకము వసూలుచేసి మఠమునకు పంపుచట్టి అందటికిని, ఆమొత్తములకు రసీదులను మఠమునుండి పంపవలయును. (2) రసీదు జతగా ఉండవలయును, ఒకటి పైకమిచ్చినవానికి చేర్చుటకును, ఒకటి మఠమున దాఖలుకును. (3) ఒక పెద్ద రిజిస్టరు ఉండవలయును. అందులో దాతలందటి పేరులును విలాసములును వరుసగా వ్రాసిపెట్టవలయును; (4) దమ్మిడికూడ సరిగా ఉండునట్లు మఠము మూలధనమునకు బహుమానముగా ఇచ్చిన మొత్తములకు కచ్చితమగు లెక్కలు వ్రాసిపెట్టవలయును. పైకము తీసియుంచుకొను శారదునివలనను ఇతరులవలనను ఆయామొత్తములకుపూర్తిగా లెక్కలు రాబట్టుకొనవలయును. సరిగా లెక్కలు వ్రాసిపెట్టనందులకై ...నేను వంచకుడనుగా దూషింపబడకుండునట్లు మీరు గమనింపవలయును. ఈ లెక్కలన్నియు తరువాత ప్రకటింపబడవలయును. (5) నీవును నేనును చనిపోవుదుమేని, అపుడు మనమఠములోనుండు సర్వమునకును హరియు శరత్తును వారసులుగా మన స్థానమునకు రావలసినది అనునొక మరణశాసనమును తక్షణమే వకీలు సలహాతో, రిజిస్టరు చేయింపుము.

నాకు అంబాలానుండి ఏమియు సమాచారము రాలేదు. హరిప్రసన్నుడును ఇతరులును అక్కడికి చేరినారో లేదో. ఈజాబులోని రెండవసగము కాగితము మాస్టరు మహాశయునికి ఇమ్ము.

నీయందనురక్తుడు
వివేకానంద.

## 381

(శ్రీ మహేంద్రనాథగుప్తకు)

లాలాహంసరాజు ఇంటిలో
రావల్పిండి
అక్టోబరు, 1897

ప్రియ 'మ'—

"మిత్రమా అది మిక్కిలి బాగున్నది." అనదగిన దానినే నీవు ఇప్పుడు చేయుచున్నావు. వెలికిరావోయి! జీవితమంతయు నిదురపోగూడదు. కాలము ఎగిరి పఱచుచున్నది. సెబాస్—అది మార్గము.

నీప్రచురణకు పెక్కు ధన్యవాదములు. నాకున్న చిన్న భయ మిది—ఈ చిన్ని పత్రికరూపమున దానికి తగినంత ధనము రాదో ఏమో, పోనీలే. రానీ, రాకపోనీ, అది ప్రచురితమై పగలింటి వెలు గును చూచునుగాక. (దానిచేత) నీకు ఎన్నియో దీవెనలు కలు గును; అంతకన్నను ఎక్కువగా తిట్లును కలుగును. మఱి అదియే ఎప్పుడును లోకరీతి!

ఇదే సరియయిన సమయము.

భవదీయ భగవద్గత
**వివేకానంద.**

## 382

(సోదరి నివేదితకు)

జమ్ము,
నవంబరు 3, 1897

నా ప్రియ కుమారి నోబుల్రూ,

...భావోద్రేకము కార్యహానికరము. "ఉక్కువలె కఠి నము, పూవువలె మృదువు" అని నీతివాక్యము.

నేను త్వరలో స్టర్డికి జాబు వ్రాసెదను. 'ఏదైనను ఇబ్బంది కలిగిన అపుడు నీకు నేను అండగా నిలుతును' అని అతడు నీకుచెప్పి నది సరియే. ఇండియాలో నాకు రొట్టెలో తునుకయే దొరకినను అదియంతయు నీదేయని; నీవు బాగుగా నమ్మియుండవచ్చును.

నేను స్టర్డికి లాహోరునుండి వ్రాయబోవుచున్నాను. రేపే అక్కడికి బయలుదేఱుచున్నాను. మహారాజు గారినుండి కాశ్మీరులో కొంతభూమి సంపాదింపగోరి నేనిక్కడ ఇప్పటికి పదునైదుదినాలుగా ఉన్నాను. నేను ఇక్కడనే, ఈదేశాననే, ఉందునేని పై సంవత్సరము వేసవికి మరల కాశ్మీరమునకు రావలయుననియు, ఇక్కడ కొంత పని నారంభింపవలయుననియు ఉద్దేశించియున్నాను.

శాశ్వతప్రేమతో, నీవాడను,

**వివేకానంద.** *

## 383

(శ్రీ బ్రహ్మానందస్వామికి).

లాహోరు
నవంబరు 11, 1897

ప్రియరాఖాల్,

లాహోరులో ఉపన్యాసము ఎట్లో జరిగిపోయినది. ఇక నొకటి రెండుదినాలలో డేరాడూన్‌కు బయలుదేఱగలను. నా సింధుదేశ సంచారమును కాలాంతరమునకు మార్చుకొంటిని. ఏలన మీరెవరును దానికి సమ్మతించునట్లులేరు; ఇంకను ఎన్నియో ఇతరములగు ఆటంకములును ఉన్నవి. ఎవడో నాకు ఇంగ్లండునుండి వచ్చిన రెండు జాబులను దారిలో తెఱచినాడు. కాబట్టి ఇక మీదట, తత్కాలమునకు, నాకు జాబులు పంపకుము. వానిని పంపుమని నేను ఖేత్రినుండి వ్రాసినతరువాత పంపుము. నీవు ఒరిస్సాకు పోవుదువేని, అప్పుడు నీకు మాఱుగా హరివంటి ఎవడైనను, అన్ని పనులను చేయుచుండగలయట్లు ఏర్పాట్లు చేయుము. చేసిపొమ్ము, ఏలన నేను అమెరికానుండి ప్రతిదినము జాబులు విశేషముగా ఎదురుచూచుచుండు కాలమిది.

హరి శరత్తులపేర నిన్ను వ్రాసి ఏర్పఱుపుమన్న వీలునామా (మరణశాసనము), ఇపుడు ఏర్పఱుపబడినదైయెనదేమో.

---

* ఇగ్లండులో ఉండగా నివేదితకు అందిన స్వామిజీలేఖలలో ఇది కడపటిది.

నేను ఇక్కడ ఒక సంఘమును ఏర్పఱిచి సదానందుని సుధీరుని ఇక్కడే వదలిపెట్టిపోవుదునేమో. ఇపుడు ఇక ఉపన్యసించుట లేదు. నేను చాల తొందరగా తిన్నగా రాజపుటానాకు పోవుదును. మఠమును స్థాపించుట అన్నిటికంటెను ముందు కావలయును. దినము కాలము తప్పకుండ వ్యాయామము చేయకున్న, దేహము ఆరోగ్యముగా ఉండదు. మాటలాడుట, సర్వకాలము మాటలాడుచుండుట నిజముగ జబ్బు కలిగించునని యెఱుంగుము. అందఱకు నా ప్రేమ.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

## 384

(శ్రీ బ్రహ్మానందస్వామి)

లాహోరు
నవంబరు 15, 1897

నా ప్రియరాఖాల్,

నీవును హరియు ఇపుడు మంచి యారోగ్యము గలిగియున్నారని నమ్ముచున్నాను. లాహోరులో పని శ్లాఘ్యజయముగా సంతోషముతో జరిగిపోయినది. ఇపుడు డేరాడూనుకు పోవుచున్నాను. సింధునకు ప్రయాణము కాలాంతరమునకు మార్పబడినది. దిను, లాటు, కృష్ణలాలును జైపూరు చేరినారో లేదో, నాకు ఇంకను సమాచారము అందలేదు. బాబూ నాగేంద్రనాథ గుప్త ఇక్కడ చందాలు విరాళాలు వసూలుచేసి మఠమునకు కావలసిన వ్యయములు చేయుటకు పంపగలడు. అతనికి కాలముతప్పక రసీదులు పంపుము. నీకు మాల్దినుండిగాని రావల్పిండినుండిగాని సియల్కోటనుండిగాని ఏమేని లభించినదా నాకు తెలుపుము.

'డేరాడూను, పోస్టుమాస్టరు ఇంటిలో' అను విలాసమునకు జవాబు వ్రాయుము. తక్కిన జాబులు నేను డేరాడూను చేరినతరువాత అక్కడినుండివచ్చు నా జాబుచూచుకొని, అటుతరువాత నీవు నాకు పంపవచ్చును. నాకు ఆరోగ్యము బాగున్నది. రాత్రి ఒకటిరెండు

సార్లు లేవవలసియున్నది. అంతే. నాకు నిద్ర గాఢముగా పట్టు చున్నది. అలయికకలిగించు ఉపన్యాసముల యనంతరముకూడ, నిదుర చెడుటలేదు. నేను ప్రతిదినము వ్యాయామము చేయు చున్నాను...ఏ బాధయు లేనేలేదు. కానిమ్ము, ఇపుడు, ఇనుమ డించిన శక్త్యుత్సాహములతో పనిచేయుము. ఆ పెద్ద భూభాగము మీద, సర్వరహస్యముగా ఒక కన్ను ఉంచియుండుము. * పెద్ద ఉత్సవము అక్కడ జరుగగలయట్లు మేము క్రమమగు ప్రయత్న ములు చేయుచున్నాము. అందఱికి నాప్రేమ.

ప్రేమయుత భవదీయ

**వివేకానంద.**

మలిమాట:—మాస్టరు మహాశయుడు అపుడపుడు మనలను గూర్చి 'ట్రిబ్యూన్' పత్రికలో వ్రాయుచుండిన బాగుండును. దాని వలన ఇపుడు లెస్సగా అనుకూలముగ నున్న లాహోరు మరల ఉదా సీనము కాకుండును. డబ్బును ఇంచుక. మితముగా ఖర్చుపెట్టు చుండుము. పుణ్యక్షేత్రయాత్ర ఖర్చులు నీవు స్వంతముగా భరించు కొనవలయును. బోధనకును ప్రచారమునకును అగు ఖర్చులు మఠము లెక్కలో చేర్పవచ్చును.

వి.

## 385

(శ్రీమతి ఇందుమతి మిత్రకు)

లాహోరు

నవంబరు 15, 1897

ప్రియజనని,

ఎంతో ఆస్థతో కోరినను, ఈసారి కరాచికి వచ్చి నిన్ను చూచుట—సాధ్యము గాకపోయినందులకు నాకు మిక్కిలి చింతగా నున్నది. అందులకు మొదటియసందర్భము ఇంగ్లండునుండి ఇచటకి వచ్చి నాతో ఈ కడచిన తొమ్మిదినెలలనుండి ప్రయాణములు

---

* శ్రీరామకృష్ణుని జయంతి మహోత్సవము.

చేయుచున్న కెప్టెన్ శ్రీసేవియరును ఆయనభార్యయు డేరాడూన్ సమీపమున కొంతచోటు కొని అక్కడ నొక అనాథశరణాలయము నారంభింపవలయునని చాల ఆత్రపడుచున్నారు. నేను వారితో కూడ పోయి పని యారంభింపవలయునని వారి ప్రత్యేక ప్రార్థన. కావున డేరాడూన్ ప్రయాణము నాకు అనివార్యమగుచున్నది.

రెండవ యసందర్భము—నా మూత్రకోశవ్యాధివలన నేను దీర్ఘకాలము జీవించియుందునని లెక్కించుకొన లేకున్నాను. ఇప్పుడును కలకత్తాలో ఒక మఠమును ఆరంభింపవలయుననుట నా కోరికలలో ఒకటి. ఐనను అందులకై నేను ఇప్పటికి ఏమియును చేయలేదు. మఱియు నా దేశజనులు తాము మా మఠమునకు చేయుచుండిన యించుక సాయమును ఇటీవల మానినారు. వారికి నేను ఇంగ్లండునుండి సమృద్ధముగా ధనము తెచ్చితినని ఒక యభిప్రాయము! దీనికిని పై ఈ సంవత్సరము శ్రీరామకృష్ణుని యుత్సవమును యథావిధిగా చేయుట అసాధ్యమైనది; ఏలన రాస్మణితోటకు సొంతదారులు, నేను పాశ్చాత్యదేశములనుండి మరలినవాడనని, నన్ను అందులోనికి రానీయక నిషేధించినారు!! కనుక రాజపుటానాలో మనకు ఉన్న పరిమితసంఖ్యులగు మిత్రులతో యోచించి, కలకత్తాలో ఒక కేంద్రము నెలకొల్పుటకు నాచేతనైనంత ప్రయత్నము చేయుట నా ప్రథమవిధి. ఈ కారణములచే ప్రకృతము సింధులో నా సంచారమును కాలాంతరమునకు మార్చుకొనవలసి నందులకు నేను చాలదుఃఖము చెందితిని. రాజపుటానా కథియవాడుల గుండ అచటికి వచ్చుటకు నాశక్తికొలది ప్రయత్నింతును. చింతిల్లకుము, దయయుంపుము. నేను మిమ్మందఱిని ఒకదినమైనను మఱచియుండను. కాని విధిని ముందు అనుష్ఠింపవలయును. కలకత్తాలో ఒకమఠము స్థాపింపబడునేని, అది నా యాందోళన నెంతయో తీర్చును. అప్పుడు నేను నాజీవితమంతయు అన్నివిధాల లేమిడిబాధలకును, ఇతరబాధలకును లోనై ఏపనికై పోరాడుచుందునో అది, నేను ఈదేహమును వీడినను, నాశనమై పోదుగదా అని ఆశ

వహింపగల్గుదును. నేను ఈదినమే డేరాడూనుకు తరలుచున్నాను. అక్కడ ఒకవారము ఉండి, తరువాత రాజపుటానాకు, అందుండి కథియవాడుకు, అట్లే తక్కినచోట్లకును తరలుదును.

దీవెనలతో,

భవదీయ శ్రద్ధాయుత,

వివేకానంద.

## 386

(శ్రీమతి ఇందుమతి మిత్రకు)

డేరాడూను.

నవంబరు 24, 1897

ప్రియ జననీ,

నీజాబును ప్రియ హరిపాదునిజాబును నాకు సరిగా చేరినవి; నీవు చింతిల్లుటకు చాలకారణము ఉన్నది. చూడుము, నేను ఏమియు చేయలేనివాడనైతిని. నే నిక్కడికి వచ్చినపనియు కేవలము నిష్ఫలమైనది. నేను సింధునకును పోజాలకపోయితిని. అది, ప్రభునిసంకల్పము. ఇపుడు రాజపుటానా కథియవాడు సింధుల గుండ కలకత్తాకు పోవలయును అని నా అభిప్రాయము. సెలవుకాలమునకు వలయు ఏర్పాట్లు చేసికొని హైదరాబాదునకు వచ్చుటకు నీవు చాల శ్రమ అనుభవించియుండవలయును. పడినశ్రమ ఎంత తక్కువైనను - శ్లాఘ్యమైన—దానిఫలములను కలిగింపకమానదు. రాగల శుక్రవారము నేను ఈచోటు వదలెదను. సహరన్పూరుగుండ తిన్నగా రాజపుటానాకు పోవలయునని నాకు తలంపు గలదు. నే నిక్కడ క్షేమముగా ఉన్నాను. నీవును ఆరోగ్యమును చిత్తశాంతియు గలిగియున్నావని నమ్ముచున్నాను.

నీకును హరిపాదునికిని నాయుత్తమ ప్రేమయు దీవెనలును.

భవదీయ శ్రద్ధాయుత

వివేకానంద.

## 387

(శ్రీ మహేంద్రనాథ గుప్తకు)

దేరాడూను
నవంబరు 24, 1897

ప్రియ మ——

నీ రెండవ గ్రంథకము(కథామృతము నుండి కొన్ని పుటలు) ను జదివి నేను కడుంగడు ధన్యుడనైతిని. అది చాల ఆశ్చర్యకరముగా నున్నది సుమా. నీపోకడ అంతయు నీసొంతమే! ఎప్పుడుగాని ఏ గొప్ప దేశికుని జీవితమును, నీ విపుడు దీనిని వ్రాయుచున్నట్లుగా, రచయిత మనసుచే వన్నెమాయక, జనసామాన్యమునకు ప్రకటింపబడనే లేదు. భాషయు స్తోత్రమునకు అందనంత నవ్యముగా సూటిగా, అట్లుండియు, నిరాడంబరముగా సులువుగా ఉన్నది.

ఆ పత్రములను నేను ఎంత ఆనందముతో అనుభవించితినో దానిని తగినమాటలతో బోధపడునట్లు చెప్పజాలను. వానిని చదువునపుడు నేనొక మైమఱపున ఉన్నాను. వింతగా ఉండలేదా అది? మనగురువు, మన ప్రభువు అంత స్వతంత్రుడు. మనము ఒక్కొక్కరము ఉన్న అట్లు స్వతంత్రులమై యుండవలయును. లేకున్న ఎందులకు? ఆయన జీవితమును వ్రాయుటకు ఇంతకుముందు మనలో ఎవరును ముందునకు రానందుకు కారణము ఇపుడు బోధపడుచున్నది. ఈ గొప్ప పని నీకోసము దాచిపెట్టబడియుండినది. స్పష్టముగా ఆయన నీతో ఉన్నాడు.

సర్వప్రేమతో నమస్కారములతో

వివేకానంద.

మఱిమాట:——సాక్రటీసు సంభాషణలలో మొదటినుండి తుదివఱకు రచయితయైన ప్లేటో కననగుచుండును. నీవు అట్లుగాక అందులో పూర్తిగా మఱుగుపడియున్నావు. అందులో ఆ నాటక రీతిగానుండు భాగము అనంతరాణీయకము కలిగియున్నది. ఇక్కడను పాశ్చాత్య దేశములందును అందఱును దాని నిష్టపడుదురు.

## 388

(శ్రీ ప్రేమానందస్వామికి)

దేరాదూను
నవంబరు 24, 1897

నా ప్రియబాబురామ్,

నిన్ను గూర్చిన సకలవృత్తాంతము నాకు హరిప్రసన్నునివలన అందినది. రాఖాలును హరియును ఇపుడు పూర్ణారోగ్యులుగా నున్నారని తెలియుచున్నది.

ఇపుడు తెహ్రీవాడగు రఘునాథభట్టాచార్య మెడమీద ఏమో నొప్పివలన మిక్కిలియు బాధపడుచున్నాడు. నాకును మెడ వెనుకవైపు ఏమో నొప్పి. దానిచేత చాలకాలము బాధపడుచున్నాను. చాల పాతనెయ్యి సంపాదింపగలవేని కొంత డేరాడూను లోని యాతనికిని, కొంత నా ఖేత్రి-విలాసమునకు నాకును పంపుము. నీకది తప్పక హాబువద్దగాని, (వకీలు) శరత్ వద్దగాని దొరకగలదు. దానిని వాయవ్యరాష్ట్రమున డేరాడూన్‌లో శాబూ రఘునాథ భట్టాచార్య అను విలాసమునకు పంపుము;...అది ఆయనకు చేరగలదు.

ఎల్లుండి సహరన్పూరుకు తరలుచున్నాను. అందుండి రాజపుటానాకు.

ప్రేమయుత భవదీయ
**వివేకానంద.**

మఱిమాట:—అందఱికి నా ప్రేమ.

వి.

## 389

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

ఢిల్లీ.
నవంబరు 30, 1897

ప్రియరాఖాల్,

కుమారి ముల్లరు ఇత్తునని వాగ్దానము చేసిన ధనమున కొంతభాగము కలకత్తా చేరినది. మిగతయు తరువాత కొలదికాల

మునసే రాగలదు. మనవద్ద కొంత మొత్తమున్నది. కుమారి ముల్లరు తనపైకమును గ్రిండ్లేకంపెనీవారివద్ద నాపేరను నీపేరను—మన యుభయులపేర—ఉంపగలదు. నీకు ప్రాతినిధ్యాధికారము ఉన్నందున, నీవే ధనమునంతయు రాబట్టుకొనవచ్చును. ధనము అక్కడ భద్రపఱచినంతనే, నీవే సొంతముగా హారిని వెంట గొని పాట్నాకు పోయి, ఆ పెద్దమనుష్యుని కలసికొని, ఏ యుపాయముచేతనైనను ఆతనిని నీమాటవినునట్లు చేసికొనుము. ఆ భూమి వెల న్యాయ్యమైనదని తోచినయెడల దానిని కొనుము. అది దొరకనయెడల, మఱెదైనను భూభాగమునకై ప్రయత్నింపుము, ఇచటి దేశాలలోగూడ నేను కొంత ధనము సంపాదించుటకై ప్రయత్నించుచున్నాను. మనము పెద్దయుత్సవమును మన సొంత భూభాగముమీద చేయవలయును. ఏమైనను రానీ, ఇదే నీ ప్రప్రథమ కర్తవ్యముగా ఉండవలయును సుమా, జ్ఞప్తియుంచుకొనుము.

నీవు చాల ధైర్యమును ప్రకటించితివి. ఈ యెనిమిది తొమ్మిదినెలలలో నీవు చేసినపని నీకు మిక్కిలి కీర్తికరము. అన్నిటి కన్నను ముందు కలకత్తాలో ఒక మఠమును ఒక కేంద్రమును స్థిరముగ నెలకొనునట్లు నీవు చూడవలయును. శాంతముగాను, రహస్యముగాను అందులకై చాల పాటుపడుము. కాశీపూరు ఇంటిని గూర్చియు సమాచారమును సంపాదింపుము. రేపు నేను ఆళ్వారుమీదుగా ఖేత్రికి పోవుచున్నాను. నాకు రవంత పడిసెము పట్టియున్నను, ఆరోగ్యము బాగున్నది. జాబుల నన్నిటిని ఖేత్రికి పంపుము. అందఱికి నా ప్రేమ. ప్రేమయుత భవదీయ

వివేకానంద.

మఱిమాట :—హారిశరత్తుల పేరట నేను వ్రాయుమన్న విల్లునామా—మరణశాసనము—విషయము ఏమైనది? లేక భూభాగము మొదలైనదానిని నాపేర కొనెదవా? విల్లునామా నేను వ్రాయుదునా?

వి.

# 390

[illegible]

[illegible]

చి|| మగన్‌లాల్,

[illegible] ఉన్నారు. నేను వ్రాసే పనులగురించి ఆలోచించవద్దని [illegible] చేయలేకపోయితిని. అయినా నాతో ఉన్నవారిలో ఎవరును ఏపనియు చేయలేరు. అది నిజము. ఒక్కొక్కరును స్వతంత్రముగా పోయినను, వారిలో ఎవరును ఏపనియు చేయజాలరు. సంక్షిప్తముగా — వారు నాతోకూడ కలిసియున్న, వారిని ఎవరు లక్ష్య పెట్టెదరు? వృథాకాలహరణము. కావున వారిని మఠమునకు పంపి వేయుచున్నాను.

క్షామనివారణానంతరము మిగులు ధనమును ఏదేని శాశ్వతమైనపనికి మూలధనముగా పెట్టిపెట్టుము. ఆ పైకమును, మరిదేనికిని వ్యయము చేయకు. క్షామనివారణ కార్యపు లెక్కలను పూర్తిగా అప్పగించి, "వేరేదేని.మంచిపనికి ఇంత ధనము మిగిలినది" అని జ్ఞాపిక వ్రాసి పెట్టుము.

పని, నాకు కావలసినది; దగా కాదు. పనిచేయుట కిష్టము లేనివానితో నేను 'అబ్బాయీ, పో, ఇక నీదారిని నీవు చూచుకో' అని చెప్పుదును. నేను క్షేత్రిచేరగానే, ఇంతలో దస్తావేజు అక్కడికి చేరియున్నయెడల చేవ్రాలు చేసి నాకు ప్రతినిధిగానుండు అధికారమును నీకు పంపెదను. అమెరికానుండి వచ్చిన జాబులలో బోస్టను రపాలాగులు తున్నదానిని మాత్రము తెలుపుము. ఇతరములను తెలుపకు. నాజాబుల నన్నిటిని క్షేత్రికి పంపుము. నేను రాజపుటానాలోనె ధన మార్జింతును. అందుకై యాందోళనపడ నక్కఱ లేదు. భూభాగమునకై శక్త్యుత్సాహములతో ప్రయత్నము

ఒకవేళ శరత్తు వచ్చుచున్నాడేమో. ఎట్లైనను, ఎందుండియైనను ఏమిసమాచారము వచ్చినను నాకు తత్ క్షణమే వ్రాయుము.

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

మఱిమాట : కానాయి ఎట్లున్నాడు? అతని యారోగ్యము బాగుగా లేదని వినుచున్నాను. అతనిని విశేషజాగ్రత్తతో విచారించుకొనుము. ఎవరిమీదను అతిగా అధికారము చూపబడకుండునుగాక. నీ యారోగ్యమును గూర్చియు హరియారోగ్యమును గూర్చియు నాకు వ్రాయుము.

వి.

## 392

(శ్రీ శివానందస్వామికి)

జైపూరు
డిసెంబరు 27, 1897

నా ప్రియ శివానందా,

నీకు మదరాసులో నుండగా బాగుగా పరిచితుడైన బొంబాయి గీర్గామువాడు శ్రీ సెట్లూరు ఆఫ్రికాకు ఇండియానుండి పోయియున్నవారి ఆధ్యాత్మికపు అక్కఱలను విచారించుకొనుటకు అక్కడికి ఎవరినైనను పంపుమని నాకు వ్రాయుచున్నాడు. ఎవరినైనను మనము ఏర్పాటుచేసిన, ఆతనికి అగు వ్యయమును భరించి, ఆతనిని అక్కడికి చేర్చుపని ఆతడు చేయగలడు లెమ్ము.

ఆపని ప్రస్తుతము అంతగా అనుకూలముగా నుండదు అని నాభయము. అయినను నిజముగా ఆపని మాత్రము నిండు ప్రవీణుడు చేయవలసినది. ఈ దేశమునుండి అక్కడికి పోయినవారిని అక్కడి తెల్లవారు ఇంచుకైనను ఇష్టపడరను మాట నీ వెఱిగినదే. ఇండియా దేశమువారిని పర్యవేక్షించుటయు, దానితో కూడ ఉద్వేగము చెందక శాంతముగా నుండి అక్కడి జగడాలు వృద్ధి కానీకుండ చూచుకొనుటయు—అది అక్కడిపని. తక్షణమే కలుగగల ఫలముగా ప్రతీక్షింపదగినది ఏదియు ఉండదు. కాని ఇప్పటికి చేయ

బడిన అన్ని ప్రయత్నములకంటె ఇదే భారతదేశమునకు లాభకారియని నిదానముమీద స్పష్టమగును. నీవు పోయి, నీ యదృష్టమును ఇందు పరీక్షింపదగునని నాకోరిక. నీకు సమ్మతమేని, ఆనీ సమ్మతిని సెట్లూరుకు వ్రాయుము. వ్రాసి, ఇంకను దానిని గూర్చి ఎక్కువ వివరములను తెలుపుమనుము. ఇట్లు నీకు నేను వ్రాసితిననియు చెప్పుము. నీదారులు శుభమగును గాక! నా ఆరోగ్యము ఇపుడు అంత బాగుగాలేదు. అయినను ఇక కొన్ని దినాలలో కలకత్తాకు పోవుచున్నాను. ఆరోగ్యము పొందగలను.

భగవద్గత భవదీయ
**వివేకానంద.**

## 393

(శ్రీమతి మృణాళినీ బోసుకు)

దేవగడము, వైద్యనాథము.
జనవరి 3, 1898

ప్రియమాతా,

నీజాబులో చాల ముఖ్యవిషయములు కొన్ని ప్రస్తావింపబడియున్నవి. వానికి పూర్తిగా సమాధానమును ఒక చిన్న జాబులో వ్రాయుట సాధ్యముగాదు. అయినను వానికి సాధ్యమైనంత సంగ్రహముగా సమాధానము వ్రాయుచున్నాను.

(1) ఋషికాని, మునికాని, దేవుడుకాని—వీరికెవరికిని మానవ సంఘమున ఒక వ్యవస్థను బలవంతముగ ప్రవేశపెట్టుటకు శక్తిలేదు, ఆయాకాలముల యక్కఱలు వారికి నిర్బంధము ఒత్తిడి కలుగచేసినపుడు, ఆత్మరక్షణకై జనులు తామె కొన్ని యాచారములను అవలంబింతురు. ఋషులు ఆయాచారములను క్రోడీకరించినారు, అంతే. మానవుడు పలుమాఱు తనకు తాత్కాలికమగు ఆత్మరక్షణను గూర్చుకొనుటకై ఉత్తరకాలమున చాల హానికరము కాగల ఉపాయమును అవలంబించుచుండును. అట్లే సంఘమును తాత్కాలిక రక్షకమును కాలాంతరమున భయంకర వినాశకరమును అగు ఉపాయమును అవలంబించును.

ఉదాహరణార్థము మన దేశమందలి విధవావివాహ నిషేధమును చూడుము. ఋషులో దుష్టాత్ములో దానికి సంబంధించిన శాస్త్రమును ప్రవర్తింప చేసినారని తలంపకుము. స్త్రీలను పూర్తిగా తమ వశమున ఉంచుకొనవలయునను కోరిక పురుషులకున్నను, ఆయా కాలములలో సంఘమున ఏర్పడిన యక్కఱలను ఆధారపఱచుకొనక అట్టి చట్టములను తెచ్చిపెట్టుటకు వారి కెప్పుడును సాధ్యపడలేదు. ఈ యాచారమున రెండువిషయములు ప్రత్యేకముగా గుర్తింపవలయును.

(అ) విధవావివాహము క్రింది తరగతుల ప్రజలలో జరుగును.

(ఆ) పై తరగతుల ప్రజలలో స్త్రీలసంఖ్య పురుషుల సంఖ్య కంటెను ఎక్కువ.

చూడుము: ప్రతిపిల్లకును పెండ్లి చేయుట యనునది శాస్త్రవిధి యగునేని, ఒక్కొక్కతెకు ఒక్కొక్క మగనిని సంపాదించుట చాల కష్టము. అట్లుండ, ఒక్కొక్కతెకు వరుసగా ఇరువురిని ముప్వురిని సంపాదించు టెట్లు? కాబట్టి సంఘము ఒక పక్షమునకు ప్రతికూలము చేసినది. అనగా అది స్త్రీకి రెండవ భర్తను నిషేధించినది. ఏలన, ఆ స్త్రీకి అప్పటికి ఒక భర్త ఉండి పోయినాడు కదా. అట్లు నిషేధింపకున్న వేఱొకకన్నెకు వరుడులేక పోవలసి వచ్చును. పక్షాంతరమున స్త్రీలకన్నను పురుషులసంఖ్య ఎక్కువగాగల సంఘములందు వితంతువివాహము ప్రవర్తిల్లుచున్నది. ఏలన వారివిషయమున పైన చెప్పిన యాక్షేపణ లేదు. పశ్చిమదేశాలలోసైతము, పెండ్లికాని పిల్లలకు భర్తలు దొరకుట నానాటికిని కష్ట మగుచున్నది.

వర్ణవ్యవస్థయు, ఇతర సంఘాచారములును ఇట్లు ఏర్పడినవే.

కాబట్టి, ఏ సాంఘికాచారమునైనను మార్పవలయునేని, దానికి మూలముగనుండిన ఆ ఆవశ్యకత యేదియో, తొలుత

కనుగొనవలయును. దానిని మార్చిన, ఆ యాచారము తనంతటనే చచ్చును. అట్లు గాకున్న, దానిని తెగడుటవలనగాని పొగడుట వలనగాని ఏ మేలును చేకుఱదు.

(2) ఇక, ఇపుడు విషయమిది :—సంఘ నియమములు ఏర్పఱుపబడుటయు సంఘము ఏర్పడుటయు ప్రజల హితము కొఱకేనా ? చాలమంది దీనికి జవాబుగా 'అవును' అని యందురు. మఱి కొందఱు 'అట్లు గాదు' అనియు అభిప్రాయపడవచ్చును. కొందఱు మనుష్యులు తాము ఇతరులకంటెను బలము గలవారైనందున, మెల్లగా ఇతరులనందఱిని తమకు లోబఱచుకొని, యుక్తిచేతనో బలాత్కారముచేతనో నేర్పుచేతనో తమ యుద్దేశములను నెఱవేర్చుకొందురు. ఇది నిజమైన, 'అజ్ఞానులకు స్వేచ్ఛ యొసంగుట అపాయకరము' అను మాటకు అర్థ మేమి ? మఱియు, స్వేచ్ఛ అనగా అర్థ మేమి ?

స్వేచ్ఛ అనగా ఇతరులధనాదికమును నీవుగాని నేనుగాని స్వార్థమునకై అపహరించుమార్గమున ఆటంకములు లేకుండుటగాదు. మఱేమనగా, ఇతరులకు హాని కలిగింపకుండ, మన యిచ్ఛమెయి మన దేహమునుగాని, తెలివినిగాని, సంపదనుగాని ఉపయోగించుటకు మనకు స్వభావసిద్ధముగ నుండు హక్కు. సంఘములో నందఱికిని ధనమునుగాని విద్యనుగాని జ్ఞానమునుగాని పొందుటకు సమానమగు అవకాశములు ఉండవలయును. రెండవవిషయమిది:—అజ్ఞానులకును బీదలకును స్వేచ్ఛను–అనగా తమ దేహధనాదికమునకైన పూర్తిహక్కును—ఇచ్చినను, ధనాఢ్యుల బిడ్డలవలెను గొప్పస్థితిలో నుండువారి బిడ్డలవలెను వీరిబిడ్డలును తమస్థితిని బాగుపఱచుకొనుటకును జ్ఞానమును సంపాదించుకొనుటకును స్వేచ్ఛగలవారయినను, వాడు విపరీతబుద్ధి గలవా రగుదు రట! ఈమాటను సంఘక్షేమమును కోరి చెప్పుచున్నారా, స్వార్థపరత చేకన్నుగానక చెప్పుచున్నారా? ''నిమ్నవర్గాలవారును విద్యావంతులగుదురేని

ఇక మనకు ఊడిగము చేయువా రెవరు?'' అను ఈమాటను నేను ఇంగ్లండులోను వినియున్నాను.

పిడికెడు ధనికుల భోగానుభవమునకై లక్షలాది పురుషులును స్త్రీలును దారిద్ర్యనరకమునను అగాధాజ్ఞానకూపమునను మునిగి యుండనీ! వారికి విద్యాధనములు కలిగిన, సంఘము తలక్రిందు లగును!

సంఘమనగా ఎవరు, ఆ లక్షలాది ప్రజలా? లేక నీవును నేనును పై వర్గాలకు చెందిన మఱి నలువురునా?

ఒకవేళ రెండవపక్షమే నిజమైనను, 'వారికి మార్గదర్శకులము మనము' అను మన యహంకారమునకు ఏమి ఆధారమున్నది? మన మేమి సర్వజ్ఞులమా?

''ఉద్ధరే దాత్మ నాత్మానమ్'' ''ఆత్మను ఆత్మచేత నే ఉద్ధరింప వలయును.'' ప్రతియొకడును తన మోక్షమును సాధించుకొననిమ్ము. అన్నివిషయములలో స్వేచ్ఛ అనగా ముక్తివంకకు ముందుకు నడువ గలుగుట—అది మానవుని అత్యంత శ్లాఘ్యతమమైన లాభము. మోక్షము వంకకు, దైహిక మానసిక పారమార్థిక స్వేచ్ఛవంకకు తాను ముందుకుపోవుటయు, పురోగమించుటకు ఇతరులకును సాయముచేయుటయు మానవుని ఉత్తమపురుషార్థము. ఈ స్వేచ్ఛా సిద్ధిమార్గమున అడ్డుచుండు సాంఘిక నిబంధనములు హాని కరములు. కావున వానిని శీఘ్రముగా నాశనము చేయగల ప్రయత్న ములను చేయవలయును. జనులను స్వేచ్ఛామార్గమున వృద్ధికి తెచ్చు సమాజములను ఏర్పాటులను ప్రోత్సహింపవలయును.

ఈజన్మమున మనకు ఒకానొకని విషయమున, వాడు అంతగా అసాధారణలక్షణములుగలవాడు గాకున్నను, తటాలున ఒక్కసారి చూచినమాత్రకే, మిక్కిలిగా గల్గుప్రేమకు జన్మాంతర సంబంధమే కారణమని మనదేశపు తత్త్వజ్ఞానులు ఉపపత్తిని విశదీకరింతురు.

సంకల్పమును గూర్చిన నీప్రశ్న చాల చిత్తరంజకముగా నున్నది. అదియే తెలిసికొనవలసినవిషయము. సర్వమత సారాంశ మేమనగా, కామమును అణచివేయుట; దాని వెంటనే సంకల్పనాశన మును వచ్చును. ఏలన, ఒకతీరు సంకల్పమునకే కామమని పేరు, అంతే. మఱియు ఈ ప్రపంచ మేల ఉన్నది? లేదా, సంకల్పమునకు ఈ ప్రత్యక్షావిర్భావములు ఏల యున్నవి? చెడ్డ సంకల్పమును నాశనము చేయదగును గాని, మంచి సంకల్పమును కాదు–అని కొన్నిమతముల యభిప్రాయము. ఐహికమున కామ మును మానుకొనిన ఆముష్మికమున భోగముల యనుభవము భుక్తి యగునట. ఈ జవాబు వివేకులకు నిజముగా సమాధానము కూర్పదు. అట్లుగాక, పక్షాంతరముగా, బౌద్ధులు కామము దుఃఖమునకు కారణ మనియు, దానిని నాశనముచేయుట మిక్కిలియు కోరదగిన దనియు చెప్పుదురు. బుగ్గమీదవాలిన దోమను చంపు ప్రయత్న మున అసలు మనుష్యునే చంపుటవలె, బౌద్ధసిద్ధాంతమున, వారు దుఃఖనాశనప్రయత్నమున తమ ఆత్మలనే నాశనము చేసికొను పర్యంతము పోయినారు.

సంగతి ఏమనగా, మనము సంకల్పము అనునది, అంతకన్నను గొప్పదైన ఒకానొకదాని అధమపరిణామమే. ఆశారహితత్వము అనగా సంకల్పరూపమగు ఈ యధమ పరిణామము మాయమై ఆ యుత్తమస్థితి యావిర్భవించుటే. ఆస్థితి మనసునకు బుద్ధికి అందునది కాదు. కాని బంగారు మొహరీయాకారము రూపాయరూపమున కన్నను పైసా రూపమునకన్నను వేఱైనను, మనము నిశ్చితముగా బంగారుమొహరీ ఆ రెంటికన్నను గొప్పదిఅని ఎఱుంగుదుము. ఆవిధ ముగానే, ఆ పరమస్థితి—దానిని మోక్షమని పేర్కొనుము లేదా నిర్వాణమని పేర్కొనుము — మనసునకును బుద్ధికిని అందని దైనను, సంకల్పమునకన్నను, తక్కిన యన్నిశక్తులకన్నను, గొప్పది. అది శక్తి గాదు. శక్తి దానిపరిణామము. కావున అది ఇంకను గొప్పది. ఇపుడు సంకల్పమును మొదట ఫలమును ఉద్దేశిం

చియు తర్వాత ఉద్దేశింపకయు చక్కగా వినియోగించినచో సంకల్పశక్తి ఇంకను చాల ఉత్తమస్థితిని చెందును. అదే దాని ఫల మని నీవు గ్రహింపగలవు.

ఆరంభదశయందు శిష్యుడు గురుని ఆకారమును ధ్యానింప వలయును. క్రమముగా దానిని ఇష్టమున లీనముచేయవలయును. ఇష్టమనగా భక్తి ప్రేమలకు లక్ష్యమైనది అని యర్థము...

మానవునిమీద దేవత్వమును అధ్యాసచేయుట చాలకష్టము. అయినను ప్రయత్నములు మాటిమాటికి చేసిన తప్పక సిద్ధికలుగును. ప్రతి మానవునియందును అతనికి తెలిసినను తెలియకున్నను దేవుడు ఉన్నాడు. నీ ప్రేమభక్తి ఆతనియందలి దివ్యత్వమును తప్పక పైకితెచ్చును.

ఎప్పుడును నీ హితైషి

వివేకానంద.

## 394

(రాజాప్యారీ మోహన్ముఖర్జీకి)

మఠము, బేలూరు

ఫిబ్రవరి 25, 1898

నాప్రియరాజాజీ,

నన్ను ఉపన్యసించుటకు పిలిచిన నీ సదయాహ్వానమునకు నేను కృతజ్ఞుడను. కొన్నాళ్ళక్రిందట ఆవిషయమును గూర్చి శ్రీ భట్టాచార్యతో ఒకసారి మాటలాడితిని. దానికి ఫలముగా, మీ సమాజమునకై కొంతవ్యవధిని కల్పించుకొందమని నా శక్తి కొలది ప్రయత్నించుచున్నాను. ఆదివారమునాడు ఏమాటయు తెలుపుదునని వారికి వాగ్దానము సయితము చేసితిని.

నేనెంతయో కృతజ్ఞుడనుగా ఉండవలసిన నామిత్రమొక్కడు, నన్ను తనయూరికి, డార్జిలింగు పిలుచుకొనిపోవుటకు కాబోలు, ఇక్కడ ఉన్నాడు.

నా అమెరికా స్నేహితులు కొందఱు వచ్చియున్నారు. తీఱిక గల ప్రతినిమిషమును క్రొత్తమఠమునకై పనిచేయుటకును, ఇంకను అందలి పెక్కు నిర్మాణకార్యక్రమములకై పనిచేయుటకును, విని యుక్తమగుచున్నది. పై నెలలో నా కమెరికా ప్రయాణము తగులు నని ప్రతీక్షించుచున్నాను.

నన్ను నమ్ముము: నీ యాహ్వానమును నాకు లాభకరముగా వినియోగింప గలుగుటకు నాచేతనైనంత ప్రయత్నము చేయుచున్నాను. ఫలమును ఆదివారము శ్రీ భట్టాచార్యద్వారా తెలిపెదను.

ప్రేమాశీస్సులతో, నీవాడను,

వివేకానంద.

## 395

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

మఠము, బేలూరు
హౌరాపోస్టు.
ఫిబ్రవరి 25, 1898

నాప్రియశశీ,

మదరాసులో మహోత్సవమును జరిపి విజయమందినందులకు మా అభినందనములు. ఉత్సవమునకు చాలమంది వచ్చియుందు రనియు మీకు సమృద్ధమైన పారమార్థికాహారము లభించియుండు ననియు తలంచెదను. నీకు అంతప్రియమైన వ్రేళ్ళు మెలికలు త్రిప్పుటను 'క్లీం' 'ఫట్' మున్నగు రహస్యమంత్రముల పారాయణములు చేయుటను నేర్పుటకంటె ఇట్లు సమధిక పారమార్థికతను మదరాసీయులకు నేర్ప నీవు నడుము బిగించినందులకు మాకు అందఱికి చాల సంతసముగా నున్నది. శ్రీ గురుదేవునిగూర్చిన నీ యుపన్యాసము నిజముగా దివ్యముగా ఉన్నది; నేను ఖండ్వాలో మదరాసుమెయిలు పత్రికలో దాని నివేదికను మాత్రము చూడగలిగితిని. మఠమువారి

కేమియు దాని సమాచారము అందలేదు. మాకు దానినకలు ప్రతియొకటి ఏల పంపవైతివి?

నేను మౌనము వహించియున్నాను అని చెప్పితివట, నిజమేనా? నీవు నాకు వ్రాసినంతకంటె నేను నీకు ఎక్కువ జాబులు వ్రాసితిని. యూరోపు అమెరికాలనుండియు వ్రాసితిని. నీవు ప్రతివారమును మదరాసునుండి నీకు శక్యమైనంతవఱకు సకల వృత్తాంతమును నాకు తప్పక తెలుపవలసినది. అందుకు చాల సులువైనపద్ధతి ప్రతిదినమును కొన్నిబంతులు కొన్ని శీర్షికలు కాగితముపై వ్రాసిపెట్టుచుండుట.

ఇటీవల నాయారోగ్యము దెబ్బతిన్నది. ప్రకృతము చాల మేలుగా ఉన్నది. ఇపుడు కలకత్తా మామూలుకంటె ఎక్కువ చల్లగా ఉన్నది. ఇక్కడనున్న అమెరికను మిత్రులకు అది చాల హాయిగా ఉన్నది. మనము కొన్న భూమిని మన స్వాధీనమునకు ఈదినము తీసికొనుచున్నాము. ఇపుడే మహోత్సవమును అందు జరుపుటకు సాధ్యము గాకున్నను, నేను ఆదివారము నాడు దానిమీద ఏదియో ఒక లాంఛనము జరుపవలయును. ఎట్లైనను శ్రీ గురుదేవుని అస్థికలను ఆ దినము మనచోటికి కొనిపోవలయును. వానికి అక్కడ పూజచేయవలయును. గంగాధరుడు ఇక్కడ ఉన్నాడు. తాను బ్రహ్మవాదినుకై కొన్ని చందాలు వసూలు చేయగల్గినాడనియు, అయినను పత్రిక సరిగా క్రమముగా అందుచుండనందున త్వరలో ఆ చందాలు నిలిచిపోవునేమో అని తనకు భయముగలుగుచున్నది అనియు నీకు జాబు వ్రాయుచున్నాడు. ఆ యువకునిగ్గూర్చిన నీ సిఫారసు జాబు చేరినది. అందులో 'మాన్యుడా, తినుటకు ఏమియు లేదు' అను ప్రాతకథయే కలదు. కాని దానికి మదరాసీయుల పద్ధతిలో ''చాలమంది బిడ్డలు కూడనున్నారు. బాబూ'' అనుమాటలుగూడ చేర్పబడియున్నవి. వారిని పుట్టించుటకు ఏ సిఫారసు అక్కఱలేక పోయెనుగదా! అతనికి

సాయము చేయుటకు నేను మిక్కిలి సంతోషింతును. కాని, సంగతి యేమనగా నాయొద్ద పైకము లేదు. అందఱు నన్ను దూబరితిండి అనుటచేతను, ఆ కారణముచే నాయొద్ద పైకముంచుటకు భయ పడుటచేతను నావద్దనున్న ప్రతి దమ్మిడీని రాజా* చేతికి ఇచ్చి వేసితిని. ఐనను అతడు నీ యువమిత్రునికి మఱికొందరు బిడ్డలు కనుటకు సాయపడు వెరవు చూడగలడేమో అని నీజాబును రాఖాలుకు పంపితిని. తాను క్రీస్తుమతమున చేరిన క్రైస్తవులు తనకు పూర్తిగా సాయము చేయుదురనియు, అయినను తాను చేరననియు అతడు జాబు వ్రాయుచున్నాడు. తాను క్రైస్తవుడైనచో హిందూ ఇండియా కొక మహోజ్జ్వలాలంకారము నష్టమగుననియు శాశ్వతదుఃఖాదపాకమైన తన సంతానోత్పాదక శక్తివలని లాభము హిందూ సంఘమునకు లేకపోవుననియు అతనికి భయము కాబోలు!

శ్వాసింపను వాడుకలేనంత అమితముగా నిర్మలమైన చల్లని గాలి దొరకి తాము గంగయొడ్డున నివసింపగన్నందున ఇక్కడ క్రొత్తమరములో బాలురు అలసినట్లు అగపడుచున్నారు. శారదుని అతడు దినాజ్పూరునుండి తెచ్చుకొన్న మలేరియా బాధించుచున్నది. మొన్న ఒకదినము ఆతనిచేత ఒకమాత్ర నల్లమందు తినిపించితిని. దానివల్ల అతనికేమియు మేలు కలుగలేదు. అందుకు బదులుగా వానిబుద్ధి కొన్నిగంటలు దానికి స్వాభావికమైన మూఢత వంకకు సాగిపోయినది. హరికిని కొంత జ్వరస్పర్శ కలదు. వారి బరువును అది చాల తగ్గించుననుకొందును. మఱియొకమాట. మేము మరల నాట్యమాడుపని నారంభించినారము. హరి శారదుడు నేను— ముగ్గురము కలసి నృత్యము సుడియుట చూచిన నీ హృదయము చాల సంతోషించును. మేము క్రిందపడక మమ్ము ఎట్లు నిలువరించుకొందుమనుట నాకు ఆశ్చర్యము.

శరత్తు వచ్చినాడు. మామూలు ప్రకారము చాల గట్టిగా పనిచేయుచున్నాడు. ఇపుడు మాకు కొన్ని మంచి గృహోపకరణ

---

* శ్రీ బ్రహ్మానందస్వామి

ములు ఉన్నవి. పాతమఠమున నున్న చాపనుండి 'అందమైన బల్లలు కుర్చీలు మూడు మంచములు' అనువానికి ఒక పెద్దగంతు, ఏమనుకొన్నావో. మేము పూజను చాల తగ్గించినాము. అంగన్యాస ములు, వషట్ ఫట్ మున్నగు వేదమంత్రములు స్వాహాలు అన్నియు చాల తగ్గించివేయబడినవి. దానిని నీవు చూతువేని నీకు మూర్ఛ వచ్చును సుమా. పూజ పగలుమాత్రమే జరుపబడుచున్నది. వారు రాత్రులు అంతయు గాఢముగా నిద్రపోయిరి. తులసియు కోకాయు ఎట్లున్నారు? రాఖాల్ దగ్గఱ ఉండినంతకన్న వారు నీకు ఎక్కువ వశ్యులుగా ఉన్నారా? అక్కడి విచారణను తులసికి అప్పగించి, నీవు కొన్నాళ్లు కలకత్తాలోనికి పరుగెత్తవచ్చును. ఐనను దానికి అంత వ్యయము! అంతేకాదు, నీవు వెనుకకు మరలిపోవలయును. ఏలన మదరాసును క్షుణ్ణముగా తయారుచేయవలయును. నేను శ్రీమతి బుల్బతితో కొన్ని నెలలలో అమెరికాకు పోవుచున్నాను.

గుడ్విన్కు నా ప్రేమ అందింపుము. ఏవిధముననైనను మేము జపానుకు పోవుదారిలో అతనిని చూడబోవుచున్నామని అతనితో చెప్పుము. శివానందుడు ఇక్కడఉన్నాడు. "నేను పోయి ఇక హిమాలయములలోనే ఉండవలయు"నను అతని వాంఛాతీవ్రతను నేను కొంత తగ్గించినాడను. తులసియు ఆయాలోచనయే చేయు చున్నాడా? పందికొక్కుబొటియ అతనికి చాలిన గుహయగునని నే ననుకొందును.

కాగా, ఇక్కడ మఠము నెలకొల్పబడియైనట్లే. నేను ఇంకను చాల సాయము సంపాదించుటకు పోవుచున్నాను... శక్త్యుత్సాహ ములతో పనిచేయుము. లోపలను బయటనుకూడ కుళ్ళిన పీనుగు వంటిది ఇండియా. మనము దానిని శ్రీగురుమహారాజు నను గ్రహమువలన మరల బ్రదికించి లేపుదము.

సర్వప్రేమతో,

సదా భవదీయ భగవద్గత,
వివేకానంద.

# 396

(కుమారి మేరి హేలుకు)

మఠము, బేలూరు,
హౌరాజిల్లా, బెంగాలు, ఇండియా,
మార్చి 2, 1898.

ప్రియ మేరీ,

అమ్మ చర్చికి నేను వ్రాసిన జాబువలన నీకు నన్నుగూర్చిన సమాచారములు అందియుండునని నా నమ్మకము. మీరందఱు, మీ కుటుంబము అంతయు, నాయెడ చాల దయగలిగియున్నారు. హిందువులమైన మేము చెప్పునట్లు, నేను పోయినజన్మమున మీవాడనుగా ఉండియుండవలయును. నాకు గల ఒక్క చింత ఇది: ఆ కోటీశ్వరులు ఎవరును అక్కఱకు రాకపోయినారు. ఏలన, వారి యావశ్యకత నాకు ఇపుడు మిక్కిలిగా నున్నది. నేను ముసలి నగుచున్నాను. బలము ఉడుగుచు మఠము కట్టించుచు నున్నది. కార్యమునకు అంగాంగ సాధుసంయోగము కుదుర్చుచును ఒళ్లు చాల వేడి యెక్కిపోవుచున్నది. హారియెట్టుకు కోటిసద్గుణములలో ఒక్కటి విరాజిల్లుచున్నను, దానితో కొన్నికోట్లధనము అనెడి సద్గుణము ఉండియున్న దానిని ఇంకను ఎంతో ప్రకాశింపజేసెడిది. అది నిశ్చయము. కావున నీవును ఆ పొరపాటునే చేయకుము. ఒక యువతికిని యువకునకును తాము భార్యయు భర్తయు అగుటకు అనుకూలలక్షణములు అన్నియు ఉండెనట. కాని అందులో ఒక్క లోపముమాత్రము ఉండెను. వధువు నాయన ఆమెను కోటీశ్వరుడుకానివానికి ఈయగూడదు అని తీర్మానించుకొనియుండెను. ఈవరునికి ఆ కోటీశ్వరత లేకుండెను. కావున ఆ యువతీయువకులు హతాశు లగుచుండిరి. అప్పుడు మనువులు కుదుర్చు మేధావియొకడు వారికి శరణమయ్యెను. అతడు 'నీకు ఒక కోటి ధనమునిచ్చిన, నీముక్కును ఇత్తువా' అని వరుని అడిగెను. అతడు ఇయ్యననెను. అంతట ఆ మనువుల కుదుర్చువాడు వధూపితయెదుట, 'వరునికి పెక్కుకోట్లు వెలగల సరకులు ఉన్నవి' అని ఒట్టుపెట్టుకొనెను.

అంతట ఆ పెండ్లి జరిగిపోయెను. నీవు అట్టికోట్లు తీసికొనకుము. సరి సరి నీకు కోటీశ్వరుడు దొరకలేదు, కావున నేను ధనము పొందజాలక పోయితిని. అందుచేత నేను చాల మనఃక్లేశము చెంది, నిష్ప్రయోజనముగానే, శ్రమపడవలసి వచ్చినది. అందుచేతనే నాకు రోగము సంభవించినది. నిజమైన కారణమును కనుగొనుటకు నా తెలివివంటి తెలివి కావలయును. నన్నుచూచి నేనే మురిసిపోవుచున్నాను!

సరి, నేను లండనునుండి మరలి వచ్చినపుడు, దక్షిణ యిండియాలోనుండగా, జనులు నాకై పండువులు ఉత్సవములు చేయుచు, నాయొద్దనుండి సర్వకార్యమును వెలికి రాబట్టుచుండిరి. వంశపారంపరిగా వచ్చిన యొక పాతరోగమప్పుడు పొడసూపినది. ఆ వ్యాధి వంకకు ప్రవణత నాకెప్పుడును ఉన్నది. మానసిక కార్యాతిభరము దానిని వెలికి తెచ్చినది. మిక్కిలి క్రుంగిపోయినాను. ప్రాణము పోవునంతకు వచ్చినది. నేను తక్షణమే మదరాసు వదలి చల్లని యుత్తరదేశమునకు వెడలవలసివచ్చినది. ఒక్కదినము ఆలస్యము చేసినయెడల, మఱియొక వారముదినములు స్టీమరుకోసము ఆ భయంకరోగ్రోష్ణమున నిలిచి మాడుచుండవలసినదే.—ఇంకొకవిషయము: శ్రీ బర్రోసు మఱుదినమే మదరాసుకు వచ్చినాడట. నేనే ఆతనికి స్వాగతాభినందనపత్రము తయారుచేయించి ఆతని యాతిథ్యమునకు వలయు ఏర్పాట్లన్నియు చేయించియుండినను తాననుకొన్నట్లు నేను అగపడకపోగా, చాల చిరాకు చెందినాడట. నాకు తరువాత తెలిసినది. పాపము, నేను చావు బ్రతుకులతో నున్నానని ఆత డెఱుగడు.

కడచిన గ్రీష్మర్తువంతయు, నేను హిమాలయములలో పర్యటించుచుంటిని. ఆ చల్లని వాతావరణము నాకు మేలు కలిగించినది. అది నాకు తక్షణమే తెలిసినది—ఈ మైదానముల యుష్ణములోనికి రాగానే, నేను మరల జబ్బున పడినాను. ఈదినము మొదలుకొని కలకత్తాలో వేడి తీక్ష్ణమగుచున్నది. ఇక నేను తొందరగా ఇందుండి ఎగిరిపోవలయును. శ్రీమతి బుల్సాతియు కుమారి మెక్లి

యడును ఇక్కడ ఉన్నందున, ఈసారి చల్లని యమెరికాకు పోయె దను. కలకత్తాసమీపమున గంగానదియొడ్డున సమాజమునకై ఒక చిన్న భూభాగమును కొన్నాను. దానిమీద ఒక చిన్నయిల్లు ఉన్నది. ఇపుడు వారు అందులోనే నివసించుచున్నారు. అందుండి రాయి విసరివేసిన పడు దూరములో ఒక యిల్లు ఉన్నది. ప్రకృతము మఠము అందు నెలకొల్పబడియున్నది. మేము అందు వసించు చున్నాము.

కావున నేను వారిని ప్రతిదినము చూతును. అందుచేత వారు అచట హాయిగా ఉన్నారు. వారు ఒక నెలదినాలలో కాశ్మీ రమునకు ప్రయాణము చేయగోరుచున్నారు. వారు సమ్మతించిన, వారితోకూడ నేనును, దారి తోడుగాను, మిత్రముగాను తత్త్వ జ్ఞానిగాను పోవుదును. అటుతర్వాత మేమందఱము స్వేచ్ఛకును అపవాదములకును నెలవగు దేశమునకు పయనింతుము.

నీవు నాకోసము దిగులుపడ నక్కఱలేదు. ఆరోగము రెండు మూడు ఏండ్లకుగాని నన్ను చంపి కొనిపోదు. అది నిరపాయకర మగు సావాసిగా నుండవచ్చు. అంతకన్న నేమియు లేదు. నేను తృప్తిగల్గియున్నాను. నేను అన్నింటిని ఎప్పటికిని సదా బాగుండు నట్లు కుదురు పఱచుటకై ఎంతేని కష్టపడి పనిచేయుచున్నాను. నేను రంగాన లేకున్నను యంత్రము ముందుకు సాగిపోవునుగాక అని నా యుద్దేశము. నేను నా ఐహికజీవితమును దత్తము చేసినప్పుడే-చాల కాలముక్రిందనే మృత్యువును జయించితిని. నాకు ఉండు ఒక్క చింతయు—'పనిని' గూర్చియే. దానినికూడ: నేను దేవునికి అర్పింతును. ఆయన చక్కగా ఎఱుగును.

సదా భవదీయ భగవద్గత,

**వివేకానంద.**

## 397

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

మఠము - బేలూరు, హౌరా.
మార్చి, 1898.

ప్రియశశీ,

నేను నీకు రెండు విషయములను గూర్చి వ్రాయుటకు మఱచితిని. 1. తులసి గుడ్విననొద్ద "పార్టుహాండు" దాని యారంభమునైనను, నేర్చుకొనవలయును. 2. నేను ఇండియాకు బయటనున్నపుడు మదరాసుకు చాలవఱకు ప్రతిదినమును ఒకజాబు వ్రాయవలసియుండెను. ఆ జాబులకు నకళ్ళు కావలయునని జాబు వ్రాసితిని. ఉపయోగము లేకపోయినది. ఆ జాబుల నన్నింటిని నాకు పంపుము. నేను నా సంచారములను గూర్చి పూర్తిగా వ్రాయగోరుచున్నాను. తప్పకుము, వానిని నేను వాడుకొని కాగానే, మరల నీకు పంపివేసెదను. 'డాన్'(-ప్రభాతము) అను పత్రిక ఇన్నూఱుగురు చందాదారులతో ఒక్కొక్క ప్రచురణకు రు 40 లు ఖర్చుతో, సకాలమున కందుచు సాగుచుండగలదు. ప్రబుద్ధభారతము చాల తాఱుమాఱుగ నున్నట్లున్నది. మరల దానిని చక్కచేయుటకు నీశక్తికొలది ప్రయత్నింపుము. పాపము అళసింగడు! అతనికై నేను చాల చింతించుచున్నాను. ఒక సంవత్సరకాలము వేఱు ఏపనియు లేకుండచేసి, అతని శక్తియంతయు బ్రహ్మవాదిన్ కార్యమునకు వినియోగించునట్లు మాత్రమే చేయగలను. అతనిని చింతిల్లవలదని చెప్పుము. అతడు సదా నా మనసులో మెదలుచునే ఉన్నాడు. పాపము ఆతని భక్తి ఋణమును నేను ఎన్నటికిని తీర్చుకొనలేను.

నేను శ్రీమతి బుల్ఎతితోను కుమారి మెక్లియడుతోను మరల కాశ్మీరమునకు పోవలయునని అనుకొనుచున్నాను. కలకత్తాకు మరలి వచ్చి, ఇక్కడినుండి అమెరికాకు బయలువెడలుదును.

కుమారి నోబులు నిజముగా ఒకఆస్తి. ఆమె త్వరలోనే శ్రీమతి బెసెంటును మించిన వ్యక్తిగా అగునని నా నమ్మకము.

తప్పకుండ అళసింగని విచారించుకొనుము. అతడు పనిలో క్రుంగిపోవుచున్నాడని నా యభిప్రాయము. పనియు విశ్రాంతియు ఒక దానితో ఒకటి మాఱిమాఱి జరిగిననే, శ్రేష్ఠమగు పని నిర్వర్తింప నగును అని ఆతనితో చెప్పుము. నాప్రేమ నంతయు వానికి అందింపుము. కలకత్తాలో రెండు బహిరంగోపన్యాసములు జరిగినవి—ఒకటి కుమారి నోబులుది, రెండవది మన శరత్తుది. వారిరువురును నిజముగా చాల చక్కగా నిర్వహించినారు. సర్వత్ర చాల ఉత్సాహము కనిపించినది. అందువలన కలకత్తా జనులు మనలను మఱచిపోలేదని తెలియుచున్నది. మఠములో నున్న కొందఱికి చలిజ్వరము తగిలినది. అది నిర్మూలించి ఇపుడు వారు బాగున్నారు. ఇక్కడ పనియంతయు బాగుగా జరుగుచున్నది. శ్రీ మాతృదేవి, ఇక్కడ ఉన్నది. యూరోపియను మగువలును అమెరికను మగువలును మొన్న ఆమె దర్శనమునకు పోయిరి. ఏమనుకొనుచున్నావు! అక్కడ వారితో కలసి అమ్మ కూడ భోజనము చేసినది! అది దివ్యముగాదా? పైనుండి ప్రభువు మనలను కనుపెట్టి యున్నాడు. భయములేదు. మీరు ఏమియు జంకవలదు. నీవు ఆరోగ్యమును చూచుకొనుము. తొణకకుండుము. కొన్ని పెద్ద ఊపులు ఊపి తర్వాత తెడ్డులను ఊనుకొని విశ్రమించుట సదా మంచిది. రాఖాలుకు ఇపుడు జీవితమంతయు క్రొత్తచోటులోను కట్టడములోను సరిపోవుచున్నది. ఈసంవత్సరపు మహోత్సవము నాకు తృప్తికరముగా లేదు. ఇక్కడి అన్నివేర్వేఱు కార్యభాగముల గొప్పమేళనముగా అది యుండవలసినది. రాగల సంవత్సరము అట్లు ప్రయత్నింతము. అప్పటికి దానికి వలయు ఆదేశములను నేను పంపెదను. అక్కడి మీకందఱికిని నా ప్రేమయు దీవెనలును.

వివేకానంద.

## 398

(కుమారి జోసెఫైన్ మెక్లియడ్ కు)

డార్జిలింగు
18 ఏప్రిల్, 1898

నా ప్రియజోజో.

నేను జ్వరముతో పడుంటిని. అతిమాత్రముగా కొండ లెక్కుటవలనను, ఈచోటు అంత ఆరోగ్యకరము గానందునను వచ్చిన దేమో జ్వరము.

నాకు ఈదినము కొంచెము నయముగా నున్నది, ఇకను ఒకటి రెండుదినాలలో ఇందుండి తరలిపోవలయునని అనుకొనుచున్నాను. కలకత్తాలో వేడి చాల ఎక్కువగా ఉన్నను, నేను బాగుగా నిద్ర పోవుచుంటిని. కొంత ఆకలియు ఉండినది. ఇక్కడ రెండును మాయమైనవి. కలిగిన లాభ మంతయు ఇదియే.

కుమారి ముల్లరును నేను ఇంకను చూడజాలనైతిని. మార్గరెట్టు విషయము ఆమెతో మాటాడలేదు. అయినను ఆమెకు జాబు ఈదినము వ్రాయవలయునని ఉద్దేశించుచున్నాను. ఆమెకు ఇక్కడ స్వాగతము చెప్పి ఆతిథ్యమిడుటకు ఈమె అన్ని ఏర్పాటులు చేయుచున్నది. వారికి బెంగాలినేర్పుటకు శ్రీగుప్తయు ఆహ్వానింపబడెను. ఆమెను గూర్చి ఈమె ఇపుడేమేని మేలు చేయవచ్చును. అయినప్పటికిని నేను వ్రాసెదను.

మార్గరెట్టుకు ఇక్కడ ఉండగా, కాశ్మీరమును చూచుట ఎప్పుడైనను సరే సులువుగానే యుండును. కాని కుమారి ముల్లరు ఇష్టపడదేని, మరల పెద్దజగడమువచ్చును. అది యుభయులకు హానికరమగును.

నేను మరల అల్మోడాకు పోవుట, నిశ్చితము గాకయున్నది. ఎక్కువ గుఱ్ఱపుస్వారి రోగమును నిశ్చయముగా తిరుగబెట్టునని తోచుచున్నది. నేను నీకై సిమ్లాలో కనుపెట్టుకొనియుందును. నీవు సేవియర్లను దర్శనముచేసి రమ్ము. నేను వచ్చినపుడు దానిని గూర్చి ఆలోచింతము. రామకృష్ణ మిషనులో

కుమారి నోబుల్ ఉపన్యాసము చేసినదట. అందులకు నాకు చాల సంతోషముగా నున్నది. త్రిమూర్తులకు నా సర్వప్రేమ.

సదా భవదీయ భగవద్గత,

**వివేకానంద,**

## 399

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

డార్జీలింగు
ఏప్రిల్ 23, 1898

ప్రియ రాఖాల్,

నేను సన్దుక్ఫు (11,924 అడుగులు) నుండియు, ఇతర స్థలములనుండియు మరలినపుడు నాయారోగ్యము దివ్యముగా ఉండినది. కాని డార్జిలింగునకు మరలినతర్వాత నాకు మొదట జ్వరము వచ్చినది. అందుండి తెప్పరిల్లగానే ఇపుడు దగ్గుతోను పడిసెముతోను బాధపడుచున్నాను. నేను ఈచోటినుండి తప్పించుకొనవలయునని ప్రతిదినము ప్రయత్నింతును. కాని వారు నా ప్రయాణమునకు ఎల్లప్పుడును దీర్ఘ పువాయిదా వేయుచున్నారు. అయినప్పటికిని, రేపు ఆదివారము, నేను బయలు దేఱుచున్నాను. ఖర్సనకడ ఒకదినము ఆగి, మరల సోమవారము కలకత్తాకు బయలు దేఱుదును. బయలుదేఱగానే నీకొక తంతివార్తనంపుదును. మనము రామకృష్ణమఠ మిషనులవారికి వార్షికసమావేశములను కూర్పవలయును. రెండు సమావేశములలోను క్షామనివారణపులెక్కలు సమర్పింపవలయును. క్షామనివారణనివేదికను ప్రకటింపవలయును. వానినన్నిటిని సిద్ధపఱచిపెట్టుము.

ఇంగ్లీషుపత్రికను నిర్వహించుటకు అంతగా డబ్బు పట్టదు అనుచున్నాడు, నిత్యగోపాలుడు. కావున మనము ముందు దీనిని ప్రకటింతము. బెంగాలిపత్రిక సంగతి పిమ్మట చూచుకొందము. ఈవిషయములన్నియు చర్చింపవలయును. పత్రికను నడుపు బాధ్యతను యోగిను తాను భరింప నిష్టపడునా? శరత్తు ఎప్పుడేని మదరాసునకు వచ్చినచో తా మిరువురు కలసి యుపన్యాస

ములు చేయుచు దేశసంచారమును చేయవచ్చునని శశి వ్రాయు చున్నాడు, అబ్బ! ఇపుడు ఎంత వేడిగానున్నది! గి. చ. యు, శారదుడును శశిబాబును ఇంకను ఇతరులును తమ వ్యాసములను సిద్ధముగా ఉంచుకొనియున్నారా అని శరత్తును అడుగుము. శ్రీమతి బుల్ఒతికి, కుమారి మెక్లియడుకు, కుమారి నివేదితకు నాప్రేమను దీవెనలును అందింపుము.

ప్రేమయుత భవదీయ,

వివేకానంద.

## 400

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

డార్జిలింగు
ఏప్రిలు 29, 1888.

నా ప్రియజోజో,

నాకు పెక్కుసార్లు జ్వరము తగిలినది. అందు కడపటిది పడి సెపు విషజ్వరము.

నన్నిపుడు అది వదలినది. ఐనను ఇంకను నేను బలహీన ముగా ఉన్నాను. నాకు ప్రయాణము చేయగలశక్తి చేకుఱగానే కలకత్తాకు వత్తును.

ఆదివారమునాడు నేను డార్జిలింగునుండి బయలుదేఱుదును. ఒకదినమో రెండుదినాలో కుర్సియాంగులో ఆగుదునేమో. తర్వాత తిన్నగా కలకత్తాకు పయనింతును. ఇపుడు కలకత్తా చాలవేడిగా ఉండవలయును. పరవాలేదు. ఈ పడిసెపు జ్వరమునకు అది చాల మంచిది. ఒకవేళ కలకత్తాలో బొబ్బలమారి (=ప్లేగు) ఆక స్మికముగా కలుగునేని, నేను ఎక్కడికిని పోగూడదు. మఱి నీవు సదానందునిగూడి కాశ్మీరమునకు బయలుదేఱుము. ఆ వృద్ధ మాన్యుడు, దేవేంద్రనాథటాగూరు నీకు ఎంతవఱకు నచ్చినాడు? చంద్రదేవుడు సూర్యదేవుడు-వీరితోడి హాన్సబాబా యంత డంబ ముగా ఉండలేదు కాబోలు. చీకటిరాత్రిలో అగ్నిదేవుడును.

సూర్యదేవుడును చంద్రదేవుడును నక్షత్రదేవతలును, అందఱును నిదురవోయినపుడు, నీ ఆంతరములను వెలిగించునది ఏది? నాచైతన్యమును మెలకువతో నుంచునది యేదియో నేను కనుగొంటిని. అది ఆకలి. ఆహా 'వెలుతురు పోలిక'యనునది గొప్ప సిద్ధాంతము!! అదిలేక ఇన్ని యుగాలును లోకము ఎంతచీకటిగా ఉండినది! ఈ జ్ఞానమంతయును, ప్రేమయు, కర్మయు, అందఱు బుద్ధులును, కృష్ణులును, క్రీస్తులును వారి జీవితములును వారిపనియు వృథ! ఏలన సూర్యచంద్రులు రాత్రిక పాతాళమునకు పోయినపుడు మన యంతర్జ్యోతిని నిలుపునది ఏదియో దానిని వారు కనిపట్టజాలరైరి! మధురముకాదా!

నా జన్మనగరమునకు బొబ్బలమారి వచ్చినచో, నేను దానికి బలియగుటకు తీర్మానించుకొంటిని. అది గుడ్డ చినుగును చీకరబాకరగా అదికి సంస్కరించుట వంటి దృశ్యము! తళుకుతళుకుమను ప్రతి జ్వాలలోను ఏదియో హవ్యము వేయుటకంటెను నిర్వాణమునకు అది మేలిమార్గము.

నాకు మదరాసుతో జాబులజవాబుల వ్యవహారము చాల జరిగినది. దాని ఫలముగా, నేను ఇపుడు వారికి ఏసాయమును పంపనక్కఱలేకపోయినది. మఱియొకవైపు కలకత్తాలో నేనొక పత్రికను ఆరంభింపబోవుచున్నాను. అందులకు నీవు సాయపడుదువేని నీకు ఎంతేని కృతజ్ఞుడనుగా నుందును. ఎప్పటివలె అమరప్రేమతో.

సదా భవదీయ భగవద్గత,

వివేకానంద.

## 401

(కుమారి మార్గరెట్ నోబులుకు)

ఆల్మోడా,
మే 20, 1918

ప్రియమార్గాట్,

...విధి విహితమునకు అంతములేదు. లోకము మిక్కిలియు స్వార్థపరము.

మిక్కిలి సంతోషముగా ఉండుము. *'మంచిపని చేయువా రెవరును దుఃఖముపాలు గాలేదు'...

సదా భవదీయేత్యాది
వివేకానంద.

## 402

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

అల్మోడా
మే 20, 1898.

ప్రియరాఖాల్,

నాకు నీజాబువలన అన్ని సమాచారములును తెలిసినవి.' నీ తంతివార్తకు జవాబును అప్పుడే పంపితిని. నిరంజను, గోవింద లాల్‌షాయును కథ్గోదమువద్ద యోగిన్మాకోసము కనుపెట్టుకొని యుందురు. నేను నైనిటాల్ చేరినతర్వాత, వలదని ఎవరు చెప్పి నను వినక బాబురాము ఇక్కడినుండి నైనిటాలుకు గుఱ్ఱముమీద, పోయినాడు. అక్కడినుండి మరలునపుడును మావెంట గుఱ్ఱము మీదనే వచ్చినాడు. నేనొక దండిలో ఉన్నందున చాల వెనుక నుంటిని. నేను రాత్రి 'డాక్ బంగళా' చేరినపుడు బాబురామ్ మరల గుఱ్ఱముమీదినుండి పడినాడనియు, ఒకచేతికి చాల దెబ్బతగిలిన దనియు వింటిని. ఎక్కడ విఱుగలేదులే. నేను తిట్టుదునేమో అని అతడు ఎవరింటనో దిగి ఉండినాడు. అట్లు అతడు పడినందువలన కుమారి మెక్లియడు అతనికి తనదండిని ఇచ్చి తాను గుఱ్ఱముమీద వచ్చినది. ఆరాత్రి అతడు నన్ను కలిసికొనలేదు. మఱునాడు నేను అతనికోసము ఒకదండికై ఏర్పాట్లు కావించుచుంటిని. ఇంతలో అతడు కాలినడకతో అక్కడినుండి బయలుదేఱిపోయినాడని వింటిని. అది మొదలుకొని మరల అతనినిగూర్చి నాకు ఏమియు తెలియ లేదు. ఒకటిరెండు చోట్లకు తంతివార్త పంపితిని. ఏమియు సమాచారము తెలియలేదు. ఒకవేళ ఎందేని గ్రామములో ఉన్నా

* 'నహి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి' భగవద్గీత.

డేమో. బళి. వారు మనుష్యుల బాధలను ఎక్కువ చేయుటలో నేర్పరులు!

యోగిన్మాకు ఒకదండి యుండును. తక్కినయందఱును కాలి నడకతో పోవలసినదే.

నా యారోగ్యము చాల నయముగానున్నది. అయినను అజీర్ణము పోలేదు. ఇక మరల నిద్రపట్టనిరోగము వచ్చినది. నీవు ఏదైనను అగ్నిమాంద్యమునకు మంచి ఆయుర్వేదౌషధమును త్వరగా పంపగలుగుదువేని చాల సాయముగా నుండును.

అక్కడ ఎక్కడనో అక్కడక్కడ ఒకరికో ఇరువురకో ఆమారి తగిలినందున, సర్కారు మారి వైద్యశాలలలో కావలసినంత వసతి యున్నది. ప్రతి (పట్టణ)శాఖలోను ఒక వైద్యశాల పెట్టుదురని వదంతి వినవచ్చుచున్నది. వీనినన్నిటిని పర్యాలోచించి, సందర్భమునకు ఏది యావశ్యకమో దానిని చేయుము. బాగ్బాజారులో ఎక్కడనో ఎవరో చెప్పినది సర్వజనాభిప్రాయము కాజాలదని జ్ఞప్తి యుంచుకొనుము. అక్కఱసమయములలో మూలధనము చాలక పోకుండునట్లు జాగ్రత్తపడుము. వృథావ్యయము కాకుండ చూచుకొనుము. ప్రకృతమున చక్కగా ఆలోచించి *రఘువీరునిపేర రామ్లాలుకోసము కొంతస్థలము కొనుము. మాతృదేవి 'సెబైతు'గా ఉండును. ఆమెకు తరువాత రామ్లాలు వచ్చును. వారికి వెనుక 'సెబైతు'గా షిబు రాగలడు. అట్లుగాదా, శ్రేష్ఠమని తోచు వేఱు ఏర్పాటు చేయుము. నీకు సరియని తోచిన నీవు ఇపుడే ఆయింటిని కట్ట నారంభింపవచ్చును. ఏలన మొదటి యొకటి రెండునెలలు క్రొత్తయింటనుండుట మంచిది గాదు. ఏలన అక్కడ చాల తడిగా ఉండును. శైథిల్యనిరోధకముగ కట్టుగోడను తర్వాత పూర్తిచేయవచ్చును. పత్రికకై నేను ధనము కూర్ప ప్రయత్నించుచున్నాను. నేను పత్రికకై యిచ్చిన రూ. 1,200 దానికే కేటాయించి పెట్టుము.

---

* కమర్పుకూరులో శ్రీ రామకృష్ణుని యిలువేలుపు.

తక్కినవారందఱు ఇక్కడ క్షేమముగా ఉన్నారు. నిన్న సదానందుని పాదము బెణికినది. తనకు సాయంకాలమునకు నొప్పి పూర్తిగా మానిపోవునని అనుచున్నాడు. ఈసమయమున అల్మోడాలో వాతావరణము దివ్యముగా ఉన్నది. మీదుమిక్కిలి సేవియరు అద్దెకు తీసికొన్న బంగాళా అల్మోడాలో చాల ఉత్కృష్టమైనది. మాకు ఎదుటివైపు ఒక చిన్నబంగళాలో ఆనిబెసెంటు ఉన్నది. ఆమెతో చక్రవర్తియు ఉన్నాడు. చక్రవర్తి ఇపుడు ఘాజిపూరు గగనుకు అల్లుడైనాడు. నేనొకదినము వానిని చూడబోయితిని. ఆనిబెసెంటు నాతో, చాల బతిమాలుకొనువిధముగా, తన సంస్థకును నా సంస్థకును మధ్య ప్రపంచమంతటను స్నేహభావముండవలయును అని ఇంకను ఏమేమో చెప్పినది. ఈదినము బెసెంటు ఇక్కడికి 'టీ'కి వచ్చును. మనస్త్రీలు సమీపమున ఒక చిన్నబంగళాలో ఉన్నారు. వారు చాల సుఖముగా నున్నారు. కుమారి మెక్లియడుమాత్రము ఈదినము ఇంచుక అస్వస్థగా ఉన్నది. హారిసేవియరు దినములు జరుగుకొలది మఱిమఱి సాధువుగా అగుచున్నాడు...సోదరుడు హారి నీకు తన కుశలప్రశ్నల అందించుచున్నాడు. అట్లే సదానందుడు అజయుడు, సురేంద్రుడును వారి సగౌరవ ప్రణామములను అందించుచున్నారు. నా ప్రేమ నీకును, తక్కినయందఱికిని.

ప్రేమయుత భవదీయ,

వివేకానంద.

మఱిమాట :—సుశీలుకు కానాయికి తక్కినవారందఱికి నా ప్రేమ అందింపుము.

వి.

403

(శ్రీ శ్రీ ఖేత్రి మహారాజునకు)

అల్మోడా
జూన్ 9, 1898

ప్రభు మహాశయా,

దేవరకు పూర్తి ఆరోగ్యము లేదని తెలిసి చాల దుఃఖించు చున్నాను. కొన్నాళ్లలో, నిజముగా మీకది చేకూరగలదు.

నేను పై శనివారము కాశ్మీరమునకు బయలుదేఱుచున్నాను. అక్కడి రెసిడెంటుకు తమరిచ్చిన పరిచయలేఖ నాచేత నున్నది. ఆయినను తమరు దయతో ఇట్లు ఫలానాఆయనకు పరిచయలేఖ ఇచ్చియున్నాను అని, రెసిడెంటుకు ఒక మాట వ్రాసిన, అది ఇంకను శ్రేయముగా నుండును.

వ్యాససూత్రములమీది నింబార్క-భాష్యమును, ఇంకను ఇతరభాష్యములను తమ పండితులద్వారా నాకు సరఫరా చేయింతునని కిషన్గడు దివానుగారి వాగ్దానమును ఆయనకు జ్ఞాపకము చేయుచుటకు ఒక జాబును దయచేసి జగ్మోహనును వ్రాయమందురా?

సర్వప్రేమ శుభాశంసలతో,

భవదీయ,
వివేకానంద.

మలిమాట.—పాపము గుడ్వీను చనిపోయినాడు. అతడు జగ్మోహనునికి బాగుగా తెలిసినవాడు. నాకు నేని రెండు పులి తోళ్లు మఠములో ఇరువురు యూరపియను మిత్రులకు బహుమానముగా ఇచ్చుటకు నాకు కావలయును. ఇవి పాశ్చాత్యులకు చాల సంతోషకరమగు బహుమానములుగా అగపడుచున్నవి.

వి.

## 404

(నైనిటాలువాసి మహమ్మద్ సర్ఫరాజ్ హుసేన్‌కు)

అల్మోడా,
జూన్ 10, 1898

నా ప్రియమిత్రమా,

నీజాబు నాకు చాల నచ్చినది. ప్రభువు నిశ్శబ్దముగానే మన మాతృభూమికి ఆశ్చర్యకరవిషయములు సమకూర్చుచున్నందుకు మిక్కిలి సంతోషముగా ఉన్నది.

మనము దానికి వేదాంతమతమని గాని మరేమతమని గాని ఏపేరు పెట్టినను, మతవిషయమున సర్వసమాకలన పూర్వముగా చెప్పిన కడపటిమాటయు తలంపును అద్వైతసిద్ధాంతమనుట సత్యము. అన్నిమతములయెడను కక్షులయెడను ప్రేమతో నుండవలయునేని అందు కద్వైతమొక్కటే మెట్టు. భవిష్యత్తున ప్రబుద్ధమానవకోటికి మతముగా నుండగలది అదే అని నా నమ్మకము. హిబ్రూలకన్నను అరబ్బులకన్నను ప్రాచీను లగుటచే, హిందువులు తక్కినవారికంటెను, తాము దానిని ముందు అందుకొన్నాము అను కీర్తి పొందగలరు. అయినను సకలమానవకోటియు తన సొంతయాత్మ యను భావమును నడువడియు గల అనుష్ఠానరూపమగు అద్వైతము ఎప్పుడును హిందువులలో పెంపొంద లేదు.

ఇంకను ఏతద్ విపరీతముగా, ఎప్పుడైనను ఏమతమైనను ఈ సమతను గణనీయమగు నంతగా చేరవచ్చెనని చెప్పదగునేని ఆమతము ఇస్లాము, ఇస్లామువ్మాత్రమే అని నాయనుభవము.

అనుష్ఠాన ప్రధానమయిన యిస్లాము సాయములేనిదే, వేదాంతసిద్ధాంతము లెంత నాణెముగాను ఆశ్చర్యకరముగాను ఉన్నను, విశాల మానవతతికి విలువ బొత్తిగాలేనివే. వేదములు గాని, బైబిలుగాని, కొరానుగాని లేనిచోటికి దారిచూపి మానవ జాతిని అటకు చేర్చుట మనకోరిక. వేదాలకును బైబిలుకును కొరానుకును అన్యోన్యసామరస్యము కుదిర్చియే దీనిని చేయవలసియున్నది.

మతములెల్ల ఏకత అను ఆ ఒక్క మతమునకు వివిధప్రకటన భంగీ విశేషములే అని మానవకోటికి కఱపవలయును. ఎవనికి ఏమార్గము మిక్కిలి తగియున్న, అతడు దానిని ఎన్నుకొని అవలంబింపదగును.

మన మాతృభూమికి ఈ రెండు గొప్ప పద్ధతుల కూటమి వేదాంతబుద్ధి, ఇస్లాము దేహము అయియుండ ఆ బుద్ధి శరీరయోగ మొక్కటే ప్రత్యాశాస్పదము.

ఈ జగడాలగందరగోళమునుండి పళపళని కాంతితో అజయ్యాదీమసముతో వేదాంతబుద్ధితోను ఇస్లాము దేహముతోను లేచుచు భవిష్యత్ పరిపూర్ణ-భారతదేశము నా మనోదృష్టికి అగపడుచున్నది.

మానవకోటికి, విశేషముగా మన నిఱుపేద మాతృభూమికి సాయపడు గొప్ప సాధనముగా ప్రభువు నిన్ను చేయును గాక యని నిరంతరము ప్రార్థించు,

సదా భవదీయ ప్రేమయుత,
వివేకానంద.

## 405

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

కాశ్మీరము,
జూలై 3, 1898

ప్రియ స్టర్డీ,

ముద్రితప్రచురణములు రెండును నా యంగీకారము గలవే. నా గ్రంథములను ఎవరు ప్రకటించినను మనము ఆక్షేపింపకుండదము అనిగదా మనమధ్య ఏర్పాటు. ఆ విషయమునుగూర్చి సర్వమును శ్రీమతి బుల్సతి ఎఱుగును. ఆమె నీకు వ్రాయుచున్నది.

మొన్నటిదినము కుమారి సౌటరువద్దనుండి నాకు చాల చక్కని జాబు వచ్చినది. ఆమె యెప్పటియట్లే స్నేహముగా నున్నది. శిశువులకును శ్రీమతి స్టర్డికిని నీకును, నా ప్రేమ.

భవదీయ భగవద్గత,
వివేకానంద.

## 406

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

శ్రీనగరము.
జూలై 17, 1898.

నా ప్రియ రాఖాల్,

నీ జాబువలన నాకు అన్నిసమాచారములు తెలిసినవి...... శారదునిగూర్చి నీవు వ్రాసినవిషయమున నా యభిప్రాయ మిది:— బెంగాలీలో పత్రికను లాభకరముచేయుట కష్టము. అంతయే. అయినను మీరందఱు కూడి, ప్రతియింటి గడపయెక్కి చందాదారులను చేర్చినచో, అది సాధ్యము కావచ్చును. ఈవిషయమున మీరందఱు ఎట్లు తీర్మానింతురో అట్లు చేయుము. పాపము, శారదుడు ఇప్పటికే ఒకసారి భగ్నాశు డైనాడు. అట్టి నిఃస్వార్థపరుడును, అంతకష్టపడి పనిచేయువాడు నగువానికి సాయముచేయుటచే ఒకవేళ ఒక వేయిరూపాయలు నష్టము వచ్చిన దానివలన ఏమంత హాని? రాజయోగమును అచ్చువేయించుటనుగూర్చి యేమి? కడపటి యుపాయముగా అమ్మకపులాభమును పంచుకొను కొన్ని యేర్పాట్లతో దానిని ఉపేనుకు ఇయ్యవచ్చును......డబ్బువిషయములలో పూర్వము చెప్పిన సలహాకు పైన మఱుమాట లేదు. ఇకమీద వ్యయమునుగూర్చియు ఇతరవిషయములనుగూర్చియు నీకు శ్రేష్ఠమని తోచినట్లు చేయుము. ఇతరులకు సాయముచేయువిషయమున నీమార్గము సరియనియు నాది తప్పు అనియు నేను చక్కగా కనిపట్టితిని. ఏకకాలమున ధనముతో అతిమాత్రముగా సాయము చేసినచో, జనము కృతజ్ఞతాబద్ధమగుటకు మాఱు తమకు డబ్బిచ్చి ఆదుకొను దద్దన్న ఒకడు దొరకినాడుకదా అని యనుకొనును. ఔదార్యము ప్రతిగ్రహీతను. నీతి చెడగొట్టి, చెఱుచును. అది నేను ఒకప్పుడును పరికింపనైతిని.

రెండవవిషయ మేమనగా, ధర్మార్థముగా వసూలుచేసిన విరాళములో దాని యుద్దేశమునుండి తప్పించి ఇతరకార్యములకు వినియోగించుటకు మనకు హక్కు లేదు. శ్రీమతి బుల్ గారికి ఆమె

జపమాల ప్రధాన న్యాయమూర్తియగు ఋషివర ముఖోపాధ్యాయుల యింటికి చేరునట్లు పంపినచో, తప్పక చేరును. శ్రీ మిత్రయు ప్రధాన న్యాయమూర్తియు వారిని అన్నివిధాల విచారించుకొను చున్నారు. మనకు కాశ్మీరమున ఇప్పటికింకను ఒకచోటు దొరక లేదు. ఐనను త్వరలో దొరకదగు నొక అవకాశము కలిగి యున్నది. ఒక శిశిరఋతువును నీవు ఇక్కడ గడపినచో, తప్పక పూర్ణారోగ్యము పొందగలవు. మంచి యిల్లు ఉండి, సమృద్ధిగా కట్టెలు ఉండి, వెచ్చని యుడుపులును ఉన్నచో, మంచుదేశమున జీవితము భోగానుభవము తప్ప ఇతరము గాదు. మఱియు కడుపు లోని అన్నాశయరోగములను తప్పక మాన్పు ఔషధము చల్లని వాతావరణము. నీతో యోగినును పిలుచుకొని రమ్ము. ఏలన ఇక్కడి నేల తాతినేల కాదు. బెంగాలులోవలె బంకమట్టినేల.

పత్రిక అల్మోడాలో ప్రకటితమైన ఆపని విశేషముగా వృద్ధి గాంచును. ఏలన, పాపము, సేవియరుకుకూడ కొంచెము పని కలుగును. తత్స్థానపు జనులకుకూడ కొంతపని దొరకును. ప్రతి వానికిని అతనికి ఇష్టమగుపనిని పెట్టుటే నిర్వాహకుని నైపుణి. మన శక్తిలోగల సర్వోపాయములచేతను సకల ధనములోను కలకత్తా లోని నివేదితా బాలికాపాఠశాలను దృఢాధారమున నెలకొల్ప వలయును. మాస్టరు మహాశయుని కాశ్మీరమునకు తెచ్చుమాట ఇంకను అస్పష్టముగ వినబడుచున్నది; ఏలన ఇక్కడ విశ్వ విద్యాలయమును ప్రతిష్ఠించుటకు ఇంకను చాలకాలము పట్టును. అయినను కలకత్తాలో వేయిరూపాయల ఆరంభవ్యయముతో తాను ప్రధానాచార్యుడుగా ఒక విశ్వవిద్యాలయము నారంభిం చుట సాధ్యమని ఆయన వ్రాసినాడు. మీరందఱునుకూడ ఆయభి ప్రాయమునకు అనుకూలురుగా నున్నారని నా చెవికి వచ్చుచున్నది. ఈవిషయమున మీరందఱును ఏది శ్రేష్ఠమని తలంతురో దానిని చేయుడు. నా యారోగ్యము బాగుగా నున్నది. దినమునకు రెండు సార్లు వరియన్నము, ఉర్లగడ్డలు, చక్కెర లేక నాకేది దొరకిన

అది తినుచున్నను, నేను రాత్రులలో లేవవలసివచ్చుట చాల అరుదు. ఔషధము ప్రయోజనము లేదు. బ్రహ్మజ్ఞాని దేహము మీద మందు పనిచేయదు. ప్రతిదియు జీర్ణమై పోవును. భయ పడకుము.

స్త్రీలు క్షేమముగా నున్నారు. వారు నిన్ను కుశలప్రశ్న చేయుచున్నారు. శివానందునియొద్దనుండి రెండుజాబులు వచ్చినవి. ఆతని ఆస్ట్రేలియా శిష్యునియొద్దనుండియు నాకు ఒకజాబు వచ్చినది. కలకత్తాలో మహామారి (ప్లేగు) ఆవిర్భావము పూర్తిగా అణగి పోయినదని వినుచున్నాను.

ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 407

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

శ్రీ నగరు,
ఆగస్టు 1, 1898

నా ప్రియరాఖాల్,

నీవు ఎప్పుడును ఒకభ్రాంతిలో పడియున్నావు. అది నిన్ను విడిచిపోవుట లేదు. ఏలన, మంచికికాని చెడ్డదికాని, ఇతరుల బుద్ధికి నీమీద మహిమ ఎక్కువ. అనగా నేను చెప్పునది ఇది— నేను లెక్కలనుగూర్చి నీకు ఎప్పుడు వ్రాసినను, నాకు నీమీద నమ్మకములేదని నీవు తలంతువు... పనియేమో ఎట్లో ప్రారంభింపబడినది. మఱి అది ఇక మనము ఇక్కడలేకపోయినను అభివృద్ధి గాంచవలయును అనుటే నా వ్యాకులత. అట్టి యాలోచనలు నన్ను అహోరాత్రము వేధించుచుండును. ఒకనికి శాస్త్రజ్ఞానము ఎంతేని యుండవచ్చును; అయినను అతడు దానిని ప్రయోగించిచూడకున్న అతనికి ఏమియు తెలియనట్లే. నేను మాటిమాటికి ఎన్నిక (ఎలక్షను) అని, లెక్కలు అని, చర్చలుఅని అనుచుందును. ఏలన ప్రతివాడును పనినిపూనుకొన సిద్ధముగా నుండగలుగుటకు. ఒకడు చనిపోవు

నేని, మఱియొకడు—ఒకడే ఏల, కావలసియున్న మఱి పదిమంది, దానిని చేతగొన సిద్ధముగా నుండవలయును. రెండవ విషయ మే మనగా, ఒకనికి ఒకదానియందు అక్కఱను పుట్టింపకున్న అతడు తన మనస్సు అంతయు అందుఉంచి పనిచేయడు. ప్రతివానికిని పనిలో ఒకభాగము ఉన్నదనియు, ఆస్తిలోను అట్లే ఉన్నదనియు, నిర్వాహమున కావలసిన మాట చెప్పు అధికారము ఉన్నదనియు లెస్సగా బోధింపవలయును. ఇది ముందుగానే కాల ముండగానే చేయవలయును. బాధ్యతాయుతమైన పదవిని ఒకనికి మార్చి ఒక్కనికిగా, ప్రతివానికిని ఒసంగి, ఆవశ్యకమైనపుడు నీవశమునకు తెచ్చుకొని చక్కదిద్దగలయట్లు కనుపెట్టుకొని యుండవలయును. పనికి మనుష్యులను తర్బీదుచేయుటకు దారి, అదే. ఎవరి చావు బ్రదుకులతోను సంబంధము లేకుండ కార్యయంత్రము తనంతట సాగిపోవునట్లు ప్రతిష్ఠింపవలయును. మనకు ఇండియాదేశమువారికి—ఒక. పెద్ద లోపము ఉన్నది. మనము ఒక శాశ్వతసంస్థను ఏర్పఱుపజాలము. అందులకు కారణము ఏమనగా మనము మన యధికారమును ఇతరులతో పంచుకొనుటకు ఎన్నడును సమ్మతింపము. 'మనము పోయినతర్వాత ఏమివచ్చును' అని భవిష్యత్తును తలంపము.

మహామారిని (ప్లేగును) గూర్చి ప్రతిసంగతియు నేను ముందే వ్రాసియున్నాను. ప్రతి నగరశాఖలోను వైద్యశాలలు ఏర్పాటు చేయబడియుండగా, మనము వృథాగా ధనవ్యయము చేయుట అనావశ్యకమని శ్రీమతి బుల్సలియు కుమారి ముల్లరును ఇంకను ఇతరులును, అభిప్రాయపడుచున్నారు. పరచారికసేవలు, ఇంకను వానిని బోలినవి చేసి మనము రోగులకు సాయపడుదము. సన్నాయిగాని పాట అతనికి ధనమిచ్చువారి అధీనము.

కాశ్మీరమహారాజు మనకు కొంత స్థలము నిచ్చుట కంగీకరించినాడు. నేనుకూడ పోయి దానిని చూచివచ్చితిని. ఇకను ప్రభువు

సంకల్పించుచున్నాను. కొన్ని దినాలలో ఆ బేరము పూర్తియగును. ఇక్కడి నుండి బయలు దేఱకమునుపే, ఇప్పుడే ఇక్కడ ఒక చిన్న యిల్లు కట్టవలయునని కోరుచున్నాను. నేను ఇందుండి బయలు దేఱునపుడు దానిని ధర్మాధికారి ముఖర్జీగారి విచారణలో నుంతును. మఱి ఎవరితోనైనను కూడి శిశిరమును గడపుటకు నీ విక్కడికి ఏల రాకూడదు? నీ యారోగ్యము బాగుపడగలదు. ఒక అక్కఱయు తీఱగలదు, అచ్చుయంత్రమునకై నేను వేఱుగా ఉంచిన ధనము అందులకు చాలియుండును. అయినను అంతయు నీవు తీర్మానించినట్లే అగును. ఈసారి తప్పకుండ నేను వాయవ్యరాష్ట్రమునను రాజపుటానాలోను, వేఱుచోటులను, కొంతధనము సంపాదింతును. సరి, ఇమ్మన్నరీతిగా ధనమును కొందఱికి ఇమ్ము. నేను ఈ మొత్తమును మఠమునుండి అప్పుగా తీసికొనుచున్నాను. దానిని వడ్డితో నీకు చెల్లింపగలను.

నా యారోగ్యము ఒకవిధముగా బాగుగానే యున్నది. గృహనిర్మాణకార్యారంభము ఐనది అనుట మంచిసమాచారము. ఎల్లరకు నా ప్రేమ.

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

## 408

(సోదరి నివేదితకు)

కాశ్మీరము,
ఆగస్టు 18, 1898

ప్రియమార్గాట్,

కడచిన రెండునెలలుగా, వట్టి సోమరిజీవితము గడపుచున్నాను. పడవయే నాయిల్లు. అందు విరామవినోదముగా దర్శనీయమగు జీలమునదిలో ఎగువకు దిగువకు, తేలి యాడుచుందును. దేవుని, ఈలోకములో దొరకగల మహోజ్జ్వల దృశ్యమును, ప్రకృతితోటలోనే, చూచుచుందును. ఇక్కడ భూమి గాలి నేల

పచ్చిక - మొక్కలు మ్రాకులు కొండలు మంచులును, మనుష్యుని రూపమును అన్నియు బయటికైనను, ప్రభుని దివ్యసౌందర్యమును కనులపండువుగా, ప్రకటించుచున్నవి. నాయొద్ద ఏ వస్తువును లేదు. తుదకు ఒక పేనాగాని ఒక సిరాబుడ్డిగాని లేవు. అంతయు సరిగా ఆ రిష్వాన్వింకులువలెనే ఎక్కడ ఎప్పుడు ఎట్లు అనుకూలపడిన అక్కడ అప్పుడు అట్లు భోజనమును తటాలున ముగించుకొందును.

నీవు అలసిపోవునట్లుగా పనిచేయకుము. దానివలన ఏమియు ప్రయోజనము లేదు. విధినిర్వాహణము తీక్ష్ణకిరణములతో మానవుల ఆయువుపట్లను కాల్చివేయుచున్న మధ్యాహ్న సూర్యునివంటిది. అది కొంతకాలము వినయము కూర్చుటకై ఆవశ్యకమే. దానికి పైన అది తెవులు తెచ్చువట్టికలయే. అన్నివిషయములును, మనము సాయముచేసినను చేయకున్నను, బాగుగానే జరిగిపోవును. వట్టి భ్రాంతిచేత మనము మన ఆరోగ్యమునే చెఱుపుకొందుము. నిస్స్వార్థతను పరమావధిని పొందించు ఒకమిథ్యాభావము కలదు. అది అన్ని చెఱుపులకును లొంగిపోయి ఇతరులకు హానికరమగును. మన నిఃస్వార్థతచే ఇతరులను స్వార్థపరులుగ చేయుటకు మనకు హక్కులేదు. కలదా?...

భవదీయేత్యాది,
వివేకానంద.

## 409

(కుమారి మేరీ హేలునకు)

శ్రీనగరు, కాశ్మీరము.
ఆగష్టు 28, 1898.

నాప్రియమేరీ,

నేను నీకు ఇంతకన్నను ముందుగా జాబువ్రాయు అవకాశము పొందజాలనైతిని. నీవు నా జాబుకోసము ఏమియు తొందరపడలేదని నేనెఱుగుదును. కావున క్షమాపణ లేమియు వ్రాయను. కుమారి మెక్లియడు శ్రీమతి లెగ్గెట్టుకు వ్రాసిన జాబువలన కాశ్మీరము

గూర్చియు మమ్ముగూర్చియు సమస్తమును నీవు తెలిసికొనుచున్నా వట. అట్లు నేను విన్నాను. కావున దానినిగూర్చి దీర్ఘముగా నిరర్థకములగు మాటలు వ్రాయబూనుట అనావశ్యకము.

హెయిన్ హోల్ట్ వ్రాసిన 'మహాత్మ్మ'లను గ్రంథమును కాశ్మీరమున వెదకుట. ఇంచుకయు ఫలప్రదము గాదు. దాని కంతటికి విశ్వాసనీయమగు మూలముగలదని తొలుత ప్రతిష్ఠితమగు వఱకు ఆ ప్రయత్నమునకు ఇంకను కాలము ఆసన్నముగానట్లే. అమ్మ చర్చియు నాయనపోఘును ఎట్లున్నారు, ఎక్కడనున్నారు? మీరు మగువలు, పెద్దవారును పిన్నవారును, ఎట్లున్నారు? మీ జట్టులో ఒక్కరు పడిపోయినందున పలుచబడిన మీరు మీ పాత యాటను మఱెంత అభిరుచితో సాగించుచున్నారా? ఫ్లారెన్సునందలి ఒకానొక శిలాప్రతిమవలె అగపడు ఆమె ఎట్లున్నది? ఆమెపేరు మఱచితిని, ఆపోలిక నా తలంపునకు వచ్చినపుడెల్ల ఆమె చేతులను దీవింతును.

నేను కొన్నాళ్ళు ఇక్కడినుండి అవతలికి పోయియుంటిని. ఇపుడు ఆ మగువలను కలసికొనబోవుచున్నాను. తరువాత మా బృందము, గొణగొణలాడుచు నది ప్రవహించుచున్న అడవిలో ఒక కొండవెనుక అందమైన ప్రశాంతస్థానమును జేరి యచటి దేవదారు వృక్షములక్రింద అల్ల యా బుద్ధునివలె పద్మాసనమున గూరుచుండి దీర్ఘగంభీరధ్యాననిమగ్న లగుదురట.

ఇది యించుమించుగా ఒక నెలకాలము జరుగును. అప్పటికి (సత్కర్మల) పుణ్యముల మహిమ తీఱిపోగలదు; మేము ఆస్వర్గము నుండి మరల భూమిమీదికి పడుదుము. తరువాత కొన్ని నెలలు మా కర్మల సాకల్యముగా నిర్వర్తించి తరువాత దుష్కర్మలకై— పాపములయనుభవమునకై—నరకమునకు, చీనాదేశమునకు, పోవలయును. అక్కడ కాన్టను మున్నగు నగరమునందలి ప్రపంచములో గూడి దుర్భర దుర్గంధములందు మునుగవలయును. అందుండి యాతనల స్థానమునకు, జపానుకును పోవలయునా? తరువాత

మరల స్వర్గమునకు 'అమెరికా యునైటెడ్ స్టేట్సు'కు చేరవలయును. ఇది కూర్మస్వామి తోబుట్టువగు కూష్మాండస్వామి చెప్పెడు జోస్యము. (బెంగాలీలో కూర్మమనగా రసము) అతడు తనచేతులు ఉపయోగించుటలో మంచి తెలివిగలవాడు. నిజముగా తనచేతులను వినియోగించు నేర్పుచేతనే అతడు పలుమాఱు గొప్ప ఆపదలలో ఇఱుకుకొన్నాడు.

నేను నీకు ఎన్నియో మంచి వస్తువులు పంపగోరితిని. కాని అయ్యో, అందులకు కట్టవలసిన పన్ను తలంపునకు రాగానే, కోరిక, స్త్రీల యౌవనమువలెను యాచకుల కలలవలెను, మాయమైపోయినది.

ఇంకొకమాట. నేను దినదినమునకు తెల్లనగుచున్నందుకు, వెంట్రుకలు నరిసిపోవుచున్నందుకు నాకు సంతోషము. నీవు నన్ను మరల చూచునప్పటికి నాతల బాగుగా పూచిన తెల్ల తామర పూవువలె ఉండును.

ఆహా, మేరీ, నీవు కాశ్మీరమును చూడగలుగుదువేని, కాశ్మీరమును మాత్రమే, అక్కడి ఆశ్చర్యకరమగు తామరకొలకులు, అందలి హంసలు-(హంసలు లేవులెమ్ము, బాతులు ఉన్నవి. హంసలు అనుట కవిసమయము), నల్లగండుతుమ్మెద గాలికి కదలాడు తామరపై వ్రాలబోవుట (తామర తన్ను ముద్దుగొననీక ఆతుమ్మెదను తొలగిపొమ్మని తల పంకించుట——ఇదియు కావ్యమే లెమ్ము) ఇదంతయు చూతువేని ప్రాణోత్క్రాంతి సమయమున నీ మనఃసాక్షి నిర్మలముగా నుండును. ఇది భూలోకస్వర్గము. తర్కశాస్త్రము చెప్పునట్లు చేతిలో దొరకియున్న ఒక్కపిట్ట పొదలోనున్న రెంటికంటె మేలు. నేటిపావురము రేపటి నెమలికంటె మేలు. దీనిని ఒక్కసారి చూచుటయు ఎంతయో తెలివిగల పని; అయినను లాభమును ఆలోచించినట్లైన ఆ మఱియొకటియే మేలు. చిక్కులేదు, శ్రమలేదు, ఖర్చులేదు, రవంత పైపై అందముగల్గి క్షణభంగురమగు ఆటబొమ్మ జీవితము! తరువాత, అంతే.

నాజాబు చాల విసుగుకలిగించునది అగుచున్నది. ఇంతట నిలిపెదను. ఇది వట్టి సోమరితనము. ఈరాత్రికి, సెలవు.

సదా భవదీయ భగవద్గత,

వివేకానంద.

నా విలాసము - ఎప్పటికిని—

మఠము, బేలూరు

హౌరాజిల్లా, బెంగాల్ (ఇండియా.)

## 410

(ఖేత్రిమహారాజునకు)

ప్రధాన న్యాయమూర్తి ఋషివర్య

ముఖర్జీ గారి యిల్లు, కాశ్మీరము.

సెప్టెంబరు 17, 1898.

ప్రభుమహాశయా,

నేను ఇక్కడ రెండువారములుగా చాల జబ్బుగా ఉంటిని. ఇపుడు రవంతనయము. నాకు ధనము కావలసియున్నది. అమెరికను మిత్రులు వారిశక్తికొలది నాకు సమస్తసాయముచేయుచున్నను, సర్వకాలము వారినే యాచించుటకు నాకు సిగ్గగుచున్నది. విశేషముగా వ్యాధి ఎప్పటికప్పుడు ధనమును వ్యయింపజేయును. సిగ్గు చెందక యాచించుటకు నాకీలోకమున నున్న దొక్కరే. ఎవరనగా తమరు. తమరు ఇచ్చినను ఈయనన్నను ఒక్కటే నాకు. శక్యమేని దయగలిగి కొంతపైకము పంపుడు. తమరు క్షేమమేగదా? అక్టోబరు మధ్యకాలమునకు, మైదానములకు వచ్చెదను.

కుమారస్సాహెబుకు పూర్తిగా నయమైనదని జగ్మోహనుని వలన తెలిసినది. చాల సంతోషము. నాకన్నియు బాగుగా జరిగి పోవుచున్నవి. తమకును అట్లే యై ఉండునుగాక అని ఆశించుచు,

సదా భవదీయ భగవద్గత,

వివేకానంద.

# 411

(శ్రీ హరిపాదమిత్రకు)

శ్రీనగరు, కాశ్మీరము,
సెప్టెంబరు 17, 1898.

ప్రియ హరిపాదా,

నీజాబువలనను, తంతివలనను అన్ని సమాచారములు తెలిసినవి. నీవు 'సింధి' పరీక్షలో సులువుగా నెగ్గుదువుగాక అని నేను ప్రభువును ప్రార్థించుచున్నాను.

ఇటీవల నాయారోగ్యము చాల చెడియుండినది. అందువలన నాకు ఆలస్యమైనది. లేకున్న ఈవారమున పంజాబునకు తరలవలయునని సంకల్పించియుంటిని. ఇపుడు చాల వేడిగా ఉండునని, నన్ను మైదానములకు పోవలదని వైద్యుడు సలహాచెప్పెను. అక్టోబరు కడపటివారమప్పటికి నేను కరాచి చేరవచ్చును. నా ఆరోగ్యము ఇపుడు కొంచెము బాగున్నది. ఇరువురు అమెరికను మిత్రులు, మహిళలు, తప్ప ఇపుడు నాతో ఎవరును లేరు. బహుశః నేను లాహోరునొద్ద వారిని వీడగలను. వారు నాకోసము కలకత్తాలోగాని రాజపుటానాలోగాని కనుపెట్టుకొనియుందురు. నేను బహుశః కచ్ఛి, భుజ్, జూనాగడ్, భావ్నగర్, లింబ్డి, బరోడాలకు పోయి చూచి తరువాత కలకత్తాకు పోవుదును. నవంబరులోనో డిసెంబరులోనో చీనా జపానులగుండ అమెరికాకు పోవలయును అని నా యిప్పటి పడకము. మఱి అదంతయు ప్రభువు చేతిలో నున్నది. పైన పేర్కొన్న అమెరికను మిత్రులు నా ఖర్చులన్నియు భరించుచున్నారు. నేను వారివద్ద కరాచివఱకు రైలుఛార్జితో కూడ నాకు కాగల వ్యయమునంతయును తీసికొందును. అయినను నీకు వీలైనచో నాకు 50/-రూపాయలు తంతిద్వారా ప్రధాన న్యాయమూర్తి ఋషివర ముఖోపాధ్యాయుల యింటికి, శ్రీనగరు, కాశ్మీరము అను విలాసమునకు పంపుము. నాకు చాల సాయముగా నుండును. ఏలన ఇటీవల జబ్బువలన ధనము విశేషముగ ఖర్చు

ఐనది. ఎప్పుడును నావిదేశభక్తులమీద ఆధారపడవలసి యుండుటకు నాకు రవంత సిగ్గుగుచున్నది. శుభాశంసలతో.

ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 412

(శ్రీహరిపాదమిత్రకు)

లాహోరు,
అక్టోబరు 16, 1898.

ప్రియ హరిపాదా,

కాశ్మీరమున నాయారోగ్యము పూర్తిగా చెడినది. కడచిన తొమ్మిదియేండ్లుగా దుర్గాపూజను సేవింపలేదు. కావున కలకత్తాకు బయలుదేఱుచున్నాను. నేను ప్రకృతము అమరికా ప్రయాణ ప్రణాళికను మానుకొన్నాను. చలికాలమున కరాచికిపోవుటకు నాకు చాలినంతకాలము ఉండునని నా యభిప్రాయము.

నా సోదరశిష్యుడు శారదానందుడు లాహోరునుండి కరాచికి రు. 50/-పంపగలడు. దుఃఖమునకు వశముగాకుము. అంతయు దేవునిచేతిలో ఉన్నది. ఈ సంవత్సరము, మిమ్మందఱిని కలసికొనకుండ నేను ఎక్కడికిని పోను, నిజము. అందఱకు నా దీవెనలు.

ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 413

(ఖేత్రిమహారాజుకు)

లాహోరు.
అక్టోబరు 16, 1898.

ప్రభుమహాశయా,

నా తంతివెంట వ్రాసిన జాబువలన కావలసిన సమాచారము తెలిసినది. కాబట్టి తమ తంతికి జవాబుగా నా యారోగ్యమును గూర్చి బదులు తంతి పంపలేదు.

ఈసంవత్సరము నేను కాశ్మీరమున మిక్కిలి బాధపడితిని. ఇపుడు తేఱుకొని ఈదినము తిన్నగా కలకత్తాకు పోవుచున్నాను. ఈకడచిన పది సంవత్సరములుగా బెంగాలులో శ్రీ దుర్గాపూజను నేను సేవింపలేదు. అది యక్కడ గొప్పవిశేషము. ఈ సంవత్సరమచట్చ అందుకై ఉండమని ఆశపడుచున్నాను.

నా పాశ్చాత్యమిత్రులు ఇక ఒకటి రెండువారాలలో జైపూరు చూడవత్తురు. అక్కడ జగ్మోహను ఉన్నచో వారిని కొంచెము చూచుకొమ్మని, వారికి ఆనగరమును అంతటను, ప్రాత శిల్పములను చూపుమని, నామీదిదయతో వానితో చెప్పుడు.

వారు జైపూరునకు బయలుదేఱకముందే -మునిషికి జాబు వ్రాయుమని నాసోదరుడైన శారదానందునితో చెప్పెదను.

తమ కెట్లున్నది? కుమారసాహెబునకు? ఎప్పుడును మామూలు ప్రకారము తమక్షేమమునకై దేవుని ప్రార్థించు,

భవదీయ ప్రేమయుత,
వివేకానంద.

మఱిమాట :—ఇకమీద నా చిరునామా: మఠము, బేలూరు, హౌరాజిల్లా, బెంగాలు.

## 414

(ఖేత్రిమహారాజుకు)

మఠము, బేలూరు.
హౌరాజిల్లా, బెంగాలు.
అక్టోబరు 26, 1898.

ప్రభుమహాశయా,

తమ యారోగ్యమును గూర్చి నాకు చాల వ్యాకులముగా ఉన్నది. నేను దక్షిణముగవచ్చు దారిలో మిమ్ము దర్శింపవలయునని చాల ఆసపడియుంటిని. కాని యారోగ్యము బొత్తిగా చెడిపోయినందున, నేను మిక్కిలి హుటాహుటిగా రావలసివచ్చినది. నా జబ్బు గుండెకు సంబంధించినది కాబోలు అని నా దిగులు.

అయినప్పటికిని, తమ దేహస్థితినిగూర్చి ఎఱుంగవలయునని నేను చాల పర్యాకులపడుచున్నాను. తమకు ఇష్టమైన, నేను తమ రిని దర్శింప క్షేత్రికి రాగలను. రాత్రింబవళ్లు తమ క్షేమమునకై దేవుని ప్రార్థించుచున్నాను. ఏమేని జరిగిన, ధైర్యము వీడకుడు; 'అమ్మ'యే తమకు రక్షకురాలు. తమరినిగూర్చి సర్వమును నాకు వ్రాయుడు...కుమారాస్వాహేబు ఎట్లున్నాడు?

సర్వప్రేమతో నిత్యదీవనలతో,

సదా భవదీయ భగవద్గత,

వివేకానంద.

## 415

(కుమారి జోసెఫైన్మెక్లీయడుకు)

57. రమాకాంతబోసు వీథి,

కలకత్తా,

నవంబరు 12, 1898.

నాప్రియజో,

రేపు ఆదివారము, కొందఱు మిత్రులను విందుకు ఆహ్వానించియున్నాను...

'టీ'కి నీవుకూడ రావలయును. నీకోసము కాచుకొని యుందుము. అప్పుడు ప్రతిదియు సిద్ధముగా నుండును.

శ్రీ మాతృదేవి ఈయుదయము క్రొత్తమఠమును చూచుటకు పోవుచున్నది. నేనుకూడ అక్కడికి పోవుచున్నాను. ఈదినము సాయంకాలము 6 గంటలకు నివేదిత సభాధ్యక్ష్యము వహింపగలదు. నీకు ఇష్టమున్నచో, శ్రీ బుల్సతియు గట్టిగా కోరునేని, తప్పక రండు.

సదా భవదీయ భగవద్గత,

వివేకానంద.

# 416

(ఖేత్రీమహారాజునకు)

మఠము, బేలూరు,
హౌరాజిల్లా,
నవంబరు, 1898.

ప్రభుమహాశయా,

తమరును కుమారులును మంచియారోగ్యము అనుభవించుచున్నారని తెలిసినది. చాల సంతోషము. నామాటకొ, నాగుండె చాల దుర్బలమై పోయినది. చోటుమార్పు నాకేమేని మేలుసేయునని నేను తలంపను. ఏలన కడచిన పదునాలుగుఏండ్లుగా, మూడు నెలలు తెంపులేకుండ, ఒక్కచోట నేను నిలిచియుండినట్లు జ్ఞప్తి లేదు. అట్లుగాకుండ, ఏదేని దైవయోగమున నేను నెలలపర్యంతము ఒక్కచోట నుండగలుగుదునేని, దానివలన నాకు మేలు గలుగునని నా ఆశ. అయినను ఈజీవితమున నాపని ముగిసిపోయినదని మనసుకు తోచుచున్నది. మంచిసెబ్బరలగుండను, సుఖదుఃఖాలగుండను, నాజీవితపుపడవ ఎట్లో లాగివేయబడినది. ఈజీవితమున నాకు నేర్పబడిన ఒక్క గొప్ప నీతి యేమనగా, జీవితము దుఃఖము, దుఃఖము తప్ప మరేమియు లేదు. ఏది శ్రేష్ఠమో అమ్మ యెఱుగును. మనలో ప్రతివాడును కర్మవశ్యుడు. అది పూర్తిగా అనుభవింపబడవలయును, లేదు కాదు అనుటకు వీలుపడదు. ఈజీవితమున ఎట్లైనను, ఎంత కష్టనష్టములు పడియైనను, పొందవలసినది, దక్కించుకొనవలసినది అన్నిటికిని మూలమైనది—ఒక్కటే, ఏదనగా ప్రేమ. మిక్కిలియైన ప్రేమ, కడలేని ప్రేమ, ఆకాశమువలె విశాలమైన ప్రేమ, సముద్రమువలె అగాధమైన ప్రేమ. ఇది యొక్కటే, జీవితమున గొప్పలాభము. దీనిని పొందిన వాడు ధన్యుడు.

సదా భవదీయ భగవద్గత,

వివేకానంద.

## 417

మఠము, బేలూరు.
డిసెంబరు 15, 1898.

ప్రియ—,

...శ్రీ మాతృదేవి మనకు మార్గదర్శకురాలు. ఏమి సంభవించినను, సంభవింపబోవుచున్నను, అదెల్ల ఆమె నియమనము.

భవదీయేత్యాది,
వివేకానంద.

## 418

(ఖేత్రిమహారాజుకు)

మఠము, బేలూరు.
డిసెంబరు 15, 1898.

ప్రభుమహాశయా,

తమరు దయతో వ్రాసిన జాబును దానితో శ్రీ దులిచందు పేరటికి పంపిన 500ల బరాతము(చెక్కు)ను అందినవి. నాకు రవంత నయముగానున్నది. ఈ నయమిట్లే నిలుచునో నిలువదో ఎఱుంగజాలను.

నాకు ఇపుడు తెలియవచ్చినట్లు తమరు ఈసారి శిశిరమున కలకత్తాలో ఉండవలయునా? క్రొత్త వైస్రాయికి పలువురు మహారాజులు తమ గౌరవము తెలుపుకొనుటకు వచ్చుచున్నారు. సికారు మహారాజు ఇక్కడికి వచ్చియున్నాడు. అది నేను ముందే పత్రికల వలన ఎఱింగితిని.

తమకోసమును తమవారికోసమును నిరంతరము ప్రార్థన చేయుచుందు,

భవదీయ భగవద్గత,
వివేకానంద.

# 419

(శ్రీమతి ఓల్బుల్సతికి)

వైద్యనాథము, దేవగడము.
డిసెంబరు 29, 1898.

నా ప్రియ ధీరా మాతా,

నీవెంట రాలేని నాయశక్తిని నీవు ముందే ఎఱుగుదువు. దానికి తగినంత బలమును నేను సేకరించుకొనజాలకయున్నాను. నా యూపిరితిత్తులలోని శైత్యము అట్లే నిలిచియున్నది. అదే నన్ను ఎక్కడికిని ప్రయాణముసేయుటకు అనర్హుని చేయుచున్నది. మొత్తమునకు నా ఆరోగ్య మిచ్చట మేలొందునని నాఆశ.

నామేనబంధువు ఒకామె ఇప్పటికి చాల ఏండ్లుగా ఒక సంకల్పముతో తన మనస్సును అభ్యాసముచేయుచు సంస్కరించుకొనుచు ఉన్నది. నే నెఱుగుదును. బెంగాలీ గ్రంథరాశి ఆమెకు ఏమియొసంగగలదో, అంతయు ఆమె గ్రహించియున్నది. అదేమి, కొంచెమా, కాదు, ఎక్కువయే. అందును ఆధ్యాత్మికశాస్త్రమున. ఆమె అప్పుడే ఇంగ్లీషులోను రోమను అక్షరాలలోను సంతకముచేయ నేర్చుకొనియున్నది. ఇపుడు ఆమెకు నేర్పుట గొప్ప మేధాకార్యము. కావుననే నేను వెనుదీసితిని. నేను నా కాలమును నిర్వ్యాపారముగా గడప ప్రయత్నించుచు, బలవంతముగా విశ్రాంతి పొంద చూచుచున్నాను.

ఇంతకుముందు నాకు నీయెడ ప్రేమమాత్రము ఉండినది. నాజీవితమును కాచియుండ అమ్మచే నీవు నియమింపబడితి వని ఇటీవలి పరిణామము స్పష్టముగా తెలుపుచున్నది. కాబట్టి ఆ ప్రేమతో విశ్వాసమును కూడినది. నన్నును నాపనినిగూర్చియా? ఇకమీద నా యభిప్రాయమిది. నీలో దైవావేశమున్నది. కావున నేను అన్ని బాధ్యతలను నా బుజమునుండి దులుపుకొని, నీగుండ అమ్మ ఏమి యుత్తరువుచేయునో దానికి సంతోషముతో తల యొగ్గుచుందును.

త్వరలోనే నిన్ను యూరపులోనో అమెరికాలోనో కలిసి కొందునని నా ఆశ.

సదా భవదీయతనయుడను ప్రేమయుతుడను,
వివేకానంద.

## 420

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

మఠము, బేలూరు.
హౌరా, బెంగాల్.
ఫిబ్రవరి 2, 1899.

నా ప్రియ జో,

నీవిప్పటికి న్యూయార్కు చేరి, ఈ దీర్ఘప్రవాసము తరువాత కలసికొన్న నీస్వజనము నడుమ నుందువు. ఈప్రయాణమున అదృష్టము నీకు అడుగడుగున అనుకూలించినది. సముద్రము సయితము శాంతముగా సుతరముగా నుండెను. ఓడయు అస్నేహపాత్రుల సావాసములేక చాలమట్టుకు ఖాళీగా ఉండెను. మఱినాకు అది అన్యథాగా ఉన్నది. నీవెంట రాలేకపోయినందుకు నేను ఎంతయు భగ్నాశుడనైతిని. వైద్యనాథమునొద్దకు మార్పు నాకు ఏమియు మేలు చేయలేదు. అక్కడ నాకు చచ్చినంతఐనది! ఎనిమిది పగళ్లు రాత్రులు ఊపిరాడలేదు! నన్ను కలకత్తాకు మరల తెచ్చినపుడు నాలో సజీవలక్షణములకన్నను మృతలక్షణము లెక్కువగా కన బడుచుండినవి. ఇక్కడ మరల ప్రాణము పొందుటకు ఎంతయో శ్రమపడుచున్నాను.

ఇపుడు డాక్టరు సర్కారు నాకు వైద్యము చేయుచున్నాడు. మునుపటంత నిరాశుడనుగా ఇపుడు లేను. దైవము అనుకూలింపతొడంగినది. మాకు ఈసంవత్సరము చాల కష్టమయముగా కననగుచున్నది. మామూలుగా అమ్మయింట ఉండు యోగానందుడు ఇపుడు నెలదినాలుగా బాధపడుచున్నాడు. ప్రతిదినము వాడు ఆసన్నమృత్యువుగా నున్నాడు. అందఱకంటె బాగుగా తెలిసి

నామె అమ్మ. నాలో మరల కార్యోత్సాహము తల యెత్తుచున్నది. నేను సొంతముగా పోకున్నను, బాలురను ఇండియా అంతటను పంపుచున్నాను. వారిచేత మరల నొకసంచలనము కలిగించుచున్నాను. అన్నిటికి పైగా, నీవు ఎఱుగుదువుగదా, ముఖ్యమైన చిక్కు—ఆర్థికము. ఇపుడు నీవు అమెరికాలో ఉన్నావు గాన, జో, ఇక్కడి మా పనికి అక్కడ కొంతధనము ప్రోగుచేసెదవా ?

నేను మార్చి యప్పటికి మరల కూడదీసికొనగలుగుదు నను కొందును. ఏప్రిలప్పటికి యూరోపుకు బయలుదేఱుదును. ఏది మేలో అమ్మ ఎఱుగును.

నా జీవితమంతట మానసికముగాను దైహికముగాను చాల బాధపడితిని. అయినను అమ్మకరుణ పుష్కలముగా నుండినది. నాయర్హతకు కొలతకు మించినంత ఎక్కువ సంతోషమును అనుగ్రహములను పడసితిని. అమ్మ నామీదపెట్టుకొన్న ఆశకు భంగము కలిగింపకుండుటకై శ్రమపడుచున్నాను, నేను ఎప్పుడును పోరుచునే, రణరంగాననే, నా కడపటి శ్వాస విడువనై యుండుట ఆమెకు ప్రత్యక్షమే.

నీకు ఎప్పుడును ఎల్లప్పుడును నాశ్రేష్ఠమైన ప్రేమయు దీవనలును.

పరమార్థమున సదాభవదీయు,

**వివేకానంద.**

## 421

(కుమారి మేరీ హేలుకు)

మఠము, బేలూరు.
హౌరా జిల్లా,
మార్చి 16, 1899.

నాప్రియ మేరీ,

శ్రీమతి ఆడమ్సుకు నా ధన్యవాదములు. ఆమె కొంటెపిల్లలగు మిమ్ము, కడపటికి ఒక జాబువ్రాయునట్లు చేసినది. 'కంటికి

దూరమైనది మనసునకును దూర'మను సామెత ఇండియాలో ఎంతయో అమెరికాలోను అంత తథ్యము. మఱి అట్లు తుట్టున పోవుచు అంతలో తనప్రేమను మానుకొన్న ఆమఱియొక యువ మహిళకు మరల ఒకమునుక కావలయు కాబోలు.

సరి. నేను నాదేహముతో ఒకమాదిరి సంతోషపుషికారు తిరుగుచుంటిని. కొన్ని నెలలుగా తానును ఉన్నాను అని నన్ను నమ్మింప నాదేహము ప్రయత్నించుచున్నట్లున్నది.

అయినను భయములేదు. నాకు మనోరోగములు మాన్పు నలువురు అప్పచెల్లెండ్రున్నారు గదా. క్రుంగుట అనునది నాకు ఇపుడు కలుగదు. మీరందఱు కలసి నన్ను ఒక్కసారి బలముగాను దీర్ఘముగాను లేవనెత్తుడు, లేవనెత్తుదురా? లేవనెత్తినప్పుడే లేచి నిలబడుదును!

నీవు సంవత్సరమునకంతటికి వ్రాయు ఒక్కజాబులో నన్ను గూర్చి అంత ఎక్కువ మాటలెందుకు? చికాగోలో ఒక మూలలో ఉడుకునీటికుండపై మంత్రములు గొణుగుచుండు నలువురు మాంత్రికురాండ్రగూర్చి అంత తక్కువగా మాటాడుటెందుకు?

మాక్సుముల్లరు క్రొత్తగ వ్రాసిన 'రామకృష్ణుడు, ఆయన జీవితము, సూక్తులు' అను పుస్తకమును ఎక్కడనైనను చూచితివా?

చూచియుండవేని, చూడుము. అమ్మను చూడనిమ్ము. అమ్మ ఎట్లున్నది? నరసిపోవుచున్నదా? నాయన పోపు ఎట్లున్నాడు? అమెరికానుండి మాకు వచ్చిన కడపటి అతిథులెవరని నీవు అనుకొందువు? "తమ్ముడు, ప్రేమ ఒకబొమ్మగీయు అట్ట" అనువాడును కుమారి'మీలు'ను. వారు ఆస్ట్రేలియాలోను ఇంకను ఇతరస్థలముల యందును దివ్యమైన పని చేయుచున్నారు. పాతచక్రపు టంచులే, మార్పులేదు. ఇండియాను చూడవచ్చు వీలు నీకొకనాటికి కలుగవలయునని నాకోరిక. అది యెప్పుడో భవిష్యత్తున ఒకదినము సంభవింపనోపును. సరే, ఇదియుండనీ, మేరీ, నేను కొన్ని నెలల క్రిందట నీవలన జాబురాలేదే అని వ్యథపడుచుండగా, నీవు ఎవనినో

విల్లిని నీవలలోవేసికొన ప్రయత్నించుచుంటివి అనియు, నీ నాట్యగాండ్రతోను విందులతోను తీఱిక లేకయుంటివి అనియు వింటిని. నీవు వ్రాయలేమికి అది సమాధానమైనది సరే. అయినను విల్లిదొరకనీ దొరకకపోనీ, నాకు నా డబ్బుతప్పకుండ కావలయును, మఱవకు. హారిమెట్టు తనకు అబ్బాయి కలిగినప్పటినుండి చాల తెలివిగా నోరు మూసికొని మాటాడకున్నది. మఱి నా పైకమేది? దయచేసి చెప్పు. ఆమెకును ఆమె భర్తకును దానిమాట జ్ఞప్తిసేయుము. ఆమె వ్రాల్లీ (=గోమిణి)యైన నేను, ఇక్కడ ఇంగ్లీషువారు పేరుపెట్టినట్లు, జిడ్డు బెంగాలీవాడను. ప్రభూ, నా పైకమేది?

అమెరికను మిత్రులయు ఇంగ్లీషు మిత్రులయు సాయమున తుదకు నాకిపుడు గంగ ఒడ్డున ఒక మఠము ఉన్నది. అమ్మను త్వరపడుమనుము. నేను మీయాంకిదేశమును విగ్రహారాధక మత బోధకులతో ముంచివేయబోవుచున్నాను.

చెల్లెలిని తీసికొన్నాడుగాని తాను ఇంకను అన్నకు పైకము చెల్లింపలేదే అని శ్రీవ్రాల్లితో అనుము. అదియునుగాక, వింతగా కట్టుకొని తొడుగుకొని చుట్ట త్రాగుచున్న చావడిలో నిలబడిన ఆ బలిసిననల్లని దయ్యము ఎన్నియో ప్రలోభములను బెదరగొట్టి తఱిమివేసినది. అదే హారిమెట్టును శ్రీవ్రాల్లికి కూర్చిన కారణములలో ఒకటి. కాబట్టి నాకు ఆపనిలో గల గొప్పభాగము మొదలైనదానికి ధనము చెల్లింపవలయును. నీవు ఇందులకై గట్టిగా వాదింపుము. వాదింతువా?

నేను 'జో'తోకూడ ఈ యెండకాలమునకు అమెరికాకు రాగల్గియుండవలయునని ఎంతగనో కోరుచున్నాను. అయినను మనుష్యుడు ఉపపాదించుమాత్రకే. తీర్మానించుట ఎవరు! తీర్మానించువాడు. నిజముగా ఎల్లప్పుడును దేవుడే కాదు. సరే, విషయములు తమ యిచ్ఛమెయి జరిగిపోనీ. అభయానందుడు ఇక్కడ ఉన్నాడు. మేరీ లూయీని ఎఱుగుదువుగదా, ఆమెకు స్వాగతోపచారము

బొంబాయిలోను మదరాసులోను చాల బాగుగా జరిగినది. ఆమె రేపు కలకత్తాకు వచ్చును. మేమును, ఆమెకు మంచి అతిథిసపర్య కావింపబోవుచున్నాము.

కుమారి హేలకును, శ్రీమతి ఆడమ్సుకును అమ్మ చర్చికిని నాయనహేపుకును ఇంకను తక్కిన నామిత్రులకును ఈ సప్తసముద్రములమీదుగా నాప్రేమను అందింపుము. సముద్రములు ఏడు అని మా నమ్మకము. ఒకటి పాలది, ఒకటి తేనెది, పెరుగుది యొకటి, సారాయిది ఒకటి, చెఱకురసముది యొకటి, ఉప్పునీటిది యొకటి, మఱియొకటి ఏదో నేను మఱచిపోయితిని. మీ నలువురు అక్కచెల్లెండ్రకును తేనె సముద్రముమీదుగా నాప్రేమను మెల్లమెల్లగా ప్రవహింపజేయుదును.

సదా శ్రద్ధాయుత భవదీయ సోదర,

**వివేకానంద.**

మఱిమాట .— నాట్యాల నడుమ సందుదొరకినపుడు జాబు వ్రాయుము.

వి.

## 422

మఠము,
ఏప్రిల్ 11, 1899.

ప్రియ,

రెండేండ్ల వ్యాధి నావయస్సులో ఇరువదియేండ్లను హరించినది. సరి, అయినను ఆత్మ మాఱదు. మాఱునా? అది అక్కడనే యున్నది. ఎప్పటి పిచ్చికుళ్ళాయి ఆత్మ. ఒక్కభావముమీదనే ఏకాగ్రమును తీవ్రమును ఐన పిచ్చిగలది.

భవదీయేత్యాది,

**వివేకానంద.**

## 423

(శ్రీమతి సరళాఘోశాల్, బి. ఏ. కు)

బేలూరు మఠము,
ఏప్రిలు 16, 1899.

ప్రియ జననీ,

దయతో నీవు వ్రాసిన చిన్నజాబు అందినది. చాల సంతోషము. నేనో నాతోడిశిష్యులో మాకు మిక్కిలియు ప్రియమగు ఒక వస్తువును త్యాగము చేయుటచేత పరిశుద్ధ సత్య దేశభక్తి పూరితాత్ములు పలువురు మాపనికి సాయముచేయ వత్తురేని, ఆ త్యాగము సేయుటకు ఇంచుకైనను మేము కొంకము, ఒకబొట్టు కన్నీరైనను రాల్పము, గట్టిగా నమ్ముము. అనుష్ఠానమున ఇది రుజువగుటను నీవే చూతువు. అయినను ఇప్పటివఱకు ఈవిధముగా సాయము చేయుటకు ముందడుగుపెట్టినవాని నొక్కనినైనను నేను చూడలేదు. కొందఱు మా అభిరుచిస్థానమున తమ యభిరుచిని ఉంచుకొనగోరినారు. అంతే. దేశమునకు గాని మానవకోటికిగాని నిజముగా ఉపకారకమగునేని, గురుపూజను మానుకొనుటను చెప్ప నక్కఱ లేదుగదా, ఇంకను ఎంతదుష్కృత్యమునైనను చేసి, క్రైస్తవులు చెప్పునట్టి ఆశాశ్వతనరకమునైనను అనుభవింప మేము సిద్ధముగా ఉన్నాము. అయినను నేను మానవుని పరిశీలింప నారంభించినప్పటి నుండి నాకు వెంట్రుకలు నరిసినవి. ఈలోకము మిక్కిలియు శ్రమ పెట్టెడుచోటు. నేను ఆగ్రీషియను తత్త్వజ్ఞాని లాంతరును (=దీపమును) చేతిగొని ప్రారంభమింప జొచ్చి చాలకాలమైనది. మాగురువు పలుమారు పాడు జనప్రియమగు నొకపాట నామనసుకు వచ్చుచున్నది!

తనదు డెందంబు చూపిన దారివట్టు
వాని నాతనిచూపులే పట్టియిచ్చు,
అట్టివాఁడు లోకంబున నరుడు సుమ్ము,
పరులకెల్ల విరుద్ధంపు దారివట్టు
వాఁడె పో రసికుఁ డనంగ వాసికెక్కు.

నావంకకు ఈపాటి. ఇందొక మాటయు అతిశయోక్తి గాదని దయచేసి గుర్తింపుము. దీనినిజ మనుష్ఠానమున నీకే కననగును.

అయినను, మేము మాగురుపూజను మానుకొన్న యనంతరమే మాతో కలియగల ఆ దేశభక్తాత్ములను గూర్చి నాకు కొన్ని సంశయములున్నవి. సరి, వారు నటించురీతిగా, తమదేహము సయితము విలయమగునంతగా దేశసేవచేయుటకై తాము ఉక్కిరి బిక్కిరి యగుచుందురేని, గురుపూజ యను ఒక్క (యాకస్మిక) సంగతి ఆ సర్వమును ఆప ఎట్లు సమర్థ మగును?

ఉప్పొంగు అలలతో గుట్టలను పర్వతములనే కొట్టుకొనిపోవు ఆవేగవతి నది, గురుభక్తి లేశము తగిలినమాత్రకే ఆగి, హిమాలయములవంకకు వెనుమరలునా? నిన్నే అడిగెదను, అట్టి దేశభక్తి వలన ఏమైనను గొప్ప లాభ ముండు నని తలంతువా! ఏదైనను నిజముగ గట్టిమేలు అట్టిసాయమువలన కలుగునని తలంతువా? నీవే దానిని చెప్పవలయును. అందు నాకేమియు బోధపడలేదు. దప్పిగొన్నవాడు నీటిగుణములను అంతగా పరిశీలించుటను, ఆకలితో చావబోవువాడు అంతగా ఆలోచించుకొని, పెట్టిన యన్నమునకు పెడమొగమిడుటను బోలినది! సరిసరి. జనులు వింతవింతమార్గాల ఆలోచింతురు. వారొక అద్దపుపెట్టెలో నున్న మేలనియు, అట్టివారు పనికి ఎంత తొలగియున్న అంత శ్రేయమనియు నామట్టుకు నాయభిప్రాయము.

"ప్రేమ ఆగదు జాత్యాదివివర మెన్న<br>
అన్నరుచి నెన్న నాగఁ డాకొన్నవాఁడు"

ఇది నేను ఎఱిగినవిషయము. అయినను నాది యంతయు పొరపాటే కావచ్చును. సరి, ఈ యల్పవిషయమగు గురుపూజ ఎవనినేని ఊపిరాడనీక చంపు బండ యగునేని, వానికి అట్టిగతి రానీక తప్పింతములే.

ఐనను ఈవిషయములను గూర్చి వివరముగా నీతో మాటలాడవలయునని చాలకోరిక ఉన్నది.

ఈ విషయములను గూర్చి మాటలాడుటకు రోగము బాధ చూపును ఇప్పటివఱకు నాకు సెలవు ఒసంగియున్నవి. సెలవు నవి ఇంకను ఇచ్చుచుండు నని నానమ్మిక.

నీకోరికలన్నియు ఈ క్రొత్తసంవత్సరమున తీరును గాక.

నిండుమనసుతో నీవాడమ,

వివేకానంద.

## 424

(ఖేత్రిమహారాజుకు) మఠము,

ఆలంబజారు, (?)

జూను 14, 1899.

ప్రియ మిత్రమహాశయా,

నేను ఇక్కడ ఎట్లుఉన్నానో, తమరు కూడ అట్లుండ వలయునని నాకోరిక. తమకు స్నేహమును ప్రేమయు ఇపుడు మిక్కిలి కావలసియున్నవి.

కొన్నివారములక్రిందట నేను తమకు ఒకజాబు వ్రాసితిని, కాని తమరినిగూర్చి ఏ సమాచారమును ఎఱుంగజాలనైతిని. ఇపుడు తమకు ఆరోగ్యము దివ్యముగా ఉన్నది అని యనుకొందును. నేను ఈనెల తే 20 ది మరల ఇంగ్లండునకు బయలు దేఱుచున్నాను.

ఈ సముద్రప్రయాణమువలన కూడ నాకు కొంత మేలు కలుగునని నా ఆశ.

తమరు సకలాపదలవలన రక్షితు లగుదురుగాక. తమకు అన్నిదీవెనలు ఫలించునుగాక.

భవదీయ భగవద్గత,

వివేకానంద.

మలిమాట :—జగన్మోహనునికి నాప్రేమ, నా వీడ్కోలు.

## 425

(శ్రీ ఇ. టి. స్టర్డికి) పోర్టు సేడ్,
జూలై 14, 1899.

నా ప్రియస్టర్డీ,

నీజాబు నాకు ఇప్పుడే భద్రముగా అందినది. పారిసుననుండు ఎమ్. నోబెలువద్దనుండియు ఒకటి వచ్చినది. కుమారి నోబులుకు అమెరికానుండి పెక్కు జాబులు వచ్చినవి.

తాను చాలకాలము పారిసునుండి చాలదూరమున నుండ వలయును కాబట్టి లండనునుండి తన్నుజూడ పారిసుకు వచ్చు నా ప్రయాణమును కొంత కాలాంతరమునకు వాయిదా వేసి కొమ్మని ఎమ్. నోబెలు నాకు జాబువ్రాయుచున్నాడు. నీవు నిజ ముగా ఎఱింగినట్లు ఇపుడు నాకు పెక్కురు మిత్రులు లండనులో ఇండ్లలో ఉండబోరు. మఱి కుమారి మెక్లియడు నేను రావలయు నని ఎంతో ఆశపడుచున్నది. ఈ సందర్భములలో ఇంగ్లండులో కొన్నాళ్ళుండుట అంత యుక్తముగాదు. అదియునుగాక, నాకిక ఆయుఃశేషము అంత ఎక్కువగాలేదు. కనీసము, నేను ఆభావనతో ఇకను గడపుచుండవలయును. అమెరికాలో ఏమేని చేయవలసి యున్న చెదరిచెదరి యుండు మనఃబలమును అంగోపాంగసంపన్నము చేయజాలకపోయినను కూడదీసికొనుటకైనను ఇప్పటికే చాల ఆలస్యమైనది. ఇక జాగుసేయరాదు. తరువాత కొన్ని నెలలలో ఇంగ్లండుకు మరలుటకును అక్కడినుండి యిండియాకు మరలువఱకు సంకల్పపురఃసరముగ పనిచేయుటకును స్వేచ్ఛ నాకుండును.

అమెరికాలో నుండు పనినంతయు ఒక్కటిగా ప్రోగుచేయు టకు నీవు తప్పక పూర్తిగా తోడ్పడవలెనని నాతలంపు. కావున నీకు సాధ్యమేని నీవు నాతోకూడ రావలయును. తురీయానందుడు నాతో నున్నాడు. శారదానందుని సోదరుడు బోస్టనుకు పోవు చున్నాడు...నీవు అమెరికాకు రాలేని పక్షమునను, నేను పోక తప్పదుకదా, తప్పునా?

నీవాడను,
వివేకానంద.

# 426

(కుమారి జోసెఫైన్ మెక్లీయడుకు)

లైమ్సు,
ఉడ్సైడ్సు, విమ్బుల్డన్,
ఆగస్టు 3, 1899.

నా ప్రియజో,

తుదకు మేము చేరినాము. తురీయానందునికిని నాకును ఇక్కడ విడిది చాల రమణీయముగా నున్నది. శారదానందుని సోదరుడు కుమారి నోబుల్ తో ఉన్నాడు. పై సోమవారము బయలు దేరగలడు.

ప్రయాణమువలన నాకు రవంత మేలు కలిగినట్లున్నది. ఆ మేలు నేను చేతి కసరత్తు చేయు ఇనుప మొద్దులతో వ్యాయామము చేయుట వలనను, వర్షర్తు గాలులవలన రేగిన తుపానులు స్టీమరును అలలపై ఉద్ఘాత లూపుటవలనను కలిగినది. వింతగా నున్నది కదా. అది నిలిచియుండు నని నాయాశ. మనఅమ్మ, అనగా భారతదేశీయ పూజ్యబ్రాహ్మణి గోమాత ఎక్కడ ఉన్నది? అది నీతో న్యూయార్కులో ఉన్నదని తలంతును.

స్టర్డి వెడలిపోయినాడు. శ్రీమతి జాన్సను వెడలిపోయినది, అందఱును పోయినారు. అందుచేత మార్గోకు మనఃఖేదముగా ఉన్నది. పై నెలవఱకు ఆమె యు. ఎస్. కు రాజాలదు. నాకు ఇప్పటికే సముద్ర మన్న ఎంతో ఇష్టముగల్గజొచ్చినది. మత్స్యావతారము నామీదఉన్నది. బెంగాలినగు నాలో అది పుష్కలముగా ఉన్నదని నాభయము.

అల్బర్టా ఎట్లున్నది? ఆముసలివారును, ఇంకను తక్కిన వారును? ప్రియ శ్రీమతి బ్రెర్ రాబిట్ నొద్దనుండి నాకు ఒకచక్కని జాబు వచ్చినది. ఆమె మమ్ము లండనులో కలసికొనజాలకపోయినది. మేము చేరుటకు ముందే ఆమె బయలువెడలినది.

ఇచట హాయిగా వెచ్చగా ఉన్నది. వారు ఇది చాల అతి అని అనుచున్నారు. నేను ప్రకృతము శూన్యవాదిని ఐతిని. పన్నాకములు లేవు. పశ్చాచ్చింతలు లేవు, దేనికిని ప్రయత్నము లేదు, పరిపూర్ణమగు స్వేచ్ఛ ఎవరికి ఇష్టమువచ్చినట్లు వారు మంచిది, జో, స్టీమరులో ఉండగా నేను నిన్నుగాని పవిత్రమగు ఆవునుగూర్చి గాని, ఎప్పుడు ఆక్షేపించినను మార్గో నీపక్షము అవలంబించెడిది. పాపము, ఏమియు ఎఱుగనిపసిది! ఆమెకు ఏమియు తెలియదు. ఆ అంతటి పర్యవసానము ఏమనగా, జో, లండనులో ఏపనియు ఉండజాలదు, ఏలన నీవు ఇక్కడ లేవుగదా. నీవు నాయదృష్టముగా తోచుచున్నావు! నలుగగొట్టుము, ఓ వృద్ధురాలా, అది కర్మ. ఎవరును తప్పించుకొనలేరు. ఈ సముద్రప్రయాణమువలన నేను పెక్కేండ్లు చిన్నవాడనుగా అగపడుచున్నాను. నాగుండె అదరినపుడు మాత్రము, నావయసు నామనసుకు వచ్చును. ఎట్లైనను, ఈ ఎముకలరోగ వైద్యము ఏమిటి? నాకు ఈరోగనివారణకై రొమ్ము గూటిపక్క నొకటిరెండెముకలను నఱికిపాఱవేయుదురా? నేను ఒప్పుకొనను. నా పక్కయెముకలతో ఏమి తయారుచేయుటయు కూడదు... అదేమైనను సరే, వానికి నాయెముకలు దొరకుట చాల కష్టమైనపని. నాయెముకలు గంగలో పగడములు అగునట్లు విధి విధానము గలదు. నాకు ప్రతిదినము ఒక్కపారము చెప్పుదువేని ఇపుడు నేను ఫ్రెంచిభాష నేర్చుకొందును. వ్యాకరణము అక్కఱలేదు. ఊరక నేను చదివెదను. నీవు ఇంగ్లీషులో వివరింపుము. అభేదానందునికి నా ప్రేమ నందించి, అతనిని తురీయానందుని కోసము సిద్ధపడుమని చెప్పుము నేను అతనివెంట బయలుదేఱుదును. త్వరగా జాబువ్రాయుము.

సర్వప్రేమయు తేత్యాది.
వివేకానంద.

## 427

(కుమారి మేరీ హేల్ కాయిస్టరుకు)

కుమారి నోబుల్ ఇల్లు,
21 ఎ. హైస్ట్రీటు, వింబుల్డన్.
ఆగస్టు, 1899.

నా ప్రియ మేరీ,

నేను మరల లండనులో ఉన్నాను. ఈసారి విసవిసన తిరుగాడక, పని యేమియు లేక, శాంతముగా ఒకమూలలో కూర్చుండి, తొలియవకాశము దొరకగానే అమెరికా సంయుక్తరాష్ట్రములకు బయలుదేఱుటకై కాచుకొని యున్నాను. నామిత్రులందఱును లండనునుండి బయటి పల్లెలకును ఇంకను ఎక్కడెక్కడికో పోయి యున్నారు. నాయారోగ్యము చాలినంతగా బాగులేదు.

అనగా, నీవు నీచెలువులు తోటలు ఏకాంతము వీనితో 'కనడా'లో సుఖముగా ఉన్నావన్నమాట. నీవు మరల ప్రవాహ శిఖరముపై ఎక్కియున్నావని, అనగా సకలాభ్యుదయముతో ఉన్నావని తెలిసినది. నాకు సంతోషముగా, చాల సంతోషముగా, ఉన్నది. నీవు ఆ శిఖరమందే ఎప్పుడును ఉందువుగాక.

నీవు ఇంకను రాజయోగ అనువాదమును ముగింపజాలకున్నావు. సరే కానీ. తొందరలేదులే. అది నెఱవేఱవలయునన్న కాలమును తగినయవకాశమును రావలయును అని నీవెఱుగుదువు గదా. రాకున్న మన ప్రయత్నము వృథ.

కనడా అత్యుత్సాహమును కలిగించు నాతిదీర్ఘపు వేసవితో ఇపుడు చాల అందముగాను ఆరోగ్యకరముగాను ఉండవలయును.

ఇక కొన్నివారాలలో నేను న్యూయార్కులో ఉందు నను కొనుచున్నాను. అటుతరువాత ఏమగునో నేను ఎఱుగను. పైవసంతమునకు ఇంగ్లండుకు మరలగలనని ఆసపడుచున్నాను.

ఎవరికిని ఏదుఃఖమును ఎన్నడును కలుగకూడదని ఎంతయో ఆసక్తితో కోరుచుందును. అయినను మనజీవితపు లోతులలో ఏమి

యున్నదో ఎఱుంగు అవకాశము మన కొసంగునది ఆ దుఃఖ ముక్కటే కాదా?

ఎప్పటికిని మూయబడియున్న వాకిళ్ళు మన మనోవేదన ఘయములలో తెఱవబడినట్లు వెలుగు వెల్లువలను లోపలికి చొర చ్చును.

మనము ఎదుగుకొలది నేర్చుకొందుము. అయ్యో, మనజ్ఞాన సును ఇందు ఉపయోగింపజాలము. మనము నేర్చుకొనుచున్నా సనిపించుతక్షణాన, ఈ రంగమునుండి అతివేగముగా తొలగింపబడు సుము. ఇదియే మాయ!

మనము ఎఱింగినయాటగాండ్రమే యగుదుమేని ఈ క్రీడా పపంచము ఇక్కడ ఉండబోదు, ఈయాట సాగనేరదు, మనము నులకు గంత కట్టుకొని ఆడవలయును, మనలో కొందఱము నాట ములోని వంచకుని పాత్రను వహింతుము. కొందఱము నాయకుని పాత్ర నభినయింతుము. ఏదైననేమి? అది సర్వము నాటకమే. అదియొకటే మనకు ఊరట. రంగాన దయ్యములు సింహములు పెద్దపులులు నున్నవి. ఆరంగమున లేని వేవి? అయినను వాని నన్నింటి నోటికి కట్లు కట్టబడియున్నవి. అవి తటాలున పైకదూకు నుగాని, కఱవజాలవు. ఈలోకము మన యాత్మలను బాధింప జాలదు. కావలయుననుకొన్న, ఈ దేహము చీల్చబడి నెత్తురు కాఱు చున్నను, నీవు నీమనసున పరిపూర్ణ ప్రశాంతిని అనుభవింపవచ్చును.

నిరాశను అలవఱుచుకొనుటయే దానికి మార్గము. దానిని నీవెఱుగుదువా? అది బలహీనుని నిరాశకాదు, వీరుడు తాను పోరాడి సంపాదించి విజయమంది తృప్తిచెంది చేతికివచ్చినతర్వాత 'ఇదెందుకు నాకు' అని తిరస్కారముతో పాఱవేయు నట్టినిరాశ.

ఈ నిరాశ నిస్పృహ నిర్లక్ష్యత ఇదియే ప్రకృతి తోడి పొత్తు. నిజముగా ప్రకృతిలో అంగాంగముల పొందిక, కారణ (కార్యసమన్వయ)ము, (దానికి తరువాత ఇది అను) వరుస ఇవిలేవు. అది పూర్వము క్రమములేని గజిబిజ. ఇప్పుడును అదిఅంతే.

మనుష్యాధముడు తన వట్టివైహికపరతచే ప్రకృతితో పొందిక కలిగియుండును. ఉత్తముడును తన జ్ఞానపూర్తిచే అట్లే, ప్రకృతితో పొందిక కలిగియుండును. * ముప్వురును లక్ష్యములేక, వసములేక తలచినట్లు కొట్టుకొనిపోవుచు, నిరాశులుగ నుందురు, ముప్వురును సుఖముగా నుందురు.

నీకు ఉబుసుపోకజాబు గావలయునుగదా ? అంతగా ముచ్చట లాడ నేమియు లేదు. ఈ కడచిన రెండుదినాలు శ్రీ స్టర్డీ వచ్చి యుండెను. అతడు రేపు వేల్సులోని తనయింటికిపోవును.

ఇక ఒకటిరెండు దినాలలో న్యూయార్కుకు పోవుటకు దారి చీటిపొందవలసి యున్నది.

లండనులోనున్న కుమారి సౌటరును, మాక్సు గిసిక్కును తప్ప నా ప్రాతమిత్రుల నెవ్వరిని నేను ఇంకను చూడలేదు. వారు ఎప్పుడు ఉండినట్లే, ఇప్పుడును చాల దయగలిగియున్నారు.

ఇంతవఱకు లండనునుగూర్చి ఏమియు తెలియనందున, నేను నీకు చెప్పదగిన సమాచారములు ఏమియులేవు. గెర్ట్రూడు ఆర్చర్డు ఎక్కడనున్నదో నాకు తెలియదు. తెలిసియున్న ఆమెకు జాబు వ్రాసియుందును. కుమారి కేటుస్టీలుకూడ ఇక్కడలేదు. ఆమె గురు వారమో శనివారమో వచ్చుచున్నది.

మహావిద్వాంసుడును ఫ్రాంసు దేశీయుడునునగు నొక స్నేహితునితో పారిసులో ఉండుటకు నాకు ఆహ్వానము వచ్చినది. అయినను నేను ఈసారి పోలేకపోయితిని. మఱియొకసారి, అతనితో కొన్నాళ్లు గడపుదమని ఆశించుచున్నాను.

నేను మన ప్రాతమిత్రుల కొందఱిని కలసికొని శుభము పలుక గోరుచున్నాను.

నేను నిన్ను అమెరికాలో తప్పక చూతునని ఆసించు చున్నాను. అనుకోకుండనే నా సంచారములలో నేను ఒట్టావాకు రావచ్చును. లేకున్న నీవు న్యూయార్కుకు రమ్ము.

---

* ఇద్దఱును అనుట హృదయము.

సెలవు పుచ్చుకొందును. సర్వాదృష్టము నీకు కలుగును గాక!

భవదీయ భగవద్గత
**వివేకానంద.**

## 428

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

లండను,
ఆగస్టు 10, 1899.

నా ప్రియరాఖాల్,

నీ జాబువలన నాకు చాలవిషయములు తెలిసినవి. నాయారోగ్యము ఓడలో నున్నప్పుడు చాల మేలుగానుండెను. కాని తీరమును చేరినతర్వాత, గర్భములోని వాయు ప్రకోపనమువలన, ఇపుడారోగ్యమంత బాగుగా లేదు...ఇపుడిక్కడ ఎంతయోకష్టము. వేసవికి మిత్రులందఱు నగరమునుండి బయటికి పోయియున్నారు. దీనికితోడు నాయారోగ్యముగూడ అంతగా బాగుండలేదు. మఱియు అన్నపానాదుల విషయమున చాల ప్రతికూలములు ఉన్నవి. కావున ఇక కొన్నిదినాలలో నేను అమెరికాకు వెడలెదను. స్థలము కొనుటకు ఎంతఖర్చు ఐనది? కట్టడములకు ఎంత? అందఱిపోషణ మున్నగువాని కెంతయైనది? వివరములతో శ్రీమతి బుల్సుకి లెక్కలు పంపుము.

శారదుడు* పత్రిక బాగుగా జరుగుటలేదని వ్రాయుచున్నాడు... నా సంచారముల వివరమంతయు ప్రచురింపుమనియు, దానినంతయు ముందుగా చక్కగా ప్రకటింపవలయుననియు అతనితో చెప్పుము చందాదారులు ఉరవడిగా పరుగెత్తుదురు. పత్రికలో ముక్కాలు మూడువీసాలు దైవభక్తి విషయాలతో నింపిన జనులు మెచ్చుకొందురా? ఎట్లయినను సరే, పత్రికయెడ విశేషశ్రద్ధను బూనుము. మానసికముగా నేను లేననుకో. ఇట్లు నిశ్చయించి నీ యిష్టాను

* శ్రీ త్రిగుణాతీతానందస్వామి.

సారము వ్యవహరింపుము. 'మేము ధనమునకును విద్యకును మఱి అన్నింటికిని మాయన్నపై నాధారపడి ఉందుము' అనుభావము నాశనమునకు మార్గము. ధనమంతయు పత్రికకు కావలయు సర్వధనమును నేను సంపాదింతునేని, దానికి వలయు వ్యాసములనన్నిటిని కూడ నేనే వ్రాయుదునేని, మీరు ఏమిచేయుదురు? ఇక మన పెద్దలందఱు ఏమి సేయుచున్నారు? నావంతు నేను ముగించితిని. మిగిలినదానిని మీరు చేయుడు. ఎవరును ఒకపైసా వసూలుచేయలేరు, ఎవరును మతప్రబోధము చేయలేరు. ఎవనికిని తన సొంత విషయములను చక్కగా విచారించుకొనుటకు కావలయు తెలివిలేదు. ఎవనికిని-ఒక బంతి వ్రాయగల యోగ్యతలేదు ఎందులకును కొఱగాని, యీ అందఱును సన్న్యాసులే! ఇదియే మీ పరిస్థితియగునేని, ఆఱుమాసములపాటు, పత్రిక, ధనము ప్రబోధనకార్యము సమస్తము బాలురకు వదలిపెట్టుడు. వారును ఏమి చేయుటకును శక్తులుకారేని, అన్నిటిని అమ్మివేయుడు, వచ్చినదానిని ఆ దాతలకు తిరిగి ఇచ్చివేయుడు, అందఱు బిచ్చగాండ్రుగా బయలుదేఱుడు! మఠమునుండి బొత్తిగా సమాచారము తెలియుటలేదు. శరత్తు * ఏమి సేయుచున్నాడు? పనిచేయుటను నేను చూడవలయును. నేను మృతినొందుటకు ముందు, నేను యావజ్జీవము పోరాడి సాధించి నెలకొల్పినట్టిది నిరంతరాయముగా కొనసాగు స్థితిలో నుండుటను చూడగోరుచున్నాను. పైకము విషయమున ప్రతియంశమునను నిర్వాహకసభతో సంప్రదింపుము. ఖర్చులో ప్రతిపద్దుకు ఆ సభ్యుల చేవ్రాళ్లు గైకొనుము. అట్లు చేయకున్న నీకును చెడ్డపేరు వచ్చును. జనులు ఎప్పుడో ఒకప్పుడు తామిచ్చిన విరాళములకు లెక్కలడుగుట వాడుకయే. కావలసినపుడంతయు దానిని సిద్ధముగా ఉంచుకొనక పోవుట పెద్దపొరపాటు...ఆరంభమున ఇట్టి సోమరితనము కలిగియున్నచో తుదకు వారు గొప్పవంచకు లగుదురు. మఠములో ఉన్నవారిని అందఱిని ఒక సంఘముగా కూర్పుము. వారును

---

* శ్రీ శారదానందస్వామి.

సంతకముచేయక ఏ ఖర్చుగాని ఎంతమాత్రము చేయగూడదు. చేయనేకూడదు! నాకు పనికావలమును, బలోత్సాహములు కావలయును. ఎవరు బ్రదికియున్నను ఎవరు మృతిచెందినను అక్కఱలేదు. సన్న్యాసికి చావుబ్రతుకు లేమిలెక్క?

శరత్తు కలకత్తాను మేలుకొల్పలేదేని.. నీవు ఈసంవత్సరము ఆ ఆనకట్టను నిర్మింపలేవేని, అప్పుడు చూతువు లే తమాషా! నాకు పనికావలయును. దానినిగూర్చి ఏమోసమును పనికిరాదు. శ్రీ మాతృదేవికి సభక్తిక ప్రణామములు.

భవదీయ ప్రేమయుత
వివేకానంద.

## 429

రిడ్జిలి,
సెప్టెంబరు 2, 1899.

ప్రియ—,

—జీవితము యుద్ధములయు భ్రమతీఱుటలయు పరంపర. జీవితరహస్యము భోగానుభవము గాదు, స్వానుభవమార్గమున గడించువిద్య. అయినను, అయ్యో, మనము నిజముగా నేర్వ మొదలిడిన క్షణమున వెనుకకు మరల్పబడుదుము. భవిష్యత్తులో జన్మమున్నదనుటకు ఇదియొక ప్రబలమైనకారణముగా చూపట్టుచున్నది. ...ఎక్కడచూచినను పనిమీదికి ఒక సుడిగాలి వీచిన బాగుండును. అది వాతావరణమును నిర్మలీకరించి, వస్తువుల స్వభావము నెఱుంగుటకు నిజమైన లోచూపును మనకు ఒసంగును. అది మరల క్రొత్తగా ఆరంభింపబడుచున్నదిగాని, ఈసారి దానిపునాది వజ్రమయము...

శుభాశంసలతో, భవదీయ,
వివేకానంద.

## 430

(శ్రీమతి బుల్ సతికి)

రిడ్జిలీ.
సెప్టెంబరు 4, 1899.

ప్రియబుల్సతి,

అందరికంటె శ్రేష్ఠముగా అమ్మ ఎఱుంగును. నన్ను గూర్చిన వార్తయంతయు అదియే.

భవదీయేత్యాది
వివేకానంద.

## 431

(శ్రీమతి బుల్సతికి)

రిడ్జిలీ మేనర్,
సెప్టెంబరు 4, 1899.

నా ప్రియజననీ,

ఈ కడచిన ఆఱునెలలు భయంకర దుర్దైవ మంత్రమహిమ నామీఁదికి పాఱియున్నది. దుర్దైవము నేను ఎట్లుపోయినను ఎప్పుడును నన్ను వెంబడించుచున్నది. ఇంగ్లండులో స్టర్డీకి పనిపై విసుగుపుట్టి నటులున్నది. ఇండియానుండి వచ్చిన మాయందు అతనికి సన్న్యాసిత్వము ఏమియు అగపడుట లేదు. ఇక్కడికి నేను చేరియుచేరక మునుపే ఓలికి ఒక చెడ్డగుణము తగులును.

నేను నీయొద్దకు పరుగెత్తుదునా? నే నంతగా సాయముగా నుండను అని నేనెఱుగుదును. ఐనను ఉపయోగముగా నుండుటకు నాచేతనైన ప్రయత్నము చేసెదను.

నీకు అంతయు త్వరలో బాగుపడవలెననియు, ఇది నీకు చేరులోపలనే ఓలికి నయమై పూర్తి యారోగ్యము కలుగవలెననియు నేను కోరుచున్నాను. అమ్మకు బాగుగా తెలియును, నన్ను గూర్చిన దంతయు అంతే.

సదా ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 432

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

రిడ్జిలీ మేనర్,
సెప్టెంబరు 14, 1899.

నా ప్రియస్టర్డీ,

నేను లెగ్గెట్టువారి యింటిలో కేవలము విశ్రాంతి పొందు చున్నాను. అంతే. ఏమియు చేయుటలేదు. అభేదానందుడు ఇక్కడికి వచ్చియున్నాడు. అతడు చాల కష్టపడి పనిచేయుచున్నాడు.

అతడు ఒక నెలదినాలు వివిధస్థలములలో తనపనిని మరల ఆరంభించుటకై ఒకటి రెండుదినాలలో బయలుదేఱును. అటు పిమ్మట పనిచేయుటకు న్యూయార్కుకు వచ్చును. .

నీవు చెప్పిన సలహా ననుసరించి కొంతపని చేయుటకు నేను ప్రయత్నించుచున్నాను, ఐనను హిందువులనుగూర్చిన వృత్తాంతము హిందువువలననే బయలువెడలిన దానిని పాశ్చాత్య ప్రజానీకము ఎట్లు గుణగ్రహణము సేయునో నేను ఎఱుంగజాలను....

నివృత్తిమార్గపరుడగు మనుష్యు డెవడును రోగికాకూడదు అని శ్రీమతి జాన్సను అభిప్రాయము. మఱియు నేను పొగద్రాగుట పాపము (ఇత్యాది) ఇపుడు ఆమెకు తోఁచుచున్నది. కుమారి ముల్లరు నన్ను నాజబ్బును వదలిపెట్టుటకు అదియే కారణము. నాకు తెలిసినంతవఱకు వారి యభిప్రాయ మత్యంతము సరియే-కావచ్చును. నీ యభిప్రాయమును సరియే కావచ్చును. ఐనను నే నెప్పటివాడనే. ఇండియాలో ఆ దోషములును, వానికితోఁడు నేను యూరోపియనులతో కూడి భోజనముచేయుటయు పలువురచే ఆక్షేపింపబడినవి. నేను 'ఒకానొకరికి సొంతమైన దేవళమునకు పోగా, యూరోపియనులగూడి భోజనము చేసినందులకై ఆదేవస్థానాధికారులు నన్ను బయటికి తఱిమివేసిరి. ఎవడు నన్ను ఎట్లు ఉండ గోరునో అట్లు వాడు నన్ను రూపొందింపగలుగునట్లు నేను మెత్త బడియుండరాదా అని కోరుదును. కాని దౌర్భాగ్యవశమున ప్రతి

వానిని తృప్తిపఱుపజాలు మనుష్యుని నేనెన్నడును చూడలేదు. వివిధస్థలములకు పోవలసియుండువాడెవడును అందఱిని తృప్తిపఱుపజాలడు.

నేను తొట్టతొలుత అమెరికాకు వచ్చినపుడు షరాయి తొడుగుకొననందులకై వారు నన్ను చులకనచేసి నాయెడ దౌర్జన్యము చూపిరి. తరువాత చొక్కాల చేతికొనలకు గట్టిపట్టలు లేకున్నను, మెడపట్టీలు లేకున్నను నన్ను ముట్టుకొనక వానిని ధరించునట్లు నిర్బంధించిరి. వారు ఇచ్చినదానిని నోటవేసికొనకున్నట్టి నేను వారికి ఎంతో హాస్యాస్పదుడనైతిని.

నేను ఇండియాలో దిగిన క్షణముననే నన్ను తల గొరిగించుకొమ్మనిరి. కౌపీనముపెట్టుకొమ్మనిరి. దానిఫలితముగా నాకు అతిమూత్రము మొదలగు రోగములు కలిగినవి. శారదానందుడు తన లోతొడుగులను ఎన్నడును మానలేదు. అది వానిప్రాణమును కాపాడినది. కాని ఇంచుక మేహవాతస్పర్శ కలిగినది. మన జనుల యాక్షేపణ ఇంకను మించినది.

నిజముగా అది నా కర్మ, అందులకు నాకు సంతోషమే. ఏలన అది తాత్కాలికముగా చులుక్కుమని బాధ కలిగించినను, అది ఈజీవితములోనో భవిష్య జ్జన్మలోనో ఉపయోగపడు మఱియొక గొప్పయనుభవము....

నావిషయమున నేను ఎల్లప్పుడు పోటుపాటుల నడుమ మెలగుచున్నాను. ప్రతి సంతోషశకలమును పూర్తిగా చక్రవడ్డీతో కాకున్నను తగినంత దుఃఖశకలమునైనను కలిగించునని ఎఱుగుదును. ఎల్లప్పుడు నామతబోధనలలో ఉపన్యసించుచుంటిని. లోకము నన్నెంతో ప్రేమించినది. కావున ఎంతో ద్వేషమునకును నేనర్హుడను. అది యట్లే యున్నదిగదాయని నాకు సంతోషము. ప్రతి యలయుదానికి ప్రతియగు క్రుంగును కలిగియేయుండును అను నా సిద్ధాంతమును నాయెడనే అది ఋజువుచేయుచున్నది.

నామాటకా, నేను నా స్వభావమును నా ముఖ్యసూత్రమును గట్టిగా అవలంబింతును. ఒకసారి మిత్రమాయెనా ఇక నెప్పటికిని అతడు మిత్రమే. మఱియు బాహ్యమునకైన కారణమును ఆంతరమున, అంతర్ముఖముగా అరయుట అను ఇండియా మూల సూత్రమునుకూడ అవలంబింతును.

నన్ను పొందు ఈర్ష్యాద్వేషములకెల్ల నాదే దోషము, కేవలము నాదే అని నా నిశ్చయము. అది అన్యథా కాజాలదు. నన్ను మఱియొకమాఱు ఇట్లు అంతర్ముఖతకు ప్రేరేపించినందులకు నీకును శ్రీమతి జాన్సనుకును నా కృతజ్ఞత.

ఎప్పటివలె ప్రేమాశీస్సులతో,

భవదీయ,

వివేకానంద.

## 433

(కుమారి మేరీ హేలుకు)

రిడ్జిలీ మేనర్.
సెప్టెంబర్, 1899.

ప్రియ మేరీ,

అవును, నేను (ఈదేశము) చేరినాను. గ్రీనేకరునుండి నాకు ఇసబెల్లా వ్రాసిన జాబొకటివచ్చినది. నేను త్వరగా ఆమెను హారియెట్టునుగూడ చూతునని ఆశపడుచున్నాను. హారియెట్టు W. ఏక విధముగా నోరు తెఱవకయున్నది. పోనీలే. నేను కాలమునకు బద్ధుడనై యుందును. శ్రీ ఉల్లీ కోటీశ్వరుడుకాగానే, నా పైకము ఇమ్మని అడిగెదను. అమ్మ చర్చిని నాయనపోపును గూర్చి నీవేమియు విశేషములు వ్రాయలేదు. ఏవియో వార్తాపత్రికలలో నన్ను గూర్చి ప్రచురింపబడిన కొంత సమాచారము మాత్రము వ్రాసితివి. నేను పత్రికలలో శ్రద్ధబూనుట మాని చాలకాలము ఐనది. నీవు చెప్పునట్లు అవి నన్ను ప్రజాలోకము నెదుటపెట్టి ఎట్లో ఒకయట్లు నాపుస్తకముల యమ్మకము కొనసాగించును. ఇపుడు నేను ఏమి

చేయ ప్రయత్నించుచున్నానో ఎఱుగుదువా? ఇండియానుగూర్చియు అందలి జనులనుగూర్చియు నుబుసుపోకవంటి చిన్న పుస్తకము ఒకటి వ్రాయుచున్నాను. మరియు నేను ఫ్రెంచిభాష నేర్చుకొనబోవుచున్నాను. నేను ఈ సంవత్సరము దానిని నేర్చుకొనక పోవుదునేని, పై సంవత్సరము పారిసులో చేయవలయు వ్యాఖ్యానమును చక్కగా చేయజాలకపోదును. సరే, ఇక్కడ నౌకరులుకూడ ఫ్రెంచిమాటలాడువారైనందున, నేను ఫ్రెంచిభాష చక్కగా నేర్చుకొనగలనని తలంచుచున్నాను.

శ్రీమతి లెగ్గెట్టును నీవెప్పుడును చూడలేదు. చూచితివా? ఆమె ఇపుడు చాల వైభవముగా ఉన్నది. నేను మునుపటివలెనే పై సంవత్సరము ఆమెకు అతిథిగా పారిసుకు పోవుదును.

తత్త్వశాస్త్రమును, సర్వమత తారతమ్య పరిశీలనమును బోధింపగల మఠము గంగాతీరమున నాకు గలదు. అది పనికిని కేంద్రస్థానము.

ఇన్నాళ్ళు నీవు ఏమిచేయుచుంటివి? చదువుచుంటివా? వ్రాయుచుంటివా? నీవు ఏమియు చేయలేదు. ఇప్పటికి నీవు ఎంతెంతయో వ్రాసియుండవచ్చును. నీవు నాకు ఫ్రెంచి నేర్పియున్నను, నేను ఇప్పటికి పూర్తిగా అందు కప్పగంతులు వేయగలిగియుందును. కాని నీవు నేర్పవైతివి. నాచే ఊరక నిరర్థకములగు మాటలాడించితివి. నీవెప్పుడును గ్రీనేకరుకు పోలేదు. అది ప్రతి సంవత్సరము ఎక్కువ అభివృద్ధి చెందుచున్నదని ఆశించుచున్నాను.

నీవు 24 అడుగుల పొడవును 600 పౌనులు బరువు నుండగల క్రైస్తవశాస్త్రమవే అనుకో. నీ వైద్యములచేత నా కారోగ్యము కలిగింపక పోయితివి. నీ చికిత్సాసామర్థ్యమున నా నమ్మకమంతయు నశించుచున్నది. సామ్ ఎక్కడఉన్నాడు? ఇంతకాలము తన శక్తికొలది జాగ్రత్తపడుచున్నాడు కావలయు! అతని హృదయమును ఆశీర్వదింతును. అంత మంచి స్వభావముగల బాలుడు!

నా వెంట్రుకలు చాల వడిగా నరిసిపోవుచుండినవి. మఱి యెందుచేతనో, ఆ నరియుట ఇపుడు ఆగినది. ఇపుడు కొన్నియే తెల్ల వెంట్రుకలు. అందులకు నాకు చింతగా ఉన్నది. ఐనను పరిశీలనచేసిన అనేకములే కనిపించును. నాకు అది చాల ఇష్టము. నేను పొడుగుపాటి తెల్లని మేకగడ్డమును పెంచబోవుచున్నాను. అమ్మ చర్చియు నాయన పోపును యూరోపుఖండమున (పర్యటించుచు) కాలమును సుఖముగా సంతోషముగా గడపుచుండిరి. నేను మా యింటికి పోవునపుడు కొంచెము చూచితిని. చికాగోలో నీవు సిండెరిల్లాను అనుకరించుచుంటివి. అది నీకు మంచిదే. పై సంవత్సరము పారిసుకు పోవునట్లును, నిన్ను తమతో తోడ్కొని పోవునటులును నీ పెద్దలను ప్రోత్సహించి ఒప్పింపుము. అక్కడ చాల ఆశ్చర్యకరములగు దృశ్యములు ఉండవలయును. ఫ్రెంచివారు వ్యాపారమును ముగించులోపల కడపటి పెద్దపోరాటము సాగింపనున్నారని అనుకొనుచున్నారు.

మంచిది. నీవు నాకు ఎంతోకాలము వ్రాయకుంటివి. నీకు ఈ జాబు తగదు. అయినను నేను అంతమంచివాడను కదా, నీకు తెలియునే; అదియునుగాక నాకు మరణము సమీపించుచున్నది, నేను ఎవరితోడను జగడమాడగోరను. ఇసబెల్లాను హారియెట్టును చూడవలయునని చచ్చిపోవుచున్నాను. వారికి గ్రీనేకరు సత్రములో రోగపరిహారక శక్తి చాల సరఫరా అగుచుండునేమో. నా యిప్పటి జబ్బునుండి కడతేఱుటకు సాయపడుదురేమో! నేనెఱిగిన దినాలలో ఆ సత్రము మిక్కుటముగా పారమార్థిక సత్తతోడను, తక్కువ ఐహిక సత్తతోడను నిండియుండెను. నీకు ఎముకల రోగపు వైద్యమేమైనను తెలియునా? ఇక్కడ న్యూయార్కులో ఒకడున్నాడు. అతడు నిజముగా అద్భుతములు గావించుచున్నాడు.

నేను ఇక వారములో నా యెముకలను వానిచేత పరీక్షింపించుకొందును. కుమారి హా ఎక్కడ ఉన్నది ? ఆమె అంతటి మహాత్మురాలు, అంతటి స్నేహితురాలు. మఱియొక సంగతి. మేరీ, మీ

కుటుంబము, అమ్మ చర్చి, ఆమెతోడి మతగురువులు, పారమార్థిక ముగను ఐహికముగను నేనెఱిగిన యితరకుటుంబము లన్నిటికన్నను మిన్నగా నా హృదయమును ఆకర్షించియుండుట మిక్కిలి ఆశ్చర్యము. ప్రభువు ఎప్పటికిని మిమ్ము మిక్కిలిగ అనుగ్రహించునుగాక.

నేను ఇపుడు విశ్రాంతిగొనుచున్నాను. లెగ్గెట్లు చాల దయ గలిగియున్నారు. ఇక్కడ నాకు స్వగృహమున ఉన్నట్లు ఉన్నది. నేను ఉర్స్యాయి ఊరేగింపు చూచుటకు న్యూయార్కుకు పోవ నుద్దేశించుచున్నాను. నేను అక్కడి స్నేహితులను ఇంకను చూడలేదు. — మిమ్ముగూర్చి సమస్తమును నాకు వ్రాయుము. వినవలయు నని మిక్కిలి ఆశించుచున్నాను. నీవు జోజోను ఎఱుగుదువుగా! వారు ఇండియాకు వచ్చినపుడు, అన్నాళ్లు నా జబ్బుతో వారి యిచటి యునికిని పాడుచేసితిని. వారు అందులకేమియు అనుకొన లేదు. అంతటి సహృదయులు అంతటి క్షమాశీలురు! ఏండ్లకొలది శ్రీమతి బుల్సతియు ఆమెయు నన్ను కాచి రక్షించు దేవదూతలుగా నుండిరి. శ్రీమతి బుల్సతి పైవారము ఇక్కడికి రాగలదు.

ఆమె ఇప్పటికి ముందే ఇక్కడికి వచ్చియుండును. కాని ఆమ కూతురు ఓలీకి ఏదియో ఆకస్మికపు జబ్బు వచ్చినది. ఆమె చాల బాధపడి, ఇప్పటికి అపాయమునుండి బయటపడినది. శ్రీమతి బుల్లు ఇక్కడ లెగ్గెట్ల కుటీరములలో నొకటి తీసికొన్నది. చలిగాలి ఎప్పటికంటె ముందుగా ఆరంభింపకున్న మాకు ఇక్కడ ఎప్పుడును ఒక మాసము హాయిగా గడచును. ఈచోటు అంత రమణీయ మైనది, మంచి అడవులు, పచ్చికబయళ్ళు!

నేను మొన్న 'గోల్ఫు' అను బంతియాటను ఆడుటకు ప్రయత్నించితిని. అదేమియు అంత కష్టముగాదు. దానికి మంచి అభ్యాసము ఉండవలయును, అంతే. నీవు 'గోల్ఫు' ఆడు నీ మిత్రు

లను చూచుటకు ఫిలడల్ఫియాకు ఎప్పుడును పోలేదా? నీ పేర్పాటులు ఆలోచనలు ఏవి? నీ జీవిత శేషమున ఏమిచేయ నుద్దేశింతువు? నీవేమేని పనిని ఆలోచించి నిశ్చయించుకొంటివా? నాకు దీర్ఘమగు జాబొకటి వ్రాయుము. వ్రాసెదవా? నేను నేపిల్సు వీథులలో నడచుచుండగా, ఒక దొరసానిని మఱి మువ్వురితో, వారు అమెరికనులు కాబోలు, పోవుచుండగా చూచితిని. ఆమె మూడుమూర్తుల నిన్ను పోలియుండినది. నేను ఆమెతో మాటలాడబోవుచుంటిని, ఇంతలో దగ్గఱకురాగా, నా పొరపాటు గ్రహించితిని. ఇప్పటికి సెలవు. త్వరగా వ్రాయుము.

సదా భవత్ప్రియ సోదరుడు,

**వివేకానంద.**

## 434

(కుమారి మేరీ హేలుకు,)

రిడ్జిలీ మేనరు,
అక్టోబరు 3, 1899

నా ప్రియ మేరీ,

అత్యంత కరుణాపూరితములగు నీమాటలకు నేను ధన్యుడను. నాకు ఇపుడు చాల మేలుగా ఉన్నది. దినదినమునకు ఆరోగ్యము వృద్ధియగుచున్నది. శ్రీమతి బుల్లును ఆమె కూతురును నేడో రేపో వత్తురు. మాకు మఱియొక మంచికాలము కలుగునని ఉవ్విళ్లూరుచున్నాము. నీకు సహజముగా ఎప్పుడును మంచికాలమే జరుగుచుండును. నీవు ఫిలడల్ఫియాకు పోవుచున్నందులకు సంతోషము. అయినను ఇప్పుడు అప్పటియంత కాదులే. అప్పుడు ఆ కోటీశ్వరుడు చూపుమేరలో ఉండెను.

సర్వప్రేమతో,

సదా భవదీయ సోదరుడు

వివేకానంద.

## 435

(కుమారి మేరీ హేలుకు) రిడ్జిలీ మేనరు,
అక్టోబరు 30, 1899.

నా ప్రియఉల్లాసినీ,

నేను నీజాబు నందుకొంటిని. ఉల్లాసపూర్ణమగు స్వేచ్ఛను క్రియారూపము చెందింప ఏదియో వచ్చినదిగదా యని నేను చాల ధన్యుడనుగా కృతజ్ఞుడనుగా ఉన్నాను. నీ ప్రశ్నలు నిర్వేదమునకు మూలకారణములనుసైతము వెలికి లాగినవి. నేటి యిండియాలోని బ్రిటిషు పాలనములో, దానికే తెలియకుండ, నష్టపరిహార కాంక్ష యొక్కటి ఉన్నది· అది యిండియాను ప్రపంచరంగముపైని మఱియొకసారి నిలిపినది. బాహ్యప్రపంచసంబంధమును దానికి బలవంతముగా కలిగించినది. జపానునకు సందర్భములు అనుకూలించినట్లుగా, అదియు ఆపనిని ఇండియా జనులమేలును చిత్తమున ఉంచుకొని చేసియున్నచో, దాని ఫలములు ఇండియాకు ఇంకను చాల ఆశ్చర్యకరముగా ఉండియుండును. నెత్తురు పీల్చుటయే ప్రధానోద్దేశమైయుండ, ఏ మేలును చేయ వీలుపడదు. మొత్తముమీద వారికి మునుపటిపాలనము జనులకు మేలుగానుండెను. ఏలన అది జనుల సర్వస్వమును నపహరింపలేదు. కొంత ధర్మమును కొంత స్వేచ్ఛయు ఉండినవి.

అరిచదువులవారును, స్వదేశీయ లక్షణములు రూపుమాసినవారును కొత్తదారులకు మార్పుబడినవార న గు మానవుల సమూహమే నేటి "యింగ్లీషు ఇండియా" ప్రపంచమునకు జూపగల దృశ్యము మఱేమియు లేదు. ఫెరిష్ట యను మహమ్మదీయ చరిత్రకారుడు 12 వ శతాబ్దిలో అరువదికోట్ల హిందువులు ఉండిరని చెప్పినాడు. ఇప్పుడో ఇరువదికోట్లకంటె తగ్గియేయున్నారు.

ఇంగ్లీషువారు ఈ దేశమును జయించుటకు పోరాడుచున్నప్పుడు పెక్కు శతాబ్దులకాలము అరాజకము తాండవమాడినను, 1857, 1858 సంవత్సరములలో వారు భయంకర హత్యలు కావించినను, వారిపాలనకు తప్పని ఫలములయి అంత భయంకరములయి

కోట్లప్రజలను మాయముచేయుచు అనివార్య క్షామములు కలిగినను జనులసంఖ్య బాగుగానే వృద్ధిపొందినది. అయినను మహమ్మదీయరాజ్యమునకు ముందు దేశమంతయు స్వతంత్రముగా ఉన్నప్పటి యంత ఇంకను కాలేదనుకో. [ఇప్పటినికి స్వదేశరాజుల రాజ్యాలలో ఎన్నటికిని క్షామమురాదు.] ఇండియనుల కాయకష్టము వస్తూత్పత్తి సమస్తము వారివద్దనుండి హరింపబడకున్నచో ఇపుడు ఇండియాలోనున్నవారికి అయిదింతల జనమును సర్వసుఖములతో పోషింపగలదు.

ఇది వస్తుస్థితి. విద్య సయితము ఇంతకంటె నెక్కుడుగ వ్యాపింపజేయబడదు. పత్రికల స్వాతంత్ర్యము ఇప్పటికే నిషేధింపబడినది. చాలకాలమునకు మునుపే మన శస్త్రాస్త్రధారణము నిషేధింపబడినది. కొన్నియేండ్లు వారికొసంగబడిన స్వపరిపాలనాధికార లేశము వడివడిగా తీసివేయబడుచున్నది. ఇక ఏది హరింపబడునా అని కనుపెట్టుకొనియున్నాము. నిరపరాధమగు కొన్ని మాటలు విమర్శ వ్రాసినందుఃకు మనుష్యులు యావజ్జీవ ద్వీపాంతరవాసము పాలు చేయబడుచున్నారు. ఇతరులు, విచారణలేకయే కారాగారమున బంధింపబడుచున్నారు. ఎవనికిని తన తల ఎప్పుడు నఱికివేయబడునో తెలియదు.

ఇండియాలో కొన్నియేండ్లుగా భయమే రాజ్యము చేయుచున్నది. ఇంగ్లీషు యుద్ధభటులు మన పురుషులను చంపుచున్నారు. స్త్రీలను బలాత్కరించుచున్నారు. ఇందులకై మాఖర్చున వారికి దారిఖర్చు విరామవేతనము పింఛను సమకూర్చి ఇండ్లకు పంపుచున్నారు. మేము ఒక భయంకర తమస్సున పడియున్నారము. ప్రభువు ఎక్కడ ఉన్నాడోగదా! మేరీ, నీవు ఉల్లాసముగా, ఈలోకమున సర్వము శుభోదర్కమే అని యుండగలవు, కాని నేనుండగలనా! నీవు ఈజాబును ఊరక ప్రకటింతువనుకో. అంతట ప్రస్తుతము నిర్మింపబడిన చట్టమునుబట్టి, ఇండియాలోని యింగ్లీషు సర్కారు నన్ను ఇందుండి బలవంతముగా లాగికొనిపోయి ఏ విచారణయు లేక

చంపివేయవచ్చును. అందులకు మేము క్రైస్తవేతరులము విగ్రహారాధకులము కావున మీ క్రైస్తవ సర్కారుదలన్నియు సహింపవలెను. నేనును ఉల్లాసముతో నిదురపోయి లోకమున సమస్తము సుఖోదర్కమే అనియుందునా? నీరో ఐహికోల్లాసవర్గములో 'అంతా సుమేలునకే అగు'నన్న మతము వారిలో అగ్రేసరుడు! వారి పత్రికలు ఈ భయంకరవిషయములను వార్తల క్రిందనైనను ప్రచురించుట ప్రయోజనకారి అని తలంపరు. ఇంకను కావలసియున్నచో రాయిటరు సమాచార ప్రతినిధి సర్కారు ఉత్తరువు ప్రకారము [illegible] విపరీతమగు అబద్ధమును కల్పించి దానిని వార్తగా పంపును! విగ్రహారాధకుల క్రైస్తవేతరుల వధ క్రైస్తవులకు కేవలము [illegible] వినోదము, ఆట! మీ మతబోధకులు దేవుని బోధింప వెడలుదురు, కాని ఇంగ్లీషువారు తమ్ము మరుదినమే ఎగిరి తన్నుదురను భయమువలన ఒకమాటయైనను సత్యముగ పలుకుటకు ధైర్యము పూనరుగదా!

పూర్వపాలకులచే విద్యాపోషణకై [illegible] భూములు మొదలైనవి అప్పుడే గ్రహింపబడినవి. [illegible] ఇప్పటి సర్కారు రష్యాకంటెను తక్కువగా విద్యావ్యాసంగమునకై ఖర్చు పెట్టుచున్నారు. ఆ విద్యయు సరి విద్య!

ఉపజ్ఞ ఇంచుక కనిపించినను [illegible] నిజముగా దేవుడు లేకున్న మానవులే [illegible]. ఈ [illegible] దేవుడు, దుర్బలులను రక్షించుటకు [illegible] ధనమును లంచముగా అంగీకరింపనివాడు నిజముగా ఉన్నాడా? కాలము రుజువుసేయును.

మంచిది, ఇక కొన్నివారాలలో నేను చికాగోకు [illegible] అనుకొందును. అప్పుడు అన్నిసంగతులు సంపూర్ణముగా మాట్లాడుకొందము! నీ ప్రమాణమును ఉదాహరింపకుము.

సర్వప్రేమతో,

సదా భవదీయ సోదరుడు
వివేకానంద.

మలిమాట. మతశాఖల విషయమున ఆ బి.యస్‌ను, ఆ ఏ యస్‌ను, ఇంకను తక్కినవియు పనికిమాలిన మేళనములైనవి. అవి మమ్ము బ్రతుకననుమతించుటకై కేవలము మా యింగ్లీషు దొరలకు పెట్టుకొన్న క్షమాపణ స్వరములు! మేమొక క్రొత్త యిండియాను, ఒకయభివృద్ధిని ఆరంభించినారము. అందుండి ఏమి పుట్టునో అని కాచుకొనియున్నాము. మేము దేశజనులకందఱికిని కావలసివచ్చినపుడు మాకు ఏవి నిజములగునో ఆ క్రొత్త భావము లనే నమ్మెదము. తమ దొరలు అంగీకరించునదియే ఈ బి.యస్‌లకు సత్యమునకు పరీక్షయు తార్కాణము అగును. ఇండియాయొక్క సుతర్కమును అనుభవమును అంగీకరించునదియే మాకు తార్కాణమగును. పోరాటము సంభవించినది, బి.యస్‌కును మాకును కాదు, ఏలన వారప్పుడే పోయిరి. కాని యింకను అధికమైనదియు గంభీరమైనదియు, భయంకరమయినదియు అగు పోరాటము.

వి.

## 436

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

యఫ్. ఫ్రాన్సిస్ లెగ్గెటు ఇల్లు,
రిడ్జిలీ మేనరు,
అల్స్టరుకౌంటి,
న్యూయార్కు.

నా ప్రియస్టర్డీ,

విలాసము పూర్తిగా ఉండనందువలన నీ మునుపటి జాబు కొంత అటు ఇటు పోయి, నాకు చేరినది.

నీ విమర్శ చాలవఱకు న్యాయ్యమును సరియుకావచ్చును. ఇట్లుండగా, ఇదంతయు కొందఱియెడ నీకున్న అప్రీతివలన పుట్టిన దనియు, నేను వట్టి బలిమేకనే అనియు ఒకానొకదినము నీవే తెలిసి కొందువనుటయు శక్యమే.

ఐనను ఆ నిమిత్తముచే ఏపగయు దుఃఖమును ఉండనక్కఅ లేదు. ఏలన, నేను, నేనేమో అంతకన్న, అన్యముగా కనబడ లేదు, భ్రమపఅుప లేదు. అట్లుచేయుటకు నాకు ఒకనాడును శక్య ముగాదని ఎవరుగాని నాతోడి ఒక్కగంట పరిచయములోనే, నా చుట్టుత్రాగుటలు సులభకోపతిలు మొదలయినవానివలన, పూర్తిగా తెలిసికొనగలరు. "ప్రతి సంయోగమునకు వియోగము తప్పదు." ఇది వస్తువుల స్వభావము. నేను ఎప్పుడును ఆశా భంగభావమును సయితము పొందనేపొందను. నీకేమియు ద్వేషము ఉండదని నా నమ్మకము. మనలను కలుపునది కర్మ, వేఅుపఅుచు నదియు కర్మయే.

నీవు ఎంతటి బిడియముగలవాడవో ఇతరుల మనసులకు నొప్పికలిగింపను ఎంత ఇష్టములేనివాడవో ఎఱుగుదును. నీ పరమ లక్ష్యమునకు ఉదారము ఎడసియున్న జనులతోకూడి పనిచేయు టకు పోరాడుచున్నప్పుడు నీవు నెలలకొలదిగా మనసులోపడిన యాతనను నేను పరిపూర్ణముగా ఎఱుగుదును. నేను ముందుగా దానిని ఊహింపనే చాలకపోయితిని. ఊహించియున్నచో నీ వ్యర్థ ఖేదములో చాల భాగమును నీకు కలుగకుండ నేను తప్పించి యుందును. ఆఖేదమును కర్మయే.

లెక్కలను ఇంతకుముందే చూపలేదు, ఏలన పని యింకను ముగియలేదు. నాకు విరాళమిచ్చిన దాతకు, ఆపని—ధర్మము— పూర్తిగా ముగింపబడినపిమ్మట పూర్తి లెక్కలను చూపుదమని అనుకొంటిని. పని కడచిన సంవత్సరమే ఆరంభింపబడెను. ఏలన పైకముకూడుటకు చాలకాలము కనుపెట్టుకొని యుండవలసి యుండెను. ఎల్లప్పుడు నెవరిని అడుగక దాతలు తమంతట చేయు సాయమునకై కాచుకొనియుండుటే నాపద్ధతి.

నా సర్వకార్యములందును నేను ఒక్క భావమునే అనుస రింతును. ఏలన నా స్వభావము పలువురికి నిజముగా అప్రియముగా నుండుట నాకు అంతమెఱుక. నన్ను ఎవరేని కోరువఱకు నేను

కాచుకొనియుందును. ఒక క్షణసూచనలో నేను విడిచిపోవుటకు కూడ సిద్ధముగా ఉందును. అట్లు వెడలిపోవు విషయమున నేను మనసున ఏమియు చెడ్డగా అనుకొనను. అసలు దానిని గూర్చి ఎక్కువగా తలపనే తలపను. నిరంతర సంచారాత్మకమగు నా జీవితమున నేను నిరంతరముగా అట్లే చేయుచున్నాను. నేను అనుకొనకయే ఇతరులకు ఇబ్బందిపెట్టుచున్నానుగదా అని అంతగా చింతిల్లుచున్నాను. నీ విలాసమునకు నా జాబులేవేని వచ్చియున్న దయతో నాకు చేర్తువా ?

నీకును నీ జనమునకును ఎప్పటికిని సమస్తదీవనలు ఫలించును గాక అని నిరంతరము దేవుని ప్రార్థించు,

వివేకానంద.

## 437

(సోదరి నివేదితకు)

రిడ్జిలీ,
నవంబరు 1, 1899.

ప్రియ మార్గట్,

......నీ మనసును ఏదియో చీకటి ఆవరించినట్లున్నది. పోనీ, ఏదియు శాశ్వతముగా ఉండబోదు : ఎట్లైనను, జీవితము శాశ్వతముగాదు. నేను అందులకెంతో కృతజ్ఞుడను. లోకములోని శ్రేష్ఠులకును ధీరోత్తములకును బాధపడుటయే విధినియతము. అయినను కొన్ని యుగముల వఱకు అన్ని విషయములు సాధ్యమగునేని, చక్కబఱుపబడునటుకు, బాధానుభూతి ఇక్కడి కలను విచ్చినమొనర్చు శిక్షణమైననగును. నా వివేకము మేలుకొని క్షణములలో నా కష్టములకు నేను సంతోషింతును. ఎవడో ఒకడు ఇక్కడ బాధపడవలయును. ప్రకృతి అర్పించు బలులలో నేను ఒకడనయినందులకు చాల సంతోషము.

భవదీయేత్యాది,
వివేకానంద.

## 438

న్యూయార్కు,
నవంబరు 15, 1899.

ప్రియ మార్గట్,

......మొత్తముమీద, నా దేహమునుగూర్చి వ్యాకుల పాటుకు ఏమేనికారణమున్నదని నేను తలంపను. ఇట్టి బలిష్ఠ (దుర్బల) కొన్ని సమయములలో గొప్ప పాటను ఆలపించు సాధన మగును, కొన్ని సమయములలో చీకటిలో ఏడ్చుటకు సాధనమగును.

భవదీయేత్యాది,
వివేకానంద.

## 439

(శ్రీమతి ఓల్బుల్సుతికి)

ఇ. గ్వార్ నేస్ యమ్. డి. ఇల్లు.
మాడ్రిడ్ 180 పడమర 59
నవంబరు 15, 1899.

నా ప్రియబుల్సుతీ,

అన్నియు ఆలోచించుకొన్నతర్వాత ఇప్పుడే కేమ్బ్రిడ్జికి వచ్చుటకు నేను తీర్మానించుకొన్నాను. నేను ఆరంభించిన కథలు ముగింపవలయును. మొదటిది నాకు మార్గొ మరల ఇచ్చివేసినట్లు నాకు జ్ఞప్తిలేదు.

నా యుడుపులు ఎల్లుండికి సిద్ధముగా నుండగలవు, అటు తర్వాత నేను బయలుదేఱుటకు సిద్ధముగా నుందును. నిరంతరము గోష్ఠులు విందులు ఉపన్యాసములతోడి ఆ ప్రయాణము చలికాల మంతయు నరముల ప్రకోపమునకు చోటగును గాని వాని శమన మునకు గాదనియే నా భయము. మంచిది, నేను ఎవరికి అగపడకుండ దాగుకొని అచట సమస్తసంభవముల సంబంధము లేకుండనుండుటకు నీవు నా కెక్కడనైనను ఒకగది ఇయ్యగలవుగదా! పైగా సాక్షాత్తుగా కాకున్నను ఏదోరీతిని ఇండియను మఠ ముందుచోటికి పోవుటకు చాల జంకుదును. మఠమువారి పేరే చాలును నన్ను భయపెట్టు

టకు. వారు ఈ జాబులు మొదలైనవానితో చంపివేయ తీర్మానించు కొన్నారు.

ఎట్లైనను, నా యుడుపులు అందగనే, ఈవారమున నేను వచ్చుచున్నాను. నా కొఱకు నీవు న్యూయార్కునకు రావలసిన పని లేదు, నీకు సొంతపనియున్నచో, అప్పుడు అది వేఱు విషయము. మాంటుక్లేరు వాసిని శ్రీమతి వ్హీలరువద్దనుండి నాకు మిక్కిలి దయతోడి ఆహ్వానము వచ్చినది. నేను బోస్టనును బయలుదేఱక మునుపు కనీసము కొన్నిగంటలైనను మాంటుక్లేరులో నుందును.

నాకు చాల మేలుగానున్నది, పూర్తిగానే ఆరోగ్యముగా ఉన్నాను. మనస్సులోని విసుగుబాధ తప్ప, నాకు మఱేమియు జబ్బు లేదు. ఇపుడు నేను దానినంతయు మానివేయ నిశ్చయించుకొంటిని.

నాకు ఒక్కవిషయమే కావలసినది, ఇండియాకు నీవువ్రాయు జాబులలో సూచనగానైనను నన్నుగూర్చిన ప్రస్తావము ఉండ గూడదు. నీవు ఈ నా మాట జరుపవని నా భయము. నేను కొంత కాలము సర్వకాలమునుగూడ దాగియుండగోరుదును. నాకు ప్రఖ్యాతిని గలిగించిన ఆ దినమును నేను ఎంతగా శపింతును!

సర్వప్రేమయుత
**వివేకానంద.**

## 440

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
నవంబరు 20, 1899.

నా ప్రియ రాఖాల్,

శరత్తు జాబువలన కొంత సమాచారము తెలిసినది...అవకాశము ఉండగానే అనుభవమును సంపాదింపుము. నీవు గెలుతువో ఓడుదువో, దానితో నాకు అక్కఱలేదు...నాకిప్పుడు జబ్బేమియు లేదు.మరల...నేను ఒకచోటినుండి మఱియొకచోటికి సంచారములు సేయబోవుచున్నాను. వ్యాకులత జెంద నవసరములేదు. నిర్భయముగా నుండుము. నీముందు ప్రతిదియు ఎగిరిపోగలదు. నీవు అవిధే

యుడవుమాత్రము కాకుము. సమస్తవిజయము, నీకు కలుగును...
జయము కాళికి! జయము మాతకు! జయము కాళికి! జయము
గురువునకు!

...నిజముగా, పిఱికితనమునకంటె పెద్దపాపము లేదు. పిఱికి
వారు ఎన్నడును రక్షింపబడరు. ఇది నిజము. నేను మఱి దేని
నైనను ఓర్చుకొందును గాని, దానిని మాత్రము ఓర్చుకొనజాలను.
దానిని మానుకొననివానితో నేను ఏ వ్యవహారమునైనను పెట్టు
కొనగలనా?...దెబ్బతిన్నవాడు, దానికి బదులు పదిదెబ్బలను,
రెట్టించిన తీవ్రతతో, వడ్డింపవలయును...అప్పుడే వాడు మానవుడు
అగును...పిఱికివాడు శోచనీయుడు.

నేను మిమ్మందఱిని ఆశీర్వదింతును. ఈదినమున, లోక
మాతకు పవిత్రమైన ఈదినమున, ఈరాత్రి అమ్మ మీ హృదయా
లలో నృత్యముచేసి, మీ బాహువులకు అనంతశక్తిని గలిగించును
గాక. జయము కాళికి! జయము కాళికి! అమ్మ నిజముగా దిగిరా
గలదు, గొప్ప బలముతో సమస్తవిజయమును, లోకవిజయమును
కలిగించును. అమ్మవచ్చుచున్నది, భయమేమున్నది? ఎవరికి భయ
పడుట? జయము కాళికి! మీ యొక్కొక్కని యడుగడుగునను
భూమి వణకగలదు...జయము కాళికి! మరల పదండి పైకి, పదండి
ముందుకు! జయము గురునకు! జయము మాతకు! కాళి! కాళి! కాళి!
రోగము, దుఃఖము, అపాయము, దుర్బలత ఇవన్నియు మీ యందఱి
నుండియు విడిపోయినవి. సమస్తవిజయము, సమస్తమైన మంచి అదృ
ష్టము, సమస్తసంపద మీది. భయపడకుడు! భయపడకుడు! విప
ద్భయము మాయమగుచున్నది! భయపడకుడు! జయము కాళికి!
జయము కాళికి!

వివేకానంద.

మలిమాట :—నేను అమ్మ సేవకుడను. మీరు రందఱును అమ్మసేవకులరు. మనకు ఏమి నాశనము, ఏమి భయము ఉన్నది? అహంకారమును మీ మనసుల చేరనీకుడు. మీ హృదయముల నుండి ప్రేమను ఎప్పుడును పోనీకుడు. ఏ నాశనము మీ జోలికి రాగలదు? భయము చెందకుడు. జయము కాళికి! జయము కాళికి!

వి.

## 441

(కుమారి మేరీ హేలుకు)

1, తూర్పు 39 వీథి న్యూయార్కు,
నవంబరు 20, 1899.

నా ప్రియ మేరీ,

నేను బహుశః రేపు కాలిఫోర్నియాకు బయలుదేఱుదును. దారిలో ఒకటి రెండు దినాలు చికాగోలో నిలిచెదను. నేను బయలుదేఱునపుడు నీకు తంతివార్త పంపుదును. నా దారి ముందు వెనుకలు ఇంతగా తడవుకొనవలసిన యిట్టిస్థితిలో నేను ఎన్నడును ఉండలేదు. కనుక ఎవరినైనను స్టేషనుకు పంపుము.

సదా భవదీయసోదర,
వివేకానంద.

## 442

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

21, పడమర 34 వీథి,
న్యూయార్కు,
నవంబరు 21, 1899.

నా ప్రియ బ్రహ్మానందా,

లెక్కలు అన్నియు సరిగా ఉన్నవి. నేను వానిని శ్రీమతి బుల్సతిచేతికి ఇచ్చివేసితిని. ఆమె వానినిగైకొని యందలి వివిధ భాగములను ఆయాధర్మదాతలకు ఎఱిగింప నంగీకరించినది. ఇంతకుపూర్వము కఠినముగా వ్రాసిన జాబుల విషయముల మనసున ఉంచుకొనకుము. అవి నీకు మేలుచేయును. మొదటిది—

అవి నిన్ను భవిష్యత్తున చక్కని వ్యాపారాధ్యానిగా ఏదినపు లెక్కలు ఆదినము వ్రాయుటకును వానిని విశదముగా ఉంచుటకును సమర్థునిగా నీ సోదరులనందఱను అందు చేర్చుకొనువానినిగాను చేయును. రెండవది ఈ నా మంగళింపులు నిన్ను ధైర్యశాలిని చేయవేని, ఇక నిన్నుగూర్చి నాకు ఏ యాసపాటును ఉండబోదు. నేను నీవు చచ్చినను చూడగోరుదును, కాని నీవొకపోరాటము పోరాడవలయును. యుద్ధభటునివలె ఆజ్ఞలపాటించుచు, మరణింపుము, నిర్వాణము చెందుము. కాని పిఱికితనముమాత్రము పెట్టుకొనకుము.

నేను కొంతకాలము అదృశ్యుడనై యుండుట ఆవశ్యకముగా ఉన్నది. ఆ సమయమున నాకు ఎవనిని జాబు వ్రాయనీకుము, నన్ను ఎవనిని వెదకుకొని రానీకుము. నా యారోగ్యమునకు అది మిక్కిలి ఆవశ్యకముగా నున్నది. నాకు నరముల బలహీనత మాత్రమే, అంతకన్న ఎక్కువ దేమియు లేదు.

దీవెనలన్నియు నిను వెన్నంటును. నా పారుష్యమును మనసున ఉంచుకొనకుము. నా పెదవులు ఏమిపలికినను, నా హృదయమును సదా నీవు ఎఱుగుదువు. అన్ని దీవెనలు నీకే. నేను, దాదాపు ఒక సంవత్సరముగా నా తెలివిలోనే లేను. అందులకు కారణమేమో నేను ఎఱుగను. నేను ఈ నరకముగుండ పోవలసి యుండినది, పోయితిని. నాకు ఇపుడు చాల మేలుగా ఉన్నది. మేలేమి, నిజముగా పూర్ణారోగ్యమే కలిగియున్నది. ప్రభువు మీకందఱకు సాయపడును గాక. నేను శాశ్వతవిరామము పొందుటకై త్వరలోనే హిమాలయములకు పోవుచున్నాను. నాపని సమస్తము చేసివేసితిని.

సదా భవదీయ భగవద్గత,

**వివేకానంద.**

మలిమాట శ్రీమతి బుల్బతి తన ప్రేమను అందించుచున్నది

వి.

## 443

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

ఫ్రా. హి. లెగ్గెట్టు ఇల్లు,
21, పడమర 34 వ వీథి,
న్యూయార్కు.
నవంబరు, 1899.

నా ప్రియ స్టర్డి,

ఇది నా ప్రవర్తనమును సమర్థించుటకు కాదు. నేను చేసిన దోషములను మాటలు తుడిచి వేయజాలవు. నే నేవేని మంచిపనులు చేసియున్న, వాని ఫలము నాకు చెందనీక ఏ విమర్శకుడును ఆప జాలడు.

ఈ కడచిన కొన్ని నెలలుగా పాశ్చాత్యజనులు నాకు అనుభవార్థమై యొసంగిన విశేషభోగములను గూర్చి ఎంతయో ఎక్కువగా వినుచున్నాను. ఎల్లప్పుడు వైరాగ్యమును ఇతరులకు బోధించుచు వంచకుడనగు నేను మాత్రమే ఆ భోగములను అనుభవించుచుంటినట! ఆ భోగానుభవమే నాకు దారిలో, కనీసము ఇంగ్లండులోనైనను తడశాటునకు కారణమైనదట.* భయంకరముగా శావురుమనుచుండు నా జీవితపు ఎడారిలో ఒక చిన్న చల్లని చలిచెలమయైనను ఉండెను గదా, దుఃఖతమోమయమగు నా జీవితమునకంతటికి వెలుతురు మిణుక్కుమను ఒక్క చిన్న చోటు ఉండెను గదా, కష్టకార్యమును, కష్టతరశాపములును గల నా జీవితమున హాయిగా బడలిక తీర్చుకొను ఒక్కక్షణము ఉండెనుగదా అను నమ్మకముగల నిదురమైకమున పరవశుడనైతిని. ఆ చలిచెలమయు ఆ వెలుగుచోటును, ఆ క్షణమును కేవలము ఇంద్రియానుభవములే!

నేను సంతసించితిని. దానిని పొందుటకు నాకు సాయపడినవారిని దినమునకు నూఱుసార్లు దీవించితిని. ఇంతలో ఆహా ఉన్నట్టులుండి నీ కడచినజాబు పిడుగుపాటువలె వచ్చినది, నా కల మాయమైనది. నేను నీ విమర్శలయందు నమ్మకము వీడ నారంభించితిని.

ఈ భోగములు సుఖానుభవములు ఇంకను స్మృతిలేపు ఇతర దర్శనములు అనువానినిగూర్చిన ఈ విషయములలో నాకు నమ్మకము బొత్తిగా పోయినది. ఇది నేను చెప్పునది. దీనిని నీవు, తగునని తలంతువేని, మిత్రుల కెఱిగింతువనియు, నా మాట తప్పుగానున్న చోట సవరింతువనియు నా ఆస.

రీడింగులో నీవున్న చోటు నాకు చక్కగా జ్ఞప్తియందున్నది. అక్కడ ఉడికించిన కాబేజితోను ఉడికించిన ఉర్లగడ్డలతోను, వండిన అన్నముతోను వండిన లెంటిల్ పప్పుతోను, సదా పులుసు కోసము పెట్టు నీభార్య తిట్లతోను నాకు దినమునకు మూడుసార్లు అన్నము పెట్టినారు. నాకు నీవెపుడును ఒక చుట్టను, రూపాయ వెల గలదానినిగాని అణా వెలగలదానినిగాని, ఇచ్చినట్లు జ్ఞప్తి లేదు. నేను ఆ యన్నమును గూర్చిగాని నిరంతరముగ నీభార్య తిట్టుతిట్లను గూర్చిగాని పిర్యాదు చేసినట్లుగాని మొఱపెట్టినట్లు గాని నాకు జ్ఞప్తి లేదు. అంతకాలము నేనొక దొంగవలె బ్రతికితిని, సర్వకాలము భయముతో వణకితిని. అట్లే నీకై ప్రతిదినము పనిచేసితిని.

అటుపిమ్మట నీవును కుమారి ముల్లరును పెద్దలుగా నుండిన సెంటుజార్జి రోడ్డుమీది యిల్లును నా స్మృతిపథమున నున్నది. సహాయుడగు నా తమ్ముడు అక్కడ జబ్బుగా నుండెను. మఱి వానిని ...తఱిమివేసెను. అక్కడను కూడ నా అన్నపానములు, పడుక, నా కిచ్చిన గది అను వీనిలో దేనియందును నేను భోగానుభవము నందినట్లు నాకు జ్ఞప్తిలేదు.

దాని తరువాతిది కుమారి ముల్లరు స్థానము. ఆమె నాయెడ చాల దయగలిగియున్నను, అక్కడ నేను పప్పుదినుసులు పండ్లు తిని జీవించుచుంటిని. దాని తరువాత నా జ్ఞప్తిలో నున్నది లండను చీకటిగది అక్కడ నేను చాలవఱకు రాత్రింబగళ్ళు చాకిరిచేసి, పలుమాఱు ఐదాఱుగురికి అన్నము వండిపెట్టి, రాత్రులలో చాలవఱకు ఒక రొట్టెముక్కతోను, వెన్నతోను గడపుకొనవలసియుండెను.

శ్రీమతి నాకు ఒక విందును ఒకరాత్రి ఉండను చోటును తనయింట ఇచ్చి, మఱునాడు 'ఈ నల్లని యనాగరకుడు, ఈ ముఱికి వాడు, చుట్టకాల్చి ఇల్లంతట పొగనింపినాడు' అని చీవాట్లు పెట్టుటను నేను స్మరించుచున్నాను. కెప్టెన్ సేవియరును ఆతని భార్యయు తప్ప, నేను ఇంగ్లండులో చేతిగుడ్డపాటి పేలికనైనను పొందినట్లు నాకు జ్ఞప్తి లేదు. దానికి ప్రతిగా, ఇంగ్లండులో నా దేహము మీదను మనసుమీదను నిరంతరము వారికి ఉండిన సాధికారమగు అక్కఱ నా యారోగ్యము చెడుటకు కారణమయినది. నన్ను చచ్చునంతవఱకును పనిగొనుచు, నాకు ఇంగ్లీషుజనులగు మీరు, ఒసంగినది యింతయే. మఱి యిప్పుడు నేను మునిగి తేలిన భోగములకై మీచే శపింపబడుచున్నాను! మీలో ఎవరైనను నాకు ఒక 'కోటు' ఇచ్చినారా? ఒకచుట్ట నిచ్చినారా? ఎవరైనను ఒక చేపముక్కగాని ఒక మాంసపుముక్కగాని ఇచ్చినారా? మీలో ఎవరైనను చెప్పగలరా, మీలో ఎవరినైనను అన్నముగాని నీరుగాని చుట్టగాని బట్టగాని డబ్బుగాని అడిగితినని చెప్పగలరా? అడుగుము, దేవుని కోసము అడుగుము, నీ మిత్రులను అడుగుము, అంతకన్నను మొట్టమొదట నీయంతరంగములోని దేవుని, ఎప్పుడును నిదుర ఎఱుగని ఆ దేవుని అడుగుము.

నీవు నాపనికై డబ్బు ఇచ్చితివి. చూచుకో, అందు ప్రతి పెన్నీ అక్కడ ఉన్నది. నీ కనులయెదుటనే నేను నా సోదరుని పంపివేసితిని, దానిచే ఒకవేళ వానికి చావే మూడునేమో! అది నా సొంత ఆస్తి కానందున నేనతనికి ఒక్క ఫార్తింగుకూడ ఆ ధనము నుండి ఈయనైతిని.

అందులకు విపరీతముగా, నాకు జ్ఞప్తియున్నది, ఇంగ్లండులో కెప్టెన్ సేవియరు ఆయన శ్రీమతియు నాకు చలిగా ఉన్నప్పుడు నాకు గుడ్డలు కట్టుకొనబెట్టినారు. నా కన్నతల్లికన్నను ప్రీతిగా నాకు పరిచర్యలు చేసినారు, దోషములను ఓర్చుకొన్నారు. వారు నాకు శుభాశంసల నొసగిరే కాని మఱి యితర మేమియు కాదు. ఆ శ్రీమతి సేవియరు,

ఆమె గౌరవమును లక్ష్యపెట్టనందున, ఈ దినము వేలకొలది జనుల పూజలను అందుకొనుచున్నది. ఇక ఆమె చనిపోయినపుడు కోట్ల కొలది జనులు నిర్భాగ్యపు ఇండియాజనుల మహోపకారిణి అని ఆమెను మనస్సునందు సదా జ్ఞప్తి ఉంచుకొందురు. మఱి నేను కోరుదు నేనియు నాకు అక్కఱ కలుగునేనియు, నాకు భోగములు సమకూర్ప వారు సిద్ధముగా నుండిరే కాని నా భోగములకై నన్నెప్పుడును తిట్ట లేదు.

నేను నీకు శ్రీమతి బుల్సతిని గూర్చియు, కుమారి మెక్లియ డును గూర్చియు, శ్రీమంతులు లెగ్గెట్టు దంపతుల గూర్చియు చెప్ప నక్కఱలేదు. నాయెడగల వారి ప్రేమను దయను నీవు ఎఱుంగుదువు. శ్రీమతి బుల్సతియు కుమారి మెక్లియడును మా దేశమునకు వచ్చి నారు. ఏ విదేశీయులును ఎన్నడును చేయనట్లు, అన్నిటికిని ఓర్చుకొని మాతో కలసి మెలసి మెలగినారు, జీవించినారు. వారెన్నడును నన్నుగాని నా భోగానుభవములనుగాని తిట్టలేదు. అంతేకాదు, ఎంత యో అతి సంతోషముతో నన్ను బాగుగా తిననిత్తురు, కోరుదునేని డాలరు నెలచేయు చుట్టలను గూడ త్రాగనిత్తురు. నేను మీ జనుల కొసము నన్ను చంపుకొనుచుండగా, ఆ ముఱికిగుంట కొసమును నా వస్తులకొసమును మీరు నా వీసెడు మాంసమును కొనుచుండ గా, ఈ భోగాల దోషారోపణను తరువాత నాకు వడ్డింపను మీరు సేకరించుకొనుచుండగా, ఈ లెగ్గెట్టులును బుల్లులును మాత్రమే నాకు తినను రొట్టె, వీపును కప్పుకొనను గుడ్డలు సరఫరా చేయుచు, త్రాగుటకు చుట్టలకగు ధనమును పంపుచు, పలుమాఱు నాయున్న చోటికి అద్దె చెల్లించుచు పోషించిరి.

ఆ. *పంటకారుమబ్బు వర్షింప నేఱదు
గర్జ సేయుచుండుఁ గాని కరము,
వానకాలమందు వర్షించు మేఘంబు
గర్జనంబొ కించుకైన లేక॥

---

* పంటకారు శరదృతువు.

ఇది చూడుము. సాయము ఇదివఱకు చేసినవారును ఇపుడింకను చేయుచున్నవారును ఆక్షేపించుట లేదు, శపించుట లేదు ఏమియు చేయనివారే, మంచిమాటలు చెప్పి మనవలన తమపనుల చక్క బెట్టుకొనువారే తిట్టుదురు. ఆక్షేపింతురు. అట్టి పనికిమాలిన హృదయములేని స్వార్థపరములగు, శిథిలములగు ఆక్షేపణలే నాకు రాగల ఉత్తమోత్తమమగు దైవానుగ్రహము. ఇట్టి అతిమాత్రపు స్వార్థపరులకును ఆత్మకార్యసాధకులకును వంచకులకును మైళ్ళ కొలదిదూరముగా నుండుటకంటె నాకు జీవితమున అంతగా కావలసినది మఱేదియు లేదు.

భోగములనుగూర్చి మాటలాడుటయా! ఈ విమర్శకులను ఒకరివెనుక ఒకరిని లోగొనుము. అంతయు పట్టిమాంసము, అంతయు పట్టిమాంసమే, తేజోవీర్యాత్మలలో ఏదియు ఎక్కడను అగపడదు. ప్రభో నమస్కారము! వారు త్వరగానో ఆలస్యముగానో ఎప్పుడో తమ స్వస్వరూపములతో బయటపడుదురు. వారిరంగు తెలిసిపోవును. ఇకను అట్టి నిర్దయులును స్వార్థపరులును, అగు జనులకోరికల మేరకు నా నడవడిని నా పనిని సరిపెట్టుకొమ్మని ఉపదేశింతువా! అట్లు నేను కావింపమికి మఱేమియు ఉపాయము తోపక ఉన్నావు!

నా సోదరశిష్యుల విషయమా నేను వారిని చేయుమని గట్టిగా చెప్పినదానిని తప్ప మఱి దేనిని వారు చేయరు. వారెందేని ఏ స్వార్థపరతనేని ప్రకటించియుందురేని, అది నేను వారికి అట్లు చేయుడని ఆజ్ఞాపించుటచేతనే. వారు సొంతముగా స్వబుద్ధితో చేయునది కాదు.

నీవు నాకై లండనులో ఏర్పఱచిన చీకటికోనలో నన్నుంచి, నాచేత చచ్చునంతపని చేయించుచు చాలవఱకు పస్తులు పెట్టితివి గదా! ఆ చీకటికోనలో నీ పిల్లల నుంచుటకు నీ విష్టపడుదువా?

శ్రీమతి అందులకు ఇష్టపడునా? వారు సన్న్యాసులు. అందుల యర్థమేమనగా, ఏ సన్న్యాసియు తన జీవితమును వృథాగా గడప గూడదు, అనావశ్యకమైన కష్టమునకు పూనుకొనగూడదు.

మేము పడమటి దేశాలలో ఈ కష్టములకు లోనగుచు సన్న్యాస సంప్రదాయముఁను ఉల్లంఘించుచుంటిమి. వారు నా తోబుట్టువులు, నా బిడ్డలు. వారు నాకోసము ఇట్టి కోనలలో చావ గోరను. శ్రేయస్సును సత్యమును బట్టి నేను వారిని, తమ కష్టము నకు అదియే ఫలము కాదగినట్లు, ప్రస్తుతుండి పనిచేసి తిట్లుతిన గోరనే కోరను.

ఇక నొక్కమాట. నేను ఈ మాంస(మయ దేహ)మును యాతనపాలు గావింపవలసినదని ఎందు బోధించితినో నీవు చూప గలుగుదువేని చాల చాల సంతోషింతును. శాస్త్రములకా, ఎవ డేని శాస్త్రి మెఱిగిన పండితుడు శాస్త్రి సన్న్యాసులకును పరమహంసలకును ఏర్పాటుపబడిన శాసనములను చూపి మమ్ము ఎదిరింప ధైర్యము వహించునేని నేను ఎంతో సంతోషింతును.

మంచిది...నా హృదయమున బాధ గలుగుచున్నది. నాకు అంతయు అవగతమగుచున్నది. నీవు దేనియందు ఉండునది నేను ఎఱుగుదును నిన్ను వాడుకొనగోరు జనుల పిడికిళ్ళలో నీవు ఉన్నావు. అనగా నీభార్య పిడికిటఅని కాదు నా భావము. ఆమె అపాయకరముగా ఉండజాలని వట్టి బేల. అయ్యో, అబ్బాయీ నీవద్ద మాంసపు కంపు - అనగా ధనము ఉన్నది. నీచుట్టును గద్దలున్నవి! జీవితమట్టిది!

పురాతనపు ఇండియాను గూర్చి నీవు ఎంతో చెప్పితివి. ఆ యిండియా ఇంకను సజీవమైయున్నది. మరణింపలేదు. సప్రాణ మగు ఆ ఇండియా నేడుకూడ తనకాళ్ళకు సంకెళ్ళు వేయబడి యున్న దేశమునగాని, ఆ గొలుసుల అవతలికొనను చేత పట్టుకొని యున్న తన ప్రభువుల యెదుట, వారి మొగాననే, కాని, నిర్భ యముగ, ధనికుల యనుగ్రహమును సరకుసేయక, తన సందేశము

నందింప ధైర్యము వహించియున్నది. ఆ యిండియా యింకను బ్రదికియున్నది...నాశరహిత ప్రేమమయి యగు ఇండియా, శాశ్వత విశ్వాసయుత, ఆచారవ్యవహారవేషభాషలం దేకాక ప్రేమయందును, విశ్వాసమందును, స్నేహమందును మార్పు నొందింప నలవిపడనిది! ఇక ఆ యిండియా బిడ్డలలో కనిష్ఠుడనగు నేను నిన్ను ప్రేమింతును ...[ఇండియా జనని ప్రేమతో] నీవు ఈ భ్రాంతినుండి వెలువడుటకు నీకు సాయపడుటకై ఎన్నడైనను వేయిదేహములనైనను అర్పింతును.

సదా భవదీయ,
వివేకానంద.

## 444

(శ్రీమతి లెగ్గెట్టుకు)

చికాగో
నవంబరు 26, 1899.

నా ప్రియ శ్రీమతి లెగ్గెట్సతి,

నీ సమస్తకారుణ్యమునకు, ముఖ్యముగా కారుణ్యముతోడి నీ లేఖకు, అనేక ధన్యవాదములు. నేను చికాగోనుండి పై గురువారము బయలుదేఱనున్నాను. నాకు ఆ దినమునకు టిక్కెట్టును బండిలో పరుండుటకు చోటును సిద్ధపఱుపబడి యున్నవి.

కుమారి నోబులు ఇక్కడ సర్వథా క్షేమముగా ఉన్నది. తనదారికి వలసినదంతయు సమకూర్చుకొనుచున్నది. మొన్న ఆల్బర్టాను చూచితిని. ఆమె కిక్కడనున్న ప్రతినిమిషమును భోగ్యముగ నున్నది; చాల సుఖముగా ఉన్నది. కుమారి ఆడమ్సు ఎప్పటివలె ఒక దేవతగా ఉన్నది.

నేను బయలుదేఱుటకు ముందు జోజోకు తంతివార్త పంపుదును. బయలుదేఱి రాత్రియంతయు చదువుదును.

శ్రీ లెగ్గెట్టునకును నీకును సర్వప్రేమ.

సదా ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 445

(శ్రీమతి లెగ్గెటునకు)

చికాగో
నవంబరు 30, 1899.

నా ప్రియజననీ,

కాల్వమ్మ నన్ను చూడను వచ్చుటతప్ప క్రొత్తది ఏదియు లేదు. ఆమె చాల గొప్ప స్త్రీ. నేను ఆమెను ఇంకను ఎక్కువగా మేలనుకొందును. చాలపెద్ద దేవదారువృక్షము తుపానుతో పోరాడుట దివ్యదృశ్యము!

——నేను ఇక్కడినుండి ఈరాత్రి బయలుదేఱుదును. ఇదిగో ఆ కాచుకొనియున్నది. కావున ఈ బంతులు చాల తొందరలో వ్రాయుచున్నాను. శ్రీమతి ఆడమ్సు ఎప్పటివలె దయామతిగ ఉన్నది. మార్గట్ సుస్థితి దివ్యముగా ఉన్నది. కాలిఫోర్నియానుండి ఇంకను ఎక్కువగా వ్రాసెదను.

ఫ్రాంకిన్సెన్సుకు సమస్త ప్రేమ.

సదా నీపుత్రుడు,
వివేకానంద.

## 446

(సోదరి నివేదితకు)

లాస్ఏంజలిస్
డిసంబరు 6, 1899.

ప్రియమార్గట్,

నీ యుత్తరవు అందినది. అయినను దానితో ఇప్పటికి నా యదృష్టమున ఏమియు మార్పు కలుగలేదు. మార్పు ఏమేని మేలగునా? అగునని నీవు భావింతువా? దుఃఖజీవనమును ప్రేమించుటకే కొందఱు సృష్టింపబడియున్నారు. నేను ఎవరిమధ్య జన్మించితినో వారిపై వారికోసము, నా హృదయమును పగులగొట్టు కొనకపోయితినేని, ఆ పనిని మఱియొకరికోసము చేసెదను. ఆ విషయమున దృఢనిశ్చయముతో ఉన్నాను. ఇది కొందఱి మార్గము. నేను

క్రమముగా దానిని కనుగొనుచున్నాను. మనమందఱము సౌఖ్యాన్వేషులమే, నిజమే, అయినను కొందఱు దుఃఖానుభవముననే సౌఖ్యమనుభవింతురు. అది వింతకదా ? అందును ఏమియు హానిలేదు, సుఖదుఃఖములు రెండును సంశ్లిష్టములు. ''నేనే దేవుడనగుదునేని అంటుకొని వ్యాపించుగుణమును రోగమునకుపెట్టక ఆరోగ్యమునకే పెట్టుదునని ఇంగర్సాలు ఒకప్పుడు చెప్పెను. పాపము, అతడు ఆరోగ్యముకూడ రోగముతో సమానముగనో ఇంకను ఎక్కువగనో అంటుకొని వ్యాపించునని కలలోనైనను ఎఱుగడాయెను. అట్లంటుకొని వ్యాపించుటే అపాయము. నేను సుఖముగానున్నను, దుఃఖముగా ఉన్నను, దానివలన లోకమునకు హానిలేదు. కాని ఇతరులకు ఆ సుఖదుఃఖములు అంటుకొని వ్యాపింపగూడదు. ఇదియే గొప్పసత్యము. భగవత్ప్రేరితుడగు ప్రవక్త మానవుని స్థితికై దుఃఖము చెందగానే అతడు తనమొగమును కోపముతోను దుఃఖముతోను కర్కశము చేసికొనును, ఱొమ్ము బాదుకొనును, ప్రతివానిని పండ్లుపులిసిపోవు పుల్లని రసమును త్రాగుమనును, నల్లబొగ్గును నమలుమనును, బూడిదెకమ్మిన పేడపెంట దిబ్బపై కూర్చుండుమనును, మూలుగులతోను కన్నీళ్లతోను మాటలాడుమనును! నాకుచూడ అవేవియు లేవు. అవును, లేవు నీవు నిజముగా లోకభారము మోయుటకు సిద్ధముగా నున్నావా, సర్వథా అట్లే మోయుము. కాని నీ మూలుగులు ఏడ్పులు తిట్లు మా చెవిని పడనీకుము. నీ బాధలతో మమ్ము బెదరింపకుము. అందువలన, మా బరువులు మాకున్నను, నీకన్న మేలుగా నున్నట్లు మాకుతోచును. నిజముగా ఈ బరువును భరించువాడు లోకమును దీవించి తనదారిని పోవును. ఒకరినిగూర్చి ఒక్క దూషణవాక్యము పలుకడు, ఒక్క ఆక్షేపణ చేయడు. లోకమున చెడుగు లేకుండుటవలనగాదు అతడట్లుండుట తాను తనంతట తన యిచ్ఛమెయి తానే దానిని తలపై వేసికొన్నందువలన. రక్షకుడే తనదారిని సంతోషించుచు పోవలసినవాడు, రక్షితుడుగాడు.

ఈ యుదయము నేను గ్రహించిన వెలుగు ఇది ఒక్కటియే. ఇది నా జీవితమున జొచ్చి నాలో ఉండిన చాలును.

మోయలేని బరువులు మోయుచుండు మీరు రండు, ఆ బరువులనెల్ల నా తలపై పెట్టుడు, తరువాత మీ కిచ్చవచ్చినదానినెల్ల చేయుడు, సుఖముగా నుండుడు అన్ను మాత్రము, నేను ఎన్నడును లేనియట్లే, మఱచిపోండు.

సదా ప్రేమయుత భవదీయ పిత,

వివేకానంద.

## 447

(శ్రీమతి బుల్లతికి)

డిసెంబరు 12, 1899.

నా ప్రియబుల్లతి,

నీమాట పూర్తిగాసరి. నేను నిజముగా మృగప్రాయుడను. మఱి మృదుత్వము మున్నగువానిలో నాదే తప్పు. నాకు అది తక్కువగా, చాల తక్కువగా ఉండరాదా అని నా కోరిక. అది నా దోషము, మఱియు అయ్యో, నా బాధలన్నియు దానివలన కలిగినవి. మంచిది, మునిసిపాలిటివారు మన దోషము తీఱునట్లుగా పన్ను విధించుచున్నారు, మేలు. అది నాదోషము. నేను మఠమును ఇల్లడపత్రము ద్వారా ప్రజల ఆస్తిగా చేయనైతిని. నేను నా బాలురవిషయమున పరుషము లాడినందులకు చాల దుఃఖము చెందుచున్నాను. నేను ఈ ప్రపంచమందు ఇతరుల ప్రేమించినంతకన్నను తమ్ము ఎక్కువగా ప్రేమింతునని వారును ఎఱుగుదురు. నాకు దేవతలసాయము ఉండియుండవచ్చును. నిజమే. కాని, అహో, దేవతలసాయమునందలి ప్రతిలవము నాకు ఒక సేరు నెత్తురు ఆయెను. అది లేక యుండియున్నచో, నేను ఇంతకన్న సంతోషముగా, ఇంతకన్న మంచి మనుష్యుడనుగా ఉండియుందును. వర్తమానము నిజముగా చాల తమోమయముగా, చింతా బహుళముగా అగపడుచున్నది. కాని నేను యోధుడను,

యుద్ధముసేయుచు ప్రాణము విడువవలయును. అంతేకాని, లొంగ
రాదు. నేను నా బాలురయెడ ఉన్మత్తుడనగుటకు అదియే కారణము.
వారిని నేను పోరాడగోరను గాని, నా పోరాటమునకు అడ్డుతగుల
వద్దు అని యందును.

నావిధికి నేను సణుగను. కాని ఓహో, ఇపుడు నాకు
ఒక మనుష్యుడు, నా బాలురలోనే ఒకడు నా ప్రక్కన నిలిచి
ఇన్ని గొప్ప ప్రతికూలములను ఎదుర్కొని పోరాడుటకు కావల
యును. నీవేమియు విసుగు, కోపము చెందకుము. ఇండియాలో ఏమేని
చేయవలసియున్న, నా సాన్నిధ్యము ఆవశ్యకము. నాకు ఆరోగ్యము
మునుపటికంటె చాల మేలుగానున్నది. సముద్రము నాకు ఇంకను
మేలు కలిగింపగలదని అనుకొందును. ఎట్లైనను, కొందఱు స్నేహి
తులకు కొంత చీదరకలిగించి బాధపెట్టుట తప్ప ఈసారి నేను అమె
రికాలో ఏమియు చేయలేదు. సాధ్యపడినంతవఱకు జో నాకు దారి
ఖర్చుపెట్టి నన్ను సాగనంపుననుకొందును. నాకు (శ్రీ) లెగ్గెట్టువద్ద
కొంత పైకము ఉన్నది. నేను ఇండియాలో ఇంకను కొంతపైకము
వసూలు చేయగలనను ఆశలు ఉన్నవి. నేను ఇండియాలో నలు
వైపులనున్న నా స్నేహితులను ఎవ్వరిని చూడలేదు. ఏబది
వేలు పూర్తియగుటకు కావలసిన పదునైదువేలు నేను వసూలు
చేయగలనను ఆశ నాకు ఉన్నది. ఇల్లడపత్రము వ్రాసి ఒప్ప
గించినట్లైన మునిసిపలుపన్నులు తగ్గిపోవును. దానిని నేను వసూలు
చేయలేకున్న, ఇక్కడ అమెరికాలో వృథాగా కాలక్షేపము
చేయుటకంటెను అచటికిపోయి అందులకై పోరాడి చచ్చుట
మేలు. నేను చేసినతప్పులు గొప్పవే. అయినను అందు ప్రతిదియు
అతి ప్రేమవలన కలిగినదే. ప్రేమను నేను ఎంత ద్వేషింతును!
నాకు ఎన్నడును భక్తిలేకుండ ఉండియుండగూడదా! నేను
ప్రశాంతుడును హృదయరహితుడునగు అద్వైతిగా, ఉండవలయు
నని నిజముగా కోరుదును. మంచిది, ఈ జీవితము గడచిపోయి
నది. పై జన్మమున ప్రయత్నింతును. ఎప్పటికంటెను విశేషముగా

ఇప్పుడు, మిత్రులను దీవించినంతకంటెను, వారికి ఎక్కువ హాని కలిగించితినని నేను దుఃఖపడుచున్నాను. నేను వెదకుచున్న నెమ్మదిగాని శాంతిగాని ఎన్నడును నాకు కనిపింపలేదు.

కొన్ని సంవత్సరములకు పూర్వము నేను మరలిరాగూడదు అని తలంచి హిమాలయములకు పోయితిని, నా చెల్లెలు ఆత్మహత్య చేసికొన్నది. ఆ వృత్తాంతము అక్కడికి అందినది. అంతట ఆనా దుర్బలహృదయము శాంత్యాశనుండి నన్ను ఇవతలికి విసరి వేసినది! ఆ దుర్బలహృదయమే నేను ప్రేమించువారికి కొంత సాయము వెదకుటకై నన్ను ఇండియానుండి తఱిమినది. అంతట ఇక్కడ ఉన్నాను! శాంతికై వెదకితిని. కాని నా హృదయము, ఆ భక్తిస్థానము, నన్ను దానిని కనుగొని అనుభవింపనీయలేదు. అంతయు పోరాటము, యాతన! యాతన, పోరాటము! సరే, అది అట్లు ఉండనీ. ఏలన అది నా తలవ్రాత. అదియెంత త్వరగా తీఱిపోయిన, అంత మేలు. నేను చపలచిత్తుడను అందురు. కాని సందర్భములను పరికింపుడు! నేను నీకు, అందఱికంటెను నీకు, నామీద అంత ప్రేమగల నీకు, నామీద అంతటి దయగల నీకు బాధకు కారణమైతినని దుఃఖించుచున్నాను. కాని అది జరిగినది. అది నిజముగా జరిగిపోయిన సంఘటన. ఆ ముడివడ్డ కష్టమైనపనిని ఇదె సాధింతును, లేకున్న ఆ ప్రయత్నమున ప్రాణములు విడుతును.

ఎప్పుడు నీ కొమారుడను,

వివేకానంద.

మఱిమాట అమ్మ అది కావలయుననుచున్నది, కావున దానిని ఉండనిమ్ము. నేను సాన్ఫ్రాన్సిస్కోగుండ ఇండియా చేర నగు దారి ఖర్చును జోను అడుగబోవుచున్నాను. ఆమె దానినిచ్చు నేని నేను తక్షణమే జపానుగుండ బయలుదేఱుచున్నాను. అది ఒక నెల పట్టును. పరిస్థితిని చక్కజేయుటకును లేక ఇంకను మేలిస్థితిలో నుంచుటకు లేదా కనీసము సమస్తమును గజిబిజిగా కననైనచో అట్లే వానిని విడుచుటకును ఇండియాలో నేను కొంతధనము ప్రోగు

చేయగలనని తలంతును. అంతము అత్యంత తమోమయము అగుచున్నది. సమస్తము మిక్కిలి గజిబిజియగుచున్నది. సరే. అట్లు కాదగునని నేను ఎదురుచూచితిని. నేను క్షణములో లొంగిపోవుదునని అనుకొనకుము. ప్రభువు నిన్ను అనుగ్రహించునుగాక. ప్రభువు నన్ను తనకై పనిచేసి వీథులలో చావవలయు తనకూలి గుఱ్ఱముగా చేసియున్న అట్లే జరుగనిమ్ము. నేను నీజాబును చూచినతర్వాత, ఇప్పటికి కొన్నియేండ్లుగా ఉండనంతకన్నను, ఇప్పుడు సంతోషముగా ఉన్నాను. జయము గురువునకు! అవును, లోకము ఎదిరించినను, నరకములు ప్రాప్తించినను, దేవతలు మారొన్నను, అమ్మయే యెదురొన్నను నేను పోరాడుదును గాని లొంగిపోను. రావణుడు మూడుజన్మములలో ప్రభువుతో యుద్ధముచేసి మోక్షము పొందినాడు! అమ్మతో పోరాడుట ఎంతయో కీర్తికరము.

నీకును నీవారికిని సమస్తాశీస్సులు. నీవు నా కోసము నా అర్హతనుమించి ఎక్కువగా, చాల ఎక్కువగా చేసితివి.

క్రిస్టినుకును తురీయానందునికిని ప్రేమ.

వివేకానంద.

## 448

(శ్రీమతి ఓల్బుల్సతికి)

డిసెంబరు 22, 1899.

నా ప్రియ ధీరమాతా,

నాకు ఈ దినము కలకత్తానుండి ఒకజాబు వచ్చినది. దాని వలన నీ చెక్కులు చేరినవని తెలిసినది, మెచ్చు ధన్యవాక్కులును కృతజ్ఞతావాక్కులు కూడ వచ్చినవి.

లండనుకు చెందిన కుమారి సౌటరు అచ్చువేసిన 'నూతనవత్సరాభినందనముల'ను, నాకు పంపినది. నీవు ఆమెకు పంపిన లెక్కలు ఆమెకు ఇప్పటికి చేరియుండవలయునని తలంతును.

మీ యింటికిచేరిన శారదానందుని జాబులను దయతో నాకు పంపుము.

నన్నుగూర్చి చెప్పుటకు నాకు ఇటీవల మరల రవంత మొదటికివచ్చినది, దానికై వైద్యుడు నాలోలును పెక్కు అంగుళములు లేచిపోవునట్లు లోమివేసినాడు.

ఇప్పుడే నాకు ఆ మంట తెలియుచున్నది. మార్గోవద్దనుండి నాకు మిక్కిలి ఆశాజనకమగు జాబు వచ్చినది. నేను పసదేనాలో శ్రమపడుచున్నాను. ఇక్కడి నా పనివలన కొంచెము ఫలము కలుగునని తలంచెదను. ఇక్కడ కొంతమంది మిక్కిలి ఉత్సాహవంతులుగా ఉన్నారు. రాజయోగ గ్రంథము నిజముగా ఈ తీరమున చాలసేవలు చేసినది. నేను మానసికముగా చాల బాగుగా ఉన్నాను. నిజముగా ఇటీవల ఉన్నట్లుగా, ఇంత శాంతముగా, ఎన్నడును ఉండలేదు. ఒక కారణము ఉపన్యాసములు నా నిద్రకు భంగము కలిగించుట లేదు, అది రవంతలాభమే. నేను ఇపుడు కొంత వ్రాతపనియు చేయుచున్నాను. ఇక్కడి యుపన్యాసములను ఒక స్టెనోగ్రాఫరు సంగ్రహించినాడు. ఇక్కడి జనులు వానిని అచ్చువేయింపదలచుచున్నారు.

మఠములో అందఱును క్షేమముగా ఉన్నారనియు, మంచిపని చేయుచున్నారనియు శా. స్వామి జోకు వ్రాసిన జాబువలన నాకు తెలిసినది. ఎప్పటివలె నెమ్మదిగా అనుకొన్న పద్ధతులన్నియు జరుగుచున్నవి. అయినను నేను చెప్పునట్లు అంతయు అమ్మ ఎఱుగును. ఆమె నాకు ముక్తినొసగి, తన పన్నాగములకు వేఱు పనివాండ్రను ఏర్పఱుచునుగాక. మఱియొక సంగతి. 'ఫలములమీద కన్నుఉంపక పనిచేయుట'ను గూర్చిన గీతాబోధనను మానసికముగా అనుష్ఠించువిధానమున నేను ఒక క్రొత్తపద్ధతిని కనిపట్టితిని. నేను ధ్యానము, శ్రద్ధ, ధ్యానమును కైవసము ఒనర్చుకొనుట వీనివలన జ్ఞానము సంపాదించితిని. వానిని అభ్యాసము చేసినచో మనకు వ్యాకులత, చిత్తభేదము తీఱిపోవును. అది నిజముగా మన మనసులను మనము కోరినపుడు, ఒక సీసాలో పెట్టి మూసినట్లు, ధ్యానలగ్నముచేసి మన వశమున ఉంచుకొను శాస్త్రము. అయ్యో! ధీరమాతా, ఇపుడు

నీసంగతి యేమి? ఇది మాతృత్వమునకును దానికి ఏర్పడిన దండ నలకును గలుగు ఫలము. మనము ఎప్పుడును మనలను గూర్చియే తలచుకొందుము, అమ్మనుగూర్చి తలంపము. నీ యోగక్షేమ మేమి? అక్కడ నీపనులు అన్నియు ఎట్లు జరుగుచున్నవి? నీ కొమార్తె సమాచారమేమి? శ్రీమతి బ్రిగ్స్ సంగతి యేమి?

తురీయానందుడు ఇప్పటికి పూర్తిగా తేలుకొని పనిచేయు చున్నాడని నానమ్మకము. పాపము, అతనికి బాధపడుటయే విధి వ్రాలుగా నున్నది. పోనీ ఇతరులకోసమే అగునేని బాధపడుట యందును, సంతోషమున్నది. లేదా? నీవేమందువు? శ్రీమతి లెగ్గెట్టు క్షేమముగా ఉన్నది. అట్లే జోయు ఉన్నది. నేనా, నేనును అట్లే ఉన్నానని వారందురు. వారిమాట సరియేకావచ్చును. ఎట్లు న్నను, నేను పనిచేయుదును, కార్యవ్యగ్రుడనుగానే, జీనుతోనే యున్న గుఱ్ఱమువలె, ప్రాణము విడువగోరెదను. అమ్మకు కావలసి నది అదియే యగునేని నేను పూర్తిగా తృప్తుడనే.

సదా నీపుత్రుడు,
వివేకానంద.

## 449

(సోదరి నివేదితకు)

421, 21 వ వీథి, లాస్‌ఏంజిలిస్.
డిసెంబరు 23, 1899.

నా ప్రియమార్గట్,

అవును. ఈ దివ్యచికిత్సాతంత్రములవలన నాకు నిజముగా నయమగుచున్నది! ఏవిధముననో నేను అంతయు నయమై ఆరోగ్య ముగా ఉన్నాను. ఎప్పుడును నా యవయవములలో దేనికిని తీవ్ర బాధ ఏమియులేదు. ఉన్నదెల్ల నరముల బలహీనతయు, అగ్ని మాంద్యమును.

ఇప్పుడు నేను భోజనమునకు ముందుగాని తరువాతగాని ఎప్పుడైనను ప్రతిదినమును మైళ్ళు నడతును. నేను పూర్తి ఆరోగ్య ముతో ఉన్నాను. ఇకను ఇట్లేయుందునని నా నమ్మకము.

చక్రము దొరలుచున్నది. అదెల్ల అమ్మ ప్రోత్సాహపఱచి చేయించుచున్నది. ఆమెపని ముగియకముందు నన్ను ఆమె పోనీయదు. అదియే రహస్యము.

ఇంగ్లండు ఎట్లు అభివృద్ధిగాంచుచున్నదో చూడు! ఈ నెత్తురు కార్చుట ముగిసినతరువాత, జనులు ఇంకను చక్కగా ఆలోచించుకొనుటకును, యుద్ధము యుద్ధము యుద్ధము అనుటకన్న గొప్పవిషయములు ఆలోచించుకొనుటకును కాలము అవకాశము గలుగును. అదియే మనకు సదవకాశము. మనము వడిగా చొచ్చి, వారిని చిన్న గుంపులుగుంపులుగా సమకూర్చుకొని, ఇండియాపనిని ముమ్మరముగావింపవలయును.

ఇంగ్లండు కేపుకాలనీని పోగొట్టుకొనవలయు నని దేవుని నేను ప్రార్థింతును. దానిని వదలుకొనునేని, ఇంగ్లండు తన శక్త్యుత్సాహములను ఇండియామీాదనే ఏకాగ్రము చేయగలిగియుండును. ఊరక దురభిమానమును హెచ్చించుటకును, కోట్లధనమును కోట్లజనుల రక్తమును వ్యయించుటకునుతప్ప ఈ అనలును కొనలును అగ్రములును గ్రిగములును ఇంగ్లండునకు ఏ యుక్కఱకును రావు. అన్ని విషయములును వేచియున్నవి. కావున సిద్ధపడుము. నలువురు అప్పచెల్లెండ్రకును నీకును నా ప్రేమ.

వివేకానంద.

## 450

(శ్రీమతి ఓల్బుల్సుకి)

921 పడమటి 21 వ వీథి,
లోసేంజెలిస్
డిసెంబరు 27, 1899.

నా యత్యంతప్రియ ధీరమాతా,

పెక్కు శుభవృత్తాంతములతో కూడి క్రొత్తసంవత్సరాది నీకు సుఖముగా నుండును గాక! ఇట్టివి ఇంకను అనేకములు నీకు వచ్చును గాక!

నాకు ఆరోగ్యము మునుపటికంటె చాల బాగుగా ఉన్నది. నేను మరల నొకమాఱు పనిచేయజాలుశక్తి పొందితిని. నేను అప్పుడే పని ఆరంభించితిని, శారదానందునికి కోర్టువ్యవహారముల ఖర్చులకు అప్పుడే రు. 1300/ పంపితిని. వారికి కావలసియున్న ఇంకను పంపగలను. నాకు ఈయుదయము మిక్కిలి దుఃస్వప్నము కలిగినది. మూడువారములుగా శారదానందునిగూర్చి ఏమియు సమాచారము తెలియ లేదు, పాపము, కనికరింపదగిన బాలురు! కొన్నిసమయములలో వారియెడ ఎంతకఠినముగా నుందును! మంచిది, అది యంతయు అట్లున్నను నేనే తమకు పరిష్ఠమిత్రము నని వా రెఱుంగుదురు.

శ్రీ లెగ్గెట్టువద్ద కొంచెము ఎక్కువగా 500 పౌనులు ఉన్నవి. రాజయోగమువలనను ఖేత్రిమహారాజువలనను లభించినదియు స్టర్డి వద్ద ఉంచియుండిన పైకమును అంతయుకలిసి శ్రీ లగ్గెట్టువద్ద ఇప్పుడు 1000 డాలర్లు ఉంచియున్నాను. అదియు నాకు ఉందునదే. నేను చనిపోవుదు నేని ఆపైకమును దయచేసి మాయమ్మకు పంపుము. నేను మూడువారములక్రిందట ఆబాలురకు నాకు పూర్తిగా రోగము మానిపోయిన దని తంతె పంపితిని. ఇంతకన్న నాకు అనారోగ్యముకలుగదేని ఇపుడు నాకున్నంత యారోగ్యము అన్నిటికిని బాగుగానే చాలును. నాకోసము వ్యథ చెందనే చెందకుము. నేను మరల తేఱుకొని, సంకల్పపూర్వకముగా పనిచేయుచున్నాను.

ఆ కథలనుగూర్చి ఇక నేమియు వ్రాయజాలకపోయినందులకు దుఃఖించుచున్నాను. నేను మఱికొన్నివిషయములు వ్రాసితిని, ప్రతి దినము ఏదైనను వ్రాయవలయు నని ఉద్దేశించుచున్నాను.

ఇపుడు నేను మునిపటికంటె చాల మనఃప్రశాంతికలిగి ఉన్నాను. అట్లు నాకు మనఃశాంతి నిలిచియుండుటకు ఇతరులకు బోధించుట ఒక్కటే దారి అని కనుగొంటిని. పనియొక్కటే నన్ను కాపాడుకవచము!

నేను చోరవగలిగించుకొని పనిని సాగించుచుండగా వివరములను చక్కగా విచారించుకొనుటకు మంచి విశదమైన వ్యవహార పరిజ్ఞానముగలవాడు ఒకడు నాకు కావలయును. ఇండియాలో అట్టివానిని కనిపట్టి సంపాదించుటకు ఇంకను చాలకాలము పట్టును అని నాభయము. ఎవరేని యుండిన వారు ఎవడేని పాశ్చాత్యునిచేత చక్కగా తరిబీదుచేయబడవలయును.

ఇది యొకటి. నేను పూర్తిగా నాసొంతముగా నిలబడ వలసి వచ్చినప్పుడే పనిచేయసమర్థుడ నగుదును. నేను ఏకాంతముగా ఉన్నప్పుడే నేను నాచేతనయినదంతయు శ్రేష్ఠముగా చేయగలుగుదును. అమ్మయు అట్లు ఏర్పాటు చేయుచ ట్లున్నది. జో ఏమో గొప్పవిషయములు అమ్మగిన్నెలో తయారగుచున్నవని నమ్ముచున్నది. అది యట్లే కావలయునని నేనును ఆశపడుచున్నాను.

జోయు మార్గటును భగవత్ప్రేరిత దివ్యదర్శినులైనట్లు తోచుచున్నది. అమ్మ మరల నొకమాటు ఇండియాకు ప్రసన్నురాలగునేని, నేను ఈజీవితమున తినిన ప్రతిదెబ్బయు, పడిన ప్రతి బాధయు, నేను సంతోషముతో చేసిన త్యాగము యజ్ఞము-అగును అని మాత్రమే నేను చెప్పగలను.

కుమారి గ్రీన్ స్టైడెలు నాకొక చక్కని జాబు వ్రాసిఉన్నది. అందు చాలవఱకు నీ సమాచారమే. ఆమె తురీయానందునిగూర్చి కూడ చాలవిషయములు అనుకొనుచున్నది. తురీయానందునికి నా ప్రేమ అందింపుము. అతడు చక్కగా పనిచేయునని నానిశ్చయము. అతనికి ధైర్యమును బలమును కలవు.

నేను కాలిఫోర్నియాలో పనిచేయుటకై త్వరలో పోవుచున్నాను. నేను బయలుదేఱునప్పుడు తురీయానందుని పిలిపించి వానిని పసిఫిక్ తీరమున పనిచేయునట్లు చేసెదను, ఇక్కడ పనికి చాల అవకాశము ఉన్నది. రాజయోగగ్రంథము ఇక్కడ ప్రసిద్ధముగా అందఱికి తెలిసినట్లు ఉన్నది. కుమారి గ్రీన్ స్టైడెలు నీ

పంచలో చాల మనఃశాంతి అనుభవించినది. ఆమె చాల సుఖముగా ఉన్నది. అదియట్లున్నందులకు నాకు ఎంతో సంతోషముగా ఉన్నది. దినదినమును ఆమెకు క్రమక్రమముగా మేలగును గాక. ఆమెకు మంచి వ్యాపారనిర్వాహణజ్ఞానము ఉన్నది. సమస్తమును క్రియా రూపమునకు దెచ్చు తెలివి ఉన్నది.

ఆకర్షకురాలైన యొక వైద్యురాలిని, జో కనిపట్టినది. మేము ఉభయులము ఆమెచేత చికిత్స పొందుచున్నాము. నాకు ఆ వైద్యురాలు దివ్యముగా నయము చేయుచున్నదనియు నేను ఆమెచేత ఆరోగ్యము పొందుచున్నాననియు జో యభిప్రాయము. తన కేమో ఆమె యొక యద్భుతమును చేసినదని జో అను చున్నది. అది అయస్కాంతి చికిత్సయో కాలిఫోర్నియాలోని ఓజోనో, లేక నా ప్రకృతపుకర్మపాకాంతమో నిర్ణయింపరాదు గాని నాకేమో నయమగు చున్నది. మిక్కిటమైన విందుభోజనముకు తరువాతకూడ మూడుమైళ్ళు నడువగలిగియుండుట గొప్పవిషయము.

ఓలికి సమస్తప్రేమయు దీవనలును, డాక్టరు జేమ్సునకును నాయితరబోస్టను మిత్రులకును నా ప్రేమ.

సదా నీ కుమారుడను,
వివేకానంద.

## 451

(కుమారి మేరీహేలుకు)

శ్రీమతి బ్లాడ్గెట్టు ఇల్లు,
921, పడమర 21 వ వీథి,
లోస్ఏంజెలిస్,
డిసెంబరు 27, 1899.

నా ప్రియ మేరీ,

ఉల్లాసకరమగు క్రిస్తుమసు, సుఖకరమగు సంవత్సరాది! ఇట్టివి నీపుట్టినదినమునకు కీర్తికరములై అనేకపర్యాయములు వచ్చును గాక! ఈ ఆశంసలు స్తోత్రములు కుశలప్రశ్నలు ఇవన్నియు ఒక్కగుక్కలోనే! నాకు రోగము నయమయినది. అది తెలిసిన

నీవు సంతోషింతువు. అది వట్టి అజీర్ణము. అంతే, గుండెజబ్బు గాదు, మూత్రకోశపుజబ్బు గాదు అని వైద్యులు అన్నారు. అంతకన్న ఎక్కువ యేమియు గాదు. నే నిపుడు దినమునకు, కడుపునిండ భుజించిన వెంటనే మూడుమైళ్ళు నడచుచున్నాను.

నా వైద్యుడు నేను తప్పక చుట్టత్రాగవలయును అన్నాడు. ఇక నేమి ? కావున నేను నాపొగగొట్టమును హాయిగా వాడు చున్నాను. దానిచేతి మఱింత కులాసాగా ఉన్నాను. సాధారణమైన మాటలలో చెప్పవలయునన్న, నా నరాలబలహీనత మొదలగున దంతయు అగ్నిమాంద్యదోషమే, అంతకన్న మఱేమియు గాదు.

. .....ఇపుడు నేను పనియుచేయుచున్నాను. పనిచేయు చున్నాను, కాని కష్టమైనపని గాదు. కాని నాకు లక్ష్యము లేదు. ఈసారి ధనము సంపాదింపవలెనని నాకోరిక. ఈసంగతి మార్గోతో చెప్పుము. ముఖ్యముగా పొగగొట్టము వ్యవహారమును చెప్పుము. నన్ను బాగుచేయుచున్నది ఎవరో ఎఱుగుదువా ? ఏవైద్యుడును గాడు. క్రైస్తవశాస్త్రముచదివిన చికిత్సకుడు గాడు. మఱి ఎవరన నొక అయస్కాంత వైద్యురాలు. ఆమె నాకు వైద్యము చేసినపుడెల్ల నాతోలు ఒలుచును. అద్భుతములు ఆశ్చర్యములు. ఆమె ఊరక తోముటచేతనే ఛేదచికిత్స చేయును, పైననే కాక దేహములోపలి ఛేదచికిత్సలుకూడ చేయు నని ఆమెరోగులు నాతో చెప్పినారు.

ఇప్పుడు రాత్రి చాల ప్రొద్దుపోయినది. నేను ఇకమీద మార్గట్టుకు, హారిమెట్టుకు, ఇసబల్లాకు, అమ్మచర్చికి ప్రత్యేకముగా పేర్వేర జాబులు వ్రాయుట మానివేయవలయును. కోరికయే సగము పని. వా రందఱు తమ్ము నే నెంతప్రీతితో ప్రేమింతునో, ఎంతతీవ్రముగా ప్రేమింతునో ఎఱుగుదురు. కాబట్టి ఈసమయ మున నాయంతరాత్మకు నీవు మార్గమవు కమ్ము. నాక్రొత్త సంవత్స రాదిపండుగ శుభాశంసావార్తలను వారికి చేర్పుము.

ఇక్కడ సరిగా ఉత్తరఇండియా శిశిరర్తువువలె ఉన్నది. కొన్నాళ్ళు అంతకంటె రవంత వెచ్చగా నుండును. రోజాపువ్వులు ఇక్కడ ఉన్నవి. అందమైన తాడిమొదలగు వృక్షములు ఉన్నవి. పొలాలలో బార్లి ఉన్నది. రోజాలు, ఇంకను పలురకాల పువ్వులు నే నుండు కుటీరము చుట్టును ఉన్నవి. ఇట నాసత్కారిణియగు శ్రీమతి బ్లడ్గెట్టు ఒక చికాగోదొరసాని. ఆమె లావు, ముసలి, మిక్కిలియు చమత్కారపు మాటలది. ఆమె చికాగోలో నా యుపన్యాసములు విన్నది. మిక్కిలియు తల్లివలె ఉన్నది.

ఇంగ్లీషువారు దక్షిణాఫ్రికాలో ఒక టార్టారును పట్టుకొన్నందుకు నేను మిక్కిలి విచారపడుచున్నాను. అనగా అనగా ఒక సేనానివేశమునకుబయట పనిచేయుచున్న భటుడు "నే నొక టార్టారును పట్టుకొంటిని" అని బిగ్గఱగా అఱచినాడట. గుడారము లోపలినుండియే ఉత్తరువు వినబడినది "వానిని లోపలికి తెమ్ము" అని. "వాడు రాడు" అని ఆపహారా వాడు బదులుపలికినాడు అట్లైన "నీవు వచ్చివేయుము" అని మరల ఉత్తరువు ఖణింగు మని వినబడినది. "వాడు నన్నైనను లోపలికి రానీయడట" అని అందులకు బదులుపలికినాడు. అఱవనిశత్రువును పట్టుకొనుట యను యర్థమున "టార్టారును పట్టుకొనుట"యను ఈ వాచోయుక్తి అట్లు కలిగినది. నీవు ఎవరిని పట్టుకొనకుము.

నేను ఇప్పుడు సుఖముగా ఉన్నాను. ఇకను ఇట్లే నాయాయుఃశేషమెల్ల నుందు నని అనుకొందును. ఇప్పుడు నేను క్రైస్తవ శాస్త్రమనే. ఏమియుసెబ్బర లేదు. ప్రేమయే ఆకర్షకమగు ఆహ్వానపత్రము. నేను చాలధనము ఆర్జింప గల నేని ఎంతో సంతోషముగాను సుఖముగాను ఉందును. ఇపుడు నేను కొంతె సంపాదించుచున్నాను. నేను చాలధనము సంపాదింపబోవుచున్నాననియు, జపాను, హోనొలులు, చీనా, జావాలమార్గమున మా దేశమునకు పోవుదు ననియు మార్గట్‌తో చెప్పుము—త్వరగా ధనము సంపాదించుటకు ఇది చాల మంచిచోటు. సాన్ఫ్రాన్సిస్కో-

ఇంకను మంచిది అని వినుచున్నాను. ఆమె ఏమైనను సంపాదించి నదా ?

నీవు కోటీశ్వరుని పొందజాలక పోయితివి. అరకోటికో, పాతికకో, నీవేల యారంభింపవు ? ఏమియు లేక పోవుటకంటె కొంత యుండుట శ్రేయముగదా ? మనకు ధనము కావలయును. అతడు మిచిగన్ సరస్సుకు పోవచ్చును, మా కించుకయు అందులకు ఆక్షేపణ లేదు. మొన్న ఇక్కడ కొంచెము భూకంపము కలిగినది. అది చికాగోకు పోయియుండు నని, ఇసబెల్లా బురదగుంటను పైకి లేపియుండు నని ఆశించుచున్నాను. చాల ప్రొద్దుపోయినది. నాకు ఆవులింతలు వచ్చుచున్నవి. కావున నేను ఇంతటితో పోయెదను— సెలవు.

సర్వాశీస్సులు సమస్తప్రేమ,
వివేకానంద.

## 452

(శ్రీమతి ఓల్బుల్సుకి)

జనవరి 17, 1900.

నా ప్రియ ధీరమాతా,

శారదానందునికి ఇమ్మన్న కాగితాలతోడి నీజాబు అందినది. అందు కొంత మంచి సమాచారము ఉండినది. ఈవారము మఱి కొంత సమాచారము వచ్చు నని ఆశంస. నీ వనుకొన్న పద్ధతులను గూర్చి నీ వేమియు వ్రాయ లేదు. నీవు చూపిన దయకై తన యత్యంతకృతజ్ఞతను దెలుపుచు ఒక జాబు నాకు కుమారి గ్రీన్‌స్టైడెలు వద్దనుండి వచ్చినది. కృతజ్ఞత ఎవరు తెలుపకుందురు ? తురీయానందుడు ఇప్పటికి బాగగుచుండునని యాశించుచున్నాను.

నేను కుమారి మెక్లియడు సాయమునను శ్రీమతి లెగ్గెట్టు సాయమునను శారదానందునికి రెండువేల 2000/ రూపాయలు పంపగల్గితిని. సహజముగానే వారు ఎక్కువభాగమును తమ వంతుగా ఒసంగినారు. తక్కినది ఉపన్యాసములవలన వచ్చినది.

ఇక్కడగాని మఱెక్కడగాని ఉపన్యాసముల చేత ఏమాత్రము ఎక్కువ వచ్చు నని నేను ఆశపెట్టుకొనను. నా ఖర్చులకైనను చాలునో చాలదో. చాలదు. ఆపాటియు రాదు. డబ్బు ఈవలసి వచ్చునేని జనులు ఎటుపోవుదురో, ఒక్కడును ఉండడు. ఉపన్యాస కార్యము ఈదేశాన మితిమీఱినది. జనులును ఉపన్యాసములు విను దశ దాటినారు.

ఆరోగ్యవిషయమున నేను నిశ్చయముగా చాల మేలుగా నున్నాను. నేను ఇపుడు నాకు నచ్చిన ఎక్కడికైనను స్వేచ్ఛగా పోవచ్చునని వైద్యురాలును తలంచుచున్నది. వైద్యకార్యము జరుగుచుండును, నేను కొన్ని నెలలలో పూర్తిగా ప్రకృతికి వత్తును. నేను ఇప్పటికే పూర్తిగా ఆరోగ్యముగలవాడనైతిననియు ఇక దేహస్వభావము, ప్రకృతి, తక్కినదానిని పూర్తిచేయవలయు ననియు ఆమె గట్టిగా చెప్పుచున్నది.

మంచిది. నేను ఇక్కడికి ముఖ్యముగా ఆరోగ్యము కోసమే వచ్చితిని. అది నాకు లభించినది. దానితోకూడ రు 2000/ రెండు వేలరూపాయలును లభించినవి, నా కోర్టుఖర్చులకు, బళి!

ఇపుడు వేదికమీది నాపని ముగిసిపోయినదని నాకు తోచు చున్నది. ఇకను అట్టిపనిచేత నేను నాయారోగ్యమును పాడుచేసి కొన నక్కఱలేదు.

నేను నామఠము జోలియంతయు మానుకొని, మరల కొంత కాలము మాయమ్మవద్దకు పోదగునని నాకు మునుపటికంటె విశద మగుచున్నది. ఆమె నావలన చాల బాధపడినది. ఆమె కడపటి దినములను ఎగుడుదిగుడులు లేక నేను చక్కబెట్టవలయును. సరిగా ఈపనినే ఆ గొప్ప శంకరాచార్యులును, చేయవలసివచ్చినది! నీ వెఱుగుదువా? తనతల్లి జీవితపు కట్టకడపటి కొన్నాళ్లు, అతడు ఆమెవద్దకు మరలిపోవలసివచ్చెను. నేను దానిని అంగీకరింతును. నేను అన్నిటిని మానుకొన్నాను. నేను మునుపటికన్నను నెమ్మ దిగా శాంతముగా ఉన్నాను. డబ్బు సంగతి ఒక్కటే కష్టము.

సరి, ఇండియాజనులు కొంత బాకీయున్నారు. నేను మదరాసులోను, ఇండియాలో మఱికొందఱి మిత్రులకడను ప్రయత్నింతును. ఎట్లైనను నేను ప్రయత్నము చేయవలయును. మా అమ్మ ఇక చాల ఏండ్లు బ్రదుకదని నాకు కొన్ని పూర్వసూచనలు కలుగుచున్నవి. మరల ఇదియు ఒకసంగతి. ఇది నాయంతట నేను చేయవలయు త్యాగము లన్నిటిలోను గరిష్ఠమైనది, నా (వృద్ధి) యాశను నాయ కత్వమును కీర్తిని త్యాగము చేయవలసి వచ్చుచున్నది. నేనుఅన్నిటిని మానుకొన్నాను, ఇక తపస్సు చేయవలయును. ఒకవేళ పిమ్మట మనకు ఆదరము కావలసినయెడల శ్రీ లెగ్గెట్టువద్దనుండు వేయి డాలర్లను ఇక కొంత వసూలుచేసినచో అదియు చాలును. నన్ను ఇండియాకు మరల పంపుదువా? నేను ఎప్పుడైనను సిద్ధముగా ఉన్నాను. నన్నుచూడకుండ ఫ్రాన్సుకుపోకుము. జోయు మార్గట్టును కేవలము తమ మనసులో కల్పించుకొన్న మిథ్యాస్వప్నములతో పోల్చిన, నేను ఇపుడు క్రియాసిద్ధిగలవాడనైతిని. వారికలలను వారేనాకు క్రియలుగా సాధింతురుగాక. అవి కలలకన్న ఎక్కువగావు. శారదానందుడు బ్రహ్మానందుడు, నీవు మీ ముగ్వురిపేరను మఠ ధర్మాధికారులుగా నియమించు ఇల్లడపత్రమును వ్రాయగోరుచున్నాను. శారదానందునివద్ద నుండికాగితములు రాగానే ఆపని చేసెదను. తర్వాత నేను కర్తవ్యములు ముగించుకొని ఇక బాకీలేక ముక్తిచెంది అందఱికి సమానుడనై పోవుదును. నాకు విశ్రాంతి భోజనము, కొన్ని పుస్తకములును కావలయును. నేను గ్రంథరచన కొంత చేయగోరుదును. అమ్మ నాకు ఈ వెలుగును ఇపుడు స్పష్టముగా చూపనున్నది. సరే, ఆమె మొట్టమొదట దానిని చూపినది నీకే, కాని అప్పుడు నేను నమ్మలేదు. మఱి 1884 లో మాయమ్మను విడిచిపెట్టుట గొప్ప త్యాగమనియు ఇపుడు ఆమెవద్దకు మరలిపోవుట అంతకంటె త్యాగమనియు ఇపుడు ఋజువుఅగుచున్నది. ఒకవేళ అమ్మ మునుపు ఆ గొప్ప ఆచార్యుని అనుభవింపజేసినదానినే ఇపుడు నన్ను అనుభ

వింపజేయగోరుచున్న దేమో. అగునా? నేను నా స్వబుద్ధిని అనుసరించుటకన్నను, నీవు చూపు మార్గమును అనుసరించుట మిక్కిలి సరియగునని తలంతును. జోయు, మార్గట్టును గొప్పవారు. కాని అమ్మ నాకు దారిచూపుటకు వలయువెలుగును నీకు పంపుచున్నది. నీవు వెలుగును చూచుచున్నావా? నీవేమి సలహా చెప్పుదువు? కనీసము నన్ను మా ఊరికైనను పంపక, నీవు ఈదేశమును విడిచి పోకుము.

నేను శిశుమాత్రుడను, నేను ఏమిపని చేయవలసియున్నది? నా శక్తులను నీకు సంక్రమింపజేసితిని. నాకు అది తెలియుచున్నది. నేనేమో ఇకమీద వేదికపై నిలబడి ఉపన్యసింపను. ఈవిషయమును ఎవ్వరికిని జోకు సయితము, చెప్పకుము. నేను సంతోషముగా ఉన్నాను. నాకు విశ్రాంతికావలయును. అది నేను అలసి పోయియుండుటవలన గాదు. దీనికి తరువాతిమెట్టు మాట కాదు, శ్రీరామకృష్ణుని స్పర్శవంటి అద్భుతస్పర్శ. మాట నిన్ను చేరినది, గొంతు మార్గోను చేరినది. అది ఇక నాలో లేదు. నాకు సంతోషము. నేను అన్నియు మానుకొని ఏదియు అంటకయున్నాను. నన్ను ఇందుండి బయటికి——ఇండియాకు చేర్పుము, అంతే. చేర్పవా? నాకు నిశ్చయముగా తెలియును. అమ్మ నీచే చేయించును.

సదా నీకొమారుడను

వివేకానంద.

## 453

(సోదరి నివేదితకు)

లోస్ఏంజెలిస్, కాలిఫోర్నియా,
జనవరి 24, 1900

ప్రియమార్గట్,

నేను కోరు విశ్రాంతియు మనఃశాంతియు ఎప్పుడును కలుగబోవని భయపడుచున్నాను. కాని అమ్మ నా ద్వారా ఇతరులకును, ఇంచుకమైనను నా స్వదేశమునకును, మేలు సేయును. మానవుడు

తనవిధికి లొంగి, యదియు నొక త్యాగమే యని, దాని ననుసరించి యుండుట ఇంతకంటెను సులభము. మన మందఱము, ఒక్కొక్కరు ఒక్కొక్కవిధాన త్యాగములమే. మహాపూజ జరుగుచున్నది. అదియొక గొప్పత్యాగమని, యజ్ఞమని, అనుటకన్న దాని యర్థమును ఎవ్వడును ఎఱుగజాలడు. ఇష్టపడియుండువారు ఎంతయో బాధను తప్పించుకొందురు. తిరుగుబాటు చేయువారు లొంగునట్లు దెబ్బలుతిని ఇంకను ఎక్కువగా బాధపడుదురు. నేను ఇపుడు ఇష్టపడినవాడనుగా ఉండుటకు తీర్మానించుకొంటిని.

భవదీయేత్యాది,
వివేకానంద.

## 454

(సోదరి నివేదితకు)

కుమారి మీడుగృహము,
447, డగ్లసు బిల్డింగు,
లాస్ ఏంజెలిస్, కాలిఫోర్నియా,
ఫిబ్రవరి 15, 1900,

నా ప్రియ నివేదితా,

నీ తే—ది జాబు నాకు ఈదినము పసదేనాలో చేరినది. జోకు నీవు చికాగోలో అగపడలేదని నాకు తెలియుచున్నది. న్యూయార్కునుండి వారివద్దనుండి ఇంకను నా కేమియు సమాచారము తెలియలేదు.

ఇంగ్లండునుండి ఇంగ్లీషు పత్రికల కట్ట యొకటి వచ్చినది. దానియొరపై నాకైన శుభాశంసలు ఒక బంతియు దానిక్రింద యఫ్. హెచ్.యమ్. అని సంతకమును ఉండినవి. అయినను వానిలో ఏదియు ప్రాధాన్యముగలది లేదు. నేను కుమారి ముల్లరుకు ఒక జాబు వ్రాసియుందును కాని నాకు విలాసము తెలియదు. అంతేకాక నేను ఆమెను వెఱగుపఱుప జంకితిని.

ఇంతలో శ్రీమతి లెగ్గెట్టు ఒకపద్ధతి ఆరంభించినది నాకు సాయముచేయుటకై ఒక్కొక్కరు సంవత్సరమునకు 100/ డాలర్ల

చందావంతున పదియేండ్లు ఇయ్యవలసినది అని. ఆ పట్టీలో మొదట తనపేరే 1900 వ సం॥ కు 100 డాలర్లు అని వ్రాసి మొదలుపెట్టి మఱి యిరువురిచేతనుగూడ అట్లే చేయించెను. తరువాత ఆమె నా మిత్రులకందఱికి ఒక్కొక్కరిని అందులో చేరుమని జాబులు వ్రాయుచుండెను. ఆమె ఆవరుసలో కుమారి ముల్లరుకును వ్రాయగా నేను సిగ్గు చెందితిని. కాని ఆమె వ్రాయుట నే నెఱుంగకముందే జరిగినది. దానికి మేరీ వ్రాసిన జవాబు శ్రీమతి హేలువద్దనుండి వచ్చినది. అందులో ఆ పట్టీలో చేరుటకు తమ అశక్తిని తెలుపుచు, నాకైన తమ ప్రేమను ఆమెకు ఎక్కువ నమ్మబలుకుచు చాల మర్యాదగానే, చాల నిరుత్సాహముగా వ్రాయబడియుండెను. శ్రీమతి హేలును మేరియు చాల అపరితోషము చెందియున్నారని నాకు భయము. ఐనను అది నాదోషము ఎంతమాత్రమును గాదు!

శ్రీమతి సేవియరువలన నిరంజనుడు కలకత్తాలో జబ్బుగా అపాయస్థితిలో నున్నాడను సమాచారము అందినది. అతడు చనిపోయినాడేమో నాకు తెలియదు. మంచిది, మార్గో, నేను ఇపుడు బలము కలిగియున్నాను. మానసికముగా నేను ఎప్పటికంటె బలము కలిగియున్నాను. నేను మానసికముగా నా హృదయము మీద ఒకమాదిరి 'ఇస్త్రీ తోముటను' అనుభవించుచుంటిని. నేనిపుడు సన్న్యాసి జీవితమునకు మిక్కిలి సన్నిహితుడనగుచున్నాను. రెండువారములుగా నాకు శారదానందునివద్దనుండి ఏమియు సమాచారము రాలేదు. నీకు కథలు చేరినందుకు నాకు సంతోషముగా నున్నది. వలయునేని వానిని మరల వ్రాయుము. నీకెవరైనను దొరకిన వానిని ప్రకటింపజేయుము. దాని విక్రయముచేత ధనమువచ్చిన, ఆమొత్తము నీపనికై నీవు వాడుకొనుము. నాకేమియు అక్కఱలేదు. నాకు ఇక్కడ కొన్నివందల డాలర్లు ఉన్నవి. పైవారము సాన్ఫ్రాన్సిస్కోకు పోయెదను. అక్కడ ఇంతకన్న మేలుగా నుందు నను కొందును. ఈసారి మేరీని కలిసికొన్నప్పుడు శ్రీమతి హేలుకు చెప్పిన ప్రతిసంవత్సరపు నూరు డాలర్ల చందాయోచనతో

నా కేమియు సంబంధము లేదని చెప్పుము. నేను వారికి ఎంతయో కృతజ్ఞుడను.

మంచిది, నీ పారశాలకు పైకము వచ్చును. ఒకప్పుడును భయపడకు. అది తప్పక రావలసియున్నది. అది రాకున్న ఎవరి కేమి? ఒక రస్తా ఎంత మంచిదో మఱొక రస్తాయు అంత మంచిదే. అమ్మ లెస్సగా ఎఱుగును. చాల త్వరలో తూర్పునకు నా ప్రయాణము సాగునో సాగదో ఎఱుగను. నాకు అవకాశము కలిగిన, నేను ఇండియానాకే పోవుదును లెమ్ము.

ఆ యంతర్జాతీయ ప్రణాళిక మంచిదే. అన్నివిధాల అందులో చేరుము. కొన్ని ఇండియాస్త్రీల సమాజములను అందు చేర్పించుటకు మధ్యవర్తినివి కమ్ము. అది చాల శ్లాఘ్యముగా నుండును....

విషయములు మనకై తలయెత్తి చూచును. పోనీలే. యుద్ధము ముగియగానే, మనము ఇంగ్లండుకుపోయి అక్కడ ఘన కార్యము చేయ ప్రయత్నింతము. నీతలంపేమి? నేను అమ్మ సుపీరియరుకు వ్రాయుదునా? వ్రాయవలసినచో, ఆమె విలాసము మొదలైనవి తెలుపుము. ఆమె నీకు వ్రాసినదా?

స్టర్డీలు పేకీలు గట్టివారు, ఊగులాడువారు! అందఱును అనుకూలమార్గమునకు వత్తురు. నీవు పట్టువదలక జరుపుము.

నీవు నీపారములను నేర్చుకొనుచున్నావు, నాకు కావలసినదంతయు అంతే. నేను అట్లే ఉన్నాను. మనము కార్యసమర్థులము అగునప్పటికి సరిగా కావలసిన మనుష్యులును ధనమును మనకు ప్రవాహముగ రావలయును. ఇటు నా నరములు అటు నీ (కోప) భావము వీనితో మనము అన్నిటిని ఇప్పుడే తారుమారు చేయుదుము. కావుననే అమ్మ ఇటు నా నరాలజబ్బును మాన్పుచును, నీకు ఉద్రేకము కలుగనీని అభ్యాసము చేయించుచును ఉన్నది. తరువాత మనము పోవుదము. ఈసాగి మేలు పెద్దపెద్ద మొత్తములుగా వచ్చు

బాధపడుటకు ఆశ్చర్యకరమగు కారణమిది! ఆ పోయినవారికి నేను చాలినంత మంచివాడనుగా ఉండకపోవుట. మానాయన చనిపోయి నపుడుఆవ్యధ నాకు కొన్ని నెలలు ఉండినది, ఏలన నేను చాల అవిధేయుడనుగా నుంటిని.

నీవు అతివిధేయురాలవుగా నుంటివి. నీకును అట్టిది ఏమేని యున్న, అదియొక దుఃఖప్రకారమాత్రము.

నీకు జీవితము ఇకను ఇప్పుడే ఆరంభమగుచున్నదని నా భయము. మనము పుస్తకాలు చదువవచ్చును, ఉపన్యాసాలు విన వచ్చును, మైళ్ళు మాటలాడవచ్చును, కాని అనుభవ మొక్కటే గురువు కన్నులు తెఱచునది. ఉన్నతీఱున అది శ్రేష్ఠము గానే యున్నది. మనము నవ్వులుగుండను నేర్చుకొందుము. అశ్రు వులగుండను నేర్చుకొందుము. అది యే కారణముచేతనో మనము ఎఱుంగము, కాని అది యట్లుండుట ప్రత్యక్షము. అది చాలును. అమ్మచర్చికి ఆమె మతములో ఊరట యున్నది లెమ్ము. మన మందఱము భంగము లేని సుస్వప్నములు కన జాలియుండరాదా అని కోరుదును.

నీ జీవితకాలమంతయు నీకు ఆశ్రయము రక్షణ యుండినది. నేను సెగలో అంతసేపును కాలుచు రోజుచు ఉంటిని. ఇపుడు నీకు అవతలితట్టు ఎట్లుండునా అని ఒకక్షణదర్శనము కలిగి నది. నాజీవితము నిరంతరముగా అట్టి దెబ్బలతోడనే నిండి యున్నది. ఇంతకన్న నూఱింతలు కష్టతరముగనుండినది కారణములు పేదఱికము, ఇతరులు నమ్మించిచేసిన ద్రోహము, నా తెలివి తక్కువ తనము! ఈ ప్రపంచమంతయు ఖేదబహుళము, ఏదియు ఖేదముగానే ముగియును! ఇపుడు అది యెట్లువచ్చునో నీకు బాగుగా బోధపడగలదు. సరిసరి, నీకు నేను ఏమి చెప్ప గలను, మేరీ? అన్ని సంభాషణలు నీవు ఎఱుగుదువు. నేను చెప్పునదింతే, ఈమాట నిజము. దుఃఖమును వినిమయము చేసికొన శక్యమగునేనియు, నాకు ఉల్లాసపూర్ణమగు మనసు ఉండె

నేనియు, నేను నాదానిని నీకిచ్చి నీదుఃఖమును ఎప్పటికిని తీసికొని యుందును. ఏది శ్రేష్ఠమో అమ్మ యెఱుగును.

సదా విశ్వాసపూర్ణుడగు నీసోదరుడు,

**వివేకానంద.**

## 457

(శ్రీ అఖండానందస్వామికి)

కాలిఫోర్నియా
ఫిబ్రవరి 21, 1900.

నా ప్రియ అఖండానందా,

నీజాబు చేరినందులకును, అందలి సమాచారముల వివరములు చదువుటకును నాకు చాల సంతోషముగా ఉన్నది. చదువును జ్ఞానమును వ్యర్థము ప్రయోజనాతిరిక్తము, నట్టి పైతళుకు మాత్రమే. కాని, హృదయము సర్వశక్తి నిలయము. జ్ఞానము శక్తి మఱుకుదనము గల ఆత్మయుండు నది మెదడులో కాదు హృదయమున, "శతం చైకా చ హృదయస్య నాడ్యః" హృదయమునకు నాడులు నూటను ఒకటి ఇత్యాది. హృదయసమీపమందుగల సమదుఃఖసుఖనాడీ సంగమము అనబడు నాడుల ప్రధానస్థానమే ఆత్మయుండు కోట. నీవు ఎంత యెక్కువగా హృదయమును ప్రత్యక్షముచేసికొనగలుగుదువో నీ జయమును సిద్ధియు అంత ఎక్కువగా ఉండును. కొందఱే మెదడు పలుకుభాషను గ్రహింపజాలినవారు, హృదయము పలుకు భాషనో ఆ బ్రహ్మస్తంబ పర్యంతము ప్రతివాడును గ్రహింపగలడు. మఱి తరువాత, మన దేశాన మృతప్రాయులుగ నున్న జనులను మేలు కొలుపుటయే వలయునది. దానికి కాలము పట్టును. మఱి నీకు కడ లేని యోర్పును పట్టుదలయు ఉన్న జయము, సిద్ధి, తప్పక కలుగును. అందు ఏమియు పొరపాటు లేదు.

ఇంగ్లీషు ఉద్యోగస్థుల తప్పేమి? అసహజమగు క్రౌర్యము గలదిఅని నీవు వ్రాసిన ఆ కుటుంబము భారతదేశమున కంతటికిని

ఒక్కటేనా ? లేక అట్టివి అనేకములు ఉన్నవా ? దేశమంతటను అదియే కథ. మఱి తరువాత, మన దేశములో అంత సాధారణ ముగా నుండు స్వార్థపరత కేవలము దౌష్ట్యఫలముగా వచ్చినది గాదు. పశుప్రాయమైన ఈ స్వార్థపరత అనేకశతసంవత్సరములలో కలిగిన భంగములయు అణగగొట్టుటలయు ఫలము, అది నిజముగా స్వార్థపరత కాదు. లోతుకు వేరులుపాఱిన నిరాశ. అది జయ సూచనమాత్రముననే చక్కబడును. ఇదియే ఆ యింగ్లీషు ఉద్యో గస్థులు చుట్టుప్రక్కల పరికించుచుండునది. కావున వారికి ఆరంభ మునసే నమ్మకము ఎటులు కలుగును ? వారు ఎందేని నిజమగు పనిని కనుగొందురేని దానితో సానుభూతిని చెందరా ? చెప్పుము...

కఱవు, వెల్లువలు, రోగములు, అంటువ్యాధులు ఇవి పూర్తిగా ఉన్న యీ దినములలో, నీ కాంగ్రెసువాదులు ఎక్కడ ఉన్నారు ? చెప్పుము. ఊరక "దేశపరిపాలనను మా చేతికి అప్పగిం పుడు" అని యడుగుట మాత్రము చాలునా ? వారిమాట లెవరు విందురు ? ఒక మనుష్యుడు చక్కగా పనిచేసినచో, అతడు దేనినేని అడుగుటకు నోరు తెఱవవలయునా ? నీయట్టివారు రెండువేలమంది పెక్కు జిల్లాలలో పనిచేయుచుండినచో ఇంగ్లీషువారు తమంతట తామే, ఇక నిది తమవంతుఅని, రాజ్యాంగవిషయములలో మీతో ఆలోచనలు చేసి సలహాపడరా ! 'స్వకార్య ముద్ధరేత్ ప్రాజ్ఞః' 'ప్రాజ్ఞుడు తన కార్యము నుద్ధరింపవలయును'...ఆ ఒక కేంద్రమును స్థాపించుటకు అనుమతింపబడలేదు. అయిననేమి? వానిని, పెదవులు విప్పకుండ పనిచేయుచు పోనిమ్ము. ఎవరితోనైనను ఏవిషయమైనను చెప్పుటవలనగాని ఎవరితోనైనను జగడమాడుటవలనగాని ఏమియు ప్రయోజనము లేదు. విశ్వమయియగు మాతృదేవి పనిలో ఎవరు సాయము చేయుదురో, వారు ఆమె యనుగ్రహమును పడయగలరు, ఎవరు ప్రతికూలింతురో, వారు "అకారణావిష్కృతవైర దారుణః" కారణము లేకయే దారుణ శత్రువును తమపైకి లేపుకొన్నవారగు దురు; అంతేకాక, తమ యభ్యుదయమూలమునకు గొడ్డలి మోటించు

కొన్నవార నగుదురు. "శనైః పన్థాః" ఇత్యాది. సమస్తమును సకాలమున నెఱవేఱగలదు. పెక్కు అణువులు చేరి ఒక బ్రహ్మాండ మగును. ఒక గొప్పపని చేయబడుచున్నప్పుడు, పునాదులు వేయబడు చున్నప్పుడు, ఒకరస్తా నిర్మింపబడుచున్నప్పుడు, అమానుషమగు శక్తి కావలసివచ్చినప్పుడు, ఒకరిరువురు అసాధారణమానవులు నోరు తెఱవకయు శబ్దము చేయకయు, లెక్కలేని ప్రతిరోధములను క్లేశ ములను ఎదుర్కొనుచు, పని చేయుదురు. వేలకొలది ప్రజలు లాభము శ్రేయము పొందినపుడు, పెద్ద కేకలు అఱపులు లేచును. దేశమంతయు ప్రశంసాధ్వనులతో మాఱుమ్రోగును. కాని, యం త్రము పూర్వమే కదల్పబడి పనిచేయుచున్నప్పుడు పసిబాలుడు కూడ దానిని నడపగలడు, ఒక మూర్ఖుడుకూడ దానికి వడి నెక్కింప గలడు. దీనిని గ్రహింపుము. ఒకటిరెండు గ్రామాలకు కలిగించు శ్రేయము, ఇరువది యనాథులతోడి యనాథశరణాలయము, ఆ పదు గురు ఇరువదుగురు పనివాండ్రు ఇవి చాలును. ఇవియే, ఒకప్పటికిని నాశనముచేయరాని బీజము కాగలుగును. వీనివలన లక్షలకొలది జనులు కాలక్రమమున శ్రేయము నందగలరు. మన కిప్పుడు ఒక ఆఱు సింహములు కావలయును, అంతట నూర్లకొలది నక్కలచేత సయితము శ్లాఘ్యమగు పని నిర్వహింపబడును.

అనాథబాలికలు ఆశ్రయముగోరి నీయొద్దకు వచ్చుట సంభ వించునేని, తక్కిన యందఱికంటెను ముందు నీవు వారిని గ్రహింప వలయును. గ్రహింపవేని క్రైస్తవమతప్రచారకులు, మిషనరీలు, పాపము! వారిని గ్రహింతురు. వారికి దగిన వసతులేవియు నీకు లేవనుటవలన నేమి ప్రయోజనము? లోకజనని సంకల్పముద్వారా వారికి కావలసినవి సమకూరును. నీకు గుఱ్ఱము దొరకినపుడు, దీనికి జాటీ యెట్లా అని మనస్సున ఖేదము చెందవుగదా...నీకు ఎవరు చేతికి దొరకిన వారినెల్ల ఒకటిగా కూర్పుము. ఏఱుకొనుటగాని ఎన్ను కొనుటగాని ఇపుడు గాదు. సర్వమును కాలక్రమమున చక్కపెట్ట

బడును. ప్రతి ప్రయత్నమందును ఎదుర్కొనవలయు ఆటంకములు ఎన్నియో కలవు. కాని కాలక్రమమున ఆమార్గము సాఫు అగును.

ఆ యూరపియను ఉద్యోగస్థునికి నాకృతజ్ఞతను నమస్కారములను అందింపుము. నిర్భయముగా పనిచేయుము. వీరుడవోయి వు! సాధుకృతం సాధుకృతం సాధుకృతం! నీవు వ్రాసినట్లు బళి. భాగల్పూరులో ఒక కేంద్రము ప్రారంభించుట బడిపిల్లలకు తెలియ జెప్పుటవంటివి నిస్సందేహముగా మంచి యభిప్రాయములే! కాని మన యుద్యమము పేదలు కొంపలు లేనివారు చదువురాని కాపులు కూలిచేయుజాతులు మొదలైన వారికొఱకే. వారికందఱకు మొట్ట మొదటి సర్వము సమకూర్పబడిన తరువాత ఇంకను విశ్రాంతి అవకాశము మిగిలియున్ననే, పెద్దమనుష్యుల సంగతి. ఆ సేద్యగాండ్రను కూలిజనులును ప్రేమచే వశీకృతులగుదురు. తరువాత వారే చిన్న చిన్న విరాళములను వసూలుచేసి తమ గ్రామములయందు చిన్న మత ప్రచారక సంఘముల నేర్పఱతురు. క్రమముగా ఆ మనుష్యుల నుండియే మతప్రచారకులును బయలుదేఱుదురు.

ఆ పల్లెజనులలో కొందఱు బాలబాలికలకు చదువుకు మూల సూత్రములను నేర్పుము, వారిబుద్ధికి అనేకభావములను ఎక్కింపుము. తరువాత ప్రతిగ్రామమందలి కాపులును ధనమును పోగు చేసి వీరిలో ఒకనిని తమగ్రామములో ఉంచుకొందురు. 'ఉద్ధరేదాత్మ నాత్మానమ్' తన ప్రయత్నముచేతనే తన్ను ఉద్ధరించుకొనవలయును ఈసూక్తి అన్ని రంగములలోను చెల్లుబడియగును. వారు తమకే సాయము చేసికొనగలుగుటకై, వారికి మనము, సాయము చేయుదము. వారు నీకు నీ నిత్యాహారమును సరఫరా చేయుచున్నారనుట కొంతపని నిజముగా చేయబడినదనుటయే. వారు ఏనిమిషమున తమస్థితిని ఎఱుంగజాలుదురో, తమకు సాహాయ్యావశ్యకతను అభివృద్ధ్యావశ్యకతను భావింతురో అపుడు నీపని ఫలము గనుచున్నదనియు సరియైన మార్గమున నడచుచున్నదనియు ఎఱుంగుము. ధనికజాతులు కనికరముచే పేదలకు కావించు రవంత

మేలు చిరస్థాయి గాదు, మఱి కడకు ఉభయులకు ఇచ్చినవారికి పుచ్చుకొన్నవారికి కీడు తప్ప మఱేమియు చేయదు. కాపులును కూలివాండ్రును ఆసన్నమరణావస్థలో నున్నారు. ధనికులు వారికి మరల సజీవత చేకూర్చుకొనుటకై సాయము చేయవలయును. ఇదియే వారికి కావలసినది. అంతకంటె విశేషమేమియు లేదు. తర్వాత కాపులను కూలీలను తమ సమస్యలను తామే పరికించుకొని చక్క బెట్టుకొననిండు. అట్లని నీవు ధనికులకును పేదకాపులకును కూలీలకును, జాతివైరము, కలుగకుండ మెలకువ వహింపవలయును. ధనిక జాతిని దూషింపగూడదని నిర్ణయించుకొనుము. 'స్వకార్య ముద్ధరేత్ ప్రాజ్ఞః' 'ప్రాజ్ఞుడు తనయుద్దేశమును సాధించుకొనవలయును.'

జయము గురుదేవునికి! జయము విశ్వమాతకు! ఏటి భయము! తగిన అవకాశము, ప్రతిక్రియ, దాని ప్రయోగము అన్నియు తమంతట తామే వచ్చును. అది మంచిదిగానీ చెడ్డదిగానీ ఫలమును గూర్చిన చింత నాకులేదు. నీవు ఈపాటి పనిచేయుదువేని, నేను సంతోషింతును. వాగ్యుద్ధాలు, ప్రమాణవాక్యాలు, (శ్రుతిస్మృతి పురాణేతిహాస) పవిత్రగ్రంథాలు, సిద్ధాంతాలు, రాద్ధాంతాలు ఈ మొదలగు వీని నన్నిటిని, నాయీ ముదురువయసులో, విషమును బోలె ప్రద్వేషింతును. ఎవడు పనిచేయునో వానిని నాతలపై కిరీటముగా గౌరవింతును. ఇది నిజమని ఎఱుంగుము. పనికిమాలిన ఒండొరుల తిరస్కారపు మాటలు వృథాఘోష ఇవి మన కాలమును హరించును, మన ప్రాణశక్తిని గ్రసించును, మన భూతదయ, లోకహితనిష్ఠ ఒక అడుగుకూడ ముందునకు సాగనీయవు, 'మాభైః' భయము వలదు. బళి! నిజముగా వీరనాయకుడు ఉన్నాడు! ధన్యుడగు గురుదేవుడు నీ హృదయసింహాసనమున కూర్చుండును గాక! లోకజనని నీకు మార్గము చూపునుగాక!

ప్రేమయుత భవదీయ,

వివేకానంద.

# 458

(కుమారి మేరీ హేలుకు)

1251 పైన్‌వీధి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 2, 1900.

ప్రియ మేరీ,

నన్ను చికాగోకు ఆహ్వానించుచు జాబు వ్రాసితివి. నీదయ అతిమాత్రము. అక్కడ ఈ నిమిషముననే ఉండజాలుదునని కోరుదును. కాని నేను ధనార్జనవ్యగ్రుడనుగా నున్నాను. కాని అంతగా సంపాదించుట లేదు. సరే, ఏదియో యొకవిధముగా నాయింటికి చేరుదారి ఖర్చునకైనను చాలినంత నేను కూర్చవలయును. ఇది నాకు క్రొత్తచోటు. ఇక్కడ నా గ్రంథాలు చదివి ముందుగానే నన్ను వినగోరి సిద్ధముగా నున్నవారు నూర్లకొలదిగా నున్నారు.

సహజముగానే ధనసంపాదన మందగతిగాను విసుగు కలిగించునదిగాను ఉన్నది. నేను కొన్నివందలు చేర్చగలనేని, మిక్కిలి సంతోషింతును. ఇప్పటికి నా పూర్వపుజాబు నీకు చేరియుండవలయును. ఇక నెలలోనో ఆఱువారాలలోనో నేను తూర్పునకు రాగలనని ఆశపడుచున్నాను.

మీరందఱు ఎట్లు ఉన్నారు? అమ్మకు నాహార్దమగు ప్రేమను విన్నవింపుము. ఆమెబలము నాకు ఉండవలయునని నాకోరిక. ఆమె నిజమైన క్రైస్తవురాలు. నాఆరోగ్యము చాల బాగుగా నున్నది. అయినను ఇంకను పూర్వ దార్ఢ్యమురాలేదు. అది ఒకనాటికి వచ్చునని ఆశించుచున్నాను. అప్పుడు మిక్కిలి చిన్నవిషయమును చేయుటకైనను అంత కష్టపడవలసియుండెను. నాకు కనీసము కొన్నాళ్లైనను విశ్రాంతియు మనఃశాంతియు ఉండరాదా అని ఆశించుచున్నాను. అట్టిది చికాగో అప్పచెల్లెంద్రవద్ద నాకు తప్పక కలుగుననుకొందును. సరే, నేను ఎప్పుడును అనునట్లు ఏది మేలో అమ్మ ఎఱుగును. ఆమె లెస్సగా ఎఱుగును. కడచిన రెండేండ్లును ముఖ్యముగా బాగుగా లేకుండ ఉండినవి. నేను ఒక మానసికనరక

మున జీవించుచున్నాను. అది ఇపుడు కొంచెము తొలగినది. ఇంత కన్న మంచిదినాలును, ఇంతకంటె మంచిదశలును కలుగునని ఆస పడుచున్నాను. నీకును నీతోబుట్టువులకును అమ్మకును అన్ని దీవెనలు. మేరీ, మీరు నాకర్ణకఠోరమగు జీవితమున ఎల్లప్పుడుమధుర స్వరములవలె నుంటిరి. అప్పుడు పీడించు పరిసరములు లేక ఆరంభించుటకు మీకు గొప్ప సత్కర్మయుండినది. నాకు ఒక్కక్షణమైనను ప్రశాంతిమగు జీవితము అనుభూతము కాలేదు. ఎప్పుడును మానసికముగా మిక్కిలి ఒత్తిడిగా నుండినది. ప్రభువు నిన్ను అనుగ్రహించునుగాక.

సదా ప్రేమయుత భవదీయసోదర
**వివేకానంద.**

## 459

(సోదరి నివేదితకు)

సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 4, 1900.

ప్రియ నివేదితా,

నాకు పనిచేయుట కిష్టములేదు. నేను ఊరక విశ్రాంతి చెంద గోరుచున్నాను. నాకు దేశకాలములు తెలియును. మఱి నా విధి లేక కర్మ పనిచేయుము, పనిని చేయుము అని నన్ను తఱుముచున్నది. నాకు అట్లు తోచుచున్నది. మనము, కొరడాతో కొట్టబడుచు రస్తాపక్కన పుడిసెడు గరికను వడిగాకొరికి నములుచు కసాయివాని యింటికి తోలుకొనిపోబడుచున్న పశువుల వంటివారము. ఇదియంతయు మనపని, మన భయము. దుఃఖము రోగము మొదలైనవానికి ఆరంభమీభయమే. పిఱికిగాను భయపడుచును ఉండుటచే మనము ఇతరులకు హానిచేయుదుము. హానిచేయుటకు అంత భయపడుచున్నందువలననే, మనము ఇంకను ఎక్కువగా హాని చేయుదుము. కీడును మానుటకు అంతగా ప్రయత్నించుచున్నందున మనము దానినోటిలో పడుచుందుము.

ఎట్టి సారహీనమైన నిరర్థకరాశిని మనము మన చుట్టు ప్రక్కల కల్పింతుము! అది మనకు ఏమేలును కలిగింపదు, మనము దేనిని మాన ప్రయత్నింతుమో దానికడకే, అనగా దుఃఖముకడకే అది మనలను కొంపోవును..

ఆహా, నిర్భయముగా నుండుట, సాహసము గల్గియుండుట, దేనినిగాని లక్ష్యపెట్టకుండుట! ...

భవదీయేత్యాది

వివేకానంద.

## 460

(శ్రీమతి ఓల్బుల్సతికి)

1502 జోన్సువీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 4, 1900.

ప్రియధీరమాతా,

ఒక నెలగా నీవద్దనుండి ఒకమాటకూడ నాకు రాలేదు. నేను ఫ్రిస్కోలో ఉన్నాను. ఇక్కడిజనులు నా వ్రాతలచే ముందుగానే సిద్ధము చేయబడినవారై పెద్ద గుంపులుగా వత్తురు. తలుపు దగ్గర పైకము చెల్లింపవలసి వచ్చినప్పుడు ఈ యుత్సాహము ఎంతవఱకు నిలిచియుండునో చూడవలసియున్నది. పూజ్యుడు బెన్జమెన్ను ఫెమిల్సు నన్ను ఓక్లెండుకు రమ్మని పిలిచినాడు. అక్కడ నేను మతవిషయము బోధించుటకు, పెద్ద గుంపులను కూర్చినాడు. అతడు అతనిభార్యయు నా గ్రంథములను చదువుచు, అంతకాలము నా సంచారముల జాడను కనుపెట్టుచు ఉండినారు. నేను నన్ను పరిచయముచేయుచు కుమారిథర్సుబి వ్రాసియిచ్చిన జాబును శ్రీమతి హోర్ట్సుకు పంపితిని. ఆమె నన్ను పై ఆదివారము తన సంగీతప్రదర్శనమునకు రమ్మనిపిలిచినది.

నాయారోగ్యము చాలవఱకు అట్లే ఉన్నది. ఎక్కువనయము తోప లేదు. ఒకవేళ చాల అస్పష్టముగా నయమగుచున్నదో యేమో, అయినను నేను నాగొంతును 3000 మంది జనులు విన గలయట్లు ఉపయోగింపగలను. అట్లు ఓక్లెండులో రెండుసార్లు కావించితిని. అట్లు రెండుగంటల యుపన్యాసమునకు అనంతరము బాగుగా నిద్రయు పట్టినది.

మార్గట్ నీతోకూడ ఉన్నదని నాకు తెలియుచున్నది. నీవు ఫ్రాన్సుకు ఎప్పుడు పోవుచున్నావు? నేను ఇక్కడినుండి ఏప్రిల్‌లో తరలెదను, తూర్పుకు పోయెదను. నేను నాకు సాధ్యపడినచో, మే నెలలో ఇంగ్లండుకు చేరవలయునని చాల కోరిక కలిగియున్నాను. మరల నొకమాఱు ఇంగ్లండును చూచి ప్రయత్నింపక ఇంటికి పోగూడదు.

నాకు బ్రహ్మానందునివద్ద నుండియు, శారదానందునివద్ద నుండియు మంచిజాబులు వచ్చినవి. వారందఱు క్షేమముగా ఉన్నారు. వారు మునిసిపాలిటిని తన తెలివికి వచ్చునట్లు చేయ ప్రయత్నించుచున్నారు. సంతోషము. ఈ మాయాలోకమున ఎవ డును హానిచేయ నక్కఱలేదు. కొట్టక ఊరక పటాటోపము చేయ వలయును. అది చాలును.

విషయములు బాగుపడవలయును. మామూలు స్థితికి రావల యును. రాకున్న అది సరియే. శ్రీమతి సేవియరు దగ్గఱనుండియు నాకొక మంచిజాబు వచ్చినది. వారు పర్వతములపై చాలహాయిగా ఉన్నారు. శ్రీమతి వాఘను ఎట్లున్నది? మీసభ ఎప్పుడు ముగి యును? తురీయానందుడు ఎట్లున్నాడు?

శాశ్వతప్రేమ కృతజ్ఞతలతో,

నీ తనయుడు,

వివేకానంద.

## 461

(శ్రీమతి ఓల్బుల్సతికి)

1502 జోన్సువీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 7, 1900.

ప్రియ ధీరమాతా,

నీజాబును అందుంచిన శారదానందునివద్దనుండిమాత్రము వచ్చినజాబును, లెక్కలును చేరినవి. ఇప్పటివఱకు ఇండియానుండి వచ్చిన సమాచారములచేత నాకు మరల మంచినమ్మకము కలిగినది. లెక్కలను గూర్చియు, 30,000 రూపాయల వ్యయమును గూర్చియు నీకు ఇష్టమైనట్లే చేయుము.

నేను నిర్వహణమును నీకు అప్పగించితిని. ఆ గురుదేవుడు నీకు ఏదిచేయుట శ్రేష్ఠమో తెలుపగలడు. ఏకము రు. 35,000/, గంగానదిపై ఆశ్రమమును కుటీరమును నిర్మించుటకై ప్రత్యేకించిన 5000/ ఇప్పుడే ఖర్చుపెట్టవద్దని నేను శారదానందునికి వ్రాసితిని. నేను ఆ పైకములో అప్పుడే 5000 /తీసికొంటిని. ఇకను నేను ఏమియు తీసికొనబోను. ఆ 5,000 నుండి రెండువేలో, ఇంకను ఎక్కువో ఇండియాలో మరల ఇచ్చివేసితిని. కాని బ్రహ్మానందుడు ఆ 35,000/ లలో ఎంతశక్యమో అంతయు సరిగా, ఖర్చుగాక, ఉన్నదని చూపుటకై నా 2,000 ల నుండి తీసికొన్నట్లు ఉన్నది. కావున నేను వారికి ఇంకను అందులకై 5,000 బాకీపడియున్నాను. ఎట్లైనను, నేను ఇక్కడ కాలిఫోర్నియాలో ధనము సంపాదింపగలననియు, వారికి గుట్టుగా తీర్చివేయగలననియు తలంచితిని.

ఇపుడు కాలిఫోర్నియాలో ఆర్థికముగ నేను పూర్తిగా భంగమొందితిని. లోసేంజిలిస్‌కంటె ఇక్కడ పరిస్థితి చాల హీనముగానున్నది. ధనముఈయనక్కఱలేని వట్టియుపన్యాసము లన్న, వారు గుంపులుగా వత్తురు, ధనమీయవలసినది యన్న చాల తక్కువమంది వత్తురు. నేను ఇంగ్లండుపై ఇంకను కొంతయాస

పెట్టుకొనియున్నాను. నేను ఇంగ్లండుకు మేనెలలో చేరి తీరవలెను. ఊరక వ్యర్థముగా, నేను సాన్ఫ్రాన్సిస్కోలో నా ఆరోగ్యమును చెడగొట్టుకొనుట ఇంచుకయు ప్రయోజనకారి కాదు. అదియును గాక, జోకు ఎంత ఉత్సాహమున్నను, ఆ దివ్య వైద్యురాలివలన, నా పొట్టమీద గీతినందున కలిగిన కొన్ని యెఱ్ఱని అతుకులవంటి గుఱుతులుతప్ప నాకు ఇక నేమియు నిజమైన గుణము అగపడలేదు! నాకు వేదికపని యంతయు ముగిసినట్టులే. ఇక, బలాత్కరించుకొన బూనుట మరణమును త్వరపెట్టుటే యగును. ఇక్కడినుండి నేను త్వరగా బయలుదేఱుచున్నాను. దారిఖర్చు ఎంత త్వరగా చేర్చు కొనగల్గిన అంతత్వరగా పోవుదును. లోసేంజిలిస్‌లో నేను సంపా దించిన 300 డాలర్లు నాచేత ఉన్నవి. పైవారము ఇక్కడ ఉపన్యా సము చేసెదను. అంతటితో ఆపివేసెదను. మరము, పైకము అను వాని విషయముల గూర్చి నాకు ఆబరువు ఎంతత్వరగా తీఱిన అంత బాగుగా నుండును.

నీవు నన్ను ఏమిచేయుమని సలహాచెప్పినను దానిని చేయు టకు సిద్ధముగా ఉన్నాను. నీవు నాకు నిజముగా తల్లివిగా ఉంటివి. నా పెద్దబరువు నొకదానిని, అనగా నా మేనబంధువును, నీమీద వేసికొంటివి. నేను పూర్తి తృప్తిని అనుభవించుచున్నాను. మా యమ్మ విషయమునకా నేను, నాకడ దినాలకును ఆమెకడదినాల కును, ఆమెవద్దకు మరలిపోవుచున్నాను. న్యూయార్కులో నాకు ఉన్న వేయిడాలర్లకు నెలకు 9/ తొమ్మిది రూపాయలు వచ్చును. తర్వాత ఆమెకోసము కొద్దిపాటిస్థలము కొన్నాను. దానికి 6/ రూపాలు వచ్చును. ఆమె పాతయిల్లు ఉన్నది. దానికి ఒక ఆరు రూపాయలు వచ్చును. వ్యాజ్యెములో చిక్కియున్న ఇంటిని నేను లెక్కపెట్టుకొనలేదు. ఇపుడు నాకది లేదుగదా. నేను మాయమ్మ మాయవ్వ, నాతమ్ముడు మేము నలువురము సులువుగా ఆ 20/ రూపాయలతో జీవితము గడుపుదుము. నాకు దారిఖర్చుకు

దొరకునేని న్యూయార్కులోని వేయిడాలర్లను తాకకుండ, నేను ఇండియాకు ఇప్పుడే బయలు దేఱెదను.

ఎట్లైనను నేను మూడునాలుగు నూర్ల డాలర్లను చేర్పగలను. నాలుగునూర్ల డాలర్లు నా రెండవతరగతి ప్రయాణవ్యయమునకును కొన్ని వారాలు లండనులో నిలుచుటకును చాలును. నేను నిన్ను నాకోసము ఇంతకన్న ఎక్కువ ఏమియు చేయుమని అడుగను. నాకు అది అక్కఱలేదు. ఎప్పుడైనను నా అర్హత ఏపాటిదో అంతకంటె చాల ఎక్కువే నీవు నాకు చేసియున్నావు. రామకృష్ణుని కార్యమున నాస్థానమును నేను ఏకాంతభక్తితో నీకు ఇచ్చివైచితిని. నేను అందుండి బయటికి వచ్చితిని. నా జీవితమంతయు నేను అసహాయురాలైన మాయమ్మకు ఒక యాతనగా ఉంటిని. ఆమె జీవితమంతట ఒక్కటే విడుమరలేని దుఃఖము. సాధ్యమగునేని ఆమెను ఇంచుకేని సుఖపెట్టుటకు నేను నా కడపటిప్రయత్నము చేయవలయును. నేను దానిపద్ధతి నంతయు పూర్తిగా ఆలోచించిపెట్టితిని. నేను నా జీవితమంతయు అమ్మకు సేవచేసితిని. అది ముగిసినది. ఇకను ఆమె కోసము నేను ఏమియుచేయను. ఆమె వేఱు పనివాండ్రను చూచుకొనునుగాక. నేను సన్న్యాసి చేసెదను.

జీవితమున కేకైక లక్ష్యముగా శ్రీరామకృష్ణుని వరించిన దానవు నా మిత్రులలో నీవొక్కతెవే. నీయందలి నా నమ్మకమునకు కీలకము అది. తక్కినవారు నన్ను తాము సొంతముగా ప్రేమింతురు. కాని వారు నన్ను నమ్ముటకు కారణము రామకృష్ణుడని రవంత కలనైనను కనరు. రామకృష్ణుని విడిచిపెట్టినచో నేను కేవలము తెలివిమాలిన తీవ్ర స్వార్థ మనోభావముల రాశినేయగుదును. ఏవిధముగానైనను తరువాత ఏమివచ్చునో అని యనుకొనుటయు, తరువాత ఏమి తప్పక రావలయునో దానిని కోరుకొనుటయునను, ఈ ఒత్తిడి చాల భయంకరమైనది; ఆబాధ్యతకు నాకు శక్తిచాలదు. నేను అసమర్థుడనని తెలిసిపోయినది. నేను ఈపని మానుకొనవలయును. పనిలో ప్రాణములేదేని, దానిని చావనిమ్ము. తనలో

ప్రాణము కలదేని అది నాబోటి అశక్తులగు పనివారికై కనుపెట్టు కొని యుండ నక్కఱలేదు.

ఇపుడు పైకము రు. 39,000 నాపేరిట ఉన్నది, సర్కారు పదిలపుపత్రాలలో ఉన్నది. వానిని ఇప్పుడు అమ్మినచో మనము భయంకరమైన నష్టము పొందుదుము. కారణ మేమన, యుద్ధము. మఱి వానిని అక్కడ అమ్మకుండ ఇక్కడికి ఎట్లు పంప నగును? వానిని అక్కడ అమ్ముటకు వానిపై నేను చేవ్రాలు చేయ వలయును. ఇదంతయు ఎట్లు చక్కపెట్టబడపోవుచున్నదో నేను ఎఱుం గను. దానినంతటిని గూర్చి నీకు ఏదిశ్రేష్ఠమని తోచునో దానిని చేయుము. ఇంతలో నేను నీపేరిటికి, నేను హఠాత్తుగా చనిపోయి నచో సర్వమునకును, ఒక విల్లునామా మరణశాసనము వ్రాయుట మిక్కిలి ఆవశ్యకము. విల్లునకు చిత్తుప్రతి సాధ్యమైనంత త్వరగా నాకు పంపుము. నేను సాన్ఫ్రాన్సిస్కోలో గాని, చికాగోలోకాని దానిని 'రిజిస్టరు' చేయించి పంపెదను. అప్పుడు నా అంతరాత్మ క్షేమముగా ఉండును. నేను ఇక్కడ ఏవకీలును ఎఱుగను. లేకున్న నేను ఇక్కడనే దానిని వ్రాయింతును. అదియునుగాక దానికి వలయు పైకమును నాచేత లేదు. విల్లును తక్షణమే నమోదు చేయ వలయును. ఇల్లడపత్రము (ట్రస్టు) మొదలగువానికి చాలినంత కాలము గలదు.

సదా నీ కుమారుడను
వివేకానంద.

## 462

(కుమారి జోసఫైన్ మెక్లియడుకు)

1502 జోన్సువీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 7, 1900.

ప్రియ జో,

శ్రీమతి బుల్సతి జాబువలన నీవు కేమ్బ్రిడ్జిలో ఉన్నావని తెలిసినది.

నీకు పంపిన కథలు నీకు చేరలేదనియు కుమారి హేలెక్ వలన నాకు తెలిసినది. నేను చింతిలుచున్నాను. మార్గట్ వద్ద ప్రతులు ఉన్నవి. ఆమె నీకు ఇయ్యవచ్చును. నాఆరోగ్యము అట్లట్లు ఉన్నది. పైకము లేదు. కష్టమైనపని. ఫలములేదు. లోసే నెలిసు కంటె హీనము, ఏమియు బాగుగా లేదు.

ఉపన్యాసము ధనము ఈయ నక్కఱలేనిదైన జనులు గుంపులు గుంపులుగా వత్తురు. ఈయవలసినదైన వారు రారు. అంతే. నాకు పూర్వపుస్థితి సంభవించినది. కొన్నాళ్ళుగా, నాకారోగ్యమించుకయు బాగుగా లేదని తోచుచున్నది. ప్రతిరాత్రియు ఉపన్యాసము చేయుటయే అందులకు కారణమని తోచుచున్నది. నేను ఓక్లెండులో ఏమేని కొంత చేయుదునని ఆసపడుచున్నాను. కనిసము నాకు న్యూయార్కు చేరుటకు వలయు దారిఖర్చుకైనను సంపాదింపలేక పోవుదునా? నాకు ఇండియాకు చేరుటకు వలయు దారి వ్యయము నకై న్యూయార్కులో పని చేయవలయునని అనుకొనుచున్నాను. అక్కడ కొన్ని నెలల మకాముకు వలయు ధనమును ఇక్కడ కూర్చుకొందునేని నేను లండనుకు పోవచ్చును.

మన సేనాధిపతివిలాసము నాకు పంపుదువా? ఇపుడు పేరు సయిలము జ్ఞప్తినుండి జాఱి పోవుచున్నది.

ఇక సెలవు. నిన్ను ఒకవేళ పారిసులో చూడవచ్చును. చూడకయు పోవచ్చును. ప్రభువు నిన్ననుగ్రహించును గాక. ఎప్పుడుకాని నాకుగల అర్హతను మించి నీవు నాకు మేలు చేసితివి.

కడలేని ప్రేమతోను కృతజ్ఞతతోను,

భవదీయ,

వివేకానంద.

## 463

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

సా న్ఫ్రాన్సిస్కో,
మార్చి 12, 1900.

నా ప్రియరాఖాల్,

కొంతకాలము క్రిందట నీవద్దనుండి నాకొక జాబు వచ్చినది. శరత్ వద్దనుండి ఒకజాబు నాకు నిన్న చేరినది. గురుదేవుని జన్మదినోత్సవమునకైన ఆహ్వాన పత్రికల ప్రతి నొకదానిని చూచితిని. శరత్తు మేహవాతమువలని కీళ్ళనొప్పులతో బాధపడుచున్నాడని విని చాల దిగులు పడితిని. అయ్యో, కడచిన రెండేండ్లును, రోగము, దుఃఖము నొప్పి ఇవి నా సావాసులుగా ఉండినవి. నేను ఇకమీదట అంతగా కష్టపడి పనిచేయబోను అని శరత్తుతో చెప్పుము. కాని ఎవడు తన భోజనము సంపాదించుకొనుటకు చాలినంత పని చేయడో వాడు పస్తుపడి చావవలసినదే!...దుర్గాప్రసన్నుడు ఇప్పటికి చుట్టు ప్రహరిగోడకు కావలసినదంతయు చేసియుండునని ఆసించుచున్నాను.... ప్రహరిగోడ లేపుట, అంతకష్టమైన పని గాదు. నాకు శక్తికలదేని, నేను అక్కడ ఒక చిన్నయిల్లు కట్టుకొని మా ముసలియవ్వకును అమ్మకును పరిచర్యలు చేయుదును. చెడుపనులు ఎవరినిగాని కట్టికుడుపక వదలిపెట్టవు. అమ్మ ఎప్పుడుగాని ఎవ్వరిని విడిచిపెట్టదు. నా చేష్టితములు తప్పులుగా నుండినవని నేను అంగీకరింతును. చూడు, తమ్ముడూ, మీ రందఱు సాధువులు, గొప్పయోగులు. నేను ఇకమీద ఈ బాధను బరువును—దేనిని నాబుజాన, మోయకుండునట్లు నామీదదయయుంచి అమ్మను ప్రార్థింపుడు. ఇపుడు నాకు కొంచెము మనఃశాంతి కావలయును. బాధ్యతను కార్యభారమును మోయగల శక్తి ఇక నాకు లేనట్లు కనిపించుచున్నది. ఇక నా జీవితమున శేషించిన కొన్నిరోజులును విశ్రాంతియు మనఃశాంతియు నాకు కావలయును. జయము గురునికి! గురునికి జయము! ఇక ఉపన్యాసములు లేవు. అట్టిది మఱేదియు లేదు. శాంతి!

శరత్తు మరపు ఇల్లడపత్రము ట్రస్టుడీడ్ పంపగానే, నేను దానిలో నా సంతకము చేసెదను. మీ రందఱు నిర్వహింపుడు. నాకు నిజముగా విశ్రాంతి కావలయును. ఈ జబ్బుకు న్యూరాస్థీనియా అని పేరు. అది నరముల రోగము. అది ఒకపరి వచ్చినచో, కొన్నియేండ్లు అట్లే నిలిచియుండును. కాని మూడునాలుగేండ్లు పూర్తిగా విశ్రాంతిగా నుండిన అది సరిపడిపోవును. ఈదేశము ఆ రోగమునకు సొంతయిల్లు. ఇక్కడ అది నన్ను పట్టుకొన్నది. అయినను అది ప్రాణహరమగు రోగము కాకపోవుటయే కాక, మనుష్యునికి దీర్ఘాయువును కూడ ఒసంగును. నాకై ఆకులపడకుము. నేను అట్లే దొరలుచుందును. అయినను గురుదేవునిపని వృద్ధికాంచక ఉన్నదే అన్న ఈదుఃఖమును ఆయనపనిలో నేను ఏమియు సాధింపలేకపోయితినే అన్న పశ్చాత్తాపమును ఉన్నవి. నేను మిమ్మందఱిని ఎంతగా తిట్టి పరుషములు ఆడుదును! మానవులలో నేను చాల పనికిమాలినవాడను, నాకన్న పనికిమాలినవాడు లేడు. నేడు ఆయన జన్మదినవార్షికోత్సవమునందు మీ పాదధూళిని నాతలపై ఉంపుడు. అంతట నామనసు మరల సుస్థిరమగును.

జయము గురుదేవునకు, గురుదేవునకు జయము!! నీవే ఏకైక శరణమవు! నీవే నా యేకైకశరణమవు! ఇపుడు నాచిత్తము సుస్థిరముగా ఉన్నది. నన్ను నీకు చెప్పనిమ్ము, ఈ సన్న్యాసము, శాశ్వతమైన నా మనోవైఖరి. తక్కిన స్థితులన్నియు వట్టి రోగము అని తెలియుము. ఇకను దయచేసి నన్ను ఎంతమాత్రము పనిచేయనీకుము. నేను ఇప్పుడు నెమ్మదిగా కొంతకాలము జపము ధ్యానము చేసికొందును. మఱేమియు గాదు. తక్కినదంతయు అమ్మ ఎఱుగును. విశ్వమాతకు జయము!

ప్రేమయుత భవదీయ

వివేకానంద.

## 464

(కుమారి మేరీ హేలుకు) 1719 తుర్కు వీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 12, 1900.

ప్రియ మేరీ,

నీ వెట్లున్నావు? అమ్మ ఎట్లున్నది? అప్పచెల్లెండ్రు? చికాగోలో అన్ని విషయములు, ఎట్లు జరుగుచున్నవి? నేను ఫ్రిస్కోలో ఉన్నాను. ఇకను దాదాపు ఒక నెల ఇక్కడనే ఉందును. ఏప్రిలు రాగానే ఆ తొలిదినాలలోనే చికాగోకు బయలుదేఱుదును. అంతకుముందు నీకు వ్రాసెదనులెమ్ము. కొన్నాళ్ళు నీతో ఉండు వీలు నాకు గల్గవలెనని ఎంతగా కోరుదును! మనుష్యుని పని అంత శ్రాంతి కలిగించును. నాయారోగ్యము అట్లట్లు ఉన్నది. కాని నా మనసు చాల ప్రశాంతముగా నున్నది. ఇప్పటికి కొంతకాలముగా అట్లున్నది. నేను నావ్యాకులత నంతయు ప్రభువుకొఱకు మానివేయ ప్రయత్నించుచున్నాను. నేను కేవలము సేవకుడను. విధేయుడనై పనిచేయుటే నాపని. తక్కినది, ఆయన యెఱుంగును, "అన్ని చిరాకులను మార్గాలను వదలిపెట్టి, నన్ను శరణుచొరుము. సమస్తాపదలనుండియు నిన్ను కాపాడెదను." (గీత XVIII. 66)

నేను దానిని పొందుటకు కష్టపడి ప్రయత్నించుచున్నాను. నేను దానిని త్వరగా పొందజాలియుందునుగాక.

సదా ప్రేమపూర్ణ భవదీయసోదరుడు
వివేకానంద.

## 465

(శ్రీమతి బుల్ సతికి) 1719 తుర్కు వీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 12, 1900.

నా ప్రియ ధీరమాతా,

నీవు కేమ్బ్రిడ్జినుండి వ్రాసిన జాబు నిన్న వచ్చినది. నాకు ఇప్పుడు నియతమైన విలాసము కలదు. 1719 తుర్కువీథి, సాన్ఫ్రా

న్నిస్కో—అని. దీనికి కొన్ని బంతులు జవాబు వ్రాయుటకు నీకు వ్యవధి ఉండునని నా ఆస. నీవు నాకు చేతివ్రాతగా పంపిన ఒక లెక్క యుండినది. నీవు కోరినట్లు దానిని నీకు మరల పంపివేసితిని. అదికాక, నాకడ మఱి వేఱులెక్కలు లేవు. అవి అన్నియు సరిగా ఉన్నవి. నాకు లండనునుండి కుమారి సౌటరు వ్రాసిన మంచి జాబు ఒకటి వచ్చినది. ఆమె శ్రీ—తనతోకూడ భోజనము చేయుటకు వచ్చునని ఎదురుచూచుచున్నది.

మార్గట్ విజయమును వినుటకు సంతోషముగా ఉన్నది. నేను ఆమెను నీకు ఇచ్చివేసితిని. ఆమెను నీవు చక్కగా విచారించుకొందువని నానిశ్చయము. నేను ఇక్కడ ఇకను కొన్నివారములే యుందును, తరువాత తూర్పుకు పోగలను. గ్రీష్మర్తువుకై ఎదురు చూచుచున్నాను, అంతే.

నాకు ఇక్కడ ధనార్జనవిషయమున ఇంచుకయైనను సఫలత కలుగలేదు. కాని ఏమియు కొఱత కలుగలేదు. ఎట్లైనను, నాకు అన్నియు ఎప్పటివలె గడచిపోవును. అది నాకు నిశ్చయము. ఒక వేళ కడచిపోకున్న అప్పుడేమి చేయగలము?

నేను పూర్తిగా సన్న్యసించియున్నాను. నాకు మఠము నుండి ఒకజాబు వచ్చినది. వారు నిన్నటిదినము ఉత్సవము చేసినారు. నేను పసిఫిక్కుమీదుగా పోవ నుద్దేశింపలేదు. నేను ఎక్కడికి పోవుదునో ఎప్పుడు పోవుదునో నాకు లెక్కలేదు. ఇపుడు పూర్తిగా అన్నింటిని విడిచిపెట్టితిని. అమ్మ ఎఱుంగును. ఇదియొక గొప్ప మార్పు. ప్రశాంతత నన్ను పైకొనుచున్నది. అమ్మ దానిని కనిపట్టి విచారించుకొనును అని నేను ఎఱుగుదును. నేనొక సన్న్యాసిగా చనిపోవుదును. నీవు నాకును నావారికిని తల్లికన్న ఎక్కువగా నుంటివి. సమస్తప్రేమయు సకల శుభాశంసలును ఎప్పటికిని నీకే అని నా నిరంతర ప్రార్థన.

వివేకానంద.

మలిమాట · నామీద దయయుంచి ఇక కొన్ని వారముల వఱకు నావిలాసము 1719 తుర్కువీధి, సాన్ఫ్రాన్సిస్కో అని శ్రీమతి లెగ్గెట్టుతో చెప్పుము.

వి.

## 466

(శ్రీమతి లెగ్గెట్టుకు)

1719 తుర్కువీధి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 17, 1900.

నా ప్రియ జననీ,

నీ రమ్యమైన జాబు వచ్చినందులకు చాల సంతోషము! మంచిది, నేను నా స్నేహితులతో ఏదియో ప్రస్తావములు కలిగియే యున్నాను. నీవు నిశ్చయముగా తలపవచ్చును. ఐనను ఆలస్యము ఒక్కొక్కప్పుడు జంకును కలిగించును.

డాక్టరు హిల్లరును ఆయన భార్యయు, వారే అన్నట్లు శ్రీమతి మెల్టను ఘర్షణలచే ఎంతయో శ్రేయము పొంది నగరమునకు మరలివచ్చినారు. నాకన్ననో రొమ్మున అనేకములగు పెద్ద ఎఱ్ఱని మాసికలు ఉన్నవి. పూర్తిగా మానుట ఆరోగ్యము రెక్కొనుట అనువిషయమై ఇకమీద అనుభవమున ఏమి నిజము ఏర్పడునో నీకు నేను తెలుపగలను. సహజముగా తానే తన యెప్పటిస్థితికి గబ్బున తిరిగివచ్చుటకు కొంతకాలము పట్టునది నా జబ్బువిషయము.

ఆ దయకై నీకును శ్రీమతి ఆడమ్సునకును నే నెంతయు కృతజ్ఞుడను. నేను చికాగోకు పోయినపుడు తప్పక పోయి వారిని చూచెదను.

నీకు అన్నివిషయములు ఎట్లు జరుగుచున్నవి? నేను ఇక్కడ "ఓర్చుకొనుము లేక మూసికొనుము" అను పద్ధతిని అనుసరించుచున్నాను. ఇంతవఱకు అది చెఱుపుగా పరిణమింపలేదు. శ్రీమతి హాన్సుబరో, ముగ్గురు అప్పచెల్లెండ్రలో రెండవది, ఇక్కడ ఉన్నది.

ఆమె నాకు సాయము చేయుటకై పని చేయుచునే చేయుచునే చేయుచునేయున్నది. ప్రభువు వారి హృదయములను అనుగ్రహించును గాక. ముగ్గురు అక్కచెల్లెండ్రును ముగ్గురు దేవతలు! నీ వేమందువు? కారా? అట్టి యాత్మలను అచ్చటచ్చట చూచుటే ఈ యనర్థజీవితమునకు ప్రతిఫలము.

మంచిది. నీకు ఎప్పటికిని నాసకలమైన దీవనలు కలుగవలయునని దేవునికి నా ప్రార్థన. అంతేకాదు, నీవును ఒక దేవతవే సుమా. కుమారి కేటుకు నా ప్రేమ.

సదా భవదీయ కుమారుడను,

వివేకానంద.

మఱిమాట "మదరు బిడ్డ" ఎట్లున్నది? కుమారి స్పెన్సరు ఎట్లు ఉన్నది? ఆమెకు నా సర్వప్రేమ. నేను జాబులు జరుపు విషయమున చాల పనికిమాలిన వాడనని నీవు పూర్వమే ఎఱుగుదువు. హృదయము మాత్రము ఎప్పుడును తప్పిపోదు, మఱవదు. ఈమాట కుమారి స్పెన్సరుతో చెప్పుము.

వి.

## 467

(శ్రీమతి లెగ్గెట్టుకు)

1719 తుర్కువీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 17, 1900.

ప్రియ జననీ,

శ్రీ లెగ్గెట్టు నా పైకమును నా పేరుతో బాంకులో వేయుటకు వీలగునట్లు నాలుగు కాగితపుముక్కలమీద సంతకములు చేసి పంపవలసినదని నాకు జో ఉత్తరము వ్రాసినది. నేను వానిని సకాలమున ఆమెకు చేర్పలేనని ఆ కాగితపు తునుకలను నీకు పంపుచున్నాను.

నా యారోగ్యము రవంత నయమగుచున్నది. ఆర్థికముగను కొంచెము అభివృద్ధి కలుగుచున్నది. నేను పూర్తిగా సంతృప్తి చెంది ఉన్నాను. ఇంకను ఎక్కువమంది నీ పిలుపు నందుకొనిరానం

దులకు నాకు దుఃఖము లేదు. వారు రారని నే నెఱుగుదును. అయినను నేను నీదయకంతటికి ఎప్పటికిని నీకెంతయో కృతజ్ఞుడను. నిన్ను నీవారిని ఎప్పటికిని సమస్తశుభములు వెన్నంటును గాక.

నాకు వచ్చు జాబులన్నియు 1231 పైన్ వీధి, 'హోమ్ ఆఫ్ ట్రూత్' అను ఇంటికి పంపిన చాల బాగుగా ఉండును. నేను అటు ఇటు సంచరించుచున్నను ఆ యిల్లు శాశ్వత ప్రతిష్ఠ గలది, అందలి జనులు నాయెడ మిక్కిలి దయార్ద్రులు.

నీవిప్పుడు మంచి ఆరోగ్యము గల్గి ఉన్నావని తెలియుచున్నది. నాకెంతో సంతోషము. శ్రీమతి మెల్టను లోస్ఏంజెలిసును వదలి ఎక్కడికో పోయినది. ఇట్లని నాకు శ్రీమతి బ్లాడ్గెట్టు తెలిపినది. ఆమె న్యూయార్కుకు పోయినదా? డాక్టరు హిల్లరును, ఆయన భార్యయు మొన్న సాన్ఫ్రాన్సిస్కోకు వచ్చినారు. వారు తాము శ్రీమతి మెల్టనుచేత మిక్కిలి సాయము పొందితిమి అని చాటి చెప్పుచున్నారు. ఇక కొంతకాలములో శ్రీమతి హిల్లరు తనకు పూర్తిగా రోగనివృత్తి కలుగునని నిరీక్షించుచున్నది.

నేను ఇక్కడను ఓక్లెండులోను ఇప్పటికే పెక్కు ఉపన్యాసములు కావించితిని. ఓక్లెండుపన్యాసములకు బాగుగా డబ్బు వచ్చినది. సాన్ఫ్రాన్సిస్కోలో మొదటివారము ఏమియు ధనము రాలేదు. ఈవారమున ధనము వచ్చుచున్నది. పైవారముకూడ ధనము వచ్చునని యాశించుచున్నాను. శ్రీ లెగ్గెట్టు వేదాంతసమాజమునకు చేసిన మంచి యేర్పాట్లనుగూర్చి విని ఎంతయో సంతోషించుచున్నాను. ఆయన చాల మంచివాడు.

సర్వప్రేమతో,

భవదీయ,
వివేకానంద.

మలిమాట తురీయానందునిగూర్చి నీ కేమేని తెలియునా? అతనికి పూర్తిగా నయమైనదా?

వి.

## 468

(కుమారి మేరీహేలుకు)

1719 తుర్కు వీథి,
సాన్ఫ్రాన్సిస్కో
మార్చి 22, 1900.

నా ప్రియ మేరీ,

దయతో నీవు వ్రాసిన చిన్నజాబునకు మిక్కిలియు కృతజ్ఞుడను. ఇండియాజనులనుగూర్చియేగాక, నేను చేయవలసిన ఆలోచనలు ఇంకను ఎన్నియో ఉన్న వని నీ వన్నమాట చాలసరి. అయినను అవన్నియు అన్నింటిని మింగు నా గురుదేవుని మహా కార్యమునకంటె వెనుకకు నెట్టబడవలసినవే.

ఈత్యాగము మనస్సునకు సంతోషకరముగా ఉండరాదా యని అనుకొందును. కాని అది అట్లు లేదు. లేనందున స్వాభావికముగానే ఒకొక్కప్పుడు నాకు కఠినముగా తోచి దుఃఖము కలిగించును. ఏలయన, మేరీ, నీ వెఱుంగుదువు, నే నింకను మానవుడనే, నన్ను నేను బొత్తిగా మఱచిపోజాలను. ఒకప్పటికి మఱచిపోగల ననుకొందును. నాకై నీవు దేవుని ప్రార్థింపుము.

సహజముగానే, నన్ను గూర్చిగాని మఱే దేనినిగూర్చిగాని కుమారి మెక్లియడు అభిప్రాయములకు గాని, కుమారి నోబులు అభిప్రాయములకు గాని, మఱెవ్వరియభిప్రాయములకు గాని బాధ్యత నాది అని గ్రహింపగూడదు. బాధ్యుడను నేనా ? నేను ఆక్షేపణలకు మనసున బాధపడుచుండగా నీవు ఎన్నడును నన్ను చూడలేదు.

నీవు యూరపుకు దీర్ఘప్రవాసము పోవుచున్నందుకు నేను సంతోషించుచున్నాను. దీర్ఘకాలము ప్రయాణముసేయుము. ఏలన నీవు చాలదినములు గూటిలోని పావురముగా ఉంటివి.

నామాటకా—నేను, అట్లు గాక, నిరంతర ప్రయాణములకు అలసిపోయితిని. అందులకే నేను ఇంటికి మరలి పోయి అక్కడ నెమ్మదిగా ఉండగోరుచున్నాను. ఇకను పనిచేయుట నాకిష్టము

గాదు. విద్వాంసుని విరామమే నా స్వభావము. నాకది ఎప్పుడును కలుగుట లేదు. ఇపుడు నేను శిథిలితగాత్రుడను, పనిచే అలసిన వాడను కావున ఆ విరామము నిపుడు పొందుదమని నా కోరిక. శ్రీమతి సేవియరువద్దనుండి తన హిమాలయగృహమునుండి నాకు ఎప్పుడు జాబు వచ్చినను, దానిని చూచి నేనును హిమాలయములకు ఎగిరిపోవలయునని అనుకొందును. నాకు ఈ సభావేదిక కార్యము నెడ నిరంతరము శ్రమకలుగునట్లుగా నడచిపోవుట, క్రొత్తమొగాలను చూచుట ఉపన్యాసములు కావించుట వీనియెడ నాకు నిజముగా చాల విసుగు కలిగిపోయినది.

నీవు చికాగోలో తరగతుల సమకూర్చు కష్టము పెట్టుకొనన క్కఱలేదు. నాకు ఫ్రిస్కోలో ధనము వచ్చుచున్నది. ఇంటికి పోవు దారివ్యయమునకు చాలినంత త్వరగానే సంపాదింపగలను.

నీవును తోబుట్టువులును ఎట్లున్నారు? నేను ఏప్రిలు మొదటిభాగమున చికాగోకు రాగల నని నిరీక్షించుచున్నాను.

భవదీయ,
వివేకానంద.

## 469

(సోదరి నివేదితకు)

సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 2౦, 1900.

ప్రియ నివేదితా,

నాకు చాల మేలుగా ఉన్నది. నేను చాల బలవృద్ధిపొందుచున్నాను. స్వేచ్ఛ, (ముక్తి) చేతికి అందు దూరములోనికివచ్చినది అని ఒక్కొక్కప్పుడు అనుకొందును. కడచిన రెండేండ్లయాతనలు పెక్కుమార్గముల గుణపారము లయినవి. అవికలిగిన ఆసమయమున మనము శాశ్వతముగా వానితో మునిగిపోయినట్లు భావించినను రోగమును మందభాగ్యతయు తుదకు మనకు మేలు సేయుటకే కలుగును.

నేను కడలేని నీలాకాశమను. నామీఁద మేఘములు క్రమ్మి వచ్చును. అయినను నే నేమో ఆకడలేని నీలాకాశమనే.

నా స్వభావమును, ఎల్లవారి స్వభావమును అయిన ఆ మనః శాంతిని రుచిచూచుటకు ప్రయత్నించుచున్నాను. సత్తుకుండలవంటి ఈ దేహములును, సౌఖ్యమును దుఃఖమును అనెడి ఈ తెలివి మాలిన కలలును —ఇవి యేటివి ?

నాకలలు తీఱిపోవుచున్నవి. ఓంతత్సత్ !

భవదీయ,

**వివేకానంద.**

## 470

(సోదరి నివేదితకు)

1719, తుర్కు వీథి,
సాన్ఫ్రాన్సిస్కో
మార్చి 28, 1900.

నా ప్రియ మార్గరెట్,

నీ మంచి యదృష్టమునకు నాకు ఎంతో సంతోషము. మనము స్థిరముగానున్న అన్ని విషయములు గిఱ్ఱున తిరిగి సరియైన దారికి వచ్చును. నీకు కావలసిన ధనమంతయు ఇక్కడగాని ఇంగ్లండులో కాని రాగలదు.

నేను చాల కష్టపడి పనిచేయుచున్నాను. నేను ఎంతకష్ట పడిన నాకు అంతహాయిగానున్నది. ఈ అనారోగ్యము నాకు గొప్పమేలు చేసినది. నిజము. నిస్సంగత్వము అనగా అర్థమేమో నాకు నిజముగా ఇప్పుడు బోధపడుచున్నది. నేను చాలత్వరలో పూర్తిగా నిస్సంగుడ నగుదు నని ఆశపడుచున్నాను.

మనము మన సకలశక్తులను ఒక్కదానిమీఁదనే కేంద్రీక రించి దానితో సంగతులమై పోవుదుము. అన్నిటినుండియు రెప్పపాటు సూచనతోనే మనము నిస్సంగత నెందు మనఃశక్తి ఏతద్విపరీతము. ఇంతయే కష్టమైనది ఐనను, మనకెప్పుడును దానిపై శ్రద్ధలేదు.

సంగమును నిస్సంగమును, పూర్తిగా అభ్యాసప్రవృద్ధము లగు నేని, మానవుని గొప్పవానినిగాను సుఖవంతునిగాను చేయును.

శ్రీమతి లెగ్గెట్టు చేసిన వేయి (1000) డాలర్ల దానమునకు నేను ఎంతో సంతోషము చెందితిని. ఆమె ఉద్రేకము చెందు చున్నది. కాచియుండి పరికింపుము. ఆమె యెఱిగినను ఎఱుగ కున్నను, రామకృష్ణుని కార్యమున ఆమె చాల గొప్పవంతు నిర్వ హింపవలసి యున్నది.

ఆచార్యగెడ్డెసును గూర్చి నీవు చెప్పిన విషయములు నాకు చాలసంతోషానుభవము కలిగించినవి. జో యోగదృష్టిగలవానిని గూర్చి ఒక తమాషావృత్తాంతము చెప్పుచున్నది. విషయము లన్నియు ఇప్పుడే మాఱ నారంభించుచున్నవి.....

ఈజాబు నీకు చికాగోలో చేరు ననుకొందును.

కుమారి సౌటరుకు గాఢ మిత్రమును, స్విస్ యువతియునగు మాక్స్గజిసిక్ నాకొక మంచిజాబు వ్రాసినది. కుమారి సౌటరుకూడ నాకు తన ప్రేమను అందించినది. వారిరువురును నేను ఎప్పుడు ఇంగ్లండుకు వత్తునో యని అడుగుచున్నారు. చాలమంది ఆసంగతిని గూర్చి తమ్ము ప్రశ్నించుచున్నా రట.

అన్ని విషయములు ఒక చక్రముగా తిరిగి దారికిరావల యును. చెట్టయి బయటికి వచ్చుటకు భూమిలోని విత్తనము చావ వలయును. కడచిన రెండేండ్లు ఆభూగర్భమున కుళ్ళుటవంటి కాలము. నేను ఎన్నడును మృత్యుముఖమున గిజగిజలాడి యెఱు గను. కాని పర్యవసానమున అది జీవితమునంతటిని లేవనెత్తుటే. అట్టి దొకటి నన్ను రామకృష్ణునికడకు చేర్చినది, మఱియొకటి యునైటెడ్ స్టేట్సునకు పంపినది, ఇదే యన్నింటికంటెను పెద్దది. ఇదియు తొలగిపోయినది, నేను చాల శాంతముగా నున్నాను. తలంచుకొన్న ఒక్కొక్కప్పుడు చాల ఆశ్చర్యము కలిగించును! నేను ప్రతిదినము ఉదయమునను సాయంకాలమునను పని చేయుదును, దేనినైనను ఏగంట యప్పుడైనను తినుదును,

రాత్రి 12 గంటలకు పండుకొందును. అయినను అంతటి సుఖనిద్ర! అట్టి నిద్రపోవు శక్తి నాకు మునుపు ఎప్పుడును లేదు!

సకల ప్రేమాశీస్సులతో,

భవదీయ,

వివేకానంద.

## 471

(కుమారి మేరీ హేలునకు)

1719 తుర్కువీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 28, 1900.

అత్యంతధన్య మేరీ,

ఈ జాబు 'నేను చాల సుఖముగా నున్నాను' అని నీకు తెలుపుటకు. అనగా, నేను ఈలోకము అంతయు సుఖమయము, శుభోదర్కము అను మిథ్యాభావమునకు లోనగుచున్నానని కాదు, బాధపడు నా శక్తి పెరుగుచున్నది అనుట. నేను ఈలోకపు సుఖదుఃఖములనెడు మారిరోగపు పురుగులు సోకకుండ ఉద్ధరింపబడుచున్నాను. అవి నాకు అర్థములేనివై పోవుచున్నవి. ఇదియొక కలల దేశము. ఒకడు భోగించినను ఏడ్చినను లెక్కలేదు. అవి వట్టి కలలు. కాబట్టి త్వరగానో ఆలస్యముగానో అవి విశీర్ణములై పోవలయును. మీ కందఱకు అక్కడ అన్ని విషయములు ఎట్లు జరుగుచున్నవి? హారిమెట్టు పారిసులో కొంతకాలము హాయిగా ఉండబోవుచున్నది. నేను అక్కడ ఆమెను తప్పక కలసికొందును. ఫ్రెంచి భాష మాటలాడెదను. నేను ఒక ఫ్రెంచి నిఘంటువును కంఠపారము చేయుచున్నాను. నేను ధనమును సయితము కొంత సంపాదించుచున్నాను. ప్రాతఃసాయంకాలముల కష్టమగు పని. అయినను ఆరోగ్యము చాల బాగున్నది. మంచి నిదుర, మంచి జీర్ణశక్తి అగ్నిదీప్తి, బొత్తిగా కాలనియమము లేమి.

నీవు తూర్పుకు పోవుచున్నావు. నేను ఏప్రిలు అంతములోపల చికాగోకు రావలయునని ఆశపడుచున్నాను. నేను రాలేకపోవుదు నేని, నిన్ను తప్పక నీవు పోకముందు, తూర్పున కలిసికొందును.

మెకిండ్లి బాలికలు ఏమిసేయుచున్నారు? ద్రాక్షపండ్ల నానాపాకముల ఆరగించుచు గుండ్రముగా బలియుచున్నావా? సాగిపో. జీవితము వట్టి స్వప్నమాత్రమే. అది యిట్టిదని నీవు సంతోష పడవా? నాదేవుడా? వారికి శాశ్వతిస్వర్గము కావలయునట! దేవునికి ప్రణామము! ఆయన తప్ప మఱేదియు శాశ్వతము గాదు. ఆత డొక్కడే దానిని భరింపగలడు. అది నానిశ్చయము. నిత్యత అనునది అర్థరహితాలాపము!

విషయముల హుంకారములు ఇపుడే చెవినిపడుచున్నవి. ఇక రవంతసేపటికి అవి గర్జింపగలవు. నేను నెమ్మదిగలిగియే యుందును. నీ కిప్పుడు విషయముల హుంకారము వినవచ్చుటలేదు. నేను చాల దుఃఖించుచున్నాను. అనగా దుఃఖింప ప్రయత్నించుచున్నాననుట! ఏలన ఇకమీదట నేను దేనికిగాని దుఃఖపడజాలను. నేను అబోధ మగు శాంతిని పడయుచున్నాను. అది సంతోషముగాదు, దుఃఖ మునుగాదు, అదేదో ఆరెంటిని మించినది. ఈవిషయము అమ్మతో చెప్పుము. కడచిన రెండేండ్లును నేను చావులోయలో, శారీరకము గాను మానసికముగాను, సంచరింపుటయే నాకు ఇందు చాల సాయము చేసినది. నేనిపుడు ఆశాంతిని, ఆ నిత్యమౌనమును డగ్గఱు చున్నాను. ఇపుడు నేను అన్నివిషయములను వాని కలరూపమున చూడ దలంచుచున్నాను, సర్వమును ఆ శాంతిలో ఎల్లెల్లు నిండుగా పూర్తిగా ఉండవలయునో అట్లు చూడదలంచుచున్నాను. ఎవనికి తన సంతోషము తనలో ఉన్నదో ఎవనికి తనకోరికలు తనలో ఉన్నవో వాడే తన గీతపాఠాలు నేర్చుకొన్నవాడు. లెక్కలేని జన్మలు లెక్కలేని స్వర్గాలు లెక్కలేని నరకాలు అనువాని యన్నింటిగుండ మన మిక్కడ నేర్చుకోవలసిన గొప్పపాఠ మిదే—' తన యాత్మకంటెను తనకు అడుగవలసినదియు, కోరవలసినదియు

ఏమియు లేదు అనుటయే నేను పొందదగినది. అన్నిటికన్నను గొప్పది నా ఆత్మ, 'నేను స్వేచ్ఛగా ఉన్నాను'. కావున నా సుఖమునకు వేఱేదియు నాకు అనపేక్షితము. "ఈయనంత కాలమునను నేను, ఒక్కడనే. ఏలన నేను మునుపును ఇప్పుడును ఇక నెప్పటికిని కూడ ముక్తుడనే" ఇది వేదాంతమతము. ఇన్నాళ్ళును దాని సిద్ధాంతమును బోధించితిని, మఱి వహావ్వా, నా సంతోషము ఏమందును! మేరీ, నా ప్రియసోదరీ, నేను ఇపుడు ప్రతిదినము ఆ సత్యమును నాయనుభవమున సాక్షాత్కరించుకొనుచున్నాను, అవును, నిజము, అట్లే అనుభవించుచున్నాను. 'నేను ముక్తుడను', 'నేను ఏకమను అద్వితీయమను.'

సదా సచ్చిదానందగత భవదీయ
వివేకానంద.

మఱిమాట—ఇపుడు నేను నిజముగా 'వివేకానందుడను'గా ఉండబోవుచున్నాను. నీ వెన్నడేని కీడును అనుభవించితివా! హా! ఆహా! ఏమియు ఎఱుంగని పసిపిల్లా, అంతయు మంచిదే! అర్థము లేనిమాట. కొంతమంచి కొంత చెడుగు. నేను మంచిని అనుభవింతును చెడుగును అనుభవింతును. నేను జీససుగా ఉంటిని, జూడసు ఇస్కారియటుగా ఉంటిని, రెండును నాయాట. నాతమాష. "ఎంత కాలము ఇరువురు ఉందురో. అంతవఱకు భయము వీడిపోదు" నిప్పుకోడి పద్ధతి? తలలను ఇసుకలో దూర్చుకొని 'నన్నెవరు చూచుట లేదు'అని యనుకొనుము! అంతయు మంచి! ధైర్యముగా ఉండి, ప్రతిదానిని ఎదుర్కొనుము. ఓమంచీ రా, ఓ చెడూ, రా; ఇరువురును రండి, ఇరువురికి స్వాగతము. మీ రిరువురును నాయాట. నేను పొందవలయు మంచిలేదు. పట్టుకొని పైకి ఎగబ్రాకవలయు పరమలక్ష్యమేమియు లేదు; తీర్చుకొనవలయు ఉన్నతాశయమేమియు లేదు. నేను వజ్రఖనిని. పటికరాతి తునుకలతో, మంచిసెబ్బరలతో, ఆడుకొనుచున్నాను. నీకు మేలు, చెడూ, రా; నీకు మేలు, మంచీ, నీవును రా. ఈవిశ్వము నా చెవులచుట్టును దొర్లనిమ్ము నాకేమి!

నేను బోధాతీతమగు శాంతిని. బోధము మనకు మేలునో కీడునో
ొసంగునది. నేను వానిని అతిక్రమించి ఉన్నాను. నేను ప్రశాంతిని
ఁమా!

వి.

## 472

(తురీయానందస్వామికి)

సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి, 1900.

ప్రియ హరిభాయ్,

నాకు శ్రీమతి బెనర్జివద్దనుండి సరకు ఎక్కించినందులకైన
సుమునుకోరు చీటి బిల్లు ఇప్పుడే వచ్చినది. ఆమె కొంత పప్పు,
ియ్యము పంపినది. ఆసరుకు ఎక్కించిన బిల్లును నేను నీకు పంపు
న్నాను. దానిని కుమారి వాల్డోకు ఇమ్ము. ఆమ ఈ వస్తువుల
న్నిటిని వారు వచ్చునపుడు తేగలదు.

పైవారము నేను ఇక్కడినుండి చికాగోకు బయలుదేఱు
న్నాను. అక్కడినుండి న్యూయార్కుకు పోయెదను. నేను ఎట్లో
ాలక్షేపము సేయుచున్నాను...ఇప్పుడు నీ కాపురమెక్కడ? నీవు
మిచేయుచున్నావు?

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

## 473

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

1719 టర్కు వీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
మార్చి 30, 1900.

ప్రియ జో,

నీవు పుస్తకములు వెంటవే త్వరగా పంపినందులకు చాల
తజ్ఞుడను. అవి త్వరగా అమ్ముడుపోవునని నమ్ముచున్నాను,
పద్ధతులు మార్చుకొనుటయందు నాకంటెను ఎక్కువగా

మితిమీరుటితివని యిందు నాకు తెలియుచున్నది. ఇంకను 'అవేకండ్' ఇండియా (ప్రబుద్ధభారతము) ఏదియు నాకు రాలేదే, ఏల! నాకు ఆశ్చర్యము కలుగుచున్నది. నాకు చేరవలయు తపాలు అట్లు అడ్డదిడ్డములగా పోవుచున్నదని భయము కలుగుచున్నది.

నేను కష్టపడి పనిచేయుచున్నాను. కొంతధనమును కూర్చుకొనుచున్నాను. ఆరోగ్యమునను అభివృద్ధిగనుచున్నాను. ఉదయము సాయంకాలము పని, రాత్రి మంచి గురువగు భోజనము, పన్నెండు గంటలకు పండుకొందును, ఊరంతయు తిరిగివత్తును! బాగుపడుచును ఉన్నాను!

శ్రీమతి మిల్టను అక్కడఉన్నదికదూ? ఆమెకు నాప్రేమను అందింపుము. అందింతువా? తురీయానందుని కాలు ఇంకను సరిపడలేదా?

శ్రీమతి బుల్లుతికోరినందున మార్గట్ జాబును ఆమెకు పంపితిని. శ్రీమతి లెగ్గెట్టు ఆమెకు ఆ బహుమాన మిచ్చినదని తెలిసి నేను చాల సంతోషించితిని. విషయము లన్నియు సరియైనదారికి స్థితికి రావలసియున్నది. ఎట్లైనను అవి వచ్చితీఱవలసినదే. ఏలన ఏదియు శాశ్వతము గాదు కావున.

ఇక్కడ నాకు లాభకరముగా నుండునేని నేను ఇంకను ఒక వారము లేక రెండువారములు ఇక్కడనే యుందును. తరువాత ఇక్కడికి సమీపముననే యున్న స్టాక్టను అను పేరుగలచోటికి పోవుదును. తరువాత—నేనెఱుగను. విషయములు ఎట్లో జరిగిపోవుచున్నవి.

నేను చాల ప్రశాంతముగా నెమ్మదిగా ఉన్నాను. విషయములు ఎట్లో తమదారిని జరిగిపోవుచున్నవి. సరే, అవి జరిగిపోవును.

సర్వప్రేమతో,

వివేకానంద.

మలిమాట—కర్మయోగ గ్రంథమును, దానికి చేర్పవలసినవి మొదలైనవి కూర్చి, అచ్చువేయింప బూనుకొనుటకు తగినా మే కుమారి వాల్డో.

వి.

## 474

(తురీయానందస్వామికి)

నా ప్రియ హరిభాయ్,

నీకాలు నయమై బాగుపడినదనియు, నీవు దివ్యమైన పని చేయుచున్నావనియు వింటిని. చాల సంతోషము చెందితిని. నా శరీరస్థితి బాగుగానే సాగుచున్నది. నేను ఎక్కువగా ముందు జాగ్రత్తపడినపుడు, నేను జబ్బుపడుదును. ఇదీ సంగతి. నేను వంట చేయుదును. ఏది లభించిన దానిని తినుదును, రాత్రింబగల్లు పని చేయుదును. నా ఆరోగ్యము బాగున్నది. గాఢముగా నిద్రపట్టుచున్నది!

నేను ఇక నెలలో న్యూయార్కుకు పోవుచున్నాను. శారదని పత్రిక ప్రచారములో లేకుండ పోయినదా? నాకు ఇటీవల వచ్చుట లేదు. 'అవేకెన్డ్'(ప్రబుద్ధము) సయితము నిదురపోవుచున్నదనితోచుచున్నది. వారు దానిని నాకు ఇటీవల పంపుటలేదు. దానిని పోనీ. మనదేశమున బొబ్బలమారి రేగినది. ఎవరు బ్రదికియున్నారో ఎవరు చనిపోయినారో ఎవరు ఎఱుగుదురు? మంచిది. 'అచ్యు'వద్దనుండి ఈదినము నాకొక జాబువచ్చినది. అతడు సికారురాష్ట్రమున రామగడనగరమున దాగుకొని యుండినాడు. ఎవరో వానితో వివేకానందుడు చనిపోయినాడని చెప్పినారు. కావున అతడు నాకుజాబు వ్రాసినాడు. నేను అతనికి జవాబు పంపుచున్నాను.

ఇక్కడ అందఱు క్షేమముగా నున్నారు. ఈజాబు నందు కొను నీవును తక్కిన అందఱును కూడ క్షేమమని నమ్ముచున్నాను.

ప్రేమయుత భవదీయ
వివేకానంద.

## 475

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

1719 తుర్కువీథి,
సాన్ఫ్రాన్సిస్కో, కాలిఫ్.
ఏప్రిల్, 1900.

నా ప్రియ జో,

నీవు ఫ్రాన్సుకు బయలుదేఱకముందు ఇదిగో నీకు ఒక్క బంతియే వ్రాయుచున్నాను. నీవు ఇంగ్లండుమీదుగా పోవుదువా? నాకు శ్రీమతి సేవియరువద్దనుండి ఒక చక్కనిజాబు వచ్చినది. కుమారి ముల్లరు డార్జిలింగులో తనతో నుండిన కాలికి మఱేమియు మాటలు లేకుండ ఒక వట్టికాగితము పంపినదట.

ఆమె మేనల్లుని పేరు కాన్గ్రీవు. అతడు ట్రాన్స్వాలు యుద్ధములో ఉన్నాడు. తన మేనల్లుడు ట్రాన్స్వాలులో బోయెర్లతో యుద్ధము చేయుచున్నాడని తెలుపుటకు, దానిక్రింద (విశేష ద్యోతకముగా) గీత గీచినది. అంతే. అందులకు అదియే కారణము. నాకు అది అప్పుడును అర్థము గాలేదు. ఇప్పుడును కాలేదు లెమ్ము.

లోసేన్జెలిసులో ఉన్న దానికంటెను, నేను శారీరకముగా తగ్గియున్నాను. కాని మానసికముగా చాల బలముగాను దృఢముగాను శాంతి కలిగియు ఉన్నాను. ఇది యిట్లే ఉండగలదని నా ఆశ. నీకు నేను వ్రాసినజాబుకు నాకు జవాబు రాలేదు. అది త్వరగా వచ్చునని కాచుకొనియున్నాను.

నాకు ఇండియానుండి వచ్చిన ఒకజాబు పొరపాటున శ్రీమతి ష్మీలరుకు పంపబడినది. తుదకు అది నాకు సరిగానే చేరినది. నాకు శారదానందునివద్దనుండి చక్కని జాబులు వచ్చినవి. వారు అక్కడ చాల బాగుగా పని చేయుచున్నారు. బాలురు ఉత్సాహపూరితులై

పని చేయుచున్నారు. మంచిది. తిట్టుటకు రెండుతట్టులును ఉన్నవి చూచితివా, అది వారిని ఉత్సాహపఱచి పని చేయించును.

మనము ఇండియనులము ఎంతో కాలము పరాధీనముగా ఉండినారము. కావున, వారిని కార్యపరులను చేయుటకు వాక్పారుష్యము ఉపయోగింపవలసియున్నది! ఇట్లు చెప్పుటకు నేను చింతిలుచున్నాను. అందఱికన్నను సోమరిపోతు ఒకడు ఈ సంవత్సరము వార్షికోత్సవమును నిర్వహించుభారమును పూనుకొన్నాడు. జరిపివేసినాడు. వారు కావలసినపద్ధతులను నిర్ణయించుకొని. నా సాయము లేకుండనే తామే, తమకార్యములను సిద్ధిప్రదముగా చేయుచున్నారు............. ఇదంతయు నేను ఘోరముగ పెట్టుచున్న చీవాట్ల ప్రభావమే, సత్యము!

వారు తమకాళ్ళపై తాము నిలువగలుగుచున్నారు. నాకు చాల సంతోషముగా ఉన్నది. చూడు జో, అమ్మ పనిచేయుచున్నది.

నేను కుమారి ధర్సిబ వ్రాసిన జాబును శ్రీమతి హార్ట్సుకు పంపితిని. ఆమె తనపాటకు నన్ను ఆహ్వానించినది. నేను పోజాలక పోయితిని. నాకు చెడ్డపడిసెము పట్టియుండినది. కావున అంతే. కుమారి ధర్సిబ మఱియొకదొరసానికి ఒక ఓక్లెండామెకు ఇమ్మని ఒక జాబు నాకు ఇచ్చియుండినది. ఆమె నాకు జవాబు వ్రాయలేదు. నాకు ఫ్రిస్కోలో చికాగోచేరుటకు కావలయు దారిఖర్చుకు చాలునంతయైనను వచ్చునో రాదో ఎఱుగను. ఓక్లెండుపని సిద్ధి పొందినది. నాకు ఓక్లెండులో నూరు డాలర్లు వచ్చునని ఆసపడుచున్నాను, అంతే. మొత్తముమీద నేను తృప్తుడనుగానే ఉన్నాను. నేను ప్రయత్నము చేయుట చాల మంచి దాయెను.........ఆ దివ్య వైద్యాలును నా కేమియు చేయలేదు. సరే నా విషయములు ఎట్లో జరిగిపోగలవు, అది ఎట్లు అని నేను లక్ష్యపెట్టి పరికింపను. ...... నేను చాల ప్రశాంతముగా ఉన్నాను. శ్రీమతి

లెగ్గెట్టుకు మరల అనారోగ్యముగల్గినదని నాకు లోసేజ్జెలిసునుండి తెలిసినది. అది నిజమే యగునా, ఏపాటి, అని యెఱుగుటకు న్యూయార్కుకు తంతెచేసితిని. నాకు త్వరగా జవాబు వచ్చు నని కనుపెట్టుకొనియున్నాను.

లెగ్గెట్లు అవతలివైపుకు పోయినపుడు నా తపాలు నాకు చేర గలయట్లు నీవు ఏమి యేర్పాటు చేసెదవు? చెప్పుము. నాకు అది సరిగా చేరునట్లు ఏర్పాటు చేయుదువా?

నీకు చెప్పదగినది ఇక నేమియు లేదు. నా ప్రేమయు, కృతజ్ఞతయు అంతయు నీదే. అట్లని నీవు ముందే ఎఱుగుదువు. ఎన్నడు గాని నాకున్న అర్హతను మించియే నీవు నాకు మేలుచేసితివి. నేను పారిసుకు పోవుదునో పోవనో ఎఱుగను. ఇంగ్లండుసకుమాత్రము తప్పకుండ మేనెలలో పోవుదును. ఇంగ్లండున కొన్నివారములు ప్రయత్నింపక నేను స్వదేశమునకు పోగూడదు.

సర్వప్రేమతో,

సదా భవదీయ భగవద్గత,
**వివేకానంద.**

మలిమాట :—తుర్కు వీధి 1719లో శ్రీమతి హాన్సుబరోయు, శ్రీమతి అప్పెనులును ఒక నెలకు ఒక అంతస్తు అద్దెకు తీసికొన్నారు. నేను వారితోకూడ ఉన్నాను. కొన్నివారాలు అక్లే ఉందును.

వి.

## 476

(శ్రీమతి ఓల్బుల్సతికి)

1719 తుర్కువీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
ఏప్రిల్ 1, 1900.

ప్రియ ధీరమాతా,

నీవు దయతో వ్రాసిన చిన్నజాబు ఈ ఉదయము అందినది. న్యూయార్కు మిత్రములు అందఱు శ్రీమతి మిల్టనుచేత రోగ

నివారణ పొందుచున్నారని తెలిసినది. నాకు చాల సంతోషముగా ఉన్నది. ఆమె లోస్ఏంజెలిసులో, మేము ఆమెకు పరిచయము చేసిన అందఱును నాకు చెప్పినట్లు, ఎవరికి మాన్పుటలోను సిద్ధి పొందలేదు అని తెలియుచున్నది. కొందఱు తోలు ఒలుచుటకు ముందఱికన్నను ఎక్కువ జబ్బుస్థితికి వచ్చినారు. శ్రీమతి మిల్టనుకు నా ప్రేమను దయతో అందింపుము. ఆమె తోముటలు తాత్కాలికముగానైనను నాకు నయము అనిపించుచుండెను. అయ్యో పాపము, ఆ డాక్టరు హిల్లరు! మామాట విని ఆతడు అతి త్వరితముగా తన భార్యను రోగనివారణకై లోస్ఏంజెలిసుకు తీసికొనిపోయినాడు. మొన్నటి యుదయము నీ వాతనినిచూచి ఆతని మాటలను విని యుండవలసినది! ఆతనిభార్యకు ఆ తోముటలవలన రోగము ఎంతయో ఎక్కువయైనదట. ఇపుడు ఆమె అస్థిపంజరమే. అన్నింటి కన్న విశేషము, ఆ డాక్టరు లోస్ఏంజెలిసులో 500/- ఐదువందల డాలర్లు ఖర్చుపెట్టవలసివచ్చెను. అది అతనిని మానసికముగ బాధించుచున్నది. సాధారణముగా ఈమాటను నేను జోకు వ్రాయ బోను. బాధలు పడువారికి తాను ఎంతయో మేలుచేసినట్లు కలలు గనుచు ఆమె సుఖముగా సంతోషముగా ఉన్నది. అయినను అయ్యో, ఆమె ఆ లోస్ఏంజెలిసు జనులును ఈ ముసలిడాక్టరు హిల్లరును చెప్పుమాటలు విన్నచో, ఆమె ఆ నిమిషముననే తన యభిప్రాయమును మార్చుకొని, ఎవ్వరికిని మందుగాని, వైద్యముగాని సిఫారసు చేయకూడదను పాత సామెతను తలచుకొనుచు జ్ఞానము సంపాదించుకొనును. ముసలిడాక్టరు హిల్లరు జోవలన ఈచికిత్సను విని లోస్ఏంజెలిసుకు పోయిన యా యుత్సాహమును వడినిగూర్చి నేను వ్రాయలేదుగదా అని నేను ఎంతో సంతోషముగా ఉన్నాను. పాపము ఆ ముసలాయన నాగదిచుట్టును ఇంకను వడిగా నాట్యమాడుటను ఆమె చూచియుండవలసినది! 500 డాలర్లు నిజముగా ముసలాయనకు దుర్భరమగు మొత్తమే! అతడు జర్మనీవాడు. ఎగురుచు దుముకుచు తన జేబులను అఱచేతులలో తడవుకొనుచు

తట్టుకొనుచు, "ఈ బుద్ధిమాలిన వయిద్దానికి కాకుంటే నీకు ఈ అయిదువందలు వస్తుందా" అని చెప్పును!

ఇక ఆమెకు ఒక్కొక్కప్పుడు ఒక్కసారి తోముటకే 3-మూడు డాలర్లు ఇచ్చిన, పేదజనులు జోను నన్నును ఇప్పుడు అభినందించుచున్నట్టివారును ఉన్నారు. ఈ సంగతి జోకు చెప్పకు. నీవును ఆమెయు ఏపనికైనను ధనము పోగొట్టుకొనుటయందు శక్తి కలిగియున్నారు. అట్లే ఆ ముసలిజర్మను డాక్టరు కూడ. పాపము ఆపసివాడు దానిని ఇంచుక దుర్భరమని తలచుచున్నాడు. ఆముసలి డాక్టరు ఇటీవల కొన్ని దయ్యములు తన సంగతులను తారుమారు చేయుచున్నవని ఇప్పుడు నమ్ముచున్నాడు. అతడు నన్ను తన అతిథిగా ఉంచుకొనగలుగుదుననియు, తన భార్యకు రోగము మానుననియు వింతయో అనుకొన్నాడు. మఱి ఇవి యేవియు జరుగకే అతడు లోస్ఏంజెలిసుకు పరువెత్తవలసివచ్చినది. అది అనుకొన్న పద్ధతి నంతయు తలక్రిందుచేసినది. ఇకను ఇప్పుడు అతడు నన్ను తన అతిథిగా ఇంట ఉంచుకొనుటకు తనచేతనైనంతయు ప్రయత్నించినను, నేను సిగ్గుపడుచున్నాను. అతనిని చూచికాదు, అతని భార్యను మఱదలిని చూచి. "ఇందులో దయ్యములు తప్పక ఉండవలయును" అని అతడు గట్టిగా తలంచుచున్నాడు. అతడు 'థియాసఫి'—దివ్యజ్ఞానపు-విద్యార్థిగా ఉండెను. నేను 'ఎక్కడనైనను దయ్యములు తోలువాడు ఉన్నాడా వెదకు'మని కుమారి మెక్లియడుకు అతనిని వ్రాయుమంటిని. ఆమూలమున తనభార్యతో అక్కడికి పరువెత్తి మఱియొక ఐదువందలు దండుగ పెట్టుకొనుటకు! మేలుచేయుట ఎల్లప్పుడును సాఫుగా నుండదు.

నావిషయమునకా జో ఖర్చు భరించుచుండునేని, అది ఎముకను విఱుచుటకానీ, తోలు ఒలుచుటకానీ, మఱి ఏ చికిత్సయైననుకానీ నేను అందు ఊరక తమాషా చూతును. మఱి ఇందఱు జనులను తోమించుకొనుటకు చేర్చి, తాను పరువెత్తిపోయి, ఆ యక్షతలనన్నిటినీ నన్నే వేయించుకొమ్మనుట, ఇది జోకు న్యాయ్యముగాదు!

ఆమ బయటివారిని ఎవరిని తోలు ఒలిపించుకొనుటకు పరిచయము చేయకున్నదిగదా అని నేను సంతసించుచున్నాను. అట్లు గాకున్న, జో పారిస్‌కు పోయియుండును. పాపము, శ్రీ లెగ్గెట్టు ఆ యత్నత లన్నియు తినతలలో వేయించుకొనియుండును. నేను ఒక క్రైస్తవ విజ్ఞాన చికిత్సకు దానిని, జో తప్పిదమునకు రవంత పరిహారముగా డాక్టరు హిల్లరుకడకు పంపితిని. కాని ఆతనిభార్య ఆమెను అడుగు పెట్టనీయక తెలుపుమూసినది. ఆమె ఇకను ఈ వింత చికిత్సలజోలి పెట్టుకొనదు.

ఎట్లైనను, ఈసారి శ్రీమతి లెగ్గెట్టు ఆరోగ్యవంతుడుగా నుండ వలయునని నేను నా మనసార ఆశించుచున్నాను. దేవుని ప్రార్థించు చున్నాను. వారు ఆ కుట్టు (గుట్టును) విభజించి చూచి వివరము తెలిసికొనినారా?

విల్లునామా-మరణశాసనము-త్వరగా రాగలదని అనుకొను చున్నాను. నేను దానినిగూర్చి ఇంచుక ఆతురపడుచున్నాను. నేటి తపాలులో ఇండియానుండి ట్రస్టు-ఇల్లీడ-పత్రము మసవిదా కూడ వచ్చునని ఎదురుచూచితిని. జాబులు ఏమియు రాలేదు. సాన్ఫ్రాన్సిస్కోకు అవేకండ్ ఇండియా (ప్రబుద్ధభారతము) వచ్చి యుండుటను నేను చూచియున్నను ఇక్కడికి నాకు అది సయితము రాలేదు.

మొన్న పత్రికలలో కలకత్తాలో మహామారివలన ఒక వారములో ఐదువందల చావులు జరిగినవని చదివితిని. ఏది శ్రేయమో అమ్మ యెఱుగును.

అనగా, శ్రీ లెగ్గెట్టు వి. సమాజమును సమకూర్చినా డన్న మాట. బళి!

ఓలి ఎట్లున్నది? మార్గట్ ఎక్కడ ఉన్నది? మొన్న నేను ఆమెకు 21 పడమర, 34, న్యూయార్కు అను విలాసమునకు ఒక

జాబు వ్రాసితిని. ఆమె వృద్ధికి వచ్చుచున్నదని నాకెంతో సంతోష
ముగా నున్నది. సర్వప్రేమతో,

ఎల్లప్పుడు నీ కుమారుడు,

**వివేకానంద.**

మఱిమాట : నేను చేయగలంతయు ఇంకను ఎక్కువగాను
పని కలుగుచున్నది. ఎట్లో, నేను నాదారిఖర్చుకు వలయు ధన
మును కూర్తును. వారు నాకు అంత ఎక్కువగా ధన మీయలేకున్న
ను, ఎంతో కొంత ఇత్తురు. మఱి నిరంతర కృషిచేత నాకు దారి
ఖర్చుకు కావలసినంత సంపాదింపగలను. ఇంక ఎట్లో కొన్నివందలు
జేబులో ఉంచుకొందును. కావున నీవు నాకై లవలేశముకూడ
వ్యాకులపడకుము.

వి.

## 477

(సోదరి నివేదితకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
ఏప్రిల్ 6, 1900.

ప్రియ మార్గట్,

నీవు మరలి వచ్చితివి, నాకు సంతోషము. నీవు పారిసుకు
పోవుచున్నావు; నాకు మఱింత సంతోషము. నేనును పారిసుకు
పోవుదును. కాని ఎప్పుడో మాత్రము ఎఱుగను. శ్రీమతి లెగ్గెట్టు
నేను తత్క్షణమే పోవలయు నని తలంచుచున్నది. పోయి ఫ్రెంచి
(భాష) చదువుట ఆరంభింపవలయు నట. సరే, ఏది వచ్చిన,
దానిని గ్రహింతును. నీవును అట్లే చేయుము.

నీ పుస్తకములను ముగింపుము. మనము పారిసులో
మత్స్యభోక్తలను జయింపబోవుచున్నాము. మేరీ యెట్లున్నది?
ఆమెకు నాప్రేమను అందింపుము. ఇక్కడ నాపని ముగిసినది.
మేరీ చికాగోలో ఉన్నచో, ఇక పదునైదుదినాలలో నేను అక్క

డికి వత్తును. ఆమె త్వరలో తూర్పుకు వెళ్ళుచున్నది. ఆశీర్వాద ములతో,

వివేకానంద.

మలిమాట: మనసు సర్వవ్యాపకము. ఎక్కడనైనను సరే దానిని వినవచ్చు, అనుభవింపవచ్చు.

వి.

## 478

(ఒక అమెరికను మిత్రమునకు)

సాన్ఫ్రాన్సిస్కో,
ఏప్రిల్ 7, 1900.

......నేను మునుపు ఎప్పుడుగాని ఉండినంతికంటె ఇపు డెక్కువ శాంతముగాను నెమ్మదిగాను ఉన్నాను. నేను పరాధీనుడ కాక స్వతంత్రముగా, నాపాదములమీదనే నిలిచి ఉన్నాను. కష్ట పడి పనిచేయుచు సంతోషము అనుభవించుచు ఉన్నాను. పని చేయుటకు నాకు హక్కుగలదు. ఇకను తక్కినది అమ్మ యొఱుగును.

నీకు తెలియుచున్నది కదా, నే నిక్కడ నే ననుకొన్న దానికంటె దీర్ఘకాలము, ఉండవలసియున్నది, పనిచేయవలసి యున్నది. కాని నీ వేమియు కలతచెందకు. నాసమస్యల నన్నింటిని నేనే తీర్చుకొందును. నేను ఇపుడు పరాధీనతలేకుండ ఉన్నాను. వెలుగును చూడ మొదలిడుచున్నాను. జయము నన్ను దారి తొలగించి లాగుకొనిపోయియుండును. అప్పుడు నేను సన్న్యాసినను సత్యము నాకంటబడక తప్పిపోయియుండును. అమ్మ నాకు ఈ యనుభవము కలిగించుచుండుటకు అదియే కారణము.

నాపడవ ఇకనెన్నడును తాను వీడిపోసక్కఱలేని ప్రశాంత మగు రేవును, నాకాశ్రయమును సమీపించుచున్నది. జయము జయము మాతకు! నాకు ఇపుడు కోరిక లేదు, ఆశ లేదు. అమ్మ ఆనందమున ఓలలాడును గాక! నేను రామకృష్ణుని సేవకుడను.

నేను కేవలము యంత్రమను. నాకు మఱేమియు తెలియదు. తెలిసికొనవలయు ననియు కోరను. జయము జయము శ్రీగురునకు!

## 479

(శ్రీమతి లెగ్గెటుకు)

1719 తుర్కుువీథి,
సాన్ఫ్రాన్సిస్కో,
ఏప్రిల్ 7, 1900.

ప్రియ జననీ,

గాయమునకు కారణము పూర్తిగా తీసివైవబడినదను సమాచారము అందినది. అందులకు నా యభినందనముల నంగీకరింపుము. ఈసారి నీవు పూర్తిగా మేలుగందువు, నీరోగము నిశ్శేషమగును అనుటలో నాకు సందేహము లేదు.

నివు దయతో పంపిన చీటి నాకు ఎంతో ఉత్సాహవర్ధకమైనది. నాకు జనులు సాయము చేయనీ చేయకపోనీ; దానిని నేను లెక్కపెట్టను. నాకు చాల శాంతికల్గుచున్నది, నా మనసులో చింత తగ్గిపోవుచున్నది.

నాయత్యంతహార్దమగు ప్రేమను శ్రీమతి మెల్టనుకు అందింపుము. నేను నిశ్చయముగా చివరకు స్వస్థతపొందుదును. అప్పుడప్పుడు రోగము తిరుగబెట్టినట్లున్నను, నా ఆరోగ్యము మొత్తముమీద బాగుపడుచునే యున్నది. ఒక్కొక్కసారి తిరుగబెట్టినప్పుడును రోగతీవ్రతయు రోగకాలమును తగ్గిపోవుచున్నది.

తురీయానందునికిని సిరికిని నీవు వైద్యము చేయించుట కేవలము నీవలెనే – తల్లికి తగినట్లుగా—ఉన్నది. ప్రభువు నీ విశాలహృదయమునకు నిన్ను అనుగ్రహించినాడు. నీకును నీజనమునకును నీసర్వమునకును అన్ని దీవనలును ఫలించును గాక.

నేను ఫ్రాన్సుకు పోయి ఫ్రెంచిభాషలో కృషిచేయవలయుట నిజమే, సందేహము లేదు. నేను ఫ్రాన్సుకు జులైలోనో కొంచెము ముందో చేరగలనని ఆశించుచున్నాను. అమ్మ యెఱుంగును. నీ

కెప్పుడును మేలు కలుగును గాక. అందులకై నిరంతరము దేవుని ప్రార్థించు,

నీ కుమారుడు,
**వివేకానంద.**

## 480

(శ్రీమతి ఓల్బుల్సుకి)

1719, టర్కు వీధి.
సాన్ఫ్రాన్సిస్కో.
ఏప్రిల్ 8, 1900.

నా ప్రియ ధీరమాతా,

ఇప్పుడే ఆ—వద్దనుండి ఒకదీర్ఘమైన జాబు వచ్చినది. అతడు పూర్తిగా తలక్రిందైనటులున్నాడు. దవంతదయ, అతనిని పూర్తిగా లోగొనునని నా నిశ్చయము. నీవు అతనిని న్యూయార్కునుండి బయటికి తఱుమగొట్టగోరుచున్నావు అను మొదలగు తలంపు లతని కున్నవి. అతడు నాయీ దేశముల నెదురుచూచుచున్నాడు. నేను అతనితో ప్రతి విషయమునందును నిన్ను నమ్మియుండవలసిన దనియు, నేను వచ్చువఱకు న్యూయార్కులో ఉండవలసినదనియు చెప్పియుంటిని.

ఇప్పుడు న్యూయార్కులోని పరిస్థితిని బట్టి, వారికి నా సాన్నిధ్యము ఆవశ్యకమని నాకు తోచుచున్నది. నీవును అట్లు తలంతువా? అట్లగుచో నేను అక్కడికి త్వరగా వచ్చెదను.

నాకు దారిఖర్చుకు చాలినంత పైకము సమకూర్చుకొను చుంటిని. నాదారిలో నేను చికాగోలోను డిట్రాయిట్టులోను ఆగగలను.

స్వాభావికముగానే, అప్పటికి నీవు వెడలిపోవుదువు, ఉండబోవు. ఆ—ఇప్పటివఱకు మంచిపని చేసినాడు. నేను నాపనివారి జోలికి పోవనేపోవను అని నీవును ఎఱుగుదువు.

పనిచేయగల మనుష్యునికి తన ప్రత్యేకవ్యక్తిత్వ మొకటి యుండును. దానికేదేని యొత్తిడి కలిగించిన అతడు ప్రతిఘటించును.

నేను పనివారిని పూర్తిగా స్వేచ్ఛగా విడిచిపెట్టుటకు అదియే కారణము. నీవు ఆచోటఉన్నావు లెమ్ము. కావున మిక్కిలియు చక్కగా ఎఱుగుదువు. నేను ఏమిచేయవలయునో సలహా చెప్పుము.

కలకత్తాకు పంపిన పైకము సరిగాచేరినది. ఈ తపాలులో నాకు ఆ సమాచారము తెలిసినది. నామేనబంధువు తనకు నీయెడ గల గౌరవమును కృతజ్ఞతను నీకు అందింపుమన్నది. కాని తనకు ఇంగ్లీషు వ్రాయుటకు రాదని ఆమె చింతించుచున్నది.

నాకు దినదినమునకు మేలుగా ఉన్నది. కొండలపైకి సయితము నడుచుచున్నాను. అప్పుడప్పుడు జబ్బుపడుటలు కలవు కాని, వాని కాలము స్థిరముగా తగ్గిపోవుచున్నది. శ్రీమతి మిల్టనుకు నా కృతజ్ఞత.

సిరిగ్రయనాన్డరువద్దనుండి నా కొక చిన్నచీటి వచ్చినది. పాపము! ఆమె తనయందు నమ్మకముంచినందులకు చాల కృతజ్ఞురాలుగా ఉన్నది. అదియంతయు శ్రీమతి లెగ్గెట్టుపోలిక. బళి, బేష్; సెబాసు. డబ్బు మంచివారిచేతిలో ఉండినచో చెఱుపుకాదు. నేను సిరికిపూర్తిగా నయముకావలయునని నా మనసార ఆశింతును. పాపము, అనుకంపనీయురాలు.

ఇక్కడినుండి నేనిక రెండువారములలో బయలుదేఱగలను. ఇక్కడినుండి స్టార్లాకను అనుచోటికి పోవుదును. అటుతర్వాత తూర్పుకు బయలుదేఱెదను. ఒకవేళ డెన్వరుకుకూడ పోవుదునేమో. జోకు సర్వప్రేమ.

ఎప్పుడును నీకోమారుడను
వివేకానంద.

మలిమాట నాకు పూర్తిగా నయమైనది అనుటకు ఇంక సందియమే లేదు. నేను ఆవిరియంత్రము వలె పనిచేయుటను అల్లె వంటచేసికొనుచు, దేనినిగాని, దొరికినప్రతిదానిని, తినుచు, అట్లయినను బాగుగా నిద్రపోవుచు, ఆరోగ్యముగా ఉండుటను, నీవు చూడవలయును.

నేను వ్రాతపని ఏమియు చేయలేదు. అందులకు కాలము లేదు. శ్రీమతి లెగ్గెట్టు మునుపటికన్న చాలబాగై, స్వాభావిక ముగా నడచుచున్నందుకు నాకు ఎంతో సంతోషముగా ఉన్నది. ఆమెకు పూర్తిగా మానుటను స్వాస్థ్యము గలుగుటను ఎదురు చూతును. అందులకై దేవుని ప్రార్థింతును.

వి.

మరిమాట-నాకు శ్రీమతి సేవియరువద్దనుండి చక్కటి జాబు వచ్చినది. వారు ఆపనిని దివ్యముగా జరుపుచున్నారు. కలకత్తాలో తీవ్రముగా మహామారి బయలుదేఱినది. అయినను ఈసారి దానిని గూర్చి యేమియు అంత గందరగోళము లేదు.

వి.

మరిమాట నేను సర్వకార్యనిర్వహణభారమును నీకు అప్ప గించితినని నీవు ఆ——కు తెలియపఱచితివా? మంచిది. దేనిని ఎట్లు చేయవలయునో నీవు మిక్కిలి శ్లాఘ్యముగా ఎఱుగుదువు. మఱి దానికి అతడు, తన్నేమో చేసినట్లు, మనస్సున నొచ్చుకొనున ట్లున్నది.

వి.

## 481

(కుమారి జోసెఫైన్ మెక్లియడునకు)

1719, టర్కువీథి.
సాన్ఫ్రాన్సిస్కో.
ఏప్రిల్ 10, 1900.

ప్రియ జో,

న్యూయార్కులో ఏదియో ఒక జగడము. నాకు తెలియు చున్నది. నాకు ఆ——వద్దనుండి ఒకజాబు వచ్చినది. అతడు న్యూయా ర్కును వదలిపోవునట. శ్రీమతి బుల్లు, నీవును తనకు విరుద్ధముగా తనమీాద చాల విస్తారముగా నాకు వ్రాసితిరని ఆతడు తల చెను. ఓర్చుకొనుమనియు, కొంతసేపు కాచుకొనియుండుమనియు

శ్రీమతి బుల్లు, కుమారి మెక్లీయడు ఆతనిగూర్చి మంచిసంగతులే వ్రాసినారనియు ఆతనికి జవాబు వ్రాసితిని.

మంచిది, జోజో, ఇట్టి జగడములలో నా మార్గమును నీవు ఎఱుగుదువు. నేను వానిలో ప్రవేశింపక ఉందునుగదా! అట్టి సంగతులను అమ్మ విచారించుకొనును. నేను నాపనిని ముగించితిని, విరామము పొందితిని, జో. అమ్మ ఇపుడు తానే పనిచేయగలదు. అంతే!

ఇపుడు, నీవు చెప్పునట్లు, నేనిక్కడ సంపాదింపగలిగిన సర్వ ధనమును పంపివేయబోవుచున్నాను. ఆపని ఈదినము చేయజాలుదును. అయినను దానిని ఒకవేయిగా చేయవలయునని కనుపెట్టుకొని యున్నాను. ఈవారము ముగియులోపల నేను ఫ్రిస్కోలో ఒకవేయి సంపాదింప గలనని ప్రతీక్షించుచున్నాను. నేను న్యూయార్కుమీద ఒక "డ్రాఫ్టు" కొని పంపెదను. లేకున్న అందులకు చేయగల శ్రేష్ఠమైన మార్గమేదియో బ్యాంకువారినే అడిగెదను.

నాకు మఠమునుండియు హిమాలయములయందలి కేంద్రము నుండియు జాబులు సమృద్ధిగా వచ్చినవి. ఈయుదయము స్వరూపానందునివద్దనుండి ఒకటి వచ్చినది. నిన్న శ్రీమతి సేవియరువద్దనుండి ఒకటి వచ్చినది.

వేదాంత సమాజము విషయమును గూర్చి ఏదిశ్రేష్ఠమో దానిని చేయవలసినదని నీవు శ్రీమతి లెగ్గెట్టుతో నామాటగా చెప్పుము. నేను ఫోటోలను గూర్చి శ్రీమతి హాన్సుబరోతో చెప్పితిని.

నాకు అగపడుచుండు ఒక్కటే విషయమిది: ప్రతి దేశములోను మనము ఆ దేశీయపద్ధతిని అనుసరింపవలయును. అట్లగుట వలన, నేను నీవు అగుదునేని, సభ్యులనందఱిని, మన యుద్దేశములతో సమభావము గలవారిని అందఱిని, ఒక్కటిగా సమావేశపఱచి వారు ఏమిచేయగోరుదురో, వారికి అంగోపాంగ సంపన్న వ్యూహము కావలయునో అక్కఱలేదో వారు ఎట్టి వ్యూహము కోరుదురో ఇత్యాది వారిని అడుగుదును. ఓ దొరసానీ అది నీ

జవాబుదారి మీాదనే చేయుము. నా కక్కఱలేదు. ఆ జోలి మానుకొంటిని. నా సాన్నిధ్యము ఏమేని సాయముగా నుండు నని నీవు తలంచినచో, నేను ఇక పదునైదుదినాలలో రాగలను. నేను ఇక్కడ నాపనిని ముగించితిని. సాన్ఫ్రాన్సిస్కోకు బయట స్టాక్టను అనునది ఒక చిన్నపట్టణము. అక్కడమాత్రము కొన్నాళ్లు పనిచేయగోరుదును. అంతట తూర్పుకు వెళ్లుదును. ఈ పట్టణమున ఇంతకాలమును నాకు వారమునకు సరాసరి నూఱు (100) డాలర్లు వచ్చుచున్నను, నేను ఇక విశ్రమింపవలయుననుకొందును. ఈసారి నా చిన్నసేనను న్యూయార్కుమీాదికి దండయాత్ర పంపవలయు ననుకొందును.

సకల ప్రేమతో,

సదా ప్రేమయుత భవదీయ
వివేకానంద.

మలిమాట పనివారందఱును పొందికతో పనిచేయుటకు పెడ మొగ మిడుదురేని ఆపని చేయుటలో ఏమేని లాభమున్నదని నీవు తలంతువా? నీవు చాల బాగుగా ఎఱుగుదువు. నీకు ఏది శ్రేష్ఠ ప్రక్రియయని తోచునో దానిని చేయుము. నాకు చికాగోనుండి మార్గరెట్ వ్రాసిన జాబొకటి వచ్చినది. ఆమె కొన్నిప్రశ్నలు అడుగు చున్నది. నేను జవాబు వ్రాయబోవుచున్నాను.

వి.

## 482

(ఒక అమెరికను మిత్రమునకు)

అలమేడ, కాలిఫోర్నియా,
ఏప్రిల్ 12, 1900.

అమ్మ మఱియొకమాఱు ప్రసన్న యగుచున్నది. విషయము లన్నియు మరల తలయెత్తుచున్నవి. అవును, అవి యెత్తి తీఱ వలయును.

పని యెప్పుడును చెడుగుచే అనుసృతమగుచునే యుండును. అది దానివెంటనే వచ్చును. నేను కూడబెట్టుకొన్న పాపమునకు

నాయనారోగ్యమును పణముగా చెల్లించితిని, సంతోషము! అందుచేత నామనస్సు మఱింత బాగుగా ఉన్నది. ఇప్పుడు జీవితమును మున్నెన్నడునులేని మార్దవమును శాంతతయు ఉన్నవి. నే నిపుడు సంగము కలిగియుండుట కెట్లో అట్లే సంగము లేకయుండుటకును నేర్చుకొనుచున్నాను. మానసికముగా నాకు నేనే ప్రభువను అగుచున్నాను.

అమ్మ తనసొంతపనిని చేయుచున్నది. నే నిపుడు ఎక్కువగా వ్యథ చెందను. ప్రతిక్షణమును నాబోటి మిడుతలు వేలువేలుగా చత్తురు. దానితో పనిలేక, ఆమె పని ఎప్పటివలె సాగిపోవుచుండును. జయము అమ్మకు!...... అమ్మ సంకల్పప్రవాహమున నాజీవితమంతయు ఒంటరిగా ఇటు నటు కొట్టుకొనిపోవుచుండినది. దానికి ఏ నిమిషమున ఎడతెంపుగూర్చుటకు ప్రయత్నించితినో ఆనిమిషముననే హాని చెందితిని. ఆమెసంకల్పము నెఱవేఱును!...

నేను సుఖముగా ఉన్నాను. నాయంతట నేను శాంతముగా ఉన్నాను. మునుపు ఎప్పటికంటెను నేను ఇపుడు ఎక్కువసన్న్యాసిని. నా చుట్టాలయందలి ప్రేమ దినదినమునకు సన్నగిల్లుచున్నది. అమ్మయందలిప్రేమ వృద్ధియగుచున్నది. దక్షిణేశ్వరమందలి మఱ్ఱినీడలో శ్రీ రామకృష్ణునితోడి కడు నిడుదలైన రాత్రిజాగరములు మరల స్మృతికి వచ్చుచున్నవి. ఇక పని? ఏమిపని? ఎవరిపని? ఎవరికోసము నేను పనిచేయుదును?

నేను స్వేచ్ఛగా ఉన్నాను. నేను అమ్మబిడ్డను. ఆమె పని చేయును, ఆమె ఆటాడును. నేనేల పద్ధతి పన్నాగింపవలయును? ఏమి పన్నాగింపవలయును? ఆమె ఇచ్ఛమెయి, నా పన్నుగడ ఏదియు లేకయే, విషయములు వచ్చినవి, పోయినవి. మనము ఆమెయొక్క సూత్రయంత్రములము. సూత్రధారిణి ఆమె.

## 483

(శ్రీ లెగ్గెట్టుకు) ఏప్రిల్ 17, 1900.

నా ప్రియ లెగ్గెట్,

దీనితో ఆ వ్రాయబడిన వీలునామాను (మరణశాసనమును) నీకు పంపుచున్నాను. అది ఆమె కోరినప్రకారముగా వ్రాయబడినది. అనగా సహజముగా అంతయు మామూలుప్రకారమే వ్రాయబడినది. దానిని నీవు తీసికొని దానిజవాబు దారి శ్రమ నీవు వహింపవలయునని నిన్ను ప్రార్థించుచున్నాను.

నీవును నీవారును నాయెడ మాఱుపాటు అనునది లేక ఏకరీతిగా ఎల్లపుడు దయకలిగియుండినారు. కాని, నా ప్రియమిత్రమా, ఇంకను ఎక్కువ యనుగ్రహములు కావలయునని అవి దొరకుచోట అడుగుట మానవస్వభావము. నీ వెఱుంగని దే మున్నది?

నేను మనుష్యమాత్రుడను, నీబిడ్డను.

ఆ——కొంత గలబా గల్బతు చేసినాడని నాకు చాల విచారముగా ఉన్నది. అతడు అప్పుడప్పుడు అట్లు చేయును. కనీసము ఇదివఱకు చేయుట వాడుక. నేను అందు జోలి పెట్టుకొందునేని ఇంకను ఎక్కువ గలబ అగునని పెట్టుకొనసాహసింపను. అతనిని వశమునసుంచుకొనుట నీవు చాల చక్కగా ఎఱుగుదువు. నీకు ఈ జాబు చేరునప్పటికి నేను సాన్ఫ్రాన్సిస్కో నుండి వెడలిపోయియుందును. నాకు ఇండియానుండి వచ్చు తపాలును 10, ఆస్టర్ వీథి, చికాగోలో శ్రీమతి హాల్ ఇంటికి దయతో పంపుదువా? అచ్చటనేయున్న మార్గట్‌కు పంపుదువా? మార్గట్ తనబడికి నీవు వేయి డాలర్లు బహుమానము ఇచ్చితివనియు నీయందు తాను చాల కృతజ్ఞురాలననియు జాబు వ్రాయుచున్నది.

నాయందును నా స్వజనముయెడలను నున్న మీ నిర్వికల్ప దయకు, అన్ని దీవెనలు నీకును నీజనమునకును సఫలములు గావలయునని సదా ప్రార్థించు,

భవదీయ ప్రేమయుత,
వివేకానంద.

మలిమాట :-శ్రీమతి లెగ్గెట్టు అప్పుడే రోగముమాని స్వస్థత నందినందుకు నాకు ఎంతో సంతోషము.

వి.

## 484

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

అలమేడ, కాలిఫోర్నియా,
ఏప్రిల్ 18, 1900.

నా ప్రియ జో,

ఇప్పుడే నాకు నీజాబును, శ్రీమతి బుల్ వ్రాసిన స్వాగత లేఖయు చేరినవి. దీనిని లండనుకు విలాసము వ్రాసి పంపుచున్నాను. శ్రీమతి లెగ్గెట్టు తప్పక స్వస్థతగనుచున్నది అని నాకెంతయో సంతోషముగా నున్నది.

శ్రీ లెగ్గెట్టు ప్రెసిడెంటుపదవికి సర్వాధ్యక్షుపదవికి-రాజీనామా ఇచ్చినందుకు నాకు చాల విచారముగా నున్నది.

సరి, నేను ఊరకయుందును, లేకున్న ఇంకను ఇబ్బంది కలిగింతునేమో అని భయము.

నామార్గములు చాల కఠినములు అని నీకు బాగుగా తెలియును. నాకు ఒకసారి కోపము వచ్చెనా, నేను అ——ను అతనికి మనఃశాంతి కలగిపోవునంతగా గలగలమని చీవాట్లు పెట్టుదును.

శ్రీమతి బుల్‌ను గూర్చిన యాతని యభిప్రాయములు బొత్తిగా సరికావు అని అతనికి తెలియునట్లు జాబు వ్రాసితిని.

పని ఎల్లప్పుడును కష్టమే. అమ్మా జో, నా పనులన్నియు ఇక శాశ్వతముగా నిలిచిపోవలయుననియు, నా యాత్మ సర్వమును అమ్మలో లీనమైపోవలయుననియు నాకోసము దేవుని ప్రార్థింపుమా. ఆమె పనులను ఆమె యెఱుగును.

నీవు లండనులో మఱియొకమాఱు ఉండుటకు చాల సంతోషింపవలసినది. మన ప్రాతమిత్రులు! వారికందఱికి నా ప్రేమను కృతజ్ఞతను అందింపుము.

నేను క్షేమముగా ఉన్నాను. మానసికముగా ప్రశాంతముగా నున్నాను. నా అనుభవములో దేహశాంతికంటెను ఆత్మశాంతి ఎక్కువగా నున్నది. పోరాటములో ఓటమియు కలిగినది, జయమును కలిగినది. నేను నా సరంజామా మూటగట్టుకొని, ఆ మోక్షప్రదునికై కాచుకొనియున్నాను.

"శివ, ఓశివ, నావడవను అద్దరికి చేర్పుమా."

ఇంతటికిని, జో, నేను దక్షిణేశ్వరపు మఱ్ఱిమాను క్రింద రామకృష్ణుని అద్భుతవాక్కులను అబ్బురమున మునిగి వినుచు ఉండిన ఆ బాలుడనే కదా. అది నా నిజస్వభావము. పనులు, చేష్టితములు, మంచిచేయుట మొదలగునవి అన్నియు తెచ్చిపెట్టుకొన్న బరువులు. ఇపుడు మరల నే నతని స్వరము వినుచున్నాను, అదే, ఆత్మను జల్లుమను అనుభూతి కలిగించు ఆ ప్రాతస్వరమే! బంధములు తెగిపోవుచున్నవి, ప్రేమ నశించుచున్నది; పని చప్పన యగుచున్నది. జీవితమునుండి ఇంద్రజాలము తొలగిపోయినది. నా గురుదేవుని స్వరముమాత్రమే పిలుచుచున్నది.—"నేను వచ్చుచున్నాను, ప్రభూ, ఇదిగో, నేను వచ్చుచున్నాను" "చచ్చినవారు చచ్చినవారిని పూడ్చురుగాక, నీవు నా వెంట రమ్ము." "ఇదిగో, వచ్చుచున్నాను, నా ప్రియప్రభూ, వచ్చుచున్నాను."

అవును. నేను వచ్చుచున్నాను. నిర్వాణము నాయెదుటనున్నది. ఒక్కొక్కపుడు అది ఒక్క అలకూడ లేని ఒక్క శ్వాసయైనను లేని అపారమగు ప్రశాంత సముద్రము, అని నాకు తోచును.

నేను పుట్టినందులకు సంతోషింతును, అన్ని కష్టాలు అనుభవించినందులకు సంతోషింతును, గొప్పపొరపాట్లు చేసినందులకు సంతోషింతును. ప్రశాంతిని ప్రవేశించుటకును సంతోషింతును. నేను ఎవనిని బద్ధునిగా విడను, ఏ బంధమును ఉంచుకొనను. ఈ దేహము పడిపోయి నాకు ముక్తి కలిగినను లేక, నేను ఈ దేహముతోనే ముక్తిగాంచినను ఆ ముసలివాడు పోయినాడు, మరి రాకుండ పోయినాడు! మార్గదేశకుడు గురువు, మొనగాడు, బోధకుడు

దాటిపోయినాడు. ఆ బాలుడు ఆ విద్యార్థి, ఆ పరిచారకుడు, అతడు వెనుక విడిచిపెట్టబడినాడు.

నేను ఆ విషయమున జోక్యమేల కలుగజేసికొననో బోధపడినదా? నే నెవరనమ్మా, జో, ఎవరివిషయమునసైన జోక్యము కలుగజేసికొనుటకు? నేను చాలకాలముక్రిందనే నా నాయకస్థానమును మానుకొంటిని. గొంతెత్తి ఏమాట పలుకుటకును నాకు హక్కు లేదు. ఈ సంవత్సరారంభము మొదలు నేను ఇండియాలో ఎవనికిని ఏమియు చెప్పి వ్రాయింపలేదు. చేయింపను లేదు, అది నీ వెఱుగుదువు. గతకాలమున నీవును శ్రీమతి బుల్సతియు నాయందెట్లు ఉంటిరో, అందులకు మిక్కిలియు కృతజ్ఞుడను. ఎప్పుడును నీ వెంటనే దీవనలు నీకు ఫలించుచుండును. నాజీవితమున నేను కొట్టుకొని పోవుచున్నప్పుడే మధురతమక్షణములు అనుభవించితిని. నేను మరల కొట్టుకొని పోవుచున్నాను, నా ముందర మంచిప్రకాశము గల వెచ్చనియెండ, చుట్టును పచ్చని వృక్షకోట్లు. మఱి యా వెచ్చనలో ప్రతిదియు చాల నిశ్చలముగా నున్నది. చాల నెమ్మదిగా ఉన్నది, వెచ్చని నదీగర్భమున నేను మెల్లగా కొట్టుకొని పోవుచున్నాను! నేను చేతులతోగాని కాళ్ళతోగాని నీళ్ళను త్రుళ్లునట్లు అప్పళింపలేదు. ఆ యాశ్చర్యకరమగు నిశ్చలతకు, అదియొక భ్రాంతియని నీకు తోచునట్లు చేయజాలిన నిశ్చలతకు భంగము కలిగించినవాడ నగుదునేమో అను భయముచేత అందులకు ధైర్యము వహింపజాలనైతిని.

నాపనికి మఱుగున ఆశ యుండెను. నా ప్రేమకు మఱుగున వ్యక్తిభావము ఉండెను. నా పవిత్రతకు మఱుగున భయము ఉండెను. నానాయకత్వమునకు వెనుక అధికారబలతృష్ణ! ఇప్పుడు అవన్నియు మాయమగుచున్నవి. నేను కొట్టుకొనిపోవుచున్నాను. నేను వచ్చుచున్నాను. అమ్మా, నేను వచ్చుచున్నాను! నీ వెచ్చని యురమునందు నిస్స్వర వినూతనాద్భుత భూమిలో నీవెక్కడికి కొని

పోయిన అక్కడికి తేలుచు, నేను వచ్చుచున్నాను; కేవలము ప్రేక్షకుడుగనే కాని నటుడనుగా ఇక కానేకాదు.

ఆహా, అది అంత శాంతిముగా ఉన్నది! నా తలంపులు నా హృదయాంతరమున ఎక్కడనో చాలచాలదూరమునుండి వచ్చుచున్నట్లున్నవి. అవి దూరమునుండి వచ్చు అస్ఫుటములగు గుసగుసల వలె ఉన్నవి. అన్నింటిమీదను మధురాతిమధురమగు ప్రశాంతి పర్వియున్నది. నిదురగూరుటకు కొన్ని క్షణములు ముందు అన్నివస్తువులు నీడలవలె అగపడుచు తోచుచు భయములేక ప్రేమలేక భావోద్వేగము లేక తోచుచు ఉండునట్టి ప్రశాంతి అది. మట్టును విగ్రహములు చిత్తరువులు ఉండగా, మానవుడు ఒంటరిగా అనుభవించునట్టి శాంతి, నేను వచ్చుచున్నాను ప్రభూ, నేను వచ్చుచున్నాను!

ప్రపంచము ఉన్నది. మనోవికారములను లేపని ఇంద్రియజ్ఞానములవలె, జగము యందమును గాదు వికారమును గాదు. ఆహా, జో, ఏమి దానిపరమానందము! ప్రతిది మంచిది, అందమైనది. ఏలన వస్తువులన్నియు తమ యన్యోన్య నిష్పత్తిని త్యజించుచున్నవి. వానిలో నాదేహామే మొదటిది! ఓమ్ తత్ సత్!

మీకందరకు లండనులోను పారిసులోను గొప్ప విశేషములు ఒనగూడునని ఆసించుచున్నాను. క్రొత్త సంతోషము, మనోదేహములకు క్రొత్త శ్రేయములు.

నీయందును శ్రీమతి బుల్సతియందును ఎప్పటి ప్రేమలో,

భవదీయ శ్రద్ధాయుత

వివేకానంద.

## 485

(కుమారి జోసెఫైన్ మెక్లియదుకు)

అలమేడ, కాలిఫోర్నియా,

ఏప్రిల్ 20, 1900.

నా ప్రియ జో,

నీచీటి ఈదినము అందినది. నేను నీకు నిన్న ఒకటి వ్రాసితిని, కాని దానిని ఇంగ్లండు విలాసమునకు, నీవు అందుందువని, పంపితిని.

నేను నీసందేశమును శ్రీమతి బెట్స్‌కు చెప్పితిని. ఆ—తో ఈ చిన్నజగడము వచ్చినందులకు ఎంతో దుఃఖంచుచున్నాను. నీవు పంపిన యతని జాబుకూడ నాకు వచ్చినది. అతడు చెప్పినంతవఱకు సరిగా నున్నది, అతని దోష మేమియు లేదు. ''స్వామీ, శ్రీ లెగ్గెట్టుకు వేదాంతమున శ్రద్ధయు ప్రీతియు లేదు. అతడు ఇక నేమియు సాయము చేయబోడు. ఇక నీకు నీవే ఆశ్రయము'' అని నాకు వ్రాసినాడు. నీవును శ్రీమతి లెగ్గెట్టును అతనికి లోస్ఏంజెలిసునుండి 'ధనమునకు ఏమి సేయ మందువు' అను అతని ప్రశ్నకు జవాబుగా న్యూయార్కునుగూర్చి నన్ను వ్రాయుమన్నట్లే యుండినది.

సరి సరి. అన్ని విషయములు తమతమ ఆకారమును అవే పొందగలవు. ఐనను శ్రీమతి బుల్సతి మనసునను నీమనసునను నే నేమో కొంత చేయవలసినది ఉన్నది అను భావము ఉన్నటులున్నది. మఱి మొదటిమాట, ఉన్న కష్టములనుగూర్చి నాకు ఏమియు తెలియదు. మీలో ఎవరును నాకు దాని ప్రయోజనమును గూర్చి ఏమియు వ్రాయరైతిరి. మీమనసులో నున్నదానిని కనుగొనగలవాడను కాను నేను.

ఆ అన్ని విషయములు తనచేతనుంచుకొనగోరుచున్నాడు-అను మామూలువిషయమును మాత్రమే మీరు నాకు వ్రాసితిరి. దానినుండి నేను ఏమి గ్రహింపజాలుదును? ఆ కష్టములు ఏవి? ప్రళయదినపుసరియైన తేది తెలియనట్లుగా ఆయభిప్రాయభేదాల మూలమును నాకు తెలియదు.

అయినప్పటికిని నీజాబులలోను శ్రీమతి బుల్సతి జాబులలోను మిక్కుటమైన మీ చిరాకుకోపము కనిపించుచున్నవి!

మనము అనుకొనకయే, మనకు తెలియకయే ఇట్టి సంగతులు ఒక్కొక్కప్పుడు చాల చిక్కుగలవి యగుచుండును. వాని రూపమును అవి దాల్చనీ.

నేను విల్లునామావ్రాసి శ్రీమతి బుల్సతికోరినట్లు శ్రీ లెగ్గెట్టుకు పంపితిని.

నాకు కొన్నిసమయములలో ఆరోగ్యముగా ఉన్నది, మఱి కొన్నిసమయములలో జబ్బుగా ఉన్నది, అట్లు నేను సాగిపోవు చున్నాను. 'నేను శ్రీమతి బిల్లనువలన ఇంచుకయైనను శ్రేయము పొందితి నని చెప్పలేను' అని నామనఃసాక్షిగ చెప్పెదను ఆమె నా మెడ మంచిగానుండినది. ఆమెకు నేను మిక్కిలి కృతజ్ఞుడను. ఆమెకు నా ప్రేమ. ఆమెవలన నితరులకు మేలు కలుగు ననినా ఆశ.

ఈ విషయమును శ్రీమతి బుల్లునకి వ్రాసినందుకు, నేను ఎట్లు కృతజ్ఞతతో ఉండవలసినది ఎట్లు దండములు పెట్టవలసినది ఇత్యాది విషయములు కల నాలుగుపుటల "మతధర్మోపన్యాసము" వచ్చినది.

అదెల్ల ఈ ఆ—వ్యవహారఫలితమే! నిజము.

శ్రీస్టర్డీయు శ్రీమతి జాన్సనును మార్గట్‌వల్ల కలవరము చెంది, నామీద పడినారు. ఇప్పుడు ఆ—శ్రీమతి బుల్లతిని కలవర పెట్టుచున్నాడు. ఇక సహజముగానే దాని తాకుడును నేను అనుభవింపవలయును. అట్టిది జీవితము!

నీవును శ్రీమతి లెగ్గెట్టును నన్ను అతనికి స్వేచ్ఛగాను స్వతంత్రముగాను ఉండుము అనియు, శ్రీ లెగ్గెట్టు అతని కేమియు సాయము చేయబోవుట లేదనియు వ్రాయమంటిరి. నేను ఆమాట వ్రాసితిని. ఇప్పుడు నే నేమి చేయగలను?

జానో జాకో నీకు విధేయుడు కాకపోయిన, అందులకు నేనా పరిశిక్ష ననుభవింపవలసినది? ఈ వేదాంతసమాజమునుగూర్చి నాకేమి తెలియును? దానిని నేను ప్రారంభించితినా? అందు నేను చేసినదేమైన కలదా?

తరువాత మఱియొక విషయము. ఎవరును లక్ష్యపెట్టని సంగతియేమో దానినిగూర్చి నాకు ఏమియు వ్రాయకున్నారే!

సరి. ఈలోకము పెద్ద తమాషా!

శ్రీమతి లెగ్గెట్టు త్వరగా రోగమునుండి కుదుటబడుచున్నందుకు సంతోషించుచున్నాను. ప్రతిక్షణమును నేను, ఆమెకు పూర్తిగా

నయముగావలయు నని దేవుని ప్రార్థించెదను. నేను సోమవారము చికాగోకు బయలుదేఱుచున్నాను. నాకు ఒకదయగలదొరసాని న్యూయార్కు వఱకు ప్రయాణమునకు మూడునెలలవఱకు చెల్లగల ఒక 'పాసు' ఇచ్చినది. నా విషయమైన జాగ్రత్త పర్యవేక్షణ అంతయు అమ్మది. నా జీవితకాలమంతయు నన్ను కాపాడుచుండి ఇపుడు నన్ను విడిచిపెట్టదు.

సదా కృతజ్ఞతాయుత భవదీయ,
**వివేకానంద.**

## 486

(కుమారి మేరీ హేలుకు)

ఏప్రిల్ 23, 1900,

నా ప్రియ మేరీ,

నేను ఈదినము బయలుదేఱియుండవలసినది. కాని కొన్ని సందర్భములు కలిగినవి. నేను బయలుదేఱకమునుపు కాలిఫోర్నియా పెద్ద యెఱ్ఱ అడవిమ్రాకుల క్రింద ఒకవిడిదిలో ఉండవలయు నను చాపలమును మానజాలక పోయితిని. కావున నా పయనమును మూడు నాలుగుదినాలు అవతలికి త్రోసికొనవలసినవాడనైతిని. అంతేకాక, నిరంతరకార్యానంతరము, నాలుగుదినాలు పట్టునట్టియు ఎముకలు విఱిగిపోవునట్టియు ఆ ప్రయాణముకై తరలక మునుపు నేను యేయడ్డములేని దేవునిగాలిని పీల్చి తేఱుకొనవలసియున్నది.

మార్గట్ తనజాబులో నేను ఇక పదునైదు దినాలలో మేరీ యత్తను చూడవత్తునని యన్నట్టి ఆమాటను నిలుపుకొనవలయునని చాల ఊని వ్రాసియున్నది. అట్లే జరిపెదను. పదునైదు అన్నంచు లకు బదులు ఇరువది దినాలలో అని మాత్రము మార్చి జరిపెదను. దానిచేత ఇటీవల చికాగోలో కొట్టిన యసహ్యాపుమంచుతుపానును కూడ తప్పించుకొన్న వాడ నగుదును. ఇంచుక బలమును సంపా దించుకొందును.

మార్గట్ మిక్కిలి మేరీయ త్తపక్షమునకు చెందినదిగా అగ పడుచున్నది. నాకే కాదు, ఇతరులకును మేనకోడండ్రు మేన బంధువులు అత్తలు ఉన్నారు.

నేను అడవులకు రేపు బయలుదేఱుదును. చికాగోలో ప్రవేశింపకమునుపు, ఆహా నాయూపిరితిత్తులను ఓజోనుతో, ఆమేలి ప్రాణవాయువుతో, నింపుకొనగోరెదను. ఈలోపల నా పేరటికి చికాగోకు వచ్చు తపాలును నాకోసము పెట్టిపెట్టుము. నీవు మంచి పిల్లవు కిదా. దానిని ఇక్కడికి పంపివేయకు.

నేను పనిని ముగించితిని. కొన్నాళ్ళు మాత్రము రైలును ఎక్కుటకు ముందు మూడునాలుగు దినాలు విశ్రాంతి తీసికొమ్మని నా మిత్రులు బలవంతె పెట్టుచున్నారు.

నాకు ఇక్కడినుండి న్యూయార్కుకు మూడు నెలల వఱకు ధనవ్యయములేక ఊరక ప్రయాణముచేయుచుండుటకు 'పాసు'-ఉన్నది. నిదురపోవుబండికి తప్ప, మఱేమియు ఖర్చు లేదు. కాబట్టి చూడుము—నిర్వ్యయము, ఊరకయే, దమ్మిడి ఖర్చు లేదు.

ప్రేమయుత భవదీయ,

వివేకానంద.

## 487

(కుమారి మేరీ హేలునకు)

ఏప్రిల్ 30, 1900.

నాప్రియ మేరీ,

ఆకస్మికముగా గలిగిన అస్వస్థతయును జ్వరమును నా చికాగో ప్రయాణమును ఇంకను ఆపిపెట్టియున్నవి. నాకు ప్రయాణముచేయగల బలము రాగానే బయలుదేఱుదును. మొన్న నాకు మార్గట్ వద్దనుండి ఒకజాబు వచ్చినది. దయయుంచి నాప్రేమను ఆమెకు అందింపుము. నీవును నాశాశ్వతప్రేమను ఎఱుగుము. హారియెట్టు ఎక్కడ ఉన్నది? ఇంకను చికాగోలోనా? ఆ మెకెండ్లి అప్పచెల్లెండ్రు? అందఱికి నాప్రేమ.

వివేకానంద.

## 488

(సోదరి నివేదితకు)

మే 2, 1900.

నా ప్రియ నివేదితా,

నాకు చాల జబ్బుచేసినది. నెలలతరబడి పని చేయుటవలన మరల నొకమారు తిరుగబెట్టినది.

సరి, నాకు మూత్రకోశపు జబ్బుగాని, గుండె జబ్బుగాని ఏమియు లేదని ఏర్పడినది. మిక్కుటమైన నరములగాసి మాత్రమే.

కాబట్టి నేను ఈదినము, నాకు పూర్తిగా మానువఱకు కొన్నాళ్ళుండమని, పల్లెలకు పోవుచున్నాను. అది కొన్నాళ్ళలో నయమగునని నా నిశ్చయము.

ఇంతలో నేను మారి (ప్లేగు) వృత్తాంతము మున్నగునవిగల ఇండియాజాబులను అంతగా చదువగోరను. నాతపాలు మేరీకివచ్చును. ఆమెగాని, ఆమె పోవునేని, నీవుగాని దానిని నేను వచ్చువఱకు ఉంచియుంపుడు.

నాఖేదమునంతయు నెట్టివేయబోవుచున్నాను. అమ్మకు జయము!

చాల మిక్కిలి ధనికురాలును నాకు సాయము చేసి నామెయునగు శ్రీమతి సి. పి. హంటింగ్టన్ వచ్చినది. నిన్నుచూచి నీకుసాయపడవలయునని కోరుచున్నది. ఆమె జూను మొదటి తేదికి న్యూయార్కులో ఉండగలదు. ఆమెను చూడక ఎక్కడికైనను పోకుము. నే నందులకు చాలినంత త్వరగా రాలేకపోవుదునేని, ఆమెను నీకు పరిచయము చేయు జాబును వ్రాసెదను.

మేరీకి నాప్రేమ తెలుపుము. నేనిందుండి ఇక కొన్నాళ్ళలో బయలుదేఱుచున్నాను.

ఆశిస్సులతో,

సదా భవదీయ

వివేకానంద.

మఱిమాట :—ఇందుంచిన జాబు న్యాయమూర్తి ఆడమ్సు గారి సతియగు శ్రీమతి యమ్. సి. ఆడమ్సుకు నిన్ను పరిచయము

చేయుటకు. తక్షణమే ఆమెను చూచుటకు పొమ్ము. దానివలనచాల మేలు కలుగవచ్చును. ఆమె ప్రసిద్ధురాలు. ఆమె విలాసము కనుగొనుము.

వి.

## 489

(లాస్ఏంజెలిసు వాసినియగు శ్రీమతి బ్లాగట్టుకు)

మే 2, 1900.

ప్రియమైన అత్తా, రాక్సీ,

నీవు చాల దయతో వ్రాసిన జాబు అందినది. నేను నరాల జబ్బుతోను జ్వరముతోను మరల పడుకలో ఉన్నాను. ఆరునెలలగాసి పని యనంతరము అది వచ్చినది. ఐనను నామూత్రకోశము, గుండె యెప్పటివలె బాగుగా నున్నవి. నేను పల్లెటూరికిపోయి కొన్నాళ్లు విశ్రాంతిగొని, తరువాత చికాగోకు బయలు దేఱుదును.

నేను ఇప్పుడే శ్రీమతి మిల్వర్డు ఆడమ్సునకు జాబు వ్రాసి, నా కూతునకు, కుమారి నోబుల్‌కు ఆమెను పరిచయపఱుచు జాబొకటి యిచ్చి, పోయి శ్రీమతి ఆడమ్సును చూడవలసినదనియు, ఆమెకు పనినిగూర్చి కోరగల సకలవృత్తాంతమును తెలుపుమనియు వ్రాసితిని.

మంచిది, నా ప్రియమగుతల్లీ, అన్ని దీవనలును శాంతియు నీవెంట నంటియుండునుగాక. నాకు రవంతశాంతి చాల జరూరుగా కావలసియున్నది. నాకై ప్రార్థనచేయుము. కేలుకు నా ప్రేమ.

సదా నీకొమారుడను

వివేకానంద.

మలిమాట.—అబ్యాసాక్విస్జు (?) కుమారి స్పెన్సరుకు నా ప్రేమ. శ్రీమతి యస్—కు, ఇంకను ఇతర మిత్రములకును, ట్రిక్సు తెల్లపై ప్రేమతోడి మొట్టికాయలరాశి.

వి.

## 490

(సోదరి నివేదితకు)

సా న్ఫ్రాన్సిస్కో,
మే 24, 1900.

(సోదరినివేదిత అడిగిన కొన్ని ప్రశ్నలకు స్వామిజీ వ్రాసి పెట్టిన సమాధానములు ఈక్రిందివి-)

ప్ర : కన్యాకుబ్జమున స్వయంవరమునకు పోవ నిశ్చయించు కొన్నప్పుడు పృథ్వీరాయియు చందును ఏవేషములతో పోయిరో నేను జ్ఞప్తికి తెచ్చుకొనలేకున్నాను.

స : ఇద్దఱును పాటకులుగా పోయిరి.

ప్ర : సంయుక్త తన ప్రతిద్వంద్వికి పుత్రికయగుటయు మహా సౌందర్యవతియగుటయు ఇవే నా ఆమెను పృథ్వీరాయి వివాహ మాడ నిశ్చయించుకొన్నందుకు కారణములు? సంయుక్తయొద్ద దాసీ పదవిని సంపాదింపుమని అతడు తన దాసి నొకతె నంపెనా? ఆ ముసలిదాది ఆ రాజకుమారికి పృథ్వీరాయియందు వలపునుపుట్టించు ప్రయత్నమునకు పూనుకొనెనా?

స : ఒకొరొకరి సౌందర్యములను గూర్చియు చెయ్యములను గూర్చియు వినియు ఒకరొకరి చిత్రపటములను చూచుకొనియు వారు ఒకరొకరివలపు వలలో పడిరి. చిత్తరువుల మూలముగ వలపు గల్గుట ప్రాచీన భారతీయలీలలలో నొకటి.

ప్ర : కృష్ణుడు గొల్లపల్లెలో పెరుగుట ఎట్లు సంభవించినది?

స : కంసుడను లోకకంటకుని బారినుండి కృష్ణుని రక్షించు కొనుటకై అతనితండ్రి అతని నెత్తుకొని పాఱిపోవలసివచ్చెను. ఆ సంవత్సరమున పుట్టిన మగబిడ్డల నందఱిని చంపవలసినదని కంసు డాజ్ఞాపించియుండెను. తన్ను చంపువాడని జోస్యులు నిర్దేశించి కృష్ణుడు ఆ బిడ్డలలో నొకడుగ నుండవచ్చుననెడి కంసుని భయమే అందుకు కారణము. కృష్ణుని తలిదండ్రులు కంసునికి దగ్గఱబంధువులే. జోస్యులమాటకు భయపడి కంసుడు వారిని చెఱసాలలో నుంచెను.

ప్ర : అతని జీవితములో ఈభాగము ఎట్లు ముగిసినది?

స: క్రూరుడగు కంసుడు ఒకానొక ఉత్సవమునకై ఆహ్వానింపగా బలదేవునితోను తన పెంపుడుతండ్రియైన నందునితోను కృష్ణుడరుదెంచెను. (కృష్ణుని చంపుటకు క్రూరనరపాలుడు పన్నిన జిత్తు ఇది.) కృష్ణుడు కంసుని సంహరించెను. సింహాసనమును తాను కైకొనక సమీపపువారసునే దాని నధిష్ఠింపజేసెను. ఏపనివలన కలిగిన ఫలితమునుగాని ఎప్పుడుగాని కృష్ణుడు తాను కైకొనలేదు.

ప్ర: ఆకాలపు అద్భుత (నాటకోచిత) సంభవమును దేనినైనను నాకు తెలుపగలరా?

స: ఇది లీలలతో నిండిన కాలము. బాల్యములో శ్రీకృష్ణుడు తుంటరిగనుండెను. యశోద అతనిని కవ్వపుతాటితో బంధింప యత్నించెను. కాని తనయొద్దనున్న త్రాళ్లన్నిటిని కలిపినను అతనిని బంధించుటకు చాలకపోయినవి. అప్పుడు ఆమెకు కనువిప్పు కలిగెను. అఖిలాండకోటి బ్రహ్మాండములను తన బొజ్జలో నిముడ్చుకొన్నవానిని తాను బంధింప నుంకించినట్లు ఆమెకు ప్రత్యక్షమయ్యెను. ఆమె కంపితయై ప్రార్థింప నారంభించెను. వెంటనే ప్రభువు, తన మాయతో ఆమెను స్పృశించెను. మాయామోహితయైన ఆమెకంటికి మరల శిశువుమాత్రమే కనిపించెను.

భగవంతుడు గోపాలుడుగ నవతరించెనను వార్తను నమ్మక సురజ్యేష్ఠుడగు బ్రహ్మ ఒకనాడు గోవులన్నిటిని గోపబాలకులనందఱిని అపహరించుకొనిపోయి ఒకగుహలో నిదురపుచ్చెను. మరల వచ్చిచూడగా శ్రీకృష్ణుని చుట్టును ఆగోవులే ఆ గోపబాలురే అతనికి కనిపించిరి. ఈ క్రొత్తజట్టును కూడ అపహరించి బ్రహ్మ దాచిపెట్టెను. మరల వచ్చిచూడగా మరల వారు కానవైరి. అప్పుడాయనకు కనువిప్పు కల్గెను. శ్రీకృష్ణునిమేనిలో అసంఖ్యాకములైన లోకములును నాకములును ఒకరికంటె నొకరధికులైన వేలకొలది బ్రహ్మదేవులును ఆయనకు కనిపింపవచ్చిరి.

యమునాజలములను విషపూరితములుగ చేయుచుండిన కాళీయ సర్ప ఫణములపై శ్రీకృష్ణుడు నటనమాడెను. ఇంద్రోత్సవ

మును శ్రీకృష్ణు డాపినందుకు పగగొని దేవేంద్రుడు ప్రళయ వృష్టిచే గోకులప్రజలను ముంచివేయగోరగా అతనిని తృణీకరించి శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తెను. ఒకవ్రేలితో గోవర్ధనగిరిని ఎత్తి పట్టుకొని శ్రీకృష్ణుడు గొల్లలకందఱికి దానిక్రింద ఆశ్రయమిచ్చెను.

శైశవమునుండియు శ్రీకృష్ణునకు సర్పపూజయు ఇంద్రపూజయు అనభిమతములు. ఇంద్రపూజ వైదికక్రతువు. భగవద్గీతను చదువువారి కంతటను వైదికక్రతువులపట్ల శ్రీకృష్ణుని ప్రతికూలతయే గోచరించును.

ఇది గోపకాంతలతో అతని శృంగారము చెల్లిన కాలము. అతని కప్పుడు వయస్సు పదునైదు సంవత్సరములు.

## 491

(సోదరి నివేదితకు) సా న్ఫ్రాన్సిస్కో.
మే 26, 1900.

ప్రియ నివేదితా,

నీకు అన్ని దీవనలును, ఇంచుకయు నిరాశ చెందకు. జయము గురూ! జయము గురూ! నీవు నిజముగా క్షత్రియ రక్తసంజాతవు సుమా! మా కనకాంబరము యుద్ధభూమిలో మృత్యువు తొడుగుకొను అంగీ. పూనిన కార్యసిద్ధికై అసువులు ఒడ్డుట మా లక్ష్యము, మాకు గమ్యము! అంతేకాని సిద్ధియు జయమును కాదు. జయము గురూ!

దుర్విధిముడుతలు నల్లగాను లావుగాను ఉండును. మఱి నేను స్వామిని. నేను చేయిఎత్తగానే అవిగో, అవి మాయమౌను! ఇది యంతయు అర్థరహితమును భయమును. నేను భయమునకు భయమను, అతిభయమునకు అతిభయమను. నేను ఆ నిర్భయమును అద్వితీయమును అగు ఏకమను! నేను దైవమునకు ప్రభువను, సమస్తమును తుడిచివేయువాడను! జయము గురూ! స్థిరముగా నుండుము బిడ్డా. బంగారునకుగాని మఱి దేనికిగాని అమ్ముడు పోకుము. మనము జయింతుము!

వివేకానంద.

# 492

(కుమారి మేరీహేలుకు)

1921 పడమట, 21 వ వీథి.
లాస్ఏంజెలిస్,
జూను 17, 1900.

నా ప్రియ మేరీ,

నాకు చాల నయముగా ఉండుట నిజమే కాని. ఇంకను పూర్తిగా మాని స్వస్థత చెందలేదు. ఎట్లైనను, మనశ్ఛాయ బాధ పడు ప్రతివానికిని చెందినదే. అది గాలియుగాదు, మఱేదియు గాదు.

కాళిపూజ ఏమతమునందును ఆవశ్యకమైన మెట్టుగాదు. మతమనగా ఏదో, దానినెల్ల ఉపనిషత్తులు మనకు నేర్పుచున్నవి. కాళిపూజయందు నాకు మాత్రము ప్రత్యేకమగు పిచ్చి పట్టుదల. దానిని నేను బోధింపగా నీవెన్నడును వినలేదు. ఇండియాలో నైనను బోధించితినని నీవు చదువలేదు. నేను విశ్వమానవాళికి ఏది హితమో దానిని మాత్రము బోధింతును. నాకు మాత్రము చెందునదైన ఒక వింతపద్ధతి యేదైననున్న, దానిని రహస్యముగా నుంచుకొందును. అంతే, అదే దాని పర్యాసానము. కాళిపూజను నే నెప్పుడును ఎవ్వరికిని బోధింపలేదు గాన, నీకును దానిని వివరింప గూడదు.

బోసులను హిందువులు త్యజించినారని నీవు తలంతువేని, నీవు పూర్తిగా పొరపాటుపడినదానవే. ఆంగ్లపాలకులు వానిని ఒక మూలకు త్రోయగోరుదురు. వారు ఇండియనుజాతిలో అట్టిపరిణతిని ఇచ్ఛగింపరు లెమ్ము. వానికి పరిస్థితులను దుర్భరమగునట్లు చేయు దురు. అందుచేతనే అతడు ఎక్కడికేని పోగోరును.

'ఆంగ్లిసైజ్డ్' 'ఆంగ్లపరిణతి చెందింపబడినవారు' అనగా తమ ఆచార వ్యవహారములచేతను నడువడిచేతను దీనులమై ప్రాత పద్ధతులకు చెందిన హిందువులమైన మాతోడి సంబంధము తమ కవమానకరమని చూపువారు అని అర్థము. నాజాతికిగాని నా జన్మ

మునకుగాని నా దేశీయతకుగాని నేనేమియు సిగ్గుపడుటలేదు. అట్టి జనులను హిందువులు ఇచ్ఛగింపరేని, నేను ఆశ్చర్యపడజాలను.

కేవలము పరిశుద్ధమైన ఉపనిషత్తుల సిద్ధాంతమగు మా మతమున ఆచారములు, కర్మలు, సాంకేతికములు వీనికి స్థానములేదు. చాలమంది జనులు ఆచారములు కర్మలు మతతత్త్వమును సాక్షాత్కరించుకొనుటకు సాయపడును అని తలంతురు. అందుకు నాకేమియు ఆక్షేపణ లేదు.

మతము అనునది పుస్తకములమీదగాని, గురువులమీదగాని భగవత్ప్రేరితులై దీర్ఘదృష్టిగల ప్రవక్తలమీదగాని రక్షకులమీదగాని ఆధారపడియుండునది గాదు. అది ఈజన్మమునగాని మఱియేజన్మమునందుగాని మనలను పరాశ్రితుల చేయునదిగాదు. ఈ యర్థమున మతమనగా ఉపనిషత్తుల యద్వైతము ఒక్కటే. అయినను రక్షకులు, గ్రంథములు, దివ్యదృక్కులు, ఆచారములు, కర్మలు మొదలైనవానికన్నిటికి వానిస్థానము ఉన్నది, లేకపోలేదు. వారందఱును అవి యన్నియు కాళీపూజ నాకు లౌకికకార్యమందు సాయపడినట్లు చాలమందికి సాయపడవచ్చును. వారికి వానికి స్వాగతమే.

అయినను గురువు అను భావము ప్రత్యేకము. శక్తిని మానసికబలమును జ్ఞానమును సంక్రమింపజేయువారి పుచ్చుకొనువారి మధ్యనుండు సంబంధము. ఒక్కొక్క దేశజనమును దైహికముగాను మానసికముగాను ఒక్కొక్క రకము. ఒక్కొక్కజనమును ఇతరులవలన భావములను ఎప్పుడును గ్రహించుచునే యుండును. గ్రహించి వానిని తమ రకమునకు తమ దేశపుతీరునకు చేరునట్లు పరిణమింపజేసికొనుచునేయుండును. వైవిధ్యము నాశనమయిపోవు కాలము ఇంకను రాలేదు. సమస్తవిద్యయు, ఏదేమూలమున వచ్చినదియు, ఆదేశపు పరమలక్ష్యములకు అనుగుణమైనదిగా చేయబడును. వానిని సకలదేశజనమునకు చెందినవానినిగా చేయ

వలయును. అనగా ప్రకాశము చెందు తక్కిన మాదిరినిపోలి దానితో ఒక్కటిగా కావలయును.

అన్ని మానవజాతులకును త్యాగము, (సన్న్యాసము) ఎల్లప్పుడును పరమలక్ష్యము. ఇతరజాతులు ప్రకృతి మైమఱపించి తమచే ఏమి చేయించునదియు తా మెఱుంగరు. తరాలుగా యుగాలుగా ఒక్కయుద్దేశము ఎడ తెంపులేక వచ్చుచున్నది. అది ఈ భూమి నశించినప్పుడు ఈ సూర్యుడు నశించినప్పుడు ముగిసిపోవును! లోకములు ఎప్పుడును అభివృద్ధి పొందుచునేయున్నవి, నిజము! ఈ యనంతలోకాలలో దేనియందుగాని ఎవడుగాని, మనతో మాటలు ప్రవృత్తి కలిగియుండజాలినట్లు ఇంకను అభివృద్ధి పొందలేదు. అంతయు అర్థములేనిది, బూటకము! వారు పుట్టుదురు. ఈ బాహ్యదృశ్యములనే చూపుదురు, ఈచావే చత్తురు! పెంపొందు ఉద్దేశము! శిశువులు! స్వప్నాలభూమిలో జీవింపుడు, ఓ శిశువులార.

సరి. ఇక నన్నుగూర్చి. నీవు హారియెట్టును నాకు ప్రతినెల కొన్నిడాలర్లు ఇచ్చునట్లు బోధించి సమ్మతింపజేయవలయును. నేను మఱికొందఱు మిత్రులనుగూడ అట్లేచేయుదును. నేను, అందు సిద్ధిపొందుదునేని, ఇండియాకు ఎగిరి పఱతును. నేను జీవికకై ఉపన్యాసములు వేయుపనిని రోసితిని. నాకు ఇకను దానియందు సంతోషములేదు. నేను విరామము నొందుదును. నాకు శక్యమేని ఏదేని పండితోచితమైన గ్రంథమును రచింతును.

నేను త్వరలో చికాగోకు వచ్చుచున్నాను. ఇక కొన్నిదినాలలో అక్కడ ఉందునని నాయాశ. నాకు నాయూరికి తిరిగిపోవుటకైన ఖర్చునకు ధనము దొరకునట్లు శ్రీమతి ఆడమ్సు నాకోసము నేను బోధింపతగిన ఒక తరగతిని కూర్పజాలదా?

నేను చాలచోట్ల ప్రయత్నింతును లెమ్ము. ఇంతట నాకు రెక్కలున్న, ఒక్క ఊపున హిమాలయములకు ఎగిరిపోవలయును అనునంతగా నాకాశావాద మలవడినది.

మేరీ, నేను నా యావజ్జీవితమును ఈలోకమునకై పని చేసి ...ని. కాని అది నా కండలు కరగింపక తిండిని సమకూర్చలేదు. ప్రతిదినము పిడికెడన్నము పొందగలనేని, నేను పూర్తిగా ...రామము చెందెదను. మఱి యిది అసాధ్యము. నాకు వయసు ముదురకొలదియు, తన పైశాచికపు ఆంతరమును బహిరంగమొన ర్చుచు పెరుగుచుండు ఉద్దేశము ఇది.

సదా భవదీయ భగవద్గత,

**వివేకానంద.**

మఱిమాట :—మానవుడు విషయముల నిస్సారతను ఎప్పుడేని కనుగొనియున్నచో, నేనే, ఇప్పుడే. ఇది లోకము-భయంకరమగు మృగకళేబరము. దానికి సాయము చేయదలంచువాడు వట్టి మూర్ఖుడు! మంచినో చెడుగునో చేసి మన బానిసతనమును పూర్తిగా తీర్చుకొనవలయును. దానిని పూర్తిగా చేసి తీర్చితినని నే నను కొనుచున్నాను. ప్రభువు నన్ను ఆవలిగట్టు చేర్చునుగాక. తథాస్తు! నేను ఇండియానుగూర్చిగాని మఱి యే భూమినిగూర్చిగాని అన్ని తలంపులను మానుకొన్నాను. నేనిప్పుడు స్వార్థపరుడను. నన్ను కడతేర్చుకొనుటే నాకోరిక!

ఎవడు (ఆదిదేవుడగు) బ్రహ్మకు వేదములప్రకాశింపజేసెనో, ఎవడు ప్రతిహృదయమునను ప్రత్యక్షముగా ఉన్నాడో, ఆతనిని ఈ బంధనమునుండి విడుపుకోరినవాడనై నేను శరణుజొచ్చెదను.

వి.

## 493

(సోదరి నివేదితకు) న్యూయార్కు,
జూను 20, 1900.

ప్రియ నివేదితా,

...మంచిది. అమ్మ మరల దయబూనినట్లున్నది. చక్రము మెల్లగా పైకి లేచుచున్నది...... భవదీయేత్యాది,

**వివేకానంద.**

## 494

(కుమారి మేరీహేలుకు)

వేదాంతసొసైటి,
146 తూర్పు, 55 వ వీథి,
న్యూయార్కు,
జూను 23, 1900.

నాప్రియ మేరీ,

నీచక్కని జాబునకు ఎంతయు కృతజ్ఞుడను. నేను ఎప్పటివలె చాల కులాసాగాను సుఖముగాను ఉన్నాను. పొంగుకుముందు అలలు రావలయును. నా సంగతియు అట్లే. నీవు ప్రార్థనకు పోవుచున్నందుకు నాకు చాల సంతోషము. నీ వేల ఒక మెథడిస్టుల 'విడిది సమావేశము'ను కూర్పవు? అది యింకను శీఘ్రఫలప్రద మగు నని నా నిశ్చయము.

నేను ఇకను మనోవికృతి చెందగూడదనియు, భావోద్వేగములకు లోను కాకూడదనియు, తీర్మానించుకొన్నాను. ఇకను నేను ఎప్పుడైన మనోవికారము చెందినట్లు నీకు తోచిన నన్ను ఉరితీయుము. నేను అద్వైతిని. మా పరమలక్ష్యము జ్ఞానము. భావములుకావు, ప్రేమకాదు. ఏలన అదంతయు ప్రకృతికి మూఢవిశ్వాసములకు బంధనములకు చెందినది. నేను కేవలము సత్తు, చిత్తు.

గ్రీనేకరు నీకు మంచి విశ్రాంతి కలిగించును. అది నా నిశ్చయము. నీకు అక్కడ సర్వము సంతోషముగా నుండ వలయు నని నా కోరిక. నాకోసము నీవు నిమిషమైనను ఖేదము చెందకుము. అమ్మ నన్ను రక్షించుకొనును - ఆమె నన్ను మొదట మనోవికారములు చెందుట యను నరకములనుండి వడిగా బయటికి తెచ్చుచున్నది; శుద్ధజ్ఞానమను వెలుగులోనికి తెచ్చుచున్నది.

సదా నీ సుఖమును కోరు,

సదా నీ భ్రాత,
వివేకానంద.

మలిమాట :—మార్గరెట్ తే 26 ది బయలుదేఱుచున్నది. నేను ఒకటి రెండు వారములలో ఆమెను అనుసరింపవచ్చును. ఎవ్వరికిని నామీద పెత్తనము లేదు. ఏలన నేను ఆత్మను, నాకు ఆశ లేదు. అదంతయు **అమ్మ** పని. అందు నాకేమియు భాగము లేదు.

వి.

కడచిన కొన్నాళ్ళుగా అజీర్ణరోగము ఎక్కువగానున్నందున, నీ జాబును జీర్ణముచేసికొన జాలనైతిని.

వి.

నిస్సంగత ఎప్పుడును ఉండినట్టిదే. ఒక్కక్షణములో అలవడినది. చాల త్వరలో ఏ రసముగాని ఏ భావముగాని నన్ను తాకని చోట నిలుతును.

వి.

## 495

(సోదరి నివేదితకు)

న్యూయార్కు,
జూలై 2, 1900.

ప్రియ నివేదితా,

......**అమ్మ** ఎఱుగును. అది నేను ఎప్పుడును చెప్పుమాట. **అమ్మ**ను ప్రార్థింపుము. నాయకుడుగానుండుట చాల కష్టమైనపని. అట్టివాడు తాను పూర్తిగా జనులపాదాల త్రొక్కిళ్ళక్రింద అణగి యుండవలసినదే.

భవదీయ,
వివేకానంద.

## 496

(కుమారి మేరీ హేలుకు)

102 తూర్పు, 58 వ వీథి,
న్యూయార్కు,
జూలై 11, 1900.

ప్రియభక్త సోదరీ,

నీ చీటి అందినందునకును నీవు గ్రీసేకరుకు పోవుచున్నావని తెలిసినందునకును, నేను సంతోషించితిని. నీకు చాల లాభము కలుగునని యాశపడుచున్నాను. నా నిడుదలగు వెంట్రుకలను కత్తిరించుకొన్నందులకు అందఱును చాల దూషించినారు. నేను చింతించుచున్నాను. కత్తిరించుకొమ్మని నీవు బలవంతపెట్టితివి.

నేను డిట్రాయిట్‌కు పోయియుంటిని. అక్కడినుండి నిన్ననే మరలివచ్చితిని. ఫ్రాన్సుకు సాధ్యమైనంతత్వరగా పోవలయునని అక్కడినుండి యిండియాకు పోవలయునని ప్రయత్నించుచున్నాను. ఇక్కడ సమాచారములు ఏమియు లేవు. పని ముగిసిపోయినది. నేను వేళతప్పక భోజనము చేయుచు నిదురపోవుచు ఉన్నాను. అంతే.

సదా విశ్వాస ప్రేమపూర్ణ భవదీయభ్రాత,
వివేకానంద.

మఱిమాట: చికాగోలో నాకు ఏమేని తపాలు ఉన్నచో, నాకు పంపుడని పిల్లలకు జాబు వ్రాయుము.

వి.

## 497

(తురీయానందస్వామికి)

102 తూర్పు, 58 వ వీథి,
న్యూయార్కు,
జూలై 18, 1900.

నాప్రియ తురీయానందా,

విలాసము ఇక్కడికి మార్చి వ్రాసిన నీజాబు చేరినది. నేను డిట్రాయిట్‌లో మూడుదినాలే ఉంటిని. ఇక్కడ న్యూయార్కులో

నేను ఆరోగ్యముగా నున్నాను. దినదినమునకు నా యారోగ్యము వర్ధిల్లుచున్నది. పై వారము నిన్ను చూచువఱకు అంతయు సరి.

నిరంతర భగవద్గత భవదీయ,
**వివేకానంద.**

## 500

(తురీయానంద స్వామికి)

102 తూర్పు 58 వ వీథి,
న్యూయార్కు,
జూలై 25, 1900.

ప్రియ తురీయానందా,

నాకు శ్రీమతి హాన్సుబరోవద్దనుండి జాబు వచ్చినది. నీవు ఆమెను చూచినసంగతి వ్రాసినది. వారికి నీవు చాల ఇష్టము. వారు మంచి మిత్రులనియు నిష్కపటులనియు పవిత్రులనియు స్వార్థగంధమైన లేనివారనియు నీవు గుర్తింతువని నానిశ్చయము.

నేను రేపు పారిసుకు బయలుదేఱుచున్నాను. అన్ని విషయములు అటు మళ్ళుచున్నవి. కాళి ఇక్కడ లేడు. నేను పోవుచున్నందుకు అతడు చాల ఖేదపడుచున్నాడు. అయినను అది జరిగి తీరవలయును.

నీ తరువాతి జాబును శ్రీ లెగ్గెట్టు ఇంటికి—6 ప్లేస్ డిస్ ఇటాట్సు యూనిస్, ప్యారిస్, ఫ్రాన్సు అను విలాసమునకు వ్రాయుము.

నా ప్రేమను శ్రీమతి విక్కాఫునకు, హాన్సుబరోకు, హెలెనుకు అందింపుము.

సంఘములను మరల రవంత పునరుజ్జీవనము చేయుము. శ్రీమతి హాన్సుబరోను బాకీలను వెంటనే వసూలుచేయు మనుము. చేసి ఇండియాకు పంపుమనుము. శారదుడు ఇపుడు తమకు వేడి

ఎక్కువగా ఉన్నదని వ్రాయుచున్నాడు. కుమారి బూకుకు ఆమె యందలి నా సాదరగౌరవమును అందింపుము.

సర్వ ప్రేమతో,

నిరంతర భగవద్గత భవదీయ,

**వివేకానంద.**

## 501

(మాయావతి అద్వైతాశ్రమమందలి ఒక బ్రహ్మచారికి)

న్యూయార్క్.

ఆగస్టు, 1900.

ప్రియ ,

నాకు చాలదినాలక్రింద నీవద్దనుండి ఒకజాబు వచ్చినది. మఱి దానికి ఇంతకంటె ముందు జవాబు వ్రాయలేకపోయితిని. శ్రీసేవియరు నిన్నుగూర్చి తనజాబులో చాల మెచ్చుకొని వ్రాసియున్నాడు. నేనందులకు చాల సంతోషించితిని.

నాకు అక్కడ ఎవరెవరు ఉన్నారో, వారు ఒకరొకరు ఏమి చేయుచున్నారో వివరముగా వ్రాయుము. నీవు మీ అమ్మకు ఏల జాబులు వ్రాయవు? ఇదేమిటి? మాతృభక్తి సర్వశ్రేయోమూలము. నీసోదరుడు కలకత్తాలో తన చదువులవిషయమున ఎట్లు ఉన్నాడు? అక్కడ ఉన్నవారి సన్న్యాసనామములు నా జ్ఞప్తిలో లేవు. పేరు వరుసన వారికి వ్రాయుటెట్లు? వారికిఉమ్మడిగానే నా ప్రేమను అందింపుము. ఖగేనుకు ఇప్పుడు పూర్తిగా స్వస్థత చేకూరినదని నాకు సమాచారము తెలిసినది. అది శుభవార్త. సేవియర్లు నీసుఖమునకు వలయువానిని సమకూర్చుచున్నారా—మున్నగువివరములు నాకు వ్రాయుము. దీను ఆరోగ్యము బాగుగా నున్నదని తెలిసినది; సంతోషము. ఆ బాలుడు కాళిబలిసి లావెక్కు స్వభావముగలవాడు. అయినను ఉదంతయు అక్కడ కొండలను నిరంతరముగా ఎక్కుట దిగుటలచే తప్పక కరగిపోగలదు. స్వరూపునితో అతని పత్రికా నిర్వహణవిధానము నాకు చాల ప్రీతి కలిగించుచున్నదని చెప్పుము.

అతడు దివ్యముగా పనిచేయుచున్నాడు. ఇతరుల కందఱికిని కూడ నా ప్రేమను దీవనలను అందింపుము. నా కిపుడు ఆరోగ్యము బాగానే యున్నదని ప్రతివానితోను చెప్పుము. ఇందుండి ఇంగ్లండునకును అక్కడినుండి ఇండియాకు త్వరలోనే రాగలను.

సర్వాశీస్సులతో,
వివేకానంద.

## 502

(తురీయానందస్వామికి)

6 ప్లేస్ డీస్ ఇటాట్స్ యూనిస్.
పారిస్,
ఆగష్టు 13, 1900.

ప్రియసోదరా, హరీ,

నీవు కాలిఫోర్నియానుండి వ్రాసిన జాబు నాకు అందినది. ముగ్గురు మనుష్యులకు ఆధ్యాత్మికపు మైమఱపు కలుగుచున్నది. సరి. అది సెబ్బరగాదు. దానివలన సయితము, చాల మేలు కలుగగలదు. శ్రీరామకృష్ణుడు ఎఱుగును! అన్నిసంగతులు వాని యిచ్ఛమెయి సంభవించును గాక. ఆతనిపనిని ఆతడెఱుగును. నీవును నేనును కేవలము కింకరులము, అంతకంటె వేఱుగాదు.

నేను ఈజాబును సాన్ఫ్రాన్సిస్కోకు శ్రీమతి సి. పేనెలు-ఇంటికి పంపుచున్నాను. ఇప్పుడే న్యూయార్కునుండి కొంత సమాచారము తెలిసినది. వారందఱు బాగున్నారు. కాళి సంచారము పోయియున్నాడు. నీ యారోగ్యమును గూర్చియు, సాన్ఫ్రాన్సిస్కోలోని నీపనిని గూర్చియు, వివరముగా వ్రాయుము. మఠమునకు ధనము పంపువిషయమున ఉదాసీనముగా ఉండకు. ప్రతినెలయు లోసేంజెలిసునుండియు, సాన్ఫ్రాన్సిస్కోనుండియు తప్పక పైకము పోవునట్లు చూడుము.

నేను మొత్తముమీద క్షేమముగా ఉన్నాను. త్వరలో ఇంగ్లండునకు బయలుదేఱుచున్నాను. శరత్తునుగూర్చి సమాచారము తెలియుచున్నది. ఇటీవల అతనికి బంకవిరేచనముల తాకుడు కలిగి

నది. తక్కినవారందఱు బాగున్నారు. మలేరియా ఈసారి చాల
యగమందికి వచ్చినది. అది గంగాతీరములందును అంతవ్యాప్తిలో
స సంవత్సరము అనావృష్టివలన బంగాళమునను క్షామ
ముమున్నది.

**అమ్మ** అనుగ్రహమువలన, తమ్ముడా, పనిచేయుచు సాగి
పొమ్ము. **అమ్మ** యెఱుగును. నీవును ఎఱుగుదువు. నేను ఎక్కడనో
దూరమున ఉన్నాను! నేనిపుడు విశ్రాంతి నొందబోవుచున్నాను.

ప్రేమయుత భవదీయ,
**వివేకానంద.**

## 503

(శ్రీ జాన్ఫాక్సునకు)

చాలివర్డు హౌన్సు స్క్వేర్,
పారిస్,
ఆగస్టు 14, 1900.

జాన్ఫాక్సు దొరగారు,
3, డాక్టరు ఉల్ఫువీథి,
డోర్చెస్టర్,
మాస్, యునైటెడ్ స్టేట్స్, అమెరికా.

దయగలిగి ఎమ్ కు అతడేమిచేసినను అందంతయు నాదీవన
మున్నవని వ్రాయుము. ఇప్పుడతడు చేయుచున్నపని వకీలుపని
మొదలైనవానికన్నను నిజముగా చాలమంచిది. నాకు ధైర్యసాహ
సములు ఇష్టము. మాజాతికి ఆయుత్సాహము చాల తక్కువ.
నాయారోగ్యమునకు భంగము కలుగుచున్నది. నేను దీర్ఘకాలము
జీవింతునని అనుకొనను. ఎమ్—. అమ్మను కుటుంబమును విచా
రించుకొనుమార్గము చూచుకొనవలయును. ఏ నిమిషముననైనను
నేను చనిపోవచ్చును. అతనినిగూర్చి నేను ఇపుడు ఎంతయు
గర్వించుచున్నాను.

ప్రేమయుత భవదీయ,
**వివేకానంద.**

## 504

(తురీయానందస్వామికి)

6 ప్లేస్ డిస్ ఇటాట్స్‌యునిస్.
పారిస్.

ప్రియసోదరా, హరీ,

నేనిపుడు ఫ్రాన్స్‌సముద్రతీరమునఉన్నాను. మతములచరిత్ర మహాసభాసమావేశము ముగిసినది. అదియొక పెద్దసంగతికాదు. సుమారు ఇరువదిమంది పండితులు సాలగ్రామ మూలమును గూర్చియు, జిహోవా మూలమును గూర్చియు, ఇంకను ఇట్టివానిగూర్చియు వెల్లుగా ప్రేలినారు. ఆ సమయమున నేనును ఏదియో కొంత చెప్పితిని.

నా దేహమును మనసును విఱిగి కూలుచున్నవి. నాకువిశ్రాంతి చాల కావలసియున్నది. పైగా, నేను ఆధారపడదగిన మనుష్యుడు, ఒకడును లేడు. అంతేగాక, నేను బ్రదికియుండువఱకును అందఱును చాల స్వార్థపరులై అన్నిటికిని నన్ను ఆశ్రయించువారు అగుదురు. ...జనులతో వ్యవహారము నిరంతరము మనస్సునకు వ్యాకులపాటు కలిగించును... నేను విల్లునామా వ్రాసి అందఱితోను అన్నింటితోను సంబంధమును లేకుండ జేసికొన్నాను. ఒక్కనికికూడ సర్వాధికారము ఉండదనియు అన్ని విషయములు అధిక సంఖ్యాకజనాభిప్రాయమును అనుసరించి చేయబడును అనియు, ఇపుడు నేను వ్రాయుచున్నాను....ఇట్టి మార్గముననే ఒక ట్రస్టుడీడ్—ఇల్లడపత్రము-కూడ వ్రాసివేయగలిగిన చో, తరువాత నాకు స్వేచ్ఛయే.

నీవు చేయుచుండునదియు గురుమహారాజుపనియే. దానిని అట్లె చేయుచుండుము. ఇప్పుడు నాభాగమును నేను ముగించినాను. ఆ విషయములను గూర్చి ఇక నేమియు నాకు వ్రాయకుము, ఆవిషయమై ప్రస్తావము సయితము చేయకుము. ఆవిషయమై చప్పుటకు నాకు ఏ యభిప్రాయములును లేవు....

ప్రేమయుత భవదీయ,
**వివేకానంద.**

మఱిమాట : నాప్రేమను అందఱికిని తెలుపుము.

## 505

(సోదరి నివేదితకు)

6 ప్లేస్ డిస్ ఇటాట్స్ యునిస్,
పారిస్,
ఆగస్టు 25, 1900.

ప్రియ నివేదితా,

నీజాబు నాకు ఇప్పుడే అందినది. నీ సదయభాషితములకు చాల కృతజ్ఞుడను.

నేను శ్రీమతి బుల్సతికి తన ధనమును మఠమునుండి తీసికొనుటకు ఒక అవకాశ మొసంగితిని. మఱి ఆమె దానిని గూర్చి ఏమియు చెప్పనందున, ట్రస్టు-ఇల్లడ పత్రములు వ్రాయవలసి కాచుకొని యున్నందునను, నేను వానిని యథావిధిగా ఇక్కడి బ్రిటిషుమంత్రి కచ్చేరిలో వ్రాసితిని. వానిని ఇండియాకు పంపివేసితిని. ఇప్పుడు అవి దారిలో పోవుచున్నవి.

నేను అన్నిసంబంధములు వదలుకొని స్వేచ్ఛగలవాడను ఐతిని. పనిలో నాకిక ఏయధికారమును బలమును స్థానమును నేను ఉంచుకొనలేదు. నా రామకృష్ణమిషను ప్రెసిడెంటుపదవికి రాజీనామాసైతము ఇచ్చితిని.

మఠము మొదలైనవి ఇప్పుడు నేను తప్ప మిగిలిన రామకృష్ణసాక్షాచ్ఛిష్యుల కందఱికిని చెందినది. ప్రెసిడెంటుపదవి ఇపుడు బ్రహ్మానందునిది. అతనియనంతరము అది ప్రేమానందునికి వచ్చును. తరువాత మఱియొకనికి; అట్లు వంతుప్రకారము.

ఒక పెద్దబరువు నామీదినుండి తొలగిపోయినది. నాకు ఎంతో సంతోషముగా నున్నది. నే నిపుడు హాయిగా ఉన్నాను... నేను ఇరువది యేండ్లు రామకృష్ణుని సేవించితిని. అందు పొరపాట్లును కలిగినవి, జయసిద్ధియు కలిగినది. ఇక దానిని మానుకొని విరామము గొన్నాను. ఇక నీ యాయుఃశేషమును నాకోసము వినియోగించు కొందును.

నేను ఇకమీాదట ఎవరికిని ప్రతినిధిని కాను. ఎవరికిని జవాబు దారియు కాను. నాస్నేహితులయెడ నాకేదియో కృతజ్ఞతా భావము ఉండెను. నేను చక్కగా పర్యాలోచించుకొంటిని. నేను ఎవరికిని ఏమియు బాకీ లేదని తోచినది. ఏమేని యున్న నేను నా శ్రేష్ఠశక్తుల నన్నిటిని, నాకు చావుకూడ కలుగునో అని యను కొను పర్యంతము, వినియోగించితిని. దానికి ప్రతిఫలముగా ధార్ష్టికపు బెదరింపును, పోకిరితనమును, బాధ, శ్రమయును, అనుభవించితిని. ఇక్కడను ఇండియాలోను నాకు అందఱితోను లన్నియు ముగిసి పోయినవి.

నీజాబు నీ క్రొత్తస్నేహితులయెడ నేను అసూయ చెంది యున్నా నని సూచించు చున్నది. నేను నాపుట్టుకలోనే నాయందు మఱే దోషము లున్నను అసూయయు తృష్ణయు అధికారము చెలా యించు కోరికయు లేక పుట్టితినను విషయము మరల నెప్పుడును చెప్ప నక్కఱ లేకుండునట్లు తెలిసికొనుము.

ఇంతకు మునుపు ఎప్పుడును నేను నిన్ను ఆదేశించియెఱుగను. ఇకను ఇప్పుడు నేను పనిలో ఎవ్వడను కాక ఏ సంబంధమును లేని వాడను అయియుండ, నేను ఏదియు ఆదేశింప బనిలేదు. నాకు ఈపాటి తెలియును. నీవు **అమ్మను** నిండుమనముతో ఎంతకాలము సేవింతువో, అంతకాలము ఆమె నీకు దారి చూపును.

నీవు ఎవరితో స్నేహించితివో అను విషయమున నాకెన్నడును అసూయ కలుగలేదు. నేను నాభ్రాతలను ఎందు తలదూర్చినందు లకును తప్పుపట్టలేదు. పాశ్చాత్యులు తమ కేది మంచి దనితోచునో, అది ఇతరులకు మంచి కాకపోవచ్చు ననుటను మఱచి, దానిని ఆచరింపు మని ఇతరులను బలవంతపెట్టుట అను లక్షణము కలిగి యున్నారు—అని ఇదిమాత్రము నాకు దృఢ మగు నమ్మకము. అట్లు ఆమార్గాన క్రొత్తస్నేహితులతోడి సంబంధమున నీకుకలుగు మనఃపరివర్తనలనే నీవు ఇతరుల నెత్తినిరుద్దుటకు ప్రయత్నింతువని

నాకు భయము. ఎప్పుడైనను దేనినైన ఒకశక్తిని నేనొక్కొక్కప్పుడు ఆపుటకు ప్రయత్నించుటకు ఆకారణముచేతనే.

నీ కేమియు ఆటంకము లేదు, అంతయు స్వేచ్ఛ, నీవు కావలసినదానిని ఎన్నుకొనుము, నీపని చేసికొనుము.........

సంతోషమున కానిమ్ము బాధలో కానిమ్ము, మనకర్మను మనము నిర్వర్తించుకొనుటకు మనకు సాయముచేయు మిత్రులు కానీ శత్రువులుకానీ, అందఱును ఆమెచేతి కొలిముట్లు. కావున అమ్మ వారి నందఱిని అనుగ్రహించును గాక.

సమస్త ప్రేమాశీస్సులతో,

ప్రేమయుత భవదీయ,
**వివేకానంద.**

## 506

(సోదరి నివేదితకు)

పారిస్,
ఆగస్టు 28, 1900.

ప్రియ నివేదితా,

అట్టిది జీవితము—విసరు, విసరుము. ఇకను మనము చేయ వలసినది ఏ మున్నది? విసరు విసరుము! ఏదియో రాగలదు, ఏదియో మార్గము తెలియకొనును. అది తెలియకొనదేని బహుశః అది యెపుడును తెలియకొనదు లే అప్పుడు, అప్పుడు, ఏమప్పుడు? మన ప్రయత్నము లన్నియు ఆ పరమోచ్చమైన మృత్యువును కొంతకాలము అవతలికి నెట్టుటకే కదా! ఓమృత్యూ, నీవు లేకున్న, ఈలోకము ఏమి చేయగలదు! ఎంతటి చికిత్సకుడవు నీవు!

లోకము ఉన్న తీఱున సత్యము గాదు, నిత్యము గాదు. ప్రభూ, నీ అనుగ్రహ మెంత! భవిష్యత్తు ఎట్లు ఇంతకన్న శ్రేయ

ముగా నుండగలదు? అది దీని ఫలముగానే ఉండవలయును. ఇంత కన్న సెబ్బర కాకున్నను కనీసము దీనివలనైనను ఉండవలయును!

కలలు ఆహా కలలు! కలలు కను పో! స్వప్నమే, స్వప్న మాయయే, ఈ జీవితమునకు కారణము. అదియే దానికి ప్రతి క్రియయు. కల, కల, కేవలము కల! కలను కలతో చంపుము.

ఇక్కడ —తో మాటలాడుచు నేను ఫ్రెంచిభాష నేర్చు కొనుచున్నాను. అప్పుడే నన్ను చాలమంది మిక్కిలి మెచ్చుకొను చున్నారు. సకలలోకముతోను ఎన్నటికిని తీఱని ఆ చిక్కు ప్రశ్నను గూర్చి, ఆ నిత్యమైన విధినూలు పుట్టుకండెనుగూర్చి మాటలాడుము. దాని నూలు కొన ఎవరును కనుగొనలేరు. అందఱికిని కనీసము తమ తృప్తికైనను కనీసము కొంతకాలమువఱకైనను, దానివలన తామే మూర్ఖులగుటకు తాము కనుగొన్నట్లు తోచును. అవునా?

మంచిది, ఇపుడు గొప్పపనులు నెఱవేఱవలయును — ఆ గొప్పవి ఎవరికి లక్ష్యము? చిన్నవికూడ ఏల చేయగూడదు? ఏదియు మఱియొకదానియంత మంచిదే. గీత బోధించునది, చిన్న పనుల గొప్పతనము. ఆ ప్రాచీన గ్రంథమును దీవింపుము!!...

నాకు ఈదేహమునుగూర్చి తలంచుటకు ఎక్కువకాలము లేదాయె. కావున అది సుస్థితియందే ఉండియు ఉండవలయును. ఇక్కడ సుస్థితి దేనికిగాని ఎప్పుడుగానిలేదు. మనము వానిని అప్పు డప్పుడు మఱతుము. విస్మృతిలోపడుటే సుస్థితియు క్షేమమును....

మంచివో చెడ్డవో, ఇక్కడ మన పాత్రల మన మభినయిం తుము. కల ముగిసి మనము రంగమును విడిచిపోయినప్పుడు దీని నంతటినిగూర్చి ఒక్క హార్దమైన నవ్వు నవ్వుదుము. ఇదే నా నిశ్చయము.

భవదీయుఁడు,

వివేకానంద.

## 507

(తురీయానందస్వామికి)

6 ప్లేస్ డిస్ ఇటాట్స్‌యునిస్,
డా ఫారెస్టు తపాల్ సాంగా క్లారాకో,
పారిస్, ఫ్రాన్సు,
సెప్టెంబరు 1, 1900.

నా ప్రియ హారీ,

నాకు నీజాబువలన అన్నివిషయములు తెలిసినవి. కొంతకాలమునకు ముందు ఆ వీరవేదాంతికిని సత్యమందిరమునకును ఏదియో కొంచెము జగడమని ఎవడో వ్రాసినాడు. నాకు రవంత సూచన యుండినది. అట్టివి సంభవించునవే. మఱి అందఱి సుప్రసన్నతను నేర్పుతో నిలబెట్టుచునే పనిని సాగించుట తెలివి.

ఇటీవల నేను కొంతకాలముగా ప్రచ్ఛన్నుడనై ఉంటిని. నేర్చుకొనుటకై ఫ్రెంచివారితో నుందును. నేను కొంతవఱకు అన్ని మనఃఖేదములవలన ముక్తి చెందియున్నాను. అనగా ట్రస్టు (ఇల్లడ) పత్రమును ఇతరములను సంతకముచేసి కలకత్తాకు పంపితిని. ఏ హక్కునుగాని స్వామ్యమునుగాని నాకు నిలుపుకొనలేదు. ఇప్పుడు సమస్తము నీది. పనినంతయు గురుకృపవలన నీవు నిర్వహింతువు.

సంచారము చేసి ప్రాణముమీదికి తెచ్చుకొనవలయునను కోరిక నాకిక లేనేలేదు. ప్రస్తుతమునకు ఎక్కడనైనను కుదురుపడి కాలమును గ్రంథములతో గడపుదమను తలంపు నాకు కల్గుచున్నది. ఫ్రెంచిభాషలో కొంత ప్రవీణతను సంపాదించితిని. అయినను ఫ్రెంచివారినడుమ ఒకటి రెండు మాసములుందునేని చక్కగా సంభాషణ జరుపగలుగుదును. ఈభాషను, జెర్మనుభాషను వాలినంత కైవసమొనర్చుకొనగలవానికి యూరపు దేశీయులవిజ్ఞానముతో చక్కని పరిచయము గల్గును. ఫ్రాన్సు దేశప్రజలు నట్టి బుద్ధిబలమును మాత్రము నమ్మువారు, ఐహికవిషయపరాయణులు. దేవుడుగాని ఆత్మగాని మూఢుల నమ్మకము అని వారి దృఢాభిప్రాయము.

అట్టి విషయములగూర్చి మాటలాడుటకు వారికి మిక్కిలి అసమ్మతము. ఇది నట్టి అనాత్మ ఐహికవాదుల దేశము! ప్రభువు ఏమి చేయునో చూతునుగాక! మఱి యీ దేశమే పాశ్చాత్య సంస్కృతికి తల పోలము. ఈ సంస్కృతికి ప్రధాననగరము పారిసు.

తమ్ముడూ, సమస్త ప్రచారకార్యక్రమమునుండియు నన్ను విడుదల చేయుము. నేనిపుడు దానికంతటికి ఎడముగా ఉన్నాను. దానిని నీవే నిర్వహింపుము. అమ్మ నాచేత చేయించినంతకన్న మీ యెల్లరచేతను నూఱింత లెక్కువపని చేయించును అని నా గట్టి నమ్మకము.

చాల దినాలకు ముందు నాకు కాళివద్దనుండి ఒకజాబు వచ్చినది. అతడు ఇప్పటికి న్యూయార్కు చేరియుండును. కుమారివాల్డో అప్పుడప్పుడు సమాచారము తెలుపుచుండును.

నా కారోగ్య మొకప్పుడు బాగుగా నుండును. ఒకప్పుడు జబ్బుగా నుండును. ఇటీవల నేను మరల శ్రీమతి మిల్టనుచేత తోమించుకొను చికిత్స చేయించుకొనుచున్నాను. ఆమె 'నీకప్పుడే అంతయు మానిపోయినది, నీవు స్వస్థత పొందితివి' అని చెప్పను. నా కగపడునది యేమనగా, గర్భవాతము ఎట్లున్నను, కదలుటగాని, నడచుటగాని, ఎక్కుటకసయితమును నాకు ఏకష్టమును తోపదు. ప్రాతర్వేళ నేను బలముగా వ్యాయామము చేసెదను. తరువాత చన్నీళ్ళలో ఒక మునుక వేసెను.

ఇక్కడ నేనొకనితో నివసింపబోవుచున్నాను. అతడొక బీద పండితుడు. అతని గదియంతయు పుస్తకములతో నిండియుండును. ఐదవ యంతస్తులో ఒకగదిలో ఉన్నాడు. ఆ యింటిని చూచుటకు నిన్న పోయియుంటిని. అమెరికాలోవలె ఇక్కడ మేడల పైకి ఎక్కించు విద్యుద్యంత్రములు లేనందున ఎవడైనను సరే, కాలి నడకన ఎక్కి దిగవలయును. అయినను అది నాకిప్పుడు కష్టమనిపించుట లేదు.

ఆ యింటిచుట్టును నగరోద్యానవనమున్నది. ఆయన ఇంగ్లీషు మాటలాడలేడు. నే నచటికిపోవుటకు అది మఱియొక కారణము. నేను నిర్బంధముగా ఫ్రెంచిభాష మాటలాడవలయును. అదంతెయు అమ్మ సంకల్పము. ఆమెకు దేనిని చేయించిచూడవలయునని కోరికయో ఆమె దానిని లెస్సగా ఎఱుంగును. ఆమె యెపుడును ప్రకాశముగా మాటలాడదు. ఊరక మౌనముగా నుండును. అయినను ఇది మాత్రము నేను పరికించుచున్నాను. నెలదినములుగా నాకు గాఢధ్యానమును ప్రభు నామావృత్తియు సాగుచున్నవి.

నా ప్రేమను కుమారి బ్రూక్సుకు, కుమారి బెల్లుకు, శ్రీమతి ఆస్పినెలుకు, కుమారి బెక్హాముకు, శ్రీజార్జికి, డాక్టరు లోగనుకు, ఇతరమిత్రులకు అందించి, నీవును అందుకొనుము. లోసేంజెలిసులోని అందఱికి సయితము నా ప్రేమ.

భవదీయ,
వివేకానంద.

## 508

(శ్రీమతి ఫ్రాన్సిసు లెగ్గెటుకు)

6 ప్లేస్ డిస్ ఇటాట్సు యునిస్,
పారిస్,
సెప్టెంబరు 3, 1900.

ప్రియ మాతా,

ఇక్కడ ఈయింటిలో వెఱ్ఱివారి మహాసభ జరిగినది.

దానికి ప్రతినిధులు అనేకదేశాలనుండి దక్షిణాన ఇండియా మొదలుకొని ఉత్తరాన స్కాట్లెండువఱకు ఉన్నవారును, పడమటను తూర్పునను అనుకొన్న యింగ్లండు అమెరికాలలో నున్నవారును వచ్చినారు.

దానికి అధ్యక్షు నెన్నుకొనుట మాకు చాల కష్టముగా నుండెను. ఏలన డాక్టరు జేమ్సు [-విల్లియము జేమ్సు పండితుడు] అక్కడ ఉన్నను, అతనికి ఆ అయస్కాంత వైద్యురాలగు శ్రీమతి

మెల్లను కలిగించిన పొక్కుడు కురుపులను చూచుకొనుటలో నున్నంత అక్కఱ లౌకికవిషయముల చిక్కులు విడదీయుటలో లేదాయెను.

నేను 'జో' పేరును ఉపపాదించితిని. (కుమారి జోసెఫైన్ మెక్లియడును.) కాని ఆమె తన క్రొత్త అంగీచేర లేదను కారణము చెప్పి ఒప్పుకొనదాయెను. మఱి ఆమె అంగు లన్నియు చక్కగా నగపడు నొకమూలకు పోయి అక్కడనుండి జరుగుదానినెల్ల కను పెట్టుచుండెను.

శ్రీమతి ఓల్బుల్సతి సిద్ధముగా నుండెను. కాని మార్గట్, అనగా సోదరినివేదిత, ఆ సమావేశమును అట్లు ఒక తారతమ్య పరిశీలనముచేయు తత్త్వశాస్త్రముల తరగతిగా చేయుట తగదని ఆక్షేపించెను.

మేము అట్లు ఏమియు దారితోపక చిక్కులో పడియుండగా, ఒకమూలనుండి పొట్టియు నలుచదరమును చాలవఱకు గుండ్రము నైన ఒకవ్యక్తి పైకిఎగిరి నిలిచినాడు. ఏ యాచారములను పాటింపక చాటినట్లు మనమందఱము సూర్యదేవతను చంద్రదేవతను, ఆరాధింప నారంభింతుమేని, ఈ యధ్యక్షుని ఎన్నుకొనుటమాత్రమే గాదు, ఇంకను మనకష్టము లన్నియు తీఱును అని పలికెను. అతడు తన భాషణమును ఐదునిమిషములలో ముగించినాడు. అయినను అతనిప్రక్కనే యున్న యతని శిష్యునికి దానిని అనువాదము చేయుటకు ముప్పావుగంట పూర్తిగా పట్టెను. ఇంతలో ఆ గురువు ఈ చావడిలో కంబళ్ళను లాగ నారంభించి ఒక పెద్దరాశిగా పేర్చెను. ఎందుకనగా, అక్కడనే ఆ సమయముననే అగ్నిదేవుని శక్తిని ప్రత్యక్షముగా ఋజువుచేయుట కది అతడే చెప్పినాడు.

ఆ సంకటతరుణములో, జో నడుమ చొచ్చి తన చావడిలో అగ్నిమయ యజ్ఞము అక్కఱలేదని అన్నది. దానిమీదట, ఆ యిండియను భక్తుడు జోను అతి కోపక్రూరదృష్టులతో చూచెను. ఏలన, ఎవతె ఈ యగ్నిపూజ మతమున నమ్మి చేరినదవ్వ తాను

తలచుచుండెనో ఆమె చూపిన యిట్టి నడువడిచేత అతడు పూర్తిగా చీదరగొన్నవాడాయెను.

తరువాత డాక్టరు జీమ్సు తన పొక్కుడుపుండ్లను ఆప్యాయముగా గోకికొనుటనుండి ఒక క్షణము ఎట్లో తీరిక చేసికొని, నేనేగన మెల్లనుపుట్టించిన పొక్కుడు కురుపులు చూచుకొనుటతో నా కాలమంతయు గడపక తీరిక సంపాదింపగలనేని అగ్నిదేవుని గూర్చియు ఉతని సోదరులను గూర్చియు వినదగు విషయములు చెప్పగలను అనియు, మఱియు నాతని గొప్పగురువు హెర్బర్టు స్పెన్సరు ఈ విషయమును ముందుగా పరిశీలింపనందున, బంగారమువంటి మౌనమును వహించును అనియు చాటెను.

తలుపుదగ్గఱ ఒక గొంతు "అసలు సంగతి చట్నీ" అని వినవచ్చెను. మేమందఱము వెనుతిరిగి చూచితిమి. అక్కడ మార్గరట్ అగపడినది. ఆమె "అది చట్నీ" అన్నది. మఱియు "చట్నీయు కాళియు ఈ జీవిత క్లేశముల నన్నింటిని తొలగించి, మనకు అన్ని సెబ్బరలను గుటుక్కుమని మ్రింగుటకును, మేలు ఏదియో, దాని చవిగని యనుభవించుటకును సులువు చేయును" అని యనెను. ఇంతలో తటాలున ఆమె తనమాటలు ఆపెను. ఆపి, "ఇక నే నేమియు మాటాడబోను, ఏలన శ్రోతలబృందమున ఏదియో ఒక మగమృగము నామాటలకు అడ్డము వచ్చినది" అని పలికెను. శ్రోతలలో ఎవడో ఒకపురుషుడు తన తలను కిటికీతట్టు తిప్పి, ఒక్క స్త్రీయెడ తాను సరిగా చూపవలయు గౌరవమును చూపక యుండెను. తానేమో స్త్రీ పుంజాతుల సామ్యమును నమ్మినదే. అయినను ఆ నోతమనుష్యుడు ఆ స్త్రీయెడ ఏల సరియగు గౌరవమును చూపడాయెనో ఆ కారణమును తాను ఎఱుగగోరెను. అంతట ప్రతియొకడును తాను ఆమెకు తదేకమగు శ్రద్ధ చూపుచున్నాను అనియు, సమానహక్కుకన్నను చూపవలయు న్యాయ్యమగు శ్రద్ధను చూపుచున్నాడననియు అనెను. అయినను ఆమాట ప్రయోజన

కారికాలేదు. మార్గట్టు భయంకరమైన ఆమూకతో తానేమియు పెట్టుకొననని కూర్చుండెను.

తరువాత బోస్టనునివాసిని 'శ్రీమతి గుల్నతి, వేదికపైకి వచ్చి లోకకష్టములన్నియు స్త్రీపుంజాతుల పరస్పరసంబంధమును లెస్సగా అరయమిచేతనే కలిగినవి అని చెప్పినది. మఱియు ఆమె 'సరియైన మనుష్యులు సరిగా అర్థము చేసికొనుటయు, తరువాత ప్రేమలో స్వేచ్ఛను కనిపట్టుటయు, స్వేచ్ఛలో అన్నింటివలన విడుదలపొందుటయు, మాతృత్వమునుండియు, సోదరత్వమునుండియు, పితృత్వమునుండియు, దైవత్వమునుండియు విడుదల పొందుటయు, ప్రేమలో విడుదలయు, విడుదలలో ప్రేమయు, స్త్రీ పుంజాతుల విషయమున నిజమగుపరమలక్ష్యమును ప్రతిష్ఠింప జూచుటయు— సర్వక్లేశరోగహరమగు ఔషధము'' అని ఉపన్యసించినది.

ఇందులకు స్కాచ్ ప్రతినిధి తీవ్రముగా ఆక్షేపించి వేటగాడు మేకలకాపరిని తఱిమి వేటాడెను. మేకలకాపరి గొఱ్ఱెలకాపరిని, గొఱ్ఱెలకాపరి కాపువానిని, కాపువాడు చేపలుపట్టు చెంబడి-వానిని సముద్రములోనికి తఱిమి వేటాడెను. ఇపుడు మనము ఏతద్విపరీతముగా, చేపలుపట్టు-చెంబడి వానిని సముద్రమునుండి బయటికి తీసి వానిని కాపువానిమీద పడునట్లును, కాపువానిని గొఱ్ఱెలకాపరిమీదను, అట్లే తక్కినవరుసను పూర్తిచేయుటకు దివురుచున్నాము. అట్లు కావించినచో జీవితపు నేత పూర్తియగును. మన మందఱము సర్వసుఖముగా నుందుము అని చెప్పెను. అయినను అతడు చెప్పిన ఒకడు ఒకనిని తోలివేయుట అను మాటలు ముగింపకపూర్వమే ఒకక్షణములో సభాజనులందఱును లేచి నిలబడిరి. అంతట మాటల గందరగోళముమాత్రమే ''సూర్యదేవతయు చంద్రదేవతయు'' ''చట్నీయు కాళియు'' ''విడుదల చక్కని జ్ఞానమును స్త్రీ పుంజాతిని, మాతృత్వమును నెలకొల్పుట'' ''ఎన్నటికిని కాదు, అది యెన్నటికిని కాదు, చేపలు పట్టువాడు తీరమునకు వెనుమరలిపోవలయును''—మున్నగుమాటలు మాకు వినవచ్చెను.

అందుమీఁదట జో లేచి 'మీరు ఈ యర్థములేని కూతలు మాన కున్న, నేను వేటకత్తెనై మిమ్మందఱిని వేటాడి ఇటనుండి తఱిమి వేయవలయునని కోరుచున్నాను' అని స్పష్టవాక్కులతో వివరించెను.

అంతట శాంతిసద్భావములు మరల నెలకొనగానే నేను నీకు ఇది వ్రాయుటకు తొందరపడుచున్నాను.

ప్రేమయుత భవదీయ,

వివేకానంద.

## 509

6 ప్లేస్ డిస్ ఇటాట్స్ యునిస్,
ప్యారిస్, ఫ్రాన్సు
సెప్టెంబరు 10, 1900.

ప్రియ ఆల్బర్టా,

నేను ఈ సాయంకాలము తప్పక వచ్చుచున్నాను. చాల సంతోషముగా ఆ రాజకుమారిని డెమిడాఫ్‌ను కాబోలు ఆమె సోదరుని కలసికొందును లెమ్ము. అయినను ఇక్కడ సమస్తము చక్కబెట్టుకొని బయలుదేఱివచ్చుటకు అత్యాలస్యము అగునేని, నీవు నాకు ఇంటిలో నిదురపోవుటకు చోటు చూపవలసియుందును.

ప్రేమాశీస్సులతో,

భవదీయ,

వివేకానంద.

## 510

(శ్రీ తురీయానందస్వామికి)

6 ప్లేస్ డిస్ ఇటాట్స్ యునిస్,
సెప్టెంబరు, 1900.

నా ప్రియ తురీయానందా,

ఇప్పుడే నాకు నీజాబు చేరినది. అమ్మ సంకల్పానుసారముగ సర్వకార్యమును జరిగిపోవును. భయపడకు, నేను త్వరలోనే ఇందుండి వేఱుచోటికి పోవుదును. ఒకవేళ నేను కొంతకాలము కాన్‌స్టాంటినోపులుకును వేఱుచోట్లకును సంచారము చేయుదునేమో.

తరువాత జరుగనున్నది అమ్మ ఎఱుగును. నాకు శ్రీమతి విల్మాట్టు వద్దనుండి ఒకజాబు వచ్చినది. దీనివలనగూడ, ఆమె చాల ఉత్సాహము కలిగియున్నట్లు తెలియుచున్నది. నిలుకడగా మనోవేదనలు లేకుండ కూర్చుండుము. సమస్తమును సరిపడ గలదు. నాదము మొదలైనదానిని వినుట ఎవనికైనను హాని కలిగించునేని అతడు ధ్యానమును కొంతకాలము మాని, చేపలు మాంసము తినజొచ్చునేని, ఆహాని మానిపోవును. దేహము క్రమముగా ఎక్కువ బలహీనత చెందకున్న, అందు దిగులుపడవలసిన కారణము ఏమియు లేదు. అభ్యాసము నిదానముగా సాగవలయును.

నీజవాబు రాకముందే నేను ఈచోటు విడిచిపోవుదును. కావున ఈజాబునకు జవాబు ఇక్కడికి పంపకుము. నాకు శారదుని పత్రికసంచికలన్నియు వచ్చినవి. నేను అతనికి కొన్నివారములకు ముందు విస్తారముగా వ్రాసితిని; కొంతకాలము తర్వాత మఱికొంత పంపుదమని నాయుద్దేశము.

నేను ఇటుతర్వాత ఎక్కడ ఆగుదునో ఎఱుగుటకు వీలు కాదు. ఇదిమాత్రము చెప్ప గలను, ఎట్టిబాధ్యతయు పెట్టుకొనక యుండవలయు నని ప్రయత్నించుచున్నాను.

ఈదినము నాకు కాళివద్దనుండియు ఒకజాబు వచ్చినది. నేను అతనికి రేపు జవాబు వ్రాసెదను. దేహము ఎట్లో దొరలిపోవుచున్నది. దేహమును జబ్బుపఱచునది పని, బాగుపఱచునది విశ్రాంతి. అంతే, అమ్మ యెఱుగును. నివేదిత ఇంగ్లండునకు పోయినది, ఆమెయు శ్రీమతి బుల్లుతియు ధనము పోగుచేయుచున్నారు. కిషెన్గఢులో తనతోకూడ నుండిన ఆ బాలికలతో ఒకబడిని జరుపవలయు నని ఆమెయుద్దేశము. ఆమెకు శక్యమైనచో దానిని చేయనీ. నేను ఇకమీద ఎందులోను కలిగించుకొనను, అంతయే.

నీకు నా ప్రేమ. ఏనను పనినిగూర్చి సలహాచెప్పుటకు ఇకను నాకే బాధ్యతయు లేదు.

సేవాసక్త భవదీయ,

వివేకానంద.

## 511

(కుమారి ఆల్బర్టా స్టర్గిసుకు)
(ఆమె 23 వ జన్మదినమున)

పెర్రోసుగ్వీరీ,
బ్రిటాని,
సెప్టెంబరు 22, 1900.

వరమాతృహృదయంబు, వీరునిదీక్ష,
మృదుతమపుష్పాల మృదుతమస్పర్శ,
వేదిహుతాశనాభీలకీలాళి
యాటల నాడించు నందము, శక్తి,
శాసించు దక్షత, శాసనములను
బ్రేమతోఁ దలఁ దాల్పఁ బ్రియపడు బలము,
దవ్వుదాఁటు కల, లత్యంతసహనము
గలయట్టి దారులు, కలకాల మాత్మ
యందు దృఢప్రత్యయంబును, జిన్న
వానిలోఁ బెద్దలో వానిలో నెల్ల
నెసఁగెడు వరదివ్యదృష్టియు—వీని
నన్నింటి, నివి గాక నాదుచూపునకు
నేఁ డందనట్టి వానినిగూడ నీకు
జగదంబ యిచ్చుత సతతము దయను.

ప్రేమాశీస్సులలో,

సదా భవదీయ,
వివేకానంద.

ప్రియ ఆల్బెర్టా,

ఈచిన్నిపద్యము నీ జన్మదినమునకు. ఇది బాగుండకున్నను ఇందు నాప్రేమ నిండియున్నది. కావున ఇది నీవు ఇచ్ఛలో మెత్తువని నా నిశ్చయము. అక్కడి చిన్నిపత్రముల ఒక్కొక్క ప్రతిని శ్రీమతి బెస్నార్డుకు, క్లేరాయికి, బ్రెస కామ్పోయిసుకు, ఆయిసుకు దయతో పంపుము, దయచేయుము.

నీ శ్రేయోభిలాషి,
వివేకానంద.

## 512

(శ్రీమతి మాడెమాయిసెల్లికి)
(ఫ్రెంచిమూలమునకు అనువాదము)

6 ప్లేస్ డిస్ ఇటాట్స్, పారిస్,
అక్టోబరు, 1900.

నా ప్రియ మాడెమాయిసెల్లి,

నేను ఇక్కడ చాలసుఖముగాను, తృప్తికలిగియు ఉంటిని. అనేక సంవత్సరముల యనంతరము ఇపుడు నాకు మిక్కిలియు ఉత్తమకాలము వచ్చియున్నది. ఇక్కడ శ్రీబాయిసుతోకూడిన నాజీవితము చాల తృప్తికరముగా ఉన్నది. పుస్తకములున్నవి, శాంతియున్నది, నన్ను మామూలుగా బాధించునది యేదియు ఇక్కడ లేదు!

అయినను నాకై ఇపుడు ఎట్టివిధి కనుపెట్టుకొనియున్నదో నే నెఱుగను. నా జాబు నవ్వు కలిగించుచున్నది కదా? అయినను ఇది నా ప్రథమప్రయత్నము.

భవదీయ శ్రద్ధాయుతి,
వివేకానంద.

## 513

(సోదరి క్రిస్టైనుకు)
(ఫ్రెంచి మూలమునకు అనువాదము)

6 ప్లేస్ డిస్ ఇటాట్స్ యూనిస్.
పారిస్,
అక్టోబరు 14, 1900.

నా ప్రియ క్రిస్టైన్,

దేవుడు నిన్ను ప్రతిపదమునను అనుగ్రహించుచుండును గాక, అట్టిది నానిరంతర ప్రార్థన!

అంత అందముగాను అంత శాంతముగాను ఉన్న నీజాబు పలుమాఱు నేను పోగొట్టుకొనుచున్న నూతనశక్తిని నాకు ఒసంగినది.

నేను సుఖముగా ఉన్నాను. అవును, నేను సుఖముగా ఉన్నాను. అయినను జబ్బు నన్ను పూర్తిగా వదలిపోలేదు. అది ఒకొక్కడు నా మందభాగ్యతచే మరల క్రమ్మును. అయినను అది మునుపటియంత రోగబాధ కలిగించుట లేదు.

నేను ప్రసిద్ధుడగు ఫ్రెంచిగ్రంథకర్త, ఎం. జూలిస్ బాయిస్‌తో కూడ ఉన్నాను. నేను ఆయనకు అతిథిని. అతడు తన కలముతో జీవికసంపాదించుకొనువాడైనందున, అంత ధనికుడు కాడు. ఐనను మాకు ఎన్నియో భావములు ఉమ్మడిగా ఉన్నందున మేము కలిసి ఎంతో సుఖముగా ఉన్నాము.

అతడు ఎన్ను కొన్ని యేండ్లక్రిందటనే కనుగొన్నాడు. అప్పుడే నా చిన్న పుస్తకముల గొన్నింటిని ఫ్రెంచి భాషలోనికి అనువదించి నాడు. మనము వెదకుచున్నదానిని కడపట కనుగొందుము, కాదా?

ఇట్లు నేను కాల్వేఅమ్మతోడను, కుమారి మెక్లియడుతోడను, యం. జూలిస్ బాయిసుతోడను కూడి ప్రయాణము చేయుదును. కాల్వేఅమ్మ గొప్ప ప్రసిద్ధగాయకురాలు. ఆమెకు నేను అతిథి నగుదును.

మేము కాన్‌స్టాంటినోపులుకు, సమీపప్రాగ్దేశమునకు, గ్రీసుకు, ఈజిప్టుకు పోవుదుము. మేము మరలి వచ్చునప్పుడు వెన్నిసులో దిగి చూతుము.

నేను మరలి వచ్చిన తర్వాత పారిసులో కొన్ని యుపన్యాస ములు కావించెదను. అవి యింగ్లీషులో ఉండును. అర్థము చెప్పువా డొక డుండును.

నా కిక కాలము లేదు, నా యీవయసున ఒక క్రొత్త భాషను నేర్చుకొను శక్తియు లేదు. నేను వయసు చెల్లినవాడను, కానా?

శ్రీమతి ఫంక జబ్బుగా నున్నది. ఆమె అతిగా పాటుపడు నని నాయభిప్రాయము. ఆమెకు మునుపే నరముల జబ్బు ఉండెను. ఆమె త్వరగా స్వస్థతచెందును అని నేను ఆశపడుచున్నాను.

నేను అమెరికాలో సంపాదించిన ధనమునంతయు ఇండియాకు పంపుచున్నాను. ఇపుడు నేను ఏనిర్బంధమును లేక విడిగా, మునుపటి వలె, భిక్షుకసన్న్యాసి నైతిని. నేను మఠాధ్యక్ష్యమునకును రాజీనామా పెట్టితిని. దేవునికి నమస్కారము. నేను విడిగా ఉన్నాను! అట్టి జవాబుదారి మోయుట ఇక నాకు శక్యము గాదు. అంతటి దడ అంతటి దుర్బలత గల్గియున్నాను.

పక్షులు, చెట్లకొమ్మలలో నిద్రించినవి, మేల్కని, సూర్యోదయమున పాడుచుండి అంతట గంభీరమగు నీలాకాశమునకు ఎగిరి పోవునట్లున్నది నా జీవితాంతము.

నాకు అనేకకష్టములు కలిగినవి, కొన్ని గొప్పవిజయములును కలిగినవి. అయినను ఆ నా క్లేశములుగాని బాధలుగాని ఏవియు ఏ లెక్కయు లేదు; ఏలన నేను జయము పొందితిని. నాయుద్దేశము సిద్ధించినది. నేను దేనిని వెదకుటకు ఈ జీవితసముద్రములో మునిగితినో ఆరత్నమును పొందితిని. నాకష్టములు ఫలించినవి. నేను సంతసించితిని.

ఇట్లు నాజీవితమున ఒక క్రొత్త యధ్యాయము ఆరంభ మగు చున్నదని నాకు తోచుచున్నది. ఇపుడు అమ్మ నన్ను మెల్లగాను మృదువుగాను సుకుమారముగాను దారిచూపి ముందుకు కొనిపోవునని నాకు తోచుచున్నది. ఇకమీదట నిరోధబంధురమార్గాలలో ఏ ప్రయత్నమును పనియు ఉండదు. ఇపుడు అది అంతయు హంస తూలికాతల్పమయము. అది నీకు బోధపడుచున్నదా? నన్ను నమ్ముము. నాకేమో అది నిశ్చయమని తోచుచున్నది.

ఇప్పటివఱకు నైన నా సకలజీవితమునను నా యనుభవము వలన నేను ఆశతో వెదకునదంతయు నాకు ఎప్పుడును తప్పక దొరకును అని తెలిసినది. కొన్నిసమయములలో అది చాల బాధపడిన తర్వాత దొరకును. అయినను ఆ బాధ లెక్కలేదు! ఫలమార్దవమున క్లేశమును బాధయు అంతయు విస్మరింపబడును. నా మిత్రమా, నీవును కష్టములు అనుభవించుచున్నావు; అయినను నీ కోరిన

ఫలమును నీవు కాంతువు. అయ్యో, నీకిప్పుడు కలిగినది ఫలము గాదు, మఱేమన ఇంకను హెచ్చిన బాధ.

నా కన్ననో, మబ్బు తొలగుచున్నది, నా పురాకృత దుష్కృతమేఘము మాయమైపోయినది. నా పురాకృతిసుకృత సూర్యుడు ఉదయించుచున్నాడు; అందముగా తీక్ష్ణముగా ప్రకాశించు చున్నాడు. నీ విషయముగూడ అట్లే యగును, మిత్రమా. నాయీ భాషాజ్ఞానమునకు నా గాఢమనోభావముల తెలుపు శక్తి చాలదు. అయినను ఏ భాషమాత్రము దానిని నిజముగా చక్కగా వర్ణింప గలదు?

కాబట్టి ఆ ప్రయత్నమును నేను మానుకొందును. నీ హృదయము నా తలంపును మృదుమధురదీప్తభాషలో కూర్చును గాక. ఈరాత్రి దేవుడు నీతోనుండి లనుగ్రహించును గాక.

నీ భక్తమిత్రము,
**వివేకానంద.**

మలిమాట : అక్టోబరు 29 వ తేది మేము పారిసునుండి వియెన్నాకు తరలుదుము. పైవారము శ్రీమతి లెగ్గెట్టు అమెరికా సంయుక్తరాష్ట్రములకు బయలు దేఱుచున్నది. మేము మా జాబులను మేమిక చేరగలచోటికి పంపుమని పోస్టు ఆఫీసుకు తెలిపెదము.

**వి.**

## 514

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

పోర్టు ట్యూఫిక్,
నవంబరు 26, 1900.

ప్రియ జో,

స్టీమరుకు ఆలస్యమైనది. కావున నేను కాచుకొనియున్నాను. మంచితనమునకు దండము! అది పోర్టుసెడ్ వద్ద ఈయుదయము కాలువలో ప్రవేశించినది. అనగా, అంతయు రిసగా జరిగిన, అది సాయంకాలమున ఎప్పుడో ఒకప్పుడు తప్పక ఇక్కడికి చేరగలదని అర్థము.

ఈ రెండుదినాలును ఒంటరిగా ఖైదిగా పడియుండుట వంటిదే లెమ్ము. నేను ఎంతయో ఓపికతో నా యాత్మను నిలుపుకొని యున్నాను.

అయినను వారు మార్పును త్రిగుణముగా ప్రియమనుచున్నారు. శ్రీ గేజుయొక్క ప్రతినిధి నాకన్నియు తప్పు సూచనలే చేసినాడు. అన్నిటికి మొదటిసంగతి ఏమనగా, ఇక్కడ నాకు ఏ సంగతి చెప్పుటకును ఎవ్వరును లేకపోయిరి. ఇక నాకు స్వాగతి మిడుట అటుండనీ. రండవసంగతి ఏమనగా, నాకు గేజు ఇచ్చిన టిక్కెట్టును స్టీమరు టిక్కెట్టుగా ఏజంటుగారి కచ్చేరిలో మార్చుకొనవలయును అని ఎవ్వరును చెప్పరైరి. అది యెక్కడ? ఇక్కడ గాదు. సూయెజులో.

అది యొకవిధముగా మేలే ఐనది. కావుననే స్టీమరు ఆలస్యముగా వచ్చినది. కావున నేను స్టీమరు ఏజెంటును చూడబోయితిని. అతడు గేజు ఇచ్చిన పాసును సరియైన 'టిక్కెట్టు'గా మార్చుకొమ్మని నాతో చెప్పినాడు.

నేను ఈరాత్రి ఏదో ఒకవేళకు స్టీమరు ఎక్కగలనని అనుకొనుచున్నాను. నేను క్షేమముగా సుఖముగా ఉన్నాను. తమాషాను మిక్కిలిగా అనుభవించుచున్నాను.

మాడెమాయిసెల్లి యెట్లున్నది? బాయిస్ ఎక్కడ ఉన్నాడు? నా శాశ్వతమగు కృతజ్ఞతను శ్రేయోభిలాషలను శ్రీమతి కాల్వేకు అందింపుము. ఆమె మంచి దొరసాని.

నీ ప్రయాణము నీకు ఆనందముగా నుండవలయునని కోరుచుందు,

సదా భవదీయ ప్రేమయుత,

వివేకానంద.

## 515

(కుమారి జోసెఫైను మెక్లియదుకు)

మఠము, బేలూరు,
డిసెంబరు 11, 1900.

ప్రియ జో,

నేను మొన్న రాత్రి చేరితిని. అయ్యో, నా తొందర ఏమియు ఉపయోగము లేకపోయెను.

పాపము, కెప్టన్ సేవియరు కొన్నాళ్ళక్రింద చనిపోయెను. ఇట్లు ఇరువురు గొప్ప ఇంగ్లీషువారు మాకోసము ప్రాణాలు వదలినారు. మాకోసము అనగా హిందువులకోసము. మతమునకై ప్రాణాలు కోలుపోవుట యనగా ఇది గాకున్న, మఱి యేది? ఇపుడే ఆయన భార్యకు, ఆమె చేసికొన్న నిశ్చయ మెఱుగుటకై జాబు వ్రాసితిని.

నేను క్షేమముగా ఉన్నాను. ఇక్కడ అన్నివిషయములు బాగున్నవి. అన్నివిధాల బాగే. ఈ తొందరను క్షమింపుము. త్వరలోనే పెద్దజాబు వ్రాసెదను.

పరమార్థమున భవదీయుడను,
వివేకానంద.

## 516

(శ్రీమతి ఓల్బుల్సతికి)

మఠము, బేలూరు,
హౌరా జిల్లా, బెంగాలు, ఇండియా,
డిసెంబరు 15, 1900.

నా ప్రియ మాతా,

నేను మూడుదినములక్రింద ఇచటికి చేరితిని. ఈ నా రాక బొత్తిగా అప్రతీక్షితము కావున ప్రతివాడు చాల ఆశ్చర్యపడినాడు.

నా పరోక్షమున ఇక్కడ ఎట్లుండునని ఎంచితినో అంతకన్నను బాగుగా జరిగిపోయినది. సేవియరు చనిపోవుట, ఒక్కటియే అప్రియము. నిజముగా అది పెద్ద పెట్టు. హిమాలయములలో పని ఇక భవిష్యత్తున ఎట్లో నాకు తెలియదు. నేను ప్రతిదినమును సేవియరు

భార్యవద్దనుండి జాబును ఎదురుచూచుచున్నాను. ఆమె ఇంకను అక్కడనే ఉన్నది.

నీ వెట్లున్నావు? ఎక్కడ ఉన్నావు? ఇక్కడ నా సంగతు లన్నియు త్వరలో చక్కబడగలవు. అట్లని నేను అనుకొనుచున్నాను. వానిని చక్కబెట్టుటకు నాచేతనైనంతగా ప్రయత్నించుచున్నాను.

నామేనబంధువునకు నీవు పంపు పైకము ఇకమీదట నాకే పంపుచుండవలయును. బిల్లులు నాపేరనే యుండవలయును. నేను వానిని రొక్కముగా మార్చి ఆమెకు పైకము పంపెదను. పైకము ఆమెకు నాద్వారా చేరుట శ్రేయము.

శారదానందునికిని బ్రహ్మానందునికిని చాల నయముగా నున్నది. ఈసంవత్సరము ఇక్కడ మలేరియా చాల తక్కువగా నున్నది. నదీతీరమున ఈ సన్నని ప్రదేశమున ఎప్పుడును మలేరియా లేకయే యుండును. నిర్మలోదకము సమృద్ధిగా వచ్చునేని ఇక్కడి స్థితులు పూర్తిగా బాగుపడును.

వివేకానంద.

## 517

(సోదరి నివేదితకు)

మఠము, బేలూరు, హౌరా,
డిసెంబరు 19, 1900.

ప్రియ నివేదితా,

ఇన్ని ఖండములమీదుగా నాగొంతును వినిపించుచున్నాను. నీవు క్షేమమేగదా? నీకు ఆశ్చర్యముగా లేదా? నేను నిజముగా దారిలోని పక్షిని.

ఉల్లాసముగాను, వ్యాపారముతో కిటకిటలాడుచునుండు ఆ పారిసు భయంకరముగాను ప్రాతగిల్లియు నుండు కాన్‌స్టాంటినోపులు తళతళమను చిన్న ఆథెన్సు, సూచ్యగ్రస్తంభాల కైరో, అన్నియు వెనుక పడిపోయినవి. ఇపుడు ఇక్కడ గంగయొడ్డున మఠములో నాగదిలో కూర్చుండి వ్రాయుచున్నాను. ఇక్కడ చాల నిశ్శబ్దము

గాను ప్రశాంతముగాను ఉన్నది! విశాలమైన నది పళపళమను ఎండలో నాట్యమాడుచున్నది. ఎప్పుడైనను ఏగో సామానుల పడవ, అడ్డనీళ్ళయప్పళింతలతో ఆనిశ్శబ్దతను చీల్చు చుండును. ఇక్కడ ఇపుడు చలికాలము. ఐనను ప్రతిదినము మధ్యాహ్నము వెచ్చగాను ప్రకాశముగాను ఉన్నది. ఈచలికాలము దక్షిణకాలిఫోర్నియా చలికాలమువంటిది. ప్రతిదియు ఆకుపచ్చగాను బంగరు పచ్చగాను ఉన్నది. గడ్డిమెత్తగా మొకమలువలె నున్నది. అయినను గాలి చల్లగాను లతినవముగాను ఆహ్లాదకరముగాను ఉన్నది.

భవదీయేత్యాది,
**వివేకానంద.**

## 518

(శ్రీమతి మృణాళినీ బోసుకు)

దేవగడము, వైద్యనాథము.
డిసంబరు 23, 1900.

అమ్మా,

"స ఈశ అనిర్వచనీయ ప్రేమస్వరూపః" "ఈశ్వరుడు ఇట్టి దట్టి దనరాని ప్రేమస్వరూపుడు" నారదుడు పేర్కొన్న 'భగవద్గుణము స్పష్టమనియు అందఱు నంగీకరించునదనియు నా జీవిత దృఢవిశ్వాసము. పెక్కండ్రు వ్యక్తుల సమూహమును సమష్టి అందురు. ఒకొక్కవ్యక్తిని వ్యష్టి అందురు. నీవు నేను—ఒకొక్కక్కరము వ్యష్టియే. సంఘము సమష్టి. నీవు నేను ఒకజంతువు ఒకపక్షి ఒకక్రిమి ఒకకీటము ఒకవృక్షము ఒకలత ఒకభూమి ఒకగ్రహము ఒకనక్షత్రము ఒకొక్కక్కటియు వ్యష్టి, విశ్వము సమష్టి. దానిని వేదాంతులు విరాట్ అనియు హిరణ్యగర్భుడు అనియు ఈశ్వరుడు అనియు వ్యవహరింతురు. దానినే పురాణములలో బ్రహ్మ విష్ణువు దేవి మున్నగు పేర్లతో నిర్దేశింతురు. వ్యష్టికి స్వేచ్ఛ ఉన్నదా, లేదా? ఉన్నచో అది ఏపాటి స్వేచ్ఛ! సమష్టి సుఖమునకై వ్యష్టివ్య

తన యీప్సితమును పూర్తిగా వదలుకొనవలయునా, వలదా ఇవి ప్రతి సంఘములోను ఉన్న సమస్యలు. ఈ సమస్యలకు పరిష్కారములను కనుగొనుటయందే సంఘము సర్వత్ర వ్యగ్రమై యున్నది. ఇవి పెద్ద తరంగములవలె నేటి పాశ్చాత్యసంఘమును ఉత్పాత లూపుచున్నవి. సంఘప్రభుత్వమునకై వ్యక్తిస్వేచ్ఛ బలి కావలయునని చెప్పు సిద్ధాంతమునకు ప్రజాసామ్యవాదము (సోషలిజము) అని పేరు. వ్యక్తిస్వేచ్ఛను పక్షీకరించు సిద్ధాంతమునకు వ్యక్తివాదము (ఇండివిడ్యువలిజము) అని పేరు.

వ్యక్తి సదా సంఘపరాధీనుడై ఉండుటచేతను నియమములకు సంస్థలకు దాసుడై స్వార్థత్యాగము చేయుటచేతను ఏ ఫలితములు లాభనష్టములు కలుగునో తెలుపు సముజ్జ్వలోదాహరణము మన మాతృదేశమే. మన దేశమున మానవులు శాస్త్రనియమానుసారమే పుట్టువొందుదురు. బ్రతికినన్నినాళ్ళు అన్నపానములను సైతము నియమ పరాధీనులై చేయుచుందురు. వివాహాది కార్యములను కూడ అట్లే కావించుచుందురు. ఇంతేందులకు? వారు మరణించుటకూడ శాస్త్రనియమానుసారమే. ఈ నియమబద్ధత కష్టము. దీనివలన గొప్ప మేలొక్కటియున్నది. అది తప్ప తక్కినదెల్ల చెడుగే. ఆ మేలు ఇది:- జనులు ఒకటిరెండు పనులను శ్రమపడకే చాలచక్కగ చేయగలిగియుందురు. ఏలయన, ఆపనులు తరతరములుగా నిత్యాభ్యాసమున నుండును. ఒక మట్టిపొయ్యి కొన్ని కట్టెలు - ఉన్న చాలును. ఈ దేశమందలి వంటవాడు మిక్కిలి రుచ్యములైన అన్నమును కూరలను తయారుచేయగలడు. అట్టిది వేఱెచ్చటను లభింపదు. సాలెమగ్గము ప్రళకాలమునకు మునుపటిది అనుకోదగినంత ప్రాతది. అది సరళమైన యంత్రవిశేషము, దాని వెల ఒకరూపాయి. దాని అడుగు ఒకపల్లమున నెలకొల్పబడియుండును. దానితో గజము ఇరువదిరూపాయలు వెలచేయగల సిల్కును నేయుట అనుపని ఈదేశములో మాత్రమే శక్యమగును. ఒకచింపి చాప ఒకమట్టి ప్రమిద దీపము దాని కాముదము—ఇట్టి పరికరముల

తోడ్పాటుతో మహాద్భుత పండితులు ఈ దేశములో మాత్రమే తయారగుచుందురు. పత్ని ఎంత రూపహీనయైనను, వెగటు కొల్పునదైన కావచ్చును. అంతటిని ఓర్చుకొను ఏకపత్నీవ్రతమును; భర్త కాసుచేయనివాడైనను పరమ దుర్మార్గుడైనను అతనిపట్ల భార్యకు యావజ్జీవ భక్తియు - ఇవి ఈ దేశములో మాత్రమే సాధ్యములు, ఇంతవఱకు నిది మేలిమి.

కాని వీని నన్నిటిని చేయు ప్రజలు నిర్జీవయంత్రములవలె నడపబడుచున్నారు. మనఃప్రవృత్తి లేదు, హృదయావిష్కారము లేదు, జీవిత స్పందనము లేదు. ఉప్పొంగు ఆశ లేదు, సంకల్పమును ప్రబలముగ ఉత్తేజపఱచున దేదియు లేదు. సూక్ష్మానందానుభవము లేదు, గాఢదుఃఖమును కలిగించుకొనుట లేదు. సృజనసమర్థమైన ప్రతిభావ్యాపారము లేదు, క్రొత్తవానియందు కోర్కె లేదు, మెప్పు లేదు. ఈ చిత్తమునుండి మేఘము లెన్నడును తొలగవు, ఉజ్జ్వలమైన ప్రభాతభానుచిత్రము ఈ హృదయము నెప్పుడును మరులు గొల్పదు. 'ఇంతకంటె మిన్నయైన దశ యొకటి ఉన్నదేమో'అను తలంపునైతము ఈ చిత్తమున ఎప్పుడును పుట్టదు. అట్టితలంపు పుట్టినను నచ్చదు, నచ్చినను ప్రయత్న ముండదు. ప్రయత్న మున్నను ఉత్సాహరహితత దానిని రూపుమాపును.

నియమబద్ధముగా జీవితము గడపుటచేతనే మేలిమి తప్పక కలుగునేని, తరతరములుగ వచ్చుచున్న ఆచార నియమములను తు.చ. తప్పక అనుసరించుటచే సుగుణమగునేని, చెప్పును, చెట్టును మించిన సాధు లెవరు? రైలుబండిని మించిన గొప్ప భక్తుడుగాని పవిత్ర తపస్విగాని ఎవరు? రాతిముక్క ప్రకృతి నియమమును అతిక్రమింపగా ఎవరైన చూచియున్నారా? పశువులు పాపములు చేయుచుండగా ఎవరైన చూచియున్నారా?

పెద్దపొగయోడ ప్రబలమైన రైల్వే ఇంజను వీనికి మతి లేదు. ఇవి కదలును తిరుగును పరుగిడును. కాని వీనికి మతిలేదు. దూరాన కననగు ఆ చిన్నకీటకము తన ప్రాణమును కాపాడుకొను

టకై రైలుపట్టాలనుండి తొలగిపోవుచున్నది. దానికి ఆ మతి ఏల కలిగినది? యంత్రములో సంకల్పావిష్కృతి కానేలేదు. నియమమును అతిక్రమింత మను కోర్కి యంత్రమునకు కలుగనేకలుగదు. కీటకము నియమమును ప్రతిఘటింప గోరును. ప్రతిఘటించును. నెగ్గనీ నెగ్గకపోనీ. కావున అది మతి కలదే. ఈ సంకల్పము ఎంత అమోఘముగ వ్యక్తమగునో సౌఖ్యమంత హెచ్చును. జీవుడు దానికి తగిన పై అంతస్థువా డగును. పరిపూర్ణముగ ఫలించు సంకల్పముకలవాడు దేవుడు. కావున దేవుడు పరాత్పరుడు.

విద్యయనగా నేమి? గ్రంథపాండిత్యమా? కాదు. వివిధమైన జ్ఞానమా? అదియు కాదు. సంకల్పప్రవాహమును ప్రకటనమును వశమందుంచుకొని ఫలింపజేయు శిక్షణమునకు విద్యయని పేరు. తరతరములుగ నిర్బంధముచే సంకల్పశక్తిని నిరంతరముగ అడ్డునదేదో దేనిచేత సంకల్పశక్తి ఇంచుమించు అంతరించిపోయినదో, దేనిచేత క్రొత్తభావములు చెప్పనేల? ప్రాతవి సైతము ఒకటివెంబడి నొకటిగా అదృశ్యమగుచున్నవో అది విద్యయా? ఆలోచింపుము. మానవుని క్రమక్రమముగ యంత్రముగా మార్చివేయునది విద్యయా? యంత్రమువలె ప్రవర్తించుచు సన్మార్గముననుండుటకంటె బుద్ధిచేత స్వతంత్ర సంకల్పముచేత ప్రేరేపింపబడి చెడుదారి పట్టుట సైతము మేలేయని నా యభిప్రాయము. ఎచ్చట మానవసమూహము మట్టిముద్దలవలెనో, నిర్జీవయంత్రములవలెనో, పేర్చిపెట్టబడినరాళ్ళవలెనో ఉండునో దానిని సంఘమనవచ్చునా? అట్టి సంఘమెట్లు మేలొందును? అట్టి స్థితిచేత మేలు సాధ్యమేని శతాబ్దులకొలది మనము బానిసలముగ నుండియుండము. భూమండలములో మనదేశము సర్వాధికమై యుండియుండెడిది, ఈ భారతభూమి మూఢత్వఖనిగా నుండక పాండిత్యమునకు నిత్యప్రభవమై యుండియుండెడిది.

మఱి 'నాకు ఏమియు వలదు' అనుకొనుట సుగుణము కాదా? పెక్కండ్రక్షేమమునకై ఒక్కడు తన సుఖమును త్యజించుట పరమ

ధర్మము కాదా? ధర్మమే, కాని "తోముటచేతను రాచుటచేతను అందమును తయారుచేయుట శక్యమా? నిర్బంధముచేతను ప్రయత్నముచేతను ప్రేమను పుట్టించుట శక్యమా" అని వంగభాషలో సామెత. నిత్యదరిద్రుడు 'నాకేమియు వలదు' అనుటలో ఏమి గొప్ప కలదు? ఇంద్రియశక్తి లేనివాని ఇంద్రియనిగ్రహములో గుణమేమున్నది? భావశూన్యుని హృదయశూన్యుని ఉన్నతాభీష్టశూన్యుని సంఘమనిన ఏమో ఎఱుగనివాని ఆత్మత్యాగము అనగా నేమి? విధవను నిర్బంధించి సహగమనము (సతి) చేయించుటచేత ఏమి పతిభక్తి ప్రకటమగును? మూఢవిశ్వాసములను కలిపి ప్రజలచే ధర్మకార్యములు చేయింపుటల? నేను చెప్పునదేమనగా సాధ్యమైనంతవఱకు ప్రజల సంకెళ్ళలను ్రెంచివేయుడు. స్వేచ్ఛ నిండు. మురికి మురికిని కడిగివేయగలదా? దాస్యము దాస్యమును తొలగింపగలదా? ఉదాహరణ మేదీ? సంఘము కొఱకు భోగాభిలాషను పూర్తిగా త్యజింపగల్గితివేని అపుడు నీవు శుద్ధదేవుడ వగుదువు, స్వతంత్రుడ వగుదువు. అది చాలదూరము. దానికి దారి హింసయేయని తలంతువా? "ఔరా, మన విధవలు స్వార్థత్యాగమునకు ఎట్టి ఉదాహరణములు! ఆహా! బాల్యవివాహము ఎంత మంచిది! అట్టి ఆచారము మఱియొకటి శక్యమా; అట్టి వివాహమున సతీపతులకు ప్రేమయే తప్ప వేఱేదైన నుండగలదా?"—ఈకాలమున సర్వత్ర వ్యాపించుచుండు ఘోష ఇది. ఇక మగవారా, వారు దొరలు. స్వార్థపరిత్యాగము వారి కక్కఱలేదు. పరసేవకంటె ఉన్నతధర్మ మొకటి కలదా? కాని ఇతరులకు సేవచేయుట ధర్మమనుట బ్రాహ్మణులకు మాత్రము లేదు. ఆసేవను బ్రాహ్మణేతరులారా, మీరు చేయుడు. నిజమిది. ఈదేశములో తల్లిదండ్రులును బంధువులును తమ బిడ్డలయు ఇతరులయు శ్రేయస్సును తమ స్వార్థమునకో సంఘముతో సమరసపడి తమ్ము కాపాడుకొనుటకో నిర్దయముగ బలి యీయగలరు. తరతరముల గావించిన తర్ఫీదు మనస్సును గట్టిపఱుపగా ఇట్టి ప్రవర్తన వారికి మంచినీళ్ల మర్యాదమైనది.

ధీరుడున్నాడే, అతడొక్కడే స్వార్థత్యాగము చేయగలవాడు. పిఱికిపంద క్రొఅద్దాలవేటుకు దద్దరిల్లి ఒకచేతితో కన్నులను తుడుచు కొనుచు రెండవచేతితో దానము చేయును. అట్టి దానమువలన ప్రయోజనమేమి? అది విశ్వప్రేమకు కడుదవ్వైన ముఖ. లేత మొలకకు కంచె యుండవలెను. దానిని జాగ్రత్తగా చూచుకొనల యును. దేనినైన నొకదానిని నిస్స్వార్థముగ ప్రేమింప నేర్చుకొన్న వానికి క్రమక్రమముగా విశ్వప్రేమ అలవడున నెడి ఆసపాటుకలదు. ఒక యిష్టదేవతయందు భక్తి కుదురునేని విశ్వవిరాన్మూర్తియందు భక్తి క్రమక్రమముగ సాధ్యమే.

కాబట్టి ఒక డింకొకనికై స్వార్థత్యాగము చేయగల్గిన పిమ్మట సంఘమునకై స్వార్థత్యాగమును చేయుటనుగూర్చి ప్రసంగింపవచ్చునే కాని అంతకుముందు మాత్రము కాదు. సకామ కర్మయే నిష్కామకర్మకు అందించును. ఆశఅనునది తొలుత నుండకున్న ఆశను త్యజించుట పొసగునా? దాని కర్థమేమి కాగలదు! చీకటిలేకున్న వెలుగున కొక అర్థముండగలదా?

సంగము కలిగి కోర్కెతో కావించు ఉపాసనము మొదటి మెట్టు. చిన్నదాని ఉపాసనమును ప్రారంభింపుము. పిమ్మట పెద్దది తనంతవచ్చును.

అమ్మా, వ్యాకులపడకుము. గాలిదెబ్బ పెద్దవృక్షములకే తగులును. "చిదుగులు కదల్చిన నిప్పు మఱింతగా ప్రజ్వరిల్లును" "సర్పమును తలపై తన్నిన అది పడగనెత్తును" ఇట్లే మఱికొన్నియు. హృదయవ్యథ కలిగినప్పుడు దుఃఖపు తుపాను నలువంకల విజృంభించినప్పుడు వెలుతురు ఇక దుర్లభమే యనిపించినప్పుడు, ఆసపాటును ధైర్యమును ఇంచుమించు అంతరించినప్పుడు—ఆ యాధ్యాత్మిక మహాప్రళయవర్షమధ్యమున, లోపలినుండి బ్రహ్మజ్యోతి ప్రకాశించును. భోగములతోనే పెరిగి, హంసతూలికాతల్పములపైనే శయనించి, కన్నీరుకార్చియే ఎఱుగనివాఁడెవడైన, ఎప్పుడైన గొప్పవాడాయెనా! తనలోని బ్రహ్మమును సాక్షాత్కరించుకొనెనా? ఏడ్చు

టకు జంకుడు రేల? ఏడ్వుడు. ఏడ్పు కన్నులను కడిగి సహజజ్ఞానము నావిష్కరించును. అప్పుడు నరుడు మృగము వృక్షము ఇత్యాదిగా కననగు వైవిధ్యము మెల్లగ కరగిపోయి ఎల్లెడల ప్రతిదానియందును అఖండ బ్రహ్మసాక్షాత్కారమునకు దారిచేయును. అప్పుడు—

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
న హిన స్త్యాత్మ నాత్మానమ్ తతో యాతి పరాంగతిమ్.

ఒక్క డే ఈశ్వరుడు. సర్వత్ర సమానముగ సమవస్థితుడై యుండుటను సాక్షాత్కరించుకొన్న వాడు ఆత్మచేత ఆత్మను హింసింపడు; ఉత్కృష్టమైన గతిని పొందును.

భవదీయ శుభాకాంక్షి
వివేకానంద.

## 519

(కుమారి జోసెఫైన్మెక్లియాడుకు)

మఠము, బేలూరు, హౌరా,
డిసెంబరు 26, 1900.

ప్రియ జో,

ఈ తపాలులో నీజాబును దానితోకూడ నున్న అమ్మజాబును కుమారి ఆల్బెర్టాజాబును చేరినవి. ఆల్బెర్టాయొక్క విద్వన్మిత్రము రష్యానుగూర్చి చెప్పునది చాలవఱకు నేను సొంతముగా తలంచునదే. హిందూజాతిని రష్యనులవలె పరిణమింపజేయుట సాధ్యమా అను ఒక్క భావనాక్లేశము మాత్రము ఉన్నది.

నేను ఇక్కడికి చేరకముందే ప్రియుడు శ్రీ సేవియరు చనిపోయినాడు. అతని యాశ్రమము ప్రక్క నే పాఱుచుండు ఏటిగట్టున అతడు మంచిహిందువువలె, పూలహారములతో కప్పబడి, బ్రాహ్మణులచే మోసికొనిపోబడి, బాలురు వేదపారాయణము చేయుచుండగా దహనము చేయబడెను.

మనమతమునకై అప్పుడే ఇరువురు ప్రాణములు కోలుపోయినారు. దానిచేత నా ప్రియమును ప్రాచీనమునగు ఇంగ్లండుపైనను దాని పిరసంతతిపైనను నా కెంతో ప్రేమ కలిగియున్నది. అమ్మ

భవిష్యదిండియా యను మొక్కకు ఇంగ్లండుయొక్క శ్రేష్ఠరక్త మను నీరుపోయుచున్నది. జయము అమ్మకు!

ప్రియ (శ్రీ) సేవియరు సతి శాంతముగా నున్నది. ఆమె నాకు పారిసు విలాసమునకు వ్రాసిన జాబు వెనుతిరిగి ఈదినము తపాలులో నాకు చేరినది. నేను రేపు ఆమెను చూడబోవుచున్నాను. దేవుడు ఆమెకు ఆ ప్రియధీరాత్మకు, ఆనందమొసంగును గాక!

నేను శాంతముగాను దృఢముగాను ఉన్నాను. ఏసమయ మునను ఇప్పటికి నేను అధైర్యపడలేదు. అమ్మ నన్ను ఇప్పుడును అధైర్యపడనీయదు.

ఇక్కడ చాల ఉల్లాసకరముగా ఉన్నది. ఇప్పుడు ఇక్కడ చలికాలము. హిమాలయములు అనాచ్ఛాదిత ప్రకాశములగు మంచులతో ఇంకను చాల రమణీయముగా నుండును.

న్యూయార్కునుండి బయలుదేరిన ఆ యువకుడు (శ్రీ) జాన్సన్ బ్రహ్మచర్యవ్రతము పూనినాడు, ఇప్పుడు మాయావతిలో ఉన్నాడు.

పైకమును మరమున శారదానందునికి పంపుము, ఏలన నేను ఇక్కడ ఉండక కొండలకు పోవుదును.

వారు శక్తికొలది చక్కగానే పనిచేసినారు. నేను సంతో షించుచున్నాను. నరముల దుర్బలతచే చిరాకుచెందిన నేను వట్టి మూర్ఖుడనని నాకు తోచుచున్నది.

వారు ఎప్పటివలె మంచిగను, విశ్వాసపూర్ణులుగనుఉన్నారు. మంచిఆరోగ్యము కలిగియు ఉన్నారు. ఇదంతయు శ్రీమతి బుల్సుకి వ్రాయుము. ఎప్పుడును ఒప్పు ఆమెదేయనియు తప్పు నాదేయనియు అందులకై నేను ఆమెను నూఱువేలక్షమాపణలు అడుగుకొందు ననియు ఆమెతో చెప్పుము.

ఆమెకును ఎమ్—కును ప్రేమసముద్రములు.

గీ॥ వెనుదిరిగి చూతుఁ జూతు ముందునకు; నాకు
నంతయును బాగుగా నున్నయటులె తోఁచు;
గాఢతమ దుఃఖములఁ గుందు కాలమునను
వాని కాత్మగ నొకజ్యోతి వరలుచుండు.

సకలప్రేమయు ఎమ్ కు, శ్రీమతి సి—కి, ప్రియ జ.బి.—కి, ప్రియ జో, నీకును, ప్రణామములు.

వివేకానంద.

## 520

(రామకృష్ణానందస్వామికి)

మఠము, బేలూరు.
డిసెంబరు 26, 1900.

ప్రియ శశీ,

నాకు నీజాబువలన అన్నిసమాచారములును తెలిసినవి. నీకు ఆరోగ్యము బాగులేకున్న నీవు ఇచటికి రాగూడదనుట నిజము. మఱియు నేను రేపు మాయావతికి పోవుచున్నాను. నేను అక్కడికి ఒకసారి పోవుట చాల ఆవశ్యకము.

అళసింగ ఇచటికి వచ్చునేని, అతడు నామరలిరాకను కను పెట్టుకొని యుండవలయును. ఇక్కడివారు కానాయిని గూర్చి ఏమి తీర్మానించుచున్నారో నే నెఱుగను. నేను త్వరలో అల్మోడాలో నుండి మరలుదును. తర్వాత నేను మదరాసుకు పోవజాలియుండ వచ్చును. వాణియంబాడినుండి నాకొక జాబు వచ్చినది. అక్కడి వారికి నాప్రేమను దీవనలను తెలుపుము, నా మదరాసుమార్గమున నేను తప్పక అక్కడదిగి వారిని చూతునని ఒకజవాబు వ్రాయుము. అందఱికి నాప్రేమను అందింపుము. అతిమాత్రముగా కష్టపడి పని చేయకుము. ఇక్కడ అంతయు బాగున్నది.

ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 521

(శ్రీమతి ఓల్బుల్సుకి)

ప్రబుద్ధభారత కార్యాలయము,
అద్వైతాశ్రమము.
మాయావతి (అల్మోడా మీదుగా)
కూమోను, హిమాలయములు,
జనవరి 6, 1901.

నా ప్రియజననీ,

నీద్వారా డాక్టరు బోసు పంపిన నాసదీయ మంత్రమునకు అనువాదమును ఇదె వెంటనే నీకు పంపుచున్నాను. దానిని సాధ్యమైనంత మూలానుగుణముగా చేయ ప్రయత్నించితిని.

డాక్టరు బోసు ఇప్పటికి తన పూర్తియారోగ్యమును మరల పొందినాడని తలంతును.

సేవియరుసతి ధీరురాలు. తన భర్తృవియోగమును ధైర్యముగాను నెమ్మదిగాను భరించినది. ఆమె ఏప్రిలులో ఇంగ్లండుకు వచ్చుచున్నది. అప్పుడు ఆమెతో నేనును వచ్చుచున్నాను.

నేను ఇంగ్లండుకు ఈ వేసవిలో సాధ్యమైనంత త్వరగా రావలయును. ఆమెయు తన పతి వ్యవహారములు విచారించుకొనుటకు రావలసియున్నది. కావున నేను ఆమెతో కూడ వత్తును.

ఈచోటు మిక్కిలియు రమణీయముగా నున్నది. వారు దానిని మఱియు దివ్యరమణీయము చేసినారు. ఇదియొక విశాలమైన చోటు, పెక్కు ఎకరాల విస్తృతి గలది, చక్కగా అమర్పబడియున్నది. సేవియరుసతి భవిష్యత్తునను దానిని అట్లే యుంప సమర్థురాలై యుండునని నా ఆశ. ఆమె మిక్కిలిగా కోరునదియు అదియే లెమ్ము.

నాకు జోనద్దనుండి వచ్చిన కడపటి జాబు ఆమె శ్రీమతి శాల్వేతో కూడి—పైకి పోవుచున్నట్లు సమాచారము తెలిపినది.

మార్గట్ తన పాండిత్యమును భవిష్యత్ప్రయోజనమునకై విడిచిపెట్టుచున్నదని తెలిసినది. నాకు చాలసంతోషము. ఆమె

గ్రంథము ఇక్కడ చాల మెచ్చుకొనబడుచున్నది. అయినను దాని ప్రకాశకులు దాని యమ్మకమునకై ఏమియు ప్రయత్నము చేయు చున్నట్లు లేదు.

కలకత్తా తొలినాటిస్పర్శయే నాకు ఉబ్బసమును తిరుగ బెట్టినది. నేను అక్కడనున్న రెండువారములును ప్రతిరాత్రియు నాకు ఒక తాకుడు వచ్చుచుండినది. అయినను ఇక్కడ హిమాలయములలో నేను హాయిగా ఉన్నాను.

ఇక్కడ ఎక్కువగా మంచు కురియుచున్నది. దారిలో ఒక మంచువానలో నేను చిక్కుకొంటిని. అయినను చలి ఎక్కువగా లేదు. రెండుదినాలు మార్గమున ఆ మంచు నాకు బాగుగా తగిలి నందున, ఎంతో మేలుచేసినది.

ఈదినము నేను మంచులో ఒకమైలు కొండమీదికి సేవియరు సతి భూములను చూచుచు పోయితిని. ఆమె అంతటను చక్కని రస్తాలు వేసియున్నది. సమృద్ధిగా తోటలు, పొలాలు, పండ్ల చెట్ల తోపులు, పెద్ద అడవులు ఇవి అన్నియు ఆమె భూమిలో ఉన్నవి. కాపురపు ఇండ్లు చాల సామాన్యముగాను శుభ్రముగాను అందముగాను, తమ ప్రయోజనమునకు మిక్కిలి యనురూపముగాను ఉన్నవి.

నీవు త్వరలో అమరికాకు వెళ్లుదువా? వెళ్ళకున్న నేను ఇక మూడు నెలలలో నిన్ను లండనులో చూడగలను.

నా మంగళాశంసలను కుమారి బెల్కాక్కుకు అందింపుము. ఈసారి నీవు కుమారి ముల్లరును చూచినపుడు ఆమెకును, అట్లే స్టర్డికిని నా తఱుగని ప్రేమను దయతో అందింపుము. నేను మా యమ్మను మేనబంధువును ఇంకను కలకత్తాలోనున్న నా జనుల నంపఱిని చూచితిని.

నీవు నా మేనబంధువుకు పంపు పైకమును నాకు నాపేర పంపుము. నేను 'చెక్కు'ను రొక్కముగామార్చి ఆమెకు పైకము ఇచ్చెదను. శారదానందుడును బ్రహ్మానందుడును ఇతరులును నేను

వారిని కడపటినారి వీడ్కొన్నప్పుడు, మఠములో క్షేమముగా ఉండినారు.

ఇక్కడ అందఱును ప్రేమను అందించుచున్నారు.

సదా నీయందు ప్రేమగల కుమారుడు,

**వివేకానంద.**

మలిమాట – కాళి రెండు బలులు గ్రహించినది. మా మతముకై అప్పుడే ఇరువురు యూరోపియనులు తమ ప్రాణము విడిచినారు. ఇక నది దివ్యముగా అభివృద్ధి గనబోవుచున్నది.

**వి.**

కుమారి ఆల్బర్టాకును శ్రీమతి వాఘునుకును నా ప్రేమ.

మంచు చుట్టును ఆఱంగుళాల లోతుగా పడియున్నది. సూర్యుడు చాల ప్రకాశముగా దేదీప్యమానముగా ఉన్నాడు. ఇప్పుడు మధ్యాహ్నవేళ, మేము బయటకూర్చుండి చదువుకొనుచున్నాము. మాచుట్టును మంచు! ఇక్కడ ఇంత మంచుఉన్నను చలి చాల తక్కువే. గాలి పొడిగా పరిమళమయముగా ఉన్నది. జలమా, ప్రశంసాతీతము.

**వి.**

## 522

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

మాయావతి,
హిమాలయములు.
జనవరి 15, 1901.

నా ప్రియ స్టర్డీ,

నీవు నీచేత ఇంగ్లండులో పనికై ఉండిన పైకమును రు. 1,529 5-5 లను మఠమునకు పంపితివని శారదానందునివలన తెలిసినది. దానికి ఇక్కడ సద్వినియోగముగల్గునని నా నిశ్చయము.

కెప్టెన్ సేవియరు ఇంచుమించుగా మూడునెలలక్రిందట చనిపోయినాడు. వారు ఇక్కడ కొండలలో చాల మనోహరమైన స్థలమును ఏర్పఱుచుకొన్నారు. ఆయనభార్య దానిని తమకే ఉంచు

కొనవలయునని అభిప్రాయపడుచున్నది. నేను ఆమెను చూచుటకు వచ్చియున్నాను. సాధ్యపడునేని నేను ఆమెతో ఇంగ్లండునకుకూడ రావచ్చును.

నేను నీకు పారిసునుండి ఒకజాబు వ్రాసితిని. అది నీకు చేర లేదేమో అని శంక కలుగుచున్నది.

శ్రీమతి స్టర్జీ చనిపోయినదని తెలిసినందులకు చాల దుఃఖపడుచున్నాను. సతులలోనేమి తల్లులలోనేమి ఆమె అత్యుత్తమురాలుగ నుండెను. ఈజీవితమున అట్టివారి సమాగమము సాధారణముగా దుర్లభము.

ఈజీవితమున ఆకస్మికాఘాతములు నిండుగ నుండును. దాని ఫలములు ఎట్లో కడచిపోవును. అదే ఆశ.

క్రిందటి జాబులో నీవు నీ అభిప్రాయమును ధారాళముగా తెలిపినందులకు కాదు నేను నీకు జాబువ్రాయుట నిలిపివేసినది. నా వాడుకచొప్పున ఆయలను దాటిపోనిచ్చితిని. జాబులు చిన్న బుడగను అలగా చేసియుండును.

శ్రీమతి జాన్సనును ఇతర మిత్రులను నీవు కలసికొందువేని దయచేసి వారికి నాయాదరమును ప్రేమను అందింపుము.

పరమార్థమున సదాభవదీయ,
వివేకానంద.

## 523

(శ్రీమతి ఓల్బుల్సుతికి)

మఠము, బేలూరు,
హౌరాజిల్లా, బంగాలు,
జనవరి 26, 1901.

ప్రియ జననీ,

మిక్కిలి ఉత్సాహజనకములగు నీమాటలకు పెక్కు ధన్యవాదములు. అట్టి మాటల అక్కఱ నాకు ఇప్పుడు ఎంతేని కలదు. క్రొత్త శతాబ్ది యారంభముకాగానే ఆ చీకటి చెదరిపోలేదు. మఱింత దట్టమగుచున్నదనుట ప్రత్యక్షము. నేను మాయావతిలో

సేవియరుసతిని చూచుటకు పోయితిని. మార్గమున ఖేత్రీ మహా రాజుగారి యాకస్మికమరణము తెలియవచ్చినది. అతడు ఆగ్రాలో నొక ప్రాచీన జ్ఞాపికశిల్పమును తన ఖర్చున చక్క జేయించుచుండి పరీక్షార్థము ఒక గోపురముమీదికి ఎక్కెనట. ఆ గోపురములో కొంత కూలినదట. అతడు తత్క్షణమే మరణించినాడట.

మూడు 'చెక్కులును' చేరినవి. అవి నామేనబంధువునకు, ఈసారి నేను కలసికొన్నపుడు చేర్పగలను.

జో ఇక్కడ ఉన్నది. కాని నేను ఇంకను ఆమెను చూడలేదు.

నేను బంగాళములో ముఖ్యముగా మఠములో అడుగు మోప గానే, నాకు ఆ యుబ్బసపుముమ్మరము కలుగును! అటనుండి తరలి రాగానే, నాకిది మానిపోవును!

నేను పైవారము మాయమ్మను పుణ్యక్షేత్రయాత్రకు పిలుచుకొనిపోయెదను. క్షేత్రము లన్నియు చూచి మరలుటకు నెలలు పట్టును. హిందూవితంతువునకు ఇదియొక్కటే గొప్పకోరిక, నేను నా జీవితకాలమంతయు స్వజనమునకు దుఃఖమే కలిగించితిని. ఆమె యీ యొక్కకోరికనైనను నేను తీర్పవలయునని ప్రయత్నించుచున్నాను.

నేను మార్గట్‌నుగూర్చినదంతయు ఎఱిగి చాల సంతోషించు చున్నాను. ఇక్కడ ప్రతియొక్కడును ఆమె మరల రావలయునని ఆమెకు స్వాగతమిడవలెనని ఆత్రపడుచున్నాడు.

డాక్టరుబోసు ఇప్పటికి పూర్తిగా స్వస్థత చెందియుండు నని యనుకొనుచున్నాను.

నాకు శ్రీమతి హామ్మండువద్దనుండియు ఒక చక్కనిజాబు వచ్చినది. ఆమె మహాత్మురాలు.

ఎట్లయినను నేను ఈసారి చాలనెమ్మదిగాను, ధైర్యము గాను ఉన్నాను. అన్నియు ఎన్నడైన నేననుకొన్నదానికంటెను మేలైనస్థితిలోనే కననగుచున్నవి.

సర్వప్రేమతో, సదా భవదీయతనయుడు,

వివేకానంద.

## 524

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

మఠము, బేలూరు.

నా ప్రియ శశీ,

నేను మా అమ్మతో రామేశ్వరము పోవుచున్నాను. అంతే. నేను అసలు మదరాసుకు వత్తునా అనుసంగతి, ఎఱుగను. వత్తునేని, అది కేవలము నాసొంతపనికి. నాశరీరమును చిత్తమును పూర్తిగా అలసియున్నవి. ఒక్క నిషాణైనను నాకిప్పుడసహ్యాము. నాకు ఎవ్వరును అక్కఱ లేదు. ఎవరినిగాని నాతో కొనిపోవుటకు వలయు బలముగాని, డబ్బుగాని, సంకల్పముగాని, ఇష్టముగాని నాకు లేదు. గురుమహారాజభక్తులు కానీ కాకపోనీ, దానితో పని లేదు. నీవు అట్టిప్రశ్న అడుగుట కూడ చాల తెలివితక్కువయే. మరల ఒక మాఱు నీకు చెప్పుచున్నాను. నేను సజీవుడననుటకంటె నిర్జీవుడ ననుటలెస్స. ఎవరినిగాని నేను చూడనేచూడను. ఇట్లు నీవు నిర్వహింపజాలవేని, నేను మదరాసుకు రాను. నాదేహమును కాపాడుకొనుటకై నేనించుక స్వార్థపరుడను కావలసియున్నది.

యోగిన్మాయు ఇతరులును వారిదారిని వారు పోవచ్చును. ఇప్పుడు నాయారోగ్యము ఉన్నస్థితిలో నేను ఎవరి పొత్తును అంగీకరింపను.

ప్రేమలో నీవాడను,

**వివేకానంద.**

## 525

(శ్రీమతి ఓల్బుల్సతికి)

మఠము, బేలూరు,
హౌరాజిల్లా, బెంగాలు,
ఫిబ్రవరి 2, 1900.

నా ప్రియ జననీ,

మెక్కదినాలక్రింద నాకు రు 150 ల 'చెక్కు'తో కూడిన నీజాబు చేరినది. దీనికి ముందు పంపిన మూడు 'చెక్కు'లను నా మేనబంధువునకు ఇచ్చితిని కావున ఇపుడు దీనిని చింపివేసెదను.

జో ఇక్కడ ఉన్నది. నేను ఆమెను రెండుసార్లు చూచితిని. ఆమె దర్శనములుచేయు పనిలో మునిగి యున్నది. సేవియరుసతి ఇంగ్లండుకు పోవుచు త్వరలో ఇక్కడికి వచ్చు నని ఎదురుసూడ బడుచున్నది. నేను ఆమెతోకూడ ఇంగ్లండుకు పోవలయు నని కాచి యుంటిని. కాని, ఇపుడు ఏర్పడిన సందర్భములో నేను మాయమ్మతో కూడ సుదీర్ఘమగు పుణ్యక్షేత్రయాత్ర పోవలసియున్నది.

బంగాళమున అడుగుమోపినక్షణముననే నాయారోగ్యము చెడిపోవును. ఎట్లైనను, నేను దానిని ఇపుడు అంతగా లక్ష్యపెట్టను. నేను ఇపుడు కులాసాగానే ఉన్నాను, ఇక నా వ్యవహారములును సుస్థితియందే ఉన్నవి.

మార్గట్ విజయమును వింటిని సంతోషించితిని. అయినను అది యంతగా ధనలాభము కలిగించునదిగా లేదు. అదియే వచ్చిన సంకటము అని జో చెప్పుచున్నది. అట్లే కొనసాగించుచు ఉండుట అంత లాభకరము గాదు. లండనునుండి కుయి కలకత్తాకు చెవి కందదు. సరి, అమ్మ మెఱుగును. అందఱును ''కాళిమాత'' అను మార్గట్ గ్రంథమును మెచ్చుకొనుచున్నారు. అయ్యో, వారికి కొనుటకు ఒకపుస్తకముకూడ దొరకక ఉన్నది! పుస్తకముల అమ్ము అంగడివారు ఆ పుస్తకము అమ్మకము విషయమున అక్కఱ వహించి దానిని వృద్ధిచేయక ఉదాసీనముగా ఉన్నారు.

ఈ పుట్టినక్రొత్తశతాబ్ది నిన్ను నీస్వజనమును దివ్యమైన ఆరోగ్యమునను ఇంతకన్న మంచిభవిష్యత్తుకైన సన్నాహమునను ఉంచును గాక యని నిరంతరము ప్రార్థించిన, ప్రార్థించుచున్న నీకొమారుడు,

వివేకానంద.

## 526

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

బేలూరు, మఠము,
జిల్లాహౌరా,
ఫిబ్రవరి 14, 1900.

నా ప్రియ జో,

బాయిసు కలకత్తాకు వచ్చుచున్నాడని వింటిని. నాకు చాల సంతోషము. అతనిని తత్క్షణమే మఠమునకు పంపుము. నేను ఇక్కడ ఉందును. శక్యమేని నేను అతనిని ఇక్కడ కొన్నాళ్ళు ఉంచుకొందును. తరువాత మరల నేపాళమునకు పోవనిత్తును.

భవదీయేత్యాది,
వివేకానంద.

## 527

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

మఠము, బేలూరు,
హౌరా, బంగాలు,
ఫిబ్రవరి 17, 1901.

ప్రియ జో,

నీచక్కని దీర్ఘ లేఖ ఇప్పుడే వచ్చినది. నీవు కుమారి కార్నీలియా సోరాబ్జీని కలసికొన్నందులకును అంగీకరించినందులకును నాకెంతో సంతోషము. పూనాలోనున్న ఆమె తండ్రియు, అమెరికాలోనున్న ఆమె చెల్లెలును నాకు పరిచితులే. ఒకవేళ ఆమెతల్లికి నేను పూనాలో లిమ్డి ఠాకూరుసాహెబుతో ఉన్న సన్న్యాసిగా జ్ఞప్తియందుందు నేమో.

నీవు బరోడాకు పోయి మహారాణిని చూతువని యనుకొందును.

నా ఆరోగ్యము చాల మెఱుగుగా ఉన్నది. ఇట్లే కొంత కాలము ఉందునని నా ఆస. ఇప్పుడే నాకు సేవియరుసతివద్దనుండి ఒక చక్కనిజాబు వచ్చినది. అందులో ఆమె నిన్నుగూర్చి మంచి సంగతులు చాల వ్రాసియున్నది.

నీవు శ్రీటాటాను చూచినందుకును; ఆయన అంతదృఢము గాను బాగుగాను ఉండుటను పరికించినందుకును నాకు చాల సంతోషము.

నన్ను బొంబాయికి రమ్మన్న ఆహ్వానము వచ్చునేని, నాకు దార్ఢ్యము చాలియున్న ఆ యాహ్వానమును అంగీకరింతును లెమ్ము.

నీవు కొలంబోకు వెడలు స్టీమరుపేరు నాకు తప్పక తంతి ద్వారా తెలుపుము. సర్వప్రేమతో,

ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 528

**(శ్రీమతి ఓల్బుల్సతికి)**

ఢాకా.
మార్చి 29, 1901

నా ప్రియజననీ,

ఇప్పటికి నేను ఢాకానుండి వ్రాసిన మఱియొక చిన్నచీటి నీకు చేరియుండవలయును. శారదానందుడు కలకత్తాలో జ్వరము వలన మిక్కిలి బాధపడుచుండినాడు. ఈ సంవత్సరము కలకత్తా అచ్చము దయ్యాల నరకమయినది. అతనికి పూర్తిగా నయమై ఇపుడు మఠములో ఉన్నాడు. ప్రణామము దేవునికి! మఠము మా బంగాళమున ఆరోగ్యవత్తమములగుచోటులలో ఒకటి.

నీకును మాయమ్మకును ఏమి సంభాషణ జరిగెనో నే నెఱుగను. నేను అక్కడ లేను. మార్గరెట్‌ను చూడవలయునని ఆమెకు ఆత్రపుకోరిక యే, కాని అది మఱేమియు కాదు అని నేను అనుకొందును.

మార్గరెట్ తన పన్నకముల నన్నింటిని ఇంగ్లండులో పక్వము చేసికొని చాలవఱకు నిర్వహించి తరువాత మరలవలయును అని ఆమెకు నా సలహా. సుస్థిరసత్కార్యమునకు నిరీక్షణ మావశ్యకము.

శారదానందుడు తనకు బలము రెక్కొనగానే, కలకత్తాలో ఇన్నాళ్లు ఉండిపోయిన శ్రీమతి బెనర్జీ కడకు డార్జిలింగుకు పోవలయును అని అనుకొనుచున్నాడు.

జపానులోనున్న జోనుగూర్చి ఏమియు సమాచారము నాకు ఇంకను తెలియలేదు. తనప్రయాణము త్వరలో సాగునని సేవియరు సతి అనుకొనుచున్నది. ఇక్కడ బ్రహ్మపుత్రానదిలో పుష్కరముల సమయమైనందున మాయమ్మ అత్త, మేనబంధువును ఐదు దినాల క్రింద ఢాకాకు వచ్చినారు. చాల అరుదైనగ్రహముల యొకానొక కూటమి కలిగినపుడెల్లను చాల జనసమూహము నదిలో ఒక విశేష ఘట్టమందు కూడును. ఈసంవత్సరము కూడిన జనసంఖ్య లక్షకంటె నెక్కువే. మైళ్ళపర్యంతము నది పడవలతో కప్పబడియుండెను.

ఆనది ఆఘట్టమున ఇంచుమించుగా ఒకమైలువెడల్పుఉన్నను, అంతయు ఒక్కటే బురద మొత్తము! అయినను చాలినంత నిశ్చలముగా నున్నందున మేము మాస్నానము పూజ మొదలగునవెల్ల జరుపుకొంటిమి.

ఢాకావాసము నాకు భోగ్యముగనున్నది. నేను మాయమ్మను తక్కనస్త్రీలను బెంగాలు కట్టకడపటి తూర్పుమూలలోనున్న పుణ్యక్షేత్రమును చంద్రనాథ్‌కు, పిలుచుకొని పోబోవుచున్నాను.

నేను క్షేమముగానే ఉన్నాను. నీవు నీకూతురును, మార్గటును దివ్యమగు ఆరోగ్యము అనుభవించుచున్నారనుకొందును.

నిత్యప్రేమతో,

సదా భవదీయతనయుడు,

వివేకానంద.

మలిమాట:–మాయమ్మయు మేనబంధువును నీకును మార్గటుకును తమ ప్రేమను అందించుచున్నారు.

మలిమాట:–నాకు తేది తెలియదు.

వి.

## 529

(శ్రీ స్వరూపానందస్వామికి)

మఠము,
మే 15, 1901.

నా ప్రియస్వరూపా (నందా),

నీవు నైనిటాలునుండి వ్రాసిన జాబు మిక్కిలి ఉద్రేకము కలిగించునదిగా ఉన్నది. తూర్పు బంగాళేమునను అస్సామునను నా సంచారము ముగించుకొని ఇప్పుడే మరలివచ్చితిని. మామూలు ప్రకారము నేను చాల అలసియు క్రుంగియు ఉన్నాను.

బరోడా మహారాజు దర్శనముచేయుటవలన ఏమైనను కొంత నిజమగు మేలు కలుగునట్లున్న, నేను వచ్చుటకు సిద్ధముగానున్నాను. అట్లుగాకున్న ఆ దీర్ఘప్రయాణమునకు అగు వ్యయప్రయాసలు భరించుటకు నాకిష్టము లేదు. ఆవిషయమును చక్కగా ఆలోచింపుము. విచారణలు చేయుము, నీకు అప్పటికిని నేను వచ్చి ఆమహారాజును చూచుట మనపనికి మిక్కిలియు శ్రేష్ఠముగా నుండునను తలంపు ఉండునేని నాకు వ్రాయుము....

ప్రేమాశీస్సులతో,

భవదీయ,
వివేకానంద.

## 530

(కుమారి మేరీహేలుకు)

మఠము, బేలూరు.
హౌరాజిల్లా.
బెంగాలు, ఇండియా.
మే 18, 1901.

నా ప్రియమేరీ,

కొన్నిసమయములలో పెద్దపేరుగలవారి పాదరక్షాసూత్రములకు కట్టువడియుండుట చాలకష్టములకు కారణమగును. అదియే ఇపుడు నాజాబునకు సంభవించినది. జాబును నీవు 1901 జనవరి తే 22 ది వ్రాసితివి. నీవు నన్ను పెద్దపేరుగల యొకరి - అనగా

కుమారి మెక్లీయడు యొక్క పాదరక్షాసూత్రములకు అంటగట్టితివి. దాని ఫలముగా, ఆజాబు ఆమె వెంట పైకిక్రిందికి ప్రపంచమంతటను అనుసరించుచుండినది. ఇప్పుడు కుమారి మెక్లీయడు ఉన్న జపాను నుండి అది నిన్నటిదినము నాకు చేరినది. సరి, కాబట్టి ఇదే ఆ 'కింసింహాపు' విడికథయందలి కఠినప్రశ్నకు సమాధానము. ''నీ వెన్నడును ఒక పెద్దపేరును ఒక చిన్న పేరుతో ముడివేయరాదు''

కావున మేరీ, నీ విన్నాళ్లుగా ఫ్లారెన్సునను ఇటలీయందును హాయిగా ఉన్నావన్న మాట. నీవిప్పటికి ఎక్కడ ఉందువో నాకు తెలియదు. కావున ఓ బలిసిన ముసలి ''దొరసానీ'', నేను ఈ జాబును ''మన్రో అండ్ కో, 7 రుసై్క్రిబ్'' అను విలాసమువారి దయకు పాత్రము కమ్మని పోస్టులో వేయుచున్నాను.

ఇపుడు, ముసలి ''దొరసానీ'', నీవు ఫ్లారెన్సులోను ఇటలీ చెఱువులలోను కలలు గనుచుంటివి అన్నమాట. బళి! ఐనను అందు నీళ్లులేవే అని నీ 'కవి' ఆక్షేపించును.

మఱి భక్తిమతివైన ఓ సోదరీ, ఇక నాసంగతి యెట్లు? నేను ఇండియాకు కడచిన శరత్తులో వచ్చితిని. చలికాలమంతయు బాధ పడితిని. ఈ యెండకాలమున తూర్పు బంగాళమునను అస్సాము నను, మహానదులు కొండలు మన్నెజ్వరము గల చోటుల, సంచా రము చేయుచుండి, రెండునెలల దుర్భర కార్యభారముచే కృశించి, కలకత్తాకు మరలి, మెల్లగా ఆ గాసినుండి కోలుకొను చున్నాను.

కొన్ని నెలలక్రింద ఖేత్రిరాజు క్రిందపడి చనిపోయినాడు. కావున నిపుడు నా సమస్తవ్యవహారములును తమోగ్రస్తములై ఉన్నవి. నా యారోగ్యము చాల చెడియున్నది. అయినను నేను త్వరలోనే తేఱుకొనగలనని నా నమ్మకము. ఇకమీాద కలుగగల మార్పునకై కనుపెట్టుకొనియున్నాను.

ఇపుడు యూరపులోనుండి నీతో దీర్ఘకాలము సంభాషించి ఇండియాకు మరలిరాగల్గియుండరాదా అని కోరుదును. ఏలయన,

తుదకు ఈదినాలలో నాకొకమాదిరి నెమ్మది, తోచుచుండును. నా ఆరాటము ముప్పాతికవంతు తీఱిపోయినది.

హారియెట్టు ఉల్లీకి ఇసబెల్లుకు హారియెట్టుమెక్కిన్లికిని నా ప్రేమ. అమ్మకు నాశాశ్వత ప్రేమకృతజ్ఞతలు. హిందువుని సూక్ష్మ కృతజ్ఞత పెక్కు తరములవఱకు సాగుచునేఉండునని చెప్పుము.

సదా భవదీయభగవద్గత,
వివేకానంద.

మఱిమాట :—వ్రాయవలయునని నీకు తోచినపుడు, ఒకబంతి వ్రాయుము.

వి.

## 531

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

మఠము, బేలూరు.
జిల్లా హౌరా.
జూను 3, 1901.

నా ప్రియశశీ,

నీజాబు చదువుచున్నప్పుడు నాకు నవ్వువచ్చినది, అంతలో అధికవిచారమును గల్గినది. నీవు అజీర్ణముచేత కలగని, దానిని నిజమని నమ్మి దుఃఖము పొలగుట నవ్వుకు కారణము. దీనిచేత నీకు ఆరోగ్యము చెడియున్నదనియు నీనరములకు విశ్రాంతి చాల ఆవశ్యకముగా నున్నదనియు స్పష్టముగా తెలియుట విచారమునకు కారణము.

నేను నీకు ఎప్పుడును శాపము పెట్టలేదు. నేను ఇపుడు అట్లు ఏల చేయవలయును? నీ జీవితకాలమంతట నాకు నీయందు ఎట్టి ప్రేమయున్నదో నీ వెఱుగుదువు. మఱి నేడు దానిని సందేహించుచున్నావా? నిజముగా, నా కోపము ఎప్పుడును చెడ్డదే. మఱి ఈదినాలలో నాకు జబ్బు కారణముగా అది ఒక్కొక్కప్పుడు

భయంకర మగును. అయినను నీయందలి నా ప్రేమ ఒకనాటికిని నశించునది కాదు అని నీవు గట్టిగా నెఱుంగుము.

ఈదినాలలో నాయారోగ్యము కొంచెము బాగగుచున్నది. మదరాసులో వానలు ఆరంభించినవా? దక్షిణాన వానలు కొంచెము ఆరంభించినపుడు నేను బొంబాయి పూనాలమీాదుగా మదరాసుకు రావచ్చును. వానలు ఆరంభింపగానే, దక్షిణదేశపు తీక్ష్ణోష్ణము తగ్గిపోవచ్చును.

నీకును తక్కినయందఱికిని నా యత్యంతప్రేమ. నిన్న శరత్తు డార్జిలింగునుండి మఠమునకు మరలివచ్చినాడు. అతని యారోగ్యము మునుపటికంటె చాల మెఱుగుగా నున్నది. నేను తూర్పు బంగాళము అస్సాములలో సంచారముచేసి ఇచటికి మరలితిని. ప్రతిపనికిని పతనోత్పతనము లుండును. అది చుఱుకుగా సాగుకాలములును మందముగ సాగుకాలములును ఉండును. మరల అది పైకి రాక లదు. ఏమి భయము?

అది యేమేని యగునుగాక. నీవు కొంతకాలము పనిమాని, మఱి యెటునుపోక, తిన్నగా మఠమునకు రమ్ము. ఇక్కడ నీవొక్క నెల విశ్రాంతి పొందినతర్వాత, మన మిరువురము కలసి ఒక పెద్ద సంచారము గుజరాత్ బొంబాయి పూనా హైదరాబాదు మైసూరులమీాదుగా మదరాసుకు వెడలుదము. అది చాల వైభవముగా ఉండదా? ఇది నీవు చేయజాలవేని, మదరాసులో నీ యుపన్యాసములను ఒకనెలకాలము మానుము. మితముగా మంచి ఆహారము భుజింపుము. బాగుగా నిద్రపొమ్ము. ఇక రెండుమూడు నెలలలో నేను అక్కడికి రాగలను. ఎట్లైనను నీవు ఏమిచేయ తీర్మానించుకొందువో తత్క్షణము జవాబు వ్రాయుము.

ఆశీస్సులతో,

భవదీయ,

వివేకానంద.

# 532

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

మఠము, బేలూరు,

హౌరా జిల్లా,

జూను 14, 1901.

ప్రియ జో,

నీవు జపానును, విశేషముగా జపానువారి శిల్పమును చూచి, ఆనందించుచున్నావని నేను ఎంతో సంతోషించుచున్నాను. మేము జపానును చూచి అనేకవిషయములు నేర్చుకొనవలసియున్నదన్న నీమాట మిక్కిలియు సరి. జపాను మాకు చేయుసాయము ఎంతయో సానుభూతితోను గౌరవముతోను కూడియుండును. అట్లుగాక పాశ్చాత్యదేశము చేయగల సాయము సానుభూతిరహితముగాను నాశకరముగాను ఉండును. నిజముగా ఇండియా జపానులమధ్య ఒక సంబంధమును కుదుర్చుట చాల కోరతగినది.

నన్నుగూర్చి చెప్పెదను. నేను అస్సాములో ఆరోగ్యమును కోలుపోయితిని; పనికి అనర్హుడనై పోయితిని. మఠమునందలి వాతావరణము నాకు ఇప్పుడే కొంత ఆరోగ్యమును బలమును ఒసగుచున్నది. అస్సాములో షిల్లాంగు ఆరోగ్యకేంద్రము. అక్కడ నాకు జ్వరము తగిలినది. ఉబ్బసము వచ్చినది, మూత్రమున తెలుపు ఎక్కువమైనది. నా దేహము ఎప్పటికంటె రెండింతలుగా వాచి పోయినది. అయినను నేను మఠముచేరగానే ఈలక్షణములన్నియు అడగిపోయినవి. ఈ సంవత్సరము వేడి భయంకరముగా నున్నది. అయినను వాన రవంత ఆరంభమైనది. ఇక త్వరలోనే వానకారు గాలి ముమ్మరించు ననుకొందును. ప్రస్తుతమునకు నాకేమియు కార్యప్రణాళికలు లేవు. బొంబాయి రాజధాని నన్ను మిక్కిలి అక్కఱతో కోరుచున్నది. త్వరలో అక్కడికి పోవలయుననుకొనుచున్నాను. మేము బొంబాయిలో సంచారము ఇంచుమించు ఒక వారములో ఆరంభింపవలయునని అనుకొనుచున్నాము.

బెట్టి దొరసానిపంపినదని నీవు ప్రస్తావించిన మూడువందల డాలర్లు నాకింకను చేరలేదు. వచ్చునన్న సమాచారమయినను నాకు జెనరల్ పాటర్సనువలన తెలియలేదు.

పాపము, అతడు, తన ఆలుబిడ్డలు యూరపుకు తరలిపోయిన తరువాత ఒకమాదిరిగా దుఃఖితుడుగా నుండెను. నన్నువచ్చి తన్ను చూడుమనెను. మఱి, నాదౌర్భాగ్యము! నేను అంత జబ్బుపడితిని; పట్టణములోనికి పోవుటకు చాలభయముగా నున్నది. వానలు మొదలిడువఱకు కాచుకొనియుండవలసియున్నది.

ఇప్పుడు చూడు, ప్రియ జో, నేను జపానుకు పోవలయునేని ఈసారి, పనిసాగించుటకు, నాతో శారదానందుని పిలుచుకొని పోవుట ఆవశ్యకము. మఱియు శ్రీ మాక్సిము, వీహువాంగ్ చాంగ్ కు ఇత్తునన్న జాబు కూడ నాకు కావలయును. అయినను తక్కినది, అమ్మ యెఱుగును. నేనింకను ఏదియు తీర్మానించుకొనలేదు.

ఆలాగుగా? నీవు జోస్యము చెప్పువానిని చూడ అలస్కావన్నుకు పోయితివా? అతనిశక్తిలో నీకు నమ్మకము కలిగించినాడా అతడు? ఏమి చెప్పినాడు? నీకు ఇష్టమైనచో వివరములు వ్రాయుము.

జూలిస్ బాయిస్ లాహోరువఱకు పోయి, నేపాళము ప్రవేశింపబోగా చొరనీక అడ్డగింపబడినాడు. అతడు ఎండవేడి ఓర్వలేక జబ్బుపడినాడని పత్రికలవలన నాకు తెలియుచున్నది. తరువాత ఓడ యెక్కి మంచి సబురుపోయినాడు. మేము మఠములో కలసి కొన్న తరువాత అతడు నాకు ఒక్కబంతికూడ వ్రాయలేదు. శ్రీమతి బుల్సతిని నార్వేలోనుండి ఇంతదూరము జపానుకు లాగుటకు నీవును నిర్ణయించుకొంటివి. బళి, కుమారీ, నీవు నిస్సందేహముగా కడు సమర్థవగు ఐంద్రజాలికురాలివి! మంచిది, జో, ఆరోగ్యోత్సాహములు పూనియుండుము. అలస్కావనను నందలిమనుష్యుని మాటలు చాలవఱకు అన్నియు నిజముగా తార్కాణపడునవే. నీకు కీర్తి గౌరవములు కలుగనున్నవి, ముక్తియు, పెండ్లాడి పురుషునిపై ఆధారపడి ఉన్నతినందుదమనుట మగువకు సహజముగనుండు

కోరిక. కాని ఆదినములు పోయినవి. ఏపురుషునిసాయమును లేక నీవు ఉన్నదానవు ఉన్నట్లే, గొప్పదాన వగుదువు. ఏ కపటమెఱుగని, ప్రియజోవు, మాజోవు, ఎప్పటికి ఉండు జోవు...

మనకు ఈజీవితపు బుడగలను వేనినైనను లక్ష్యపెట్టుటకు చాలినంత యనుభవము కలదు. ఏమి లేదా మనకు జో? నెలలతరబడిగా నేను మనోభావముల నన్నిటిని తటిమివేయుటకు సాధన చేయుచున్నాను. కావున నేను ఇంతట నిలిపెదను. ఇప్పుడు ఇక నాకు సెలవు. మనము కలసి పనిచేయవలసినట్లు అమ్మ నిర్ణయము చేసియున్నది. అది ఇప్పటికే బహుజనులకు మేలొనగూర్చునదైనది. ఇంకను బహుతరజనులకు మేలొనగూర్చునది కాగలదు. అది అట్లే యుండ నిమ్ము. ప్రణాళికలు ఎగయుటలు వ్యర్థములు. అమ్మ తన సొంతదారి కనుగొనును ......... గట్టిగా నమ్మి యుండుము.

ప్రేమతో హృదయపూర్వకాశీస్సులతో,

సదా భవదీయ,

వివేకానంద.

మలిమాట :—ఇప్పుడే శ్రీ ఒకాకురవద్దనుండి 300/ రూపాయలకు "చెక్కు"ను ఆహ్వానమును వచ్చినవి. అది మిక్కిలి ఆసగొలుపుచునే ఉన్నది. అయినను అమ్మ యెఱుగును.

వి.

## 533

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

మఠము, బేలూరు,
జూను 18, 1901.

ప్రియ జో,

నీజాబుతో శ్రీ ఒకాకురపంపిన పైకము నాకు చేరినందుకు రసీదుచీటిని జతపఱచి నీకు పంపుచున్నాను. నీయుక్తులకు అన్నిటికిని నేను సంసిద్ధుడనే లెమ్ము.

ఎట్లయినను, వచ్చుటకు నేను నిజముగా ప్రయత్నించుచున్నాను. మఱి నీ వెఱుగుదువు. వచ్చుటకు ఒక నెల, మరలి వచ్చుటకు ఒక నెల, అక్కడ నుండుటకు కొన్నాళ్ళు! కానిమ్ము. నేను నాశక్తికొలది ప్రయత్నించుచున్నాను. మిక్కిలి అసంతుష్టికరమైన నాయారోగ్యము కొన్ని కోర్టువ్యవహారములు మొదలైన వానివలన కొంచెము జాగు కావచ్చును.

నిత్యప్రేమతో,
వివేకానంద.

## 534.

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

మఠము, బేలూరు,
హౌరా,
బంగాళము, ఇండియా.

ప్రియ జో,

నీపట్ల మిక్కుటమైన నా కృతజ్ఞతా ఋణమును భావనచేనైనను తీర్పజాలను. నీవు ఎక్కడ ఉన్నను నాశ్రేయమును మఱవవు. మఱి అక్కడను నీవు ఒక్కతెవె నా బరువులను జవాబుదారిని భరింతువు. (కోపమున) పశూచితములైన నా అఱపులను ఓర్చుకొందువు.

నీ జపానీయమిత్రము నాకెంతో దయచూపినాడు. మఱి నాయారోగ్యము చాల జబ్బుగా నున్నందున జపానుకై చాలకాలము వినియోగింపలేనో ఏమో అని నా భయము. బొంబాయి రాజధానిలో నాయందు దయగల నామిత్రులనందఱిని 'బాబూ, క్షేమమా ?' అను నొక్క కుశలప్రశ్నయడుగు పాటికైనను నన్ను నేను ఈడ్చుకొనిపోవుదును.

తరువాత రాకపోకలకు రెండు నెలలు పట్టును. ఒక్క నెల మాత్రమే అక్కడ ఉండుటకు. అంతగా పనిచేయుటకు అదెక్కువ అవకాశము కాదు. అవునా ?

కావున నీజపానీయమిత్రము నాదారివ్యయమునకు పంపిన పైకమును దయచేసి నీవు అతనికి ఇచ్చి వేయుము. నీవు నవంబరులో ఇండియాకు వచ్చినప్పుడు నేను దానిని నీకు తీర్చెదను.

నేను అస్సాములో భయంకర ప్రాణాపాయదశకు వచ్చితిని. అందుండి మెల్లగా కోలుకొనుచున్నాను. బొంబాయిజనులు కాచుకొని కాచుకొని ఉండి విసుగు చెందియున్నారు. నేను ఈసారి వారిని చూడవలయును.

ప్రతికూలసందర్భములు ఇన్నియున్నను, నేను రావలసినదే అని నీవుకోరుదువేని, నీవు వ్రాసిన ఆనిమిషముననే నేను బయలుదేరెదను.

నాకు శ్రీమతి లెగ్గెట్టు లండనునుండి వ్రాసిన జాబువచ్చినది. తాను పంపిన 300 పౌనులు పదిలముగా చేరినవా అని అడిగినది. అవి నాకు చేరినవి. ఆమాటను ఒకవారముక్రిందనో ఏమో, ఆమె మునుపు చెప్పినట్లు, "మన్రో అండ్ కో, ప్యారిస్" అను విలాసమునకు వ్రాసివేసితిని.

ఆమె కిందటిసారి వ్రాసిన జాబు, దానియొరయంతయు చాల చినిగిపోయి, లోపలికి బయటికి కనబడునట్లయి, చేరినది! ఇండియాలో తపాలు కార్యాలయాలు నా తపాలును చినిగి గినిగి పోకుండ సరిగానైన తెలవవు.

ప్రేమతో,

సదా భవదీయ,
వివేకానంద.

## 535

(కుమారి మేరీహేలుకు)

మఠము
జూలై 5, 1901.

నా ప్రియ మేరీ,

నీవు చక్కని పెద్దజాబు వ్రాసితివి. నేను నీకు చాల కృతజ్ఞుడను. ఏలన, విశేషముగా నాకు ఇంచుక యుల్లాసము కలిగించుటకు

ంరిగా అట్టిది ఒకటి కావలసియుండినది. ఇన్నాళ్ళు నాయారోగ్యము బాగులేదు. ఇప్పుడును అంతే; చాల జబ్బుగా ఉన్నది. కొన్నాళ్ళే ంచెము నయముగా తోచును. తరువాత మరల వ్యాధి తప్పదు. ంతే, ఎట్లైనను ఆ జబ్బుస్వభావము అట్టిది.

నేను ఇటీవల తూర్పుబంగాళమునను అస్సాములోను సంచ ంచుచు ఉంటిని. అస్సాము ఇండియాలో కాశ్మీరమునకు తరువాత చెప్పదగిన మిక్కిలియు రమణీయమైన ప్రదేశము. కాని చాల ోగభూయిష్ఠము. ఆ బ్రహ్మాండమైన బ్రహ్మపుత్రానది ఆ కొండలలో ప్టలలో మడగియు దూకియు ప్రవహించుటలును, దాని నిండుగ లంకలును—అవన్నియు అవకాశమున్నంతవఱకు తప్పక చూడ గినవి.

మా దేశము, నదీజలముల దేశము అని నీ వెఱుగుదువు దా. అయినను నేను దానియర్థమును ఇంతకుముందు ప్రత్యక్షీక ంచుకొనలేదు. తూర్పుబంగాళపు నదులు అలలు దొరలు మంచి టి సముద్రములు, నదీమాత్రములుగావు. అవి వానిమీద స్టీమర్లు ారాలకొలది ప్రయాణము చేయునంత పొడవుగలవి. కుమారి ుక్లియడు జపానులో ఉన్నది. ఆమె ఆదేశముపై చాల ుక్కువ గొనియున్నది లెమ్ము. నన్ను అక్కడకు రమ్మన్నది. ంతే నా యారోగ్యము అంత దూరప్రయాణమునకు అనుకూలింప ందున నేను మానుకొంటిని. నేను ఇంతకుమునుపు జపాను చూచి ున్నాను.

నీవిపుడు వెనిస్సును చూచి ఆనందించుచున్నా వన్నమాట. ముసలాయన చాల నచ్చి ఉండవలెను. వెనిస్సే ఆ ప్రాత షైలాకు వాసస్థలము కాదా ?

ఈసంవత్సరము 'సాము' నీతో నున్నాడు. నాకు చాల ంతోషము. అతడు ఉత్తరమున ఆ నిర్జనప్రదేశాల యనుభవ ంనకు తర్వాత యూరపులోని చక్కని పరిస్థితులనుచూచి చాల ంందమనుభవించుచుండవలయును.

నే నిటీవల ఆశ లూటించునట్టి క్రొత్తమిత్రులను సంపాదించుకొనలేదు. నీ వెఱిగిన యా ప్రాతవారు చాలవఱకు అందఱును చనిపోయినారు, ఖేత్రిరాజునయితెము. అతడు అక్బరు చక్రవర్తి గోరియగు సికంద్రలో ఒక యెత్తైన గోపురముమీదనుండి పడి చనిపోయినాడు. అతడు ఆగ్రాలో ఈ ప్రాచీనమైన గొప్ప కట్టడమును తన వ్యయముతో బాగుచేయుచుండి, ఒకదినము తనఖీ చేయుచుండగా, అతనికి కాలు జాఱినది. అంతే. కొన్నినూర్ల యడుగులు క్రిందికి దబ్బని పడినాడు. పురాణవస్తువులయందలి శ్రద్ధోత్సాహములచే మనము ఇట్లు ఒక్కొక్కప్పుడు దుఃఖకరమగు అవసానమును పొందుదుము. జాగ్రత్తగానుండు, మేరీ, భారతీయ పురాతనములలో నీవంతుకై ఎక్కువ శ్రద్ధోత్సాహములు చెందకు.

మన (రామకృష్ణ) మిషను ముద్రలో పాము మర్మసిద్ధాంతము (మిస్టిసిజము)నకు గుఱుతు. సూర్యుడు జ్ఞానమునకు, పొంగిన నీరు కార్యోత్సాహమునకు, కమలము ప్రేమకు, హంస యీ యన్నింటినడిమి ఆత్మకు.

సాముకును అమ్మకును నా ప్రేమ.

సదా ప్రేమయుత,
వివేకానంద.

మలిమాట :-నా జాబు ఇట్లు కుఱుచగా నుండవలసివచ్చినది. నేను ఇన్నాళ్ళును జబ్బున పడియుంటిని. నేను అనగా ఈ దేహము!

## 536

(కుమారి క్రిస్టైనుకు)

మఠము, బేలూరు,
జూలై 6, 1901.

నా ప్రియ క్రిస్టైన్,

నాకు అన్నియు ఆవేశములుగా వచ్చును. ఈదినము నాకు రచనావేశము కలిగియున్నది. కాబట్టి నేను చేయవలయు తొలిపని యేమనగా, నీకు కొన్ని బంతులు వ్రాయుట. నేను పిఱికివాడనని

ప్రసిద్ధి. చాల ఖేదపడుచుందును. అయినను, నాప్రియ క్రిస్టైన్, అందులో నీవు నాకు అంతగా తక్కువదానవు కావు. మాకవి యొకడు "కొండలు సయితము ఎగిరిపోవును, అగ్ని చల్లబడును; ఐనను గొప్పవారిహృదయము ఎన్నటికిని మాఱదు" అని చెప్పినాడు. నేను చిన్న, చాలచిన్నవాడను. కాని నే నెఱుగుదును. నీవు చాల గొప్పదానవు. నీ సత్యహృదయమున నా నమ్మకము. నేను అన్నింటిని గూర్చి ఖేదపడుదును, గాని నిన్నుగూర్చి, పడను. నేను నిన్ను అమ్మకు అర్పణచేసితిని. ఆమె నీ కవచము, నీకు మార్గదర్శిని. నీకు ఏహానియు కలుగనేరదు. ఏదియు నిన్ను క్షణమేని భ్రంశంగజేయదు అని నేనెఱుగుదును.

సదా భవదీయ భగవద్గత,
వివేకానంద.

## 537

(కుమారి మేరీహేలుకు)

మఠము, బేలూరు,
హౌరాజిల్లా, బెంగాలు.
ఆగష్టు 17, 1901,

నా ప్రియ మేరీ,

నా యారోగ్యము నీవు కావలయుననుకొన్నట్లు కనీసము నీకొక పెద్దజాబు వ్రాయుపాటిగా నైన ఉండరాదా? అట్లుండవలయునని కోరుదును. నిజముగా అది దినదినమునకు హీనమగుచున్నది. అదికాక ఎన్నియో చిక్కులు బాధలు - నేను వానినెల్ల పరికించుట బొత్తిగా మానుకొన్నాను.

నీకు నీయందమైన స్విస్ గుడిసెడిసెలో నిండుసంతోషము, దివ్యమైన ఆరోగ్యము, మంచి ఆకలి, రవంత అన్నిటిని సప్రాణము సోత్సాహము చేయుటకు స్విస్ దేశముయొక్కగాని మఱిదేని యొక్కగాని పురాతన విషయములనుగూర్చిన లఘువైన పఠనము- ఇవి కలిగియుండవలయునని నేను కోరుదును. నీవు కొండలయందలి

యడ్డులేని ధారాళమైన గాలిని శ్వాసించుచున్నావని నా కెంతో సంతోషము. కాని సాము మంచి యారోగ్యమున లేడని దుఃఖముగా నున్నది. సరి, దానిని గూర్చి దిగులేమియు లేదు. అతని దేహ తత్త్వము స్వాభావికముగా అంత చక్కనిది.

"స్త్రీల చిత్తవృత్తులనుగాని పురుషుల యదృష్టములనుగాని దేవతలే ఎఱుగనేరరు అన్నచో ఇక మనుష్యుని మాట చెప్పవలయునా?" నా సహజప్రవృత్తులు మిక్కిలి మహిళోచితములు కావచ్చునుగాని, నీవు కొంత నీయందు పుంభావమును పొందకూడదా అని నేను ఈక్షణమున ఆకులపాటు చెందుచున్నాను. తన వ్యక్తిత్వము రూఢిచేసికొనుట అను ప్రధానలక్షణ మొక్కటి లేకపోయినందున, ఓ మేరీ, నీబుద్ధి, ఆరోగ్యము, అందము, ప్రతిదియు, వృథయగుచున్నది. నీ గర్వము, ఉత్సాహము, శక్తి మొదలగు నవన్నియు వట్టి అర్థములేనివి, వెక్కిరింతలు. నిన్ను ఎంత గొప్పగా ఎంచుకొనవలయునన్నను నీవు, అన్నముపెట్టి చదువుచెప్పు బడిలోని పిల్లపాటిదానవు, అంతే. స్థైర్యము లేదు! స్థైర్యము లేదు!!

అయ్యో, జీవితకాలమంతయు ఈ పరాశ్రయవ్యవహారము! ఇది చాల కఠినమైనది, పశూచితము. అయినను నేను అందులకు ఏమియు చేయజాలను. నేను నిన్ను హార్దముగాను అచ్చముగాను ప్రేమింతును. మేరీ, నేను నిన్ను వట్టి అచ్చికబుచ్చిక మాటల కలకండపెళ్లలతో మోసపుచ్చజాలను. అసలు అట్టివి నానోట రానే రావు.

తరువాత మఱియొకటి. నేను కాటికి కాలుసాచియుండువాడను. పరిహాసములకు నాకు వ్యవధిలేదు. మేలుకో, అమ్మాయి. ఇపుడు నీవలన సూటియైన ఎత్తి పొడుపులుగల జాబులు ఎదురుసూతును. సరిగా సూటిగా వ్రాయుము. ప్రేరణ—మేలుకొలుపు—నాకు చాల ఆవశ్యకము.

నేను ఆ 'మాక్వేఘుల' (**Macveaghs**) ను గూర్చి, వారిక్కడనుండగా ఏమియు వినలేదు. నాకు శ్రీమతి బుల్సతివద్దనుండి

గాని నివేదితవద్దనుండిగాని తిన్నగా ఏ సందేశమును అందలేదు. సేవియరుసతిమాత్రము సరిగా సకాలమునకు జాబులు వ్రాయుచుండును. వారందఱు నార్వేలో శ్రీమతి బుల్సతికి అతిథులుగా ఉన్నారు

నివేదిత ఎప్పుడు ఇండియాకు వచ్చునో ఎఱుగను. అసలు ఆమె ఎప్పటికైనను మరలివచ్చునా అనుటయు ఎఱుగను.

నేను ఒకవిధమున పనినుండి విరామము పొందినవాడను. ఉద్యమమునకు సంబంధించి ఏమి జరుగుచున్నదో నేను అంతగా పరికింపను, లెక్క పెట్టను. అంతేకాదు, ఆ వ్యవహారము దినదినమునకు చాల పెరిగి పెద్దదియగుచున్నది. దానిని గూర్చి వివరముగా ఎఱుగుట ఒక్కనికి అశక్యము.

భోజనము నిదుర తక్కినకాలముల దేహమునకు కావలసిన సంస్కారములు చేసికొనుట చేయించుకొనుట—వీనికై ప్రయత్నించుట తప్ప, నేనిప్పుడు మఱేమియు చేయుటలేదు. నాకు సెలవు, నా ప్రియమేరీ; మనము మరల ఈజీవితమున ఎక్కడనైనను కలసికొనగలము. కలసికొన్నను కలసికొనకున్నను నేను.

సదా నిన్ను ప్రేమించు సోదరుడను,
వివేకానంద.

## 538

(శ్రీ యం. యన్. బెనర్జీకి)

మఠము, బేలూరు,
హౌరా,
ఆగష్టు 29, 1901.

నన్య ప్రియ,

నాకు కొంచెము నయముగా ఉన్నది. ఐనను ఇంకను చాల ంలహీనముగా ఉన్నాను ...... ఇప్పటిజబ్బు కేవలము నరములకు

సంబంధించినది. ఎట్లైనను, నాకు దినదినమునకు నయమగు చున్నది.

అమ్మ* దయతో చేసిన ఉపపాదనకు నే నెంతయు కృతజ్ఞుడను. నీలాంబర్బాబు గారిచోటను అచ్చటి బేలూరుగ్రామమంతటను ఈనెలయు పై నెలయు మన్నెజ్వరప్రకోపము మిక్కుటముగ నుండును అని మరములో ప్రతివాడును నాకు చెప్పుచున్నాడు. అంతే. పైగా బాడిగ చాల ఎక్కువ. కావున తాను రా నిర్ణయించుకొనునేని, కలకత్తాలో ఒక చిన్నయిల్లు తీసికొమ్మని అమ్మకు నా సలహా. నా యిప్పటి క్రుంగు ఉండనే ఉండగా, నేను ఆయులేరియాను తగిలించుకొనుట మంచిదిగాదు. కావున నేను అక్కడికి పోవచ్చును. అక్కడనే ఉండవచ్చును. నే నింకను శారదానంద బ్రహ్మానందుల యభిప్రాయమును అడుగలేదు. వా రిరువురును కలకత్తాలో ఉన్నారు. ఈరెండు నెలలు కలకత్తా ఆరోగ్యప్రదము. అక్కడ ఖర్చుకూడ చాల తక్కువ.

తుదకు ప్రభువు ఏదారిచూపిన ఆమె ఆదారిన పోవును గాక, సూచనచేయుటమాత్రమే మనకు శక్యము, ఆసూచనయు తప్పు కావచ్చు.

ఆమె నీలాంబరునింటనే కాపురమునకు కోరుకొనునేని, బాడిగ మొదలగు విషయములను ముందుగానే నిర్ణయము చేయుము. అమ్మ అందఱికన్నను బాగుగా ఎఱుగును. నాకు తెలిసినది కూడ అంతే.

సమస్తప్రేమాశీస్సులతో,

సదా భవదీయ భగవద్గత
వివేకానంద

* మాతృశ్రీ శారదాదేవి.

## 539

(శ్రీ యం. యస్. బెనర్జీకి)

మఠము, బేలూరు,
హౌరాజిల్లా,
సెప్టెంబరు 7, 1901.

ధన్య ప్రియ,

నేను బ్రహ్మానందాదులతో సలహాపడవలసియుండెను. వారందఱును, కలకత్తాలోనుండిరి. కావున పోయినసారి నీకు జవాబు వ్రాయుటకు ఆలస్యమైనది.

ఇంటిని ఒకసంవత్సరమంతటికిని తీసికొను నేర్పాటు నమలు చేయునప్పుడు చాల ఆలోచన చేయవలయును. ఏలన ఒకపక్షమున, బేలూరులో ఈనెల మలేరియాతగులు అపాయము కొంత యున్నది. మఱియొక పక్షమున, కలకత్తాలో బొబ్బలమహామారిభయము ఉన్నది. తరువాత మఱియొక సంగతి. ఈయూరిలో గ్రామాంతర్భాగమునకుపోకుండ మిక్కిలిజాగ్రత్తకలిగియున్న జ్వరమును తప్పక తప్పించుకొనవచ్చును. ఏటియొడ్డుకు అనుకొన్న చోట జ్వరము బొత్తిగా లేదు. మారియింకను ఏటివద్దకు రాలెదు. ఇక్కడ దొరకుచోట్లన్నియు మారివచ్చుకాలమున మార్వారీలతో నిండియుండును.

తరువాత మఱియొకమాట. నివు ఈయజాలిన బాడిగ మొత్తము, ఇంతకుపైన శక్యముకాదని, ఉదాహరింపవలయును. అందుకుతగినట్లు ఇంటివిషయమున మేముప్రయత్నింతుము. నగరమున ఒకచోటు అనుట మఱియొకసలహా. నామట్టుకు నేను కలకత్తాకు పరాయివాడను అయితిని. తక్కినవారు నీ యిష్టప్రకారము ఇల్లు త్వరగా కుదుర్చుకొందురు. ఈ క్రింది రెండు విషయములును నీవు ఎంతత్వరగా నిర్ణయించిన అంత మేలు:—(1) ఒకటి, అమ్మ మకాము బేలూరులో పెట్టునా, కలకత్తాలో పెట్టునా ? (2) రెండు, కలకత్తాయగునేని ఏపేట, ఎంతబాడిగ ? నీ జవాబు అందినతర్వాత ఒక్కక్షణములో దానినిచేసివేయవచ్చును.

ప్రేమాశీస్సులతో,

భవదీయ,
వివేకానంద.

మలిమాట : — మేము ఇక్కడ కులాసాగానున్నాము. మోతి వారముదినములు కలకత్తాలోనుండి మరలినాడు. ఇక్కడ కడచిన మూడు దినములనుండి రాత్రింబగళ్ళు వాన కురియుచున్నది. మన ఆవులలో రెండు ఈనినవి.

వి.

## 540

(సోదరి నివేదితకు)

మఠము, బేలూరు.
సెప్టెంబరు 7, 1901.

ప్రియ నివేదితా,

ఈ యుద్యమమున .మనమందఱము పనిచేయుదు మనగా వంతులప్రకారము చేయుదుమనుటే. నేను బిసను అదిమిపెట్టుటకు ప్రయత్నింతును. ఇంతలో ఏదియో ఒకటి సంభవించును. ఆ బిస బుట్టని బెడిసిపోవును. అంతట నీ వక్కడ ఆలోచించుచు, స్మృతికి తెచ్చుకొనుచు, అక్షరాలు గోకుచు, వ్రాకులాడుచు, ఇంకను పెల్లెట్లో నిలుతువు.

సరి, వానలనుగూర్చి - అవి యిపుడు పూర్తిగా దిగివచ్చినవి. అంతయు ఒక్కటే ప్రళయము, రాత్రింబవళ్లు కురియుచు కురియుచు ఒక్కమొగిని కురియుచు ఉన్నది. ఏటిలో నీరు ఎక్కుచున్నది. గట్టులను ముంచుచున్నది. గుంటలు చెఱువులు నిండి పొరలిపోయినవి, మఠభూములనుండి నీటిని లాగివేయుటకు ఒక లోతైన కాలువను త్రవ్వుపనిలో నేనును ఒక చేయివేసి, ఇప్పుడే మరలీ వచ్చితిని. కొన్నిచోట్ల నిలిచిన వాననీళ్లుకొన్నియడుగుల లోతు గల్గియున్నవి. నా పెద్దకొంగ సంతోషముతో త్రుళ్లుచున్నది. అట్లే యున్నవి పెద్దబాతులును చిన్న బాతులును. నాపెంపుడు జింక మఠము నుండి పఱువెత్తిపోయినది, దానిని వెదకిపట్టి తెచ్చుట కొన్నాళ్లీ ఆకులపాటు కలిగించినది. నా చిన్నబాతు ఒకటి దురదృష్టవశమున నిన్న చచ్చిపోయినది. అది వారముదినములకు పైన ఊపిరాడక ఆయాసపడుచుండినది. నా ముసలిసన్న్యాసులలో హాస్యము

నెఱపువాడు ఒకడు, 'అయ్యో, ఈ కలియుగమున జీవించి ప్రయో జనములేదు, ఇప్పుడు వానకురడికి బాతులకు జలుబు పట్టుచున్నది, కప్పలు తుమ్ముచున్నవి!' అని చెప్పుచున్నాడు.

నా బాతులలో ఒకదానికి ఈకెలు రాలిపోవుచుండినవి. మఱే మియు ఉపాయము తోపక, దానిని ఒక తొట్టినీటిలో, తక్కువ ఘాటుగల ఫినాలు కలిపి, అందు ఆబాతును చచ్చినచావనీ, ఆజబ్బు మానినమాననీ అని విడిచిపెట్టితిని. అది యిపుడు అన్నివిధాల బాగుగా నున్నది.

భవదీయేత్యాది,
వివేకానంద.

## 541

బేలూరు.
అక్టోబరు 8, 1901,

ప్రియ—,

జీవిత ప్రవాహములో నేను పైకిని క్రిందికిని కొట్టుకొని పోవు చున్నాను. ఈదిన మది మఱింత అధోగతినందినది.

భవదియెత్యాది,
వివేకానంద.

## 542

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

మఠము, బేలూరు.
హౌరా.
నవంబరు 8, 1901.

నా ప్రియ జో,

'అబేట్మెంట్' ( తగ్గుట) అనగా ఏమో నేను వివరించి వ్రాసిన నాజాబు ఇప్పటికి నీకు చేరియుండవలయును. నేను జాబు వ్రాయలేదు, తంతియు పంపలేదు. ఏమిచేయుటకును సమర్థుడను కానంత జబ్బుగా అప్పుడుంటిని. నేను నాతూర్పు బంగా

శపు సంచారము చేసినది మొదలుకొని చాలవఱకు మంచముపట్టి యున్నాను. ఇప్పుడు నేను ఎప్పటికన్నను జబ్బుగాఉన్నాను. ఏలన నాదృష్టి సయితము చెడిపోయినది. నేను ఈవిషయములు వ్రాసి యుండను. అయినను చూడగా కొందఱికి వివరములు కావలసినటు లున్నది.

బళి నీవు నీ జపానుమిత్రులను పిలుచుకొని వచ్చుచున్నందుకు నాకు చాల సంతోషము. నా శక్తిలోపముచేయక, వారికి వలసిన వన్నియు విచారించుకొందును. నేను మదరాసులో నుందు నేమో. నేను పైవారము కలకత్తానుండి బయలుదేఱి క్రమముగా దక్షిణ మునకు పోవలయు నని అనుకొనుచున్నాను.

నీ జపాను స్నేహితులతోకూడి ఒరిస్సాలోని దేవళములను చూడ నాకు సాధ్యపడునో పడదో ఎఱుగను. అసలు నన్నే లోపల ప్రవేశింపనిత్తురో ప్రవేశింపనీయరో. ఏలన మ్లేచ్ఛాన్న మును తింటినట! కర్జనుదొరను లోపలికి రానీలేదు. అయినను, నేను చేయగలపాటికి, నీస్నేహితులకు ఎప్పటికి నా స్వాగతమే. కుమారి ముల్లరు కలకత్తాలో నున్నది. ఆమె ఇంకను మమ్ము చూడరాలేదు లెమ్ము.

సకలప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 543

(శ్రీ స్వరూపానందస్వామికి)

గోపాలలాల్ విల్లా,
వారణాసి, సేనాని వేశము,
ఫిబ్రవరి 9, 1902.

నీ ప్రియ స్వరూపా (నందా),

...చారు వ్రాసిన జాబునకు జవాబుగా అతనినే స్వయ ముగా బ్రహ్మసూత్రములు చదువుమనుము. బ్రహ్మసూత్రములలో బౌద్ధమతమునకు నిర్దేశము ఉన్నదియనుటలో అతని యభిప్రాయ మేమి? 'బ్రహ్మసూత్రములలో' అనగా 'బ్రహ్మసూత్ర భాష్యము

లలో' అను అర్థమునే అతడుద్దేశించి యుండునులెమ్ము. లేదా, అట్లుద్దేశించియుండకపోవచ్చును. శంకరుడు కేవలము కట్టకడపటి భాష్యకారుడు. బౌద్ధగ్రంథములో నైనను, వేదాంతమునకు సంబంధాలు నిర్దేశాలు కలవు. బౌద్ధములో మహాయాన సంప్రదాయము అద్వైతసిద్ధాంతమే. బౌద్ధుడగు అమరసింహుడు, బుద్ధనామములలో అద్వయవాది అని ఏల ఉదాహరించును? చారు 'బ్రహ్మ' అనుమాట ఉపనిషత్తులలో ఎక్కడను రాదని వ్రాయుచున్నాడు!

బౌద్ధ సంప్రదాయములు రెంటిలోను మహాయానమే ఎక్కువ ప్రాచీనమని నా యభిప్రాయము.

మాయాసిద్ధాంతము ఋక్సంహితయంతటి ప్రాచీనము. శ్వేతాశ్వతరోపనిషత్తులో మాయాశబ్దము ఉన్నది. అది 'ప్రకృతి' నుండి సంపాదింపబడినది. ఆ యుపనిషత్తు కనీసము బౌద్ధమతమునకంటె ప్రాచీనమని నా యభిప్రాయము.

నా కిటీవల బౌద్ధమతమునుగూర్చి చాల విశదముగా విషయములు తెలిసినవి. నేను ఇట్లు రుజువుచేయుటకు సిద్ధముగా ఉన్నాను.

(1) బౌద్ధులకు పూర్వము, అనేకరూపములలో శివారాధనము ఉండినది. బౌద్ధులు శైవుల పుణ్యక్షేత్రముల వశపఱచుకొనుటకు ప్రయత్నించిరి, కాని అలవికాలేదు. అందువలన ఆక్షేత్రములలోనే, బుద్ధగయా సారనాథులలో నున్నట్లు, తమకు క్రొత్త స్థలములు కల్పించుకొనిరి.

(2) అగ్నిపురాణము తెలుపు గయాసురుని కథ, అంతకు ముందేయున్న ఒకానొక కథకు సంబంధించినదే కాని బుద్ధునికి సంబంధించినది కానేకాదు. డాక్టరు రాజేంద్రలాలేమో అట్లు అభిప్రాయపడినాడు.

(3) బుద్ధుడు గయాశీర్ష పర్వతమువీాద నివసింపబోయెననుట ఆచోటు అంతకుముందే యున్నదని రుజువుచేయును.

(4) గయ పూర్వమే పితృదేవతాపూజాస్థానము. పాద చిహ్నముల పూజించుటను బౌద్ధులు హిందువులను చూచి నేర్చుకొన్నారు.

(5) అత్యంత ప్రాచీనములగు గ్రంథములు సైతము వారాణసి గొప్ప శివారాధనస్థలమని రుజువుసేయును, ఇత్యాది.

బుద్ధగయలోను, బౌద్ధగ్రంథములనుండియు క్రొత్త విషయములను అనేకములను నేను గ్రహించితిని. చారుతో స్వయముగా చదువుకొమ్మనియు, తెలివితక్కువ యభిప్రాయములకు లొంగి అభిప్రాయములు మార్చుకొనవలదనియు చెప్పుము.

ఇక్కడ వారాణసిలో నా ఆరోగ్యము బాగుగానే యున్నది. నా శరీరస్థితి యిట్లే క్రమముగా మేలొందునేని, చాల గొప్ప లాభమే.

బౌద్ధమతమునకు నవహిందూమతమునకు గల సంబంధమును గూర్చిన నా యభిప్రాయములో పూర్తిమార్పు కలిగినది. నేను కనిపట్టిన సూక్ష్మసూచనలను బట్టి సర్వమును సాధించునంత కాలము నేను బ్రదుకకపోవచ్చును. అయినను ఆపని కావింపవలయు మార్గము లన్నియు పూర్తిగా సూచించి పోయెదను. నీవును నీధర్మభ్రాతలును దానిని పూర్తిగా సాధింపవలసియుండును.

సర్వ ప్రేమాశీస్సులతో

భవదీయ,
వివేకానంద.

## 544

(శ్రీమతి ఓల్బుల్సుకు)

గోపాలలాల్ విల్లా,
వారాణసి, సేనానివేశము,
ఫిబ్రవరి 10. 1902.

నా ప్రియజననీ,

ప్రియ జననికిని పుత్రికిని ఇండియాకు మరల నొకసారి స్వాగతము. జో చాలదయతో నాకొక మదరాసు పత్రికప్రతి పంపి

నది. దానివలన నాకత్యంతము సంతోషముకలిగినది. మదరాసులో నివేదితకు కావింపబడిన స్వాగతోపచారము నివేదితకును మదరాసునకునుకూడ శ్రేయస్కరము. ఆమె యుపన్యాసము నిజముగా మనోహరముగా ఉండినది.

నీవు నీ దీర్ఘప్రయాణమునకు తర్వాత విశ్రాంతిపొందుచున్నావనుకొందును. నివేదితయు అట్లేయుండును. మీరు కొన్నిగంటల కాలము కలకత్తా పడమటిపల్లెలలో కొన్నింటికి పోయి కొయ్యతోను, వెదురుతోను, పేముతోను, అభ్రకముతోను, పూరితోను నిర్మింపబడిన అక్కడి ప్రాతబెంగాలి కట్టడము చూచి రావలయునని నాకెంతయో ఆశగా ఉన్నది.

ఇవి బంగళాలు, మిక్కిలియు అందమైనవి. అయ్యో, ఇపుడు ప్రతి పందులదొడ్డికిని ఆపేరును పెట్టి ఆపేరును వెక్కిరించుచున్నారు.

పూర్వకాలము రాజభవనమును గట్టిన మనుష్యుడు అతిథుల విడిదిసత్కారములకై ఒక బంగళానుకూడ కట్టుచుండెను. ఆ శిల్పము ఇప్పుడు నశించిపోవుచున్నది. 'నివేదితా పాఠశాల'నంతయు ఆరీతిగ నేను కట్టగలుగరాదా అని నాఆశ. అయినను ఆ మిగిలియున్న కొన్నింటిని, కనీసము ఒక్కదానినైనను చూచుటమంచిది.

బ్రహ్మానందుడు దానికి కావలయు ఏర్పాటులు చేయును, మీరు కొన్నిగంటల ప్రయాణము చేయవలయును. అంతే.

శ్రీ ఒకాకుర తన స్వల్పసంచారమునకై బయలుదేరినాడు. ఆగ్రాను గ్వాలియరును ఎల్లోరాను చిత్తూరును ఉదయపూరును జయపూరును ఢిల్లీని దర్శింపవలెనని అతని యుద్దేశము.

మాకు చిరకాలమిత్రమగు నొకనికుమారుడు చాల చక్కగా చదువుకొన్న ఒక సంపన్న యువకుడు వారాణసివాడు, ఈ నగరమునకు నిన్న మరలినాడు. అతనికి శిల్పమందు విశేషశ్రద్ధ. నాశనమగుచున్న ఇండియా శిల్పములను మరల బాగుసేయు తన ప్రయత్నములలో ఉద్దేశపూర్వకముగా చాలధనము ఖర్చు పెట్టుచున్నాడు. శ్రీ ఒకాకుర అప్పుడే నన్ను వీడ్కొని అటుపోయి

నాడు. కొన్నిగంటలే ఐనవి. ఇంతలో ఇతడు నన్ను చూడవచ్చి నాడు. ఇతనికి ఇండియాశిల్పమును, ఆమిగిలియున్నరవంతనే, చూపుటకు అతడు సరియైనవాడు. ఇతడు ఒకాకురచెప్పు సలహాలచే చాల లాభపడునని నా నిశ్చయము. ఒకాకుర ఇక్కడ నౌకరులు వాడుచుండు సాధారణమైన పింగాణిమట్టితో చేయబడిన నీటి పాత్రను చూచినాడు. దాని యాకారము దానిమీద పైకి ఉబ్బి అగపడునట్లు చేసియుండు పనితనము అతని మనసును మిక్కిలి ఆకర్షించినవి. అయినను అది పట్టిమట్టికుండయైనందున ప్రయాణమునకు ఆగదని, ఆనమూనాలో ఒక ఇత్తడికుండను చేయించి యిమ్మని నన్ను చాల అక్కఱతో అడిగిపోయినాడు. అంతట నాకు ఏమి చేయుటకు తోచకపోయినది. ఈ యువకమిత్రము కొన్నిగంటల తర్వాత వచ్చినాడు. అతడు దానిని అట్లే చేయించియిచ్చుటకు ఒప్పుకొనుటయేకాక, ఒకాకుర చూచి భ్రమచెందిన దానికన్న లెక్కలేనంత మేలైనవియు మిక్కిలి చిత్రవిచిత్రమైన ఉబుకు పనితనముగలవియునగు అట్టి పింగాణివస్తువులను తాను చూపుదును అనెను.

మఱియు అతడు ఆయద్భుతమగు ప్రాతరీతిగల పురాతనవర్ణ చిత్రములనుకూడ చూపుదు నన్నాడు. పాత్రరీతిలో చిత్తరువు వ్రాయువారు వారాణసిలో ఇంక నొక్కకుటుంబమువారు మాత్రమే ఉన్నారట. వారిలో ఒకడు ఒక్క పటాణిగింజపై అన్నివివరముల తోను చేష్టలతోను సమగ్రమైన పూర్తివేట దృశ్యమును చిత్రించి నాడట!

ఒకాకుర తనప్రయాణమున వెనుమరలునపుడు ఇటు ఈ నగరమునకు వచ్చి ఈ యువకుని అతిథిగానుండి, ఆ శిల్పశేషములో అణుమాత్రము చూడ వలయునని నా ఆశ.

నిరంజను శ్రీ ఒకాకురతో పోయినాడు. జపానువాడైనందున అతడు ఏదేవళమునకు పోయినను ఆక్షేపింపరు. టిబెటన్లు, ఇంకను

ఇతరులగు ఉత్తరాదిబౌద్ధులు సర్వకాలము శివునిపూజించుటకు ఇక్కడికి వచ్చుచునే యుండినారు.

వారు అతనిని శివలింగమును తాక ననుమతించినారు. అట్లే పూజింపనిచ్చినారు. శ్రీమతి ఆనిబెసెంటు ఒకసారి ప్రయత్నించినది. ఆమె కాలిజోడు తీసివైచి, చీరకట్టుకొని, దేవళము ఆచార్యుల ముందు పాదధూళికై వంగి ఎంతయో నమ్రత చూపినది. ఐనను ఆమెను గుడియావరణములోనికి సైతము రానీయ్యరైరి. బౌద్ధులు మన దేవళములలో హైందవేతరులుగా తలంపబడుట లేదు. నా కార్యక్రమములు పద్ధతులు ఇంకను ఇదమిత్థమని తీర్మానింపబడ లేదు. నేను చాల త్వరలోనే ఈచోటును వదలిపోవచ్చును.

శివానందుడును బాలురను నీకు తమ స్వాగతమును, మర్యాదలను ప్రేమను అన్నింటిని అందించుచున్నారు.

నేను ఎప్పటివలె నీ యత్యంత ప్రియపుత్రుడను,

వివేకానంద.

## 545

(సోదరి నివేదితకు)

వారాణసి,
ఫిబ్రవరి 12, 1902.

నీకు సర్వశక్తులు వచ్చురుగాక! అమ్మయే సొంతముగా నీకు చేతులును మనసును అగునుగాక! నీకోసము నేను ప్రార్థించునది ఎదిరింపనలవిపడని అతిమాత్రపు శక్తి. మఱియు, శక్యమేని, దానితోకూడ నిరవధిక శాంతిని......

శ్రీ రామకృష్ణునిలో ఏమేని సత్యముండినచో, అతడు నాకు దారిచూపినట్లే నీకును చూపునుగాక. అంతకు వేయిమడుంగులెక్కువగా అనుగ్రహించునుగాక!

వివేకానంద.

## 546

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

గోపాలలాల్ విల్లా,
వారాణసి, సేనానివేశము,
ఫిబ్రవరి 12, 1902.

నా ప్రియరాఖాల్,

నీజాబువలన అన్ని వివరాలతో సకలసమాచారములు తెలిసినవి. చాల సంతోషము. నివేదిత పాఠశాలను గూర్చి నేను చెప్పనెంచినదానినంతయు ఆమెకు వ్రాసితిని. ఆమె తాను మిక్కిలి శ్లాఘ్యమని తలంచుదానిని చేయవలయును. ఇదియే నా యభిప్రాయము.

మఱి యేవిషయమును గూర్చియు నాయభిప్రాయమును అడుగకుము. అడిగినచో నాకు కోపము వచ్చును. ఆపనిని నాకోసము చేయుము. అంతే. పైకము పంపుము. ఏలన ఇపుడు కొన్ని రూపాయలు మాత్రమే మిగిలియున్నవి.

కానాయి మాధుకరము ఎత్తుకొని జీవించును. స్నానఘట్టమున తాను చేయవలయు జపము చేయును. రాత్రి ఇక్కడికివచ్చి నిదురపోవును. నిమెదా ఒకబీదవాని పనిచేయును, రాత్రి ఇక్కడికి వచ్చినిద్రించును. మామయు * నిరంజను ఆగ్రాకు పోయినారు. నాకు వారిజాబు ఈదినము రావచ్చును.

ప్రభువు చూపినదారిలో నీపని నీవు చేయుచు సాగిపొమ్ము. వీరివారి అభిప్రాయములకై బాధపడనేల, అందఱికి నా ప్రేమ.

ప్రేమయుత భవదీయ,

వివేకానంద.

---

* బెంగాలిభాషలో 'ఖురా' అనగా మామ, కాబట్టి 'ఒకావర'ను స్వామిజీ తమాషకు 'మామ' అని పేర్కొనుచుండును.

## 547

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

గోపాలలాల్ విల్లా,
వారాణసి, సేనానివేశము
ఫిబ్రవరి 18, 1902.

నా ప్రియరాఖాల్,

పైకము నాకు చేరినదని తెలుపు నా నిన్నటిజాబు ఇప్పటికి నీకు చేరియుండవలయును. ఈ జాబునకు ముఖ్యోద్దేశము——నుగూర్చి వ్రాయుట. నీకు ఈజాబు చేరగానే, నీవుపోయి అతనిని కలసికొనవలయును...సమర్థుడగు వైద్యుని పిలిచి చక్కగా ఆ రోగనిదానము కనుగొనవలయును. ఇప్పుడు రామ్‌బాబు పెద్దకూతురగు విష్ణుమోహిని, ఎక్కడ ఉన్నది. ఆమె ఇటీవల భర్తృవియోగము చెందినది...

మనోవ్యాకులము, రోగమునకన్న, ఎక్కువ చెడ్డది. కొంచెము పైకము, అక్కఱకు కావలసినంత ఇమ్ము. నరకమే అయిన ఈ లోకమున ఎవడైనను ఒక్కనిమనసుకు ఒక్కదినమునైనను రవంత సంతోషమును శాంతియు కలిగింపగలడేని, అదిమాత్రమే సత్యము. దీనిని నా యావజ్జీవితము బాధపడినతర్వాత తెలిసికొంటిని. తక్కినదంతయు వట్టిమాయ.

జవాబు చాలత్వరగా వ్రాయుము. 'మామయు' నిరంజను గ్వాలియరునుండి జాబువ్రాసినారు...ఇక్కడ ఇపుడు క్రమముగా దినదినమునకు వేడి ఎక్కువ యగుచున్నది. ఈచోటు బుద్ధగయ కంటె చల్లగానుండెను...నివేదితచేత సరస్వతిపూజ నిర్విఘ్నముగాను చక్కగాను కొనియాడబడినదని విని మిక్కిలి సంతోషించితిని. ఆమె పాఠశాలను త్వరగా ప్రారంభింపగోరునేని అట్లే ప్రారంభింపనిమ్ము, పవిత్రగ్రంథములపారాయణము, పూజ, చదువు ఇవన్నియు జరుగుచుండునట్లు చూడుము.

ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 548

(శ్రీ బ్రహ్మానందస్వామికి) గోపాలలాల్ విల్లా,
వారాణసి, కంటోన్మెంటు.
ఫిబ్రవరి 21, 1902.

నా ప్రియరాఖాల్,

నీవద్దనుండి నాకు ఇప్పుడే జాబు వచ్చినది. అమ్మాయి అవ్వాయి రాగోరుదురేని, వారిని పంపివేయుము. ఇప్పుడు మహా (ప్లేగు) కాలము ఆరంభమైయున్న, కలకత్తానుండి బయటికివెళ్లుట చాలమంచిదే. అలహాబాదులో మహా మారి అంతటను వ్యాపించియున్నది. ఈసారి అది వారాణసికిని వ్యాపించునేమో నేను చెప్పలేను...ఎల్లోరాకును ఇంకను తక్కినచోట్లకును సంచారము చేయుట చాల కష్టములతో కూడుకొన్న ప్రయాణము అని శ్రీమతి బుల్సతో నా మాటగా చెప్పుము. అదియుగాక ఇపుడు చాలవేడి. ఆమె దేహము చాల అలసియున్నది. కావున ప్రస్తుతము సంచారము వెడలుట యుక్తము గాదు. 'మహిమ' వద్దనుండి జాబువచ్చి చాలదినాలయినవి. అతడు అజంతకుపోయినాడనుటే అతనిని గూర్చిన కడపటి సమాచారము. మహాంతుకూడ జవాబు వ్రాయలేదు. ఒకవేళ అతడు రాజా ప్యారీమోహన్ జాబుకు వ్రాయు జవాబుతో కూడ నాకును వ్రాయునేమో.

నేపాళమంత్రి విషయమును గూర్చి వివరముగా నాకు వ్రాయుము. నా విశేషప్రేమను దీవెనలను శ్రీమతి బుల్సతోకిని కుమారి మెక్లియుడుకును ఇంకను ఇతరులకందరికిని అందింపుము. నీకును, బాబురామ్‌కును, ఇంకను ఇతరులకందరికిని నా ప్రేమయు అభినందనములు. గోపాల్ దాదాకు జాబు చేరినదా? దయతో మీరు గవంతి విచారించుకొనుము.

ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

మరిమాట:-ఇక్కడి బాలురందరు వారి సగౌరవ నమస్కారములు నీకు అందించుచున్నారు.

## 549

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

గోపాలలాల్ విల్లా,
వారాణసి, సేనాని దేశము,
ఫిబ్రవరి 24, 1902.

నీవు పంపిన చిన్న అమెరికన్ పార్సెలు నాకు ఈయుదయము చేరినది. నీవు చెప్పిన రిజిస్టరుజాబుగాని మఱొక జాబుగాని నాకు చేరలేదు. ఆ నేపాళదేశీయుడు వచ్చినాడా? ఏమి జరిగినది? దానినిగూర్చి నాకు బొత్తిగా ఏమియు తెలిసికొన శక్యముగా లేదు. వట్టి జాబు వ్రాయుటకు ఇంతకష్టము, ఇంత ఆలస్యము!...... లెక్కలన్నియు నాకిప్పుడు చేరిన ఎంతయో ఊరట కలుగును. అది కూడ ఎన్ని నెలల యనంతరము నాకు వచ్చునో ఎవరెఱుంగుదురు!...

ప్రేమయుత భవదీయ,
వివేకానంద.

## 550

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

మఠము,
ఏప్రిల్ 21, 1902.

ప్రియ జో,

జపానుకు పోవు ఏర్పాటు నెగ్గనట్లు అగపడుచున్నది. శ్రీమతి బుల్ సతి వెళ్ళిపోయినది; నీవును పోవుచున్నావు. నాకేమో జపాను వారితో చాలినంత పరిచయము కలుగలేదు.

సదానందుడు, కానాయియు తానును, జపానీయులతో కలసి నేపాళమునకు పోయినాడు. మార్గరెట్ ఈనెల కడపటివఱకు పోలేకపోయినందున క్రిస్టైను అంతకన్న ముందుగా బయలుదేఱలేక పోయెను.

నా దేహస్థితి చాల మేల్కొనుచున్నదని వారను చున్నారు. కాని యింకను చాల బలహీనముగా నున్నది. త్రాగను నీళ్ళు లేవు. అయినను రసాయనికముగా కావించిన ఆవిభాగవిమర్శ

చాల అభివృద్ధిని చూపుచున్నది. పాదాలలో వాపు, ఇతర రోగ లక్షణములు మాయమైనవి.

నా నిరవధిక ప్రేమను బెట్టి దొరసానికి, శ్రీ లెగ్గెట్టుకు, ఆల్బర్టాకు, హాల్లికి నిమ్ము. ఆశిశువుకు నాదీవెనలు. అది పుట్టక ముందటినుండి యున్నవి, ఇక నెప్పటికిని ఉండును.

మాయావతి నీకెంతవఱకునచ్చినది? దానినిగూర్చి నాకు ఒక బంతి వ్రాయుము.

నిత్యప్రేమతో,
వివేకానంద.

## 551

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

మఠము, బేలూరు, హౌరా,
మే 15, 1902.

ప్రియ జో,

శ్రీమతి కాల్వేకి వ్రాసిన జాబును నీకు పంపుచున్నాను.

* * * *

నాకు కొంచెము నయముగా నున్నది. అయినను నేను ప్రతీక్షించిన నయమునకంటె చాల తక్కువయే. ఇపుడు నన్ను ఒక గొప్పశాంతిభావము ఆవరించియున్నది. నేను శాశ్వత విరామము చెందబోవుచున్నాను. నాకిక నేపనియులేదు. శక్యమగు నేని నేను మరల బిచ్చమెత్తు నా ప్రాతదినాలకు మరలగలను. అన్ని దీవనలు నీకు గలవమ్మా, జో, నీవు నాకు మంచిదేవ(దూ)తవుగా నుంటివి.

శాశ్వతప్రేమయుత,
వివేకానంద.

## 552

(శ్రీమతి ఓల్బుల్సతికి)

మఠము,
జూను 14, 1902.

ప్రియ జననీ,

ప్రేమతో నీవు వ్రాసిన జాబునకు జవాబును ముందుగనే వ్రాసియుండిన బాగుండెడిది.

డాక్టరు జోన్సును గూర్చిన గ్రంథ మొక్కటి నాకందినది. మనకత్యంత పూజ్యుడగు మిత్రునిగూర్చి ఏదేనొక యభిప్రాయమును తెల్పుటకు నేను జంకితిని. గ్రంథముతోబాటు అభిప్రాయమునుగోరు లేఖ ఏదియు లేదు. అయినను ఇప్పుడు నీవు కోరినట్లు సాధ్యమైనంత ముందుగా శ్రీఫాక్సుకు నేను వ్రాసెదను.

నేను యథాప్రకార మున్నాను. ఇతరులు క్షేమము. నివేదిత కొండపై నున్నది. ఒకాకుర నగరమునకు, మరలి వచ్చి శ్రీసురేంద్రనాథటాగూరునింట అతిథిగ నున్నాడు. ఒక నా డతడు ఈమనమును దర్శించుటకు వచ్చెను. అప్పుడు నేను వెలి కేగి యుంటిని. మరల అతనిని కలసికొని అతని భవిష్యత్ప్రణాళి కను గూర్చిన విషయములను సేకరింత మని ఆసించుచున్నాను.

ఆ జపానీయువకున కిచ్చట జ్వరము తగులుకొన్నది. జ్వర మునుండి తెప్పరిల్లుకొని కొన్నాళ్ళలోనే అతడు ఒకాకురతో కూడ పోయినాడు. అతని ఆధ్యాత్మికవైఖరులచేత అతనియందు అందఱికిని అత్యంతప్రీతి. బ్రహ్మచర్యమును గూర్చిన అతని ఆశ యము మహోన్నతము. విశుద్ధబ్రహ్మచర్య జీవితాశయముపై నాధారపడిచి జపానులో మరమును నెలకొల్పవలెననుట అతని యభీష్టము.

నిష్కళంకస్వచ్ఛతాదర్శమును సాధింపగోరిన జాతి మొదట మాతృభావమును ఎక్కువగ ఆదరించుట నలవఱచుకొనవలె నని నా యభిప్రాయము. అందులకు వివాహమును పవిత్రముగను అనుల్లంఘ్యముగను చేయుట సాధనము. రోమను కాథలిక్కులును హిందువులును వివాహమును పవిత్రముగను అనతిక్రమణీయముగను భావించుటచే వారిలో మహానుభావులును అతిపవిత్రాత్ములునగు స్త్రీ పురుషులు రూపొందిరి. అరేబియాదేశీయునకు పెండ్లి అనిన ఒక యొప్పందము, లేదా బలాత్కారముగ దక్కించుకొనవలసి నది. తోచినప్పుడు, పెండ్లిని రద్దుచేసినను చేయవచ్చును. కావున

వారిలో బ్రహ్మచర్యమును కన్యాత్వమును పెంపొంద లేదు! ఈ కాలపు బౌద్ధమతము వివాహాచారమునే ఇంతవఱకు ఏర్పఱచుకొనని జాతుల నడుమబడి సన్న్యాసమును నవ్వులపాలు చేయుచున్నది. కావున (పరస్పర ప్రేమాకర్షణలుగాక) వివాహమును గూర్చి పవిత్రోదారలక్ష్యము జపానులో పెంపొందువఱకు గొప్పసన్న్యాసులును సన్న్యాసినులును ఎట్లేర్పడగలరో నా కర్థ మగుట లేదు.

స్వచ్ఛతయే జీవితశోభ అని నీవు గ్రహింపగలిగితివి కదా. అట్లే అస్ఖలితస్వచ్ఛత గల సమర్థులు కొందఱు ఏర్పడవలయు ననిన గొప్పదైన ఈవివాహపవిత్రీకరణము అందఱకు ఆవశ్యక మని నేనును గుర్తింప గల్గితిని......

పెక్కువిషయములు వ్రాయగోరితిని. కాని దేహము దుర్బలము. మేరీలూయీ శ్రీ చైతన్యుని భక్తగా ఇచ్చటికి వచ్చినది. సంపన్నులైన విజ్ఞులు కొందఱు అత్యంతాదరముతో ఆమెకు స్వాగతము చెప్పిరని విన్నాను. ఈసారి ఆమెకు చాలినంత ధనము లభించి తీరవలెను. అదే నేను కోరునది. "ఎవరు దేనినికోరి నన్నుపాసించినను వారికి నేను దానిని ఒసగెదను" (భగవద్గీత) ఆమె ధనమును కోరినది. చాలినంతగా దేవు డామె కిచ్చును గాక.

సదా భవదీయ ప్రియపుత్రే,

వివేకానంద.

మలిమాట :—పాశ్చాత్యదేశములందున్న ఈ సంపదాడంబరము లన్నియు అనావశ్యకములు. ఆధ్యాత్మికమార్గమున అవి ఆటంకములనే కలిగించును. జగన్మిథ్యాత్వము ఇంత విశదముగ నాయనుభూతి కెప్పుడును రాలేదు. ప్రభువు ఎల్లరకును బంధవిముక్తిని కల్గించునుగాక. ఈమాయావాగురనుండి వారు విడుపొందుదురు గాక. ఇదే నా నిత్యప్రార్థన.

వివేకానంద.

# అకారాది

# శోధనపత్రము

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 2 | 15 | కగిలిన | కలిగిన |
| 9 | 16 | రైనసు | రైనను |
| 50 | 29 | జాజ్వల | జాజ్వల్య |
| 78 | 12 | 1869 | 1896 |
| 81 | 11 | పెంపెదను | పంపెదను |
| 129 | 5 | కాచి | కాంచి |
| 181 | 3 | రందరు | రందఱు |
| 144 | 5 | సంచారించితిని | సంచరించితిని |
| 156 | 7 | చెప్పెదును | చెప్పెదను |
| 205 | 3 | షట | టష |
| 208 | 26 | 52 | 25 |
| 238 | 10 | శారదా | త్రిగుణాతీతా |
| 279 | 27 | 1918 | 1898 |
| 290 | 23 | 18 | 25 |
| 358 | 18 | ఆఱవని | ఆఱపని |
| 397 | 28 | వెంటవే | వెంటనే |
| 405 | 10 | ఆరోగ్యవంతుడు | ఆరోగ్యవతి |
| 431 | 26 | ఓక్క | ఒక్క |
| 450 | 25 | కది | కని |
| 457 | 4 | ఒక్కొక్కడు | ఒక్కొక్కప్పు |
| 463 | 29 | ష్టివ్య | వ్యష్టి |
| 467 | 22 | త్వాగము | త్యాగము |
| 469 | 9 | విరాన్మూర్తి | విరాణ్మూర్తి |
| 477 | 26 | 1900 | 1901 |
| 479 | 6 | 1900 | 1901 |

Freedom Press, 134, T. H. Road, Madras 21